# శృంగార సంకీర్తనలు

(తాళ్ళపాక అన్నమాచార్య విరచితములు)

పరిష్కర్త

కీ॥ శే॥ గౌరిపెద్ది రామసుబ్బశర్మ




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు

1998

ప్రథమ ముద్రణ : 1976
ద్వితీయ ముద్రణ : 1998






ప్రతులు : 2,000

ప్రచురణ :
శ్రీ M.K.R. వినాయక్, I.A.S.
కార్యనిర్వాహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.




ముద్రణ :
త్రివేణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
14/264, ఈడేపల్లి
మచిలీపట్నం - 1
ఆంధ్రప్రదేశ్

# విన్నపము

ఇందరికి అభయంబు లిచ్చు చేయి
కందువగు మంచిబంగారు చేయి ॥

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని, మాహాత్మ్యాన్ని, తత్త్వాన్ని 32,000 అధ్యాత్మ, శృంగార సంకీర్తనలుగా రచించినవాడు తాళ్లపాక అన్నమాచార్యులు. ఇందులో మనకు సుమారు 13,000 సంకీర్తనలు మాత్రమే లభించాయి. వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు పదకవులే ! తాళ్లపాక కవులు క్రీ॥శ॥ 15-16 శతాబ్దాలకు చెందినవారు. వీరి స్వస్థలం ఆంధ్రప్రదేశ్‌లోని కడపజిల్లా రాజంపేట తాలూకా తాళ్లపాకగ్రామం.

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో వైష్ణవమత ప్రచారం కోసం తిరుమలను కేంద్రంగా చేసుకొని శ్రీ వేంకటేశ్వరాంకితంగా వేలకొలది సంకీర్తనలను, ఇతర సాహిత్య ప్రక్రియలను రచించినవారు తాళ్లపాకకవులు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి సేవలో తరించిన ధన్యమూర్తులు.

తాళ్లపాక పదకవిత్రయంగా కీర్తిగడించిన తాళ్లపాక అన్నమాచార్యుల, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్యల సంకీర్తనల రాగిరేకులు తిరుమలలో శ్రీవారి ఆలయంలో 'తాళ్లపాక అర'లో లభించాయి.

తాళ్లపాక కవుల సంకీర్తనల భాండాగారం గూర్చిన మొదటి శాసనం క్రీ॥శ॥ 1530 సంవత్సరంలో కనిపిస్తుంది. తదుపరి క్రీ॥శ॥ 1545, 1547, 1554, 1558 సంవత్సరాల నాటి శాసనాల్లోను సంకీర్తనభాండాగారం గూర్చిన ప్రస్తావన కనిపిస్తుంది. ఇవి తిరుమల తిరుపతి దేవస్థానాల శాసనాలు.

తిరుమల తిరుపతి దేవస్థానములవారు క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి తాళ్లపాక కవుల సంకీర్తనల ముద్రణకు పూనుకొన్నారు. క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి క్రీ॥శ॥ 1992 సంవత్సరం వరకు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాల ముద్రణలో వివిధ దశలు కనిపిస్తాయి.

1922 సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానాలవారు రాగిరేకుల్లోని తాళ్లపాక కవుల సంకీర్తనలను వ్రాతప్రతుల్లో వ్రాయించటానికి పూనుకొన్నారు.

1935-38 సంవత్సరాల్లో తాళ్లపాక లఘుకృతులు, తాళ్లపాక కవుల సంకీర్తనలు సంపుటాలుకొన్ని వెలువడ్డాయి.

1947-65 సంవత్సరాల్లో తాళ్లపాక కవుల అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు కొన్ని సంపుటాలు ముద్రించబడ్డాయి.

1947-1965 సంవత్సరాల మధ్యకాలంలో నిరాఘాటంగా కొనసాగిన తాళ్లపాక పదకవుల సంకీర్తనల ముద్రణ తరువాత ఒక దశాబ్దంపాటు కొనసాగలేదు.

1975-1986 సంవత్సరాల మధ్యకాలంలో తాళ్లపాక పదకవుల సంకీర్తనలు కొన్ని సంపుటాలు వరకు, మరియు అధ్యాత్మ సంకీర్తనలు కొన్ని సంపుటాలు పునర్ముద్రింపబడ్డాయి.

తదుపరి 1992 సంవత్సరంలో ఒక సంపుటం ముద్రింపబడినది.

ఇంతేకాక తాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్ర, తాళ్లపాక కవుల ఇతర సాహిత్య ప్రక్రియలను ఈ దశల్లోనే తిరుమల తిరుపతి దేవస్థానం ముద్రించింది.

ఈ వివిధ దశల్లో తాళ్లపాక పదకవుల సంకీర్తనలను రాగిరేకులనుండి పరిష్కరించిన మహాపండితులు కీ॥శే॥ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, పండిత విజయరాఘవాచార్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, పి.టి. జగన్నాథరావు, గౌరిపెద్ది రామసుబ్బశర్మ, శ్రీయుతులు ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారలు.

తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించినప్పటినుండి తాళ్లపాక అన్నమాచార్య సంకీర్తనలకు దేశవ్యాప్తంగా విశేషవ్యాప్తి ఏర్పడింది. తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు సాహితీవేత్తలకు, సంగీత విద్వాంసులకు వరకవిత్వ వాణీవీణా నినాదాలైనాయి. ఈ సంకీర్తనలు భక్తులకు మోక్ష మార్గాన్ని తెలిపే విశిష్టరచనలు. పరిశోధకులకు, సాహిత్యచరిత్రకారులకు కొంగుబంగారమై విలసిల్లుతున్నాయి. తాళ్లపాక కవుల సంకీర్తనలకు సంగీత, సాహిత్య, భక్తలోకంలో నేడువున్న ఆదరణ ఎనలేనిది.

ఈ ఆవశ్యకతను గుర్తించి వివిధ దశల్లో పరిష్కరింపబడి, ముద్రించబడిన తాళ్లపాకకవుల సంకీర్తనలను ఒక్కసారిగా సమగ్రరీతిలో ముద్రించడానికి తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యం సంకల్పించింది.

ప్రథమతః తాళ్లపాక కవుల సంకీర్తనలను సమగ్రంగా 29 సంపుటాలుగా లోకానికి అందిస్తున్నాం.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళిక రూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త) విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందం గారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యుమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) డా॥ ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరెక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A., Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు అర్పిస్తున్నాము.

దీని తర్వాత తాళ్లపాక కవుల లఘుకృతులు, ఇతర కావ్యాలు వెలువరించడానికి ప్రణాళిక సిద్ధంచేస్తున్నాం.

ప్రస్తుతం వెలువడుచున్న తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు శ్రీ వేంకటేశ్వర స్వామివారి కృపా కటాక్షంచే భక్తజనామోదం పొందగలవని విశ్వసిస్తున్నాం.

**M.K.R. వినాయక్**
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు

# నివేదిక

క్రీ॥ శ॥ 15వ శతాబ్దంలో భక్తి, ప్రపత్తి, దేహాత్మేశ విచారాదులను తెలిపే అధ్యాత్మసంకీర్తనలు; జీవాత్మ, పరమాత్మల ఐక్యాన్నిచాటే అమలిన దివ్య శృంగార సంకీర్తనలు రచించినవారు తాళ్లపాక కవులు. సకల దేవతా స్వరూపమైన శ్రీ వేంకటేశ్వరస్వామి తత్త్వాన్ని ఎన్నోవేల సంకీర్తనలద్వారా లోకవిదితంచేసి ఆత్మకల్యాణంతోపాటు లోక కల్యాణం సాధించిన వారు తాళ్లపాక అన్నమాచార్యులు, వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు. శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వంగా భావించి ఉభయ విభూతినాయకుడైన ఆ స్వామి కల్యాణగుణాలను ఎన్నోవేల సంకీర్తనల్లో కీర్తించారు. శరణాగతి తత్త్వాన్ని ప్రబోధించారు.

క్రీ॥ శ॥ 15వ శతాబ్దంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి నందకాంశ సంభూతుడుగా తాళ్లపాక అన్నమాచార్యులు జన్మించాడు. తన పదహారవయేట శ్రీ వేంకటేశ్వరుని సాక్షాత్కారం పొంది స్వామి ఆదేశంతో సంకీర్తనరచనకు శ్రీకారం చుట్టి ఆనాటినుండి జీవితాంతంవరకు దినమునకు ఒక్క సంకీర్తనకు తక్కువ కాకుండా సంకీర్తన రచన సాగించాడు. పల్లవి, చరణాలతో కూడిన సంకీర్తన రచనకితడు మార్గదర్శకుడై 'పదకవితాపితామహుడ'ని కీర్తి గడించాడు. అన్నమయ్య పదాలలో సంగీతం, సాహిత్యం, భగవద్భక్తి త్రివేణీ సంగమంలా మేళవించాయి.

శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వమూర్తిగానే కాకుండా వివిధ ఆగమ సంప్రదాయాల్లో వినుతుడైన వైభవమూర్తిగా కూడా అన్నమయ్య కీర్తించాడు. ఆంధ్రవాగ్గేయకారుల్లో అనేక వైష్ణవ క్షేత్రాలను సందర్శించి ఆయాక్షేత్ర మూర్తులపై వివిధ సంకీర్తనలను రచించిన ఘనత తాళ్లపాక అన్నమాచార్యులదే!

అన్నమయ్య భగవత్తత్త్వాన్ని అనేక జానపద గేయరీతుల్లో రచించి సామాన్యులకు అందించే ప్రయత్నంచేశాడు. అన్నమయ్య గ్రాంథిక, శిష్టవ్యావహారిక, వ్యావహారిక భాషాశైలులలో సంస్కృతాంధ్ర సంకీర్తనల్ని రచించాడు. జానపదుల జీవద్భాషను సర్వతంత్ర స్వతంత్రంగా వాడి సంకీర్తనల రచనాశైలిలో తర్వాతి వాగ్గేయకారులకి మార్గదర్శకుడైనాడు.

అన్నమయ్య పదాలు శ్రీ వేంకటేశ్వరముద్రాంకితాలు. వీరి బాటను అనుసరించిన వారు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, తాళ్లపాక చినతిరుమలాచార్యులు.

ఇహపర శ్రేయోదాయకమైన తాళ్లపాక అన్నమాచార్యులు, ఇతర తాళ్లపాకకవుల సంకీర్తనలను భక్తజనానికి అందించాలని తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో సంకల్పించి అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించింది. అప్పటినుండి అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే గానంచేయబడిన తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు ఆంధ్ర ప్రదేశ్‌లోనే కాక, ఆంధ్రేతర రాష్ట్రాలలో కూడా బహుళ ప్రచారం, ప్రాచుర్యం పొందాయి.

అన్నమాచార్య ప్రాజెక్ట్ తాళ్లపాక అన్నమాచార్య, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనల ప్రచారం-పరిశోధన -రికార్డింగ్ శాఖల సమన్వయంతో వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే వేలకొలదిగా సంగీత సభలు, పరిశోధకులచే సాహితీసమావేశాలు నిర్వహించింది. మరియు తాళ్లపాక కవుల సంకీర్తనలను ఆడియో క్యాసెట్లుగా విడుదలచేసి బహుజనామోదం పొందింది.

తిరుమల తిరుపతి దేవస్థానంచే 1949 సంవత్సరం నుండి ప్రతి సంవత్సరం అన్నమాచార్య వర్ధంతి ఉత్సవాలు, 1978 సంవత్సరం నుండి అన్నమాచార్య జయంతి ఉత్సవాలు జయప్రదంగా నేటికీ నిర్వహింప బడుచున్నవి. మరియు అన్నమాచార్య సంకీర్తనోత్సవాలు కుగ్రామ స్థాయినుండి మహానగరాలస్థాయివరకు జరుగుచున్నాయి. అన్నమాచార్య ప్రాజెక్ట్ వివిధ విశ్వవిద్యాలయాల

సమన్వయంతో తాళ్లపాక కవుల సాహితీ సదస్సులు నిర్వహిస్తున్నది. తిరుమల తిరుపతి దేవస్థానం 1978సం॥ నుండి తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సాహిత్యంపై వివిధ విశ్వవిద్యాలయాల్లో పరిశోధన చేసేవారికి ఉపకారవేతనం ఇచ్చి ప్రోత్సహిస్తున్నది. ఈ ప్రణాళిక క్రింద ఇప్పటివరకు దాదాపు 50 సిద్ధాంతవ్యాసాలు సమర్పింపబడ్డాయి.

తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలపట్ల నానాటికీ పెరుగుచున్న ప్రజాదరణ, మరియు 1935వ సంవత్సరం నుండి వివిధ దశల్లో ముద్రింపబడిన తాళ్లపాక అన్నమయ్య, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్య సంకీర్తనల సంపుటాలు ఏనాడో చెల్లిపోయిన కారణంగా నేడు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు సమగ్రంగా పునర్ముద్రించవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

పూర్వముద్రణ సంపుటాల్లోని పూర్వపరిష్కర్తల పీఠికలు యథాతథంగా ముద్రింపబడుచున్నాయి. పరిష్కర్తచే పీఠికలో సూచింపబడిన సంపుటాల సంఖ్యలు పూర్వముద్రణకు సంబంధించినవి. తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రితమవుతున్నందువల్ల ముద్రణ, పాఠకుల సౌకర్యార్థం క్రమపద్ధతిలో వుండాలనే వుద్దేశ్యంతో పూర్వముద్రణ సంపుటాల సంఖ్యలు మార్చబడినవి. సంపుటాల సంఖ్యల మార్పులు ప్రత్యేకంగా పట్టికలో చూపబడింది.

తిరుమల తిరుపతి దేవస్థానానికి రాగిరేకుల్లో లభించిన తాళ్లపాక కవుల సంకీర్తనలు మొత్తం నేడు ముద్రించబడుచున్నందువల్ల సమగ్రమనే పదం సూచికంగా వాడబడింది.

భక్తిభావ విలసితాలైన తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలను సమగ్రంగా ముద్రించుటకు ఆమోదించిన తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తృత్వమండలి అధ్యక్షులు శ్రీకలిదిండి రామచంద్రరాజుగారికి, మరియు ధర్మకర్తృత్వమండలి సభ్యులకు మా హార్దిక కృతజ్ఞతాంజలి.

ఈ సంపుటాల ముద్రణకు అధికారికమైన అమోదాన్ని తెలిపిన తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.కె.ఆర్.వినాయక్ I.A.S. గారికి కృతజ్ఞతాంజలి.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళికరూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త), విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందంగారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యూమానిటీస్ & ఎక్స్టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A., Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) మా హార్దిక కృతజ్ఞతాంజలులు.

ఈ సంపుటాల ముద్రణలో సాంకేతికపరమైన సహకారాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రణాధికారి శ్రీ ఎం. లక్ష్మణరావుగారికి, వారి సిబ్బందికి, తి.తి.దే పౌరసంబంధ శాఖాధికారి శ్రీ పి. సుభాష్‌గౌడ్ గారికి కృతజ్ఞతాంజలులు.

డా॥ మేడసాని మోహన్ M.A., Ph.D
డైరక్టర్
అన్నమాచార్య ప్రాజెక్ట్
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

తేది : 10-2-98

# తాళ్లపాక పదకవుల సంకీర్తనల సంపుటాలు
# సంఖ్యా వివరణ పట్టిక - 1998

| సంపుటాలు | మునుపటి సంఖ్య | ఇప్పటి సంఖ్య | సంకీర్తనాచార్యుని పేరు |
|---|---|---|---|
| అధ్యాత్మ సంకీర్తనలు | 1 | 1 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 2 | 2 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 3 | 3 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 10+11(1,2భాగాలు) | 4 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 12 | 5 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 4 | 6 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 13 | 7 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 14 | 8 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 15 | 9 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు | 16 | 10 | తాళ్లపాక చినతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 17 | 11 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 18 | 12 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 19 | 13 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 20 | 14 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 21 | 15 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 22 | 16 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 23 | 17 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 24 | 18 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 25 | 19 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 26 | 20 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 27 | 21 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 28 | 22 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 29 | 23 | తాళ్లపాక అన్నమాచార్యులు |

| | | | |
|---|---|---|---|
| శృంగార సంకీర్తనలు | 30 | 24 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 31 | 25 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 32 | 26 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 33 | 27 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 34 | 28 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 35 | 29 | తాళ్లపాక అన్నమాచార్యులు |

* తాళ్లపాక పదసాహిత్యం మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రణచేయబడుచున్నది. ఈ సందర్భంగా సంకీర్తనల సంపుటాల సంఖ్యలు క్రమపద్ధతిలో ఉండాలనే వుద్దేశ్యంతో మార్పులు చేయబడి, పై పట్టికలో చూపబడినవి. పై పట్టికలోని మునుపటి సంఖ్య వరుసలో సూచింపబడిన 33, 34, 35 సంపుటాలు ఇంతవరకు ముద్రింపబడలేదు. ఇప్పుడు ప్రథమంగా ప్రచురింపబడుతున్నాయి. అయినప్పటికి ప్రస్తుతం 1998 సం॥లో క్రొత్తగా 1వ సంపుటం నుండి ఇవ్వబడిన క్రమ సంఖ్యలు ఈ ప్రథమ ముద్రణ సంపుటాలకు చేర్చబడినవి. వివిధ దశలలో 5, 6, 7, 8, 9 సంపుటాలు ప్రస్తుతం 1, 2, 3 సంపుటాలుగా గ్రహింప వినతి. వివరములకు ఆయా సంపుటాల పీఠికలు చదువగలరు. ఈ మార్పును సహృదయ పాఠకులు గమనించగలరు.

# పీఠిక

* * *

శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల శృంగారసంకీర్తనల సముద్రణము ఈ ౧౨-వ సంపుటముతో ఈఁదుటకు ప్రారంభించినట్లైనది. మొత్తము ౨౦౦౨ గల ఆ సంకీర్తనల రేకులలో మొదటి నూఱు రేకులందలి సంకీర్తనలిందు పరిశోధితములై ప్రకటింపఁబడినవి. రేకులలో ౧౯, ౯౨, ౯౩, ౯౪, ౯౯, ౧౦౦ సంఖ్యల రేకులు మాకు లభింపలేదు. మఱి నాల్గవ సంపుటమున, ౩౧-వ రేకులోని మూఁడవ సంకీర్తన మొదలు ౬౦ వఱకుఁగల రేకులలోని సంకీర్తనలన్నియు కీ॥ శే॥ శ్రీ ప్రభాకరశాస్త్రిగారి చేతి మీఁదుగా పరిశోధితములై ప్రచురింపఁబడినవి. తక్కిన సంకీర్తనలన్నియు ఈ సంపుటమున క్రమముగా చేర్చఁబడినవి. ౧౧-వ సంపుటమందువలె ఇందును సాధారణపురేకులు (సా-రే.), నిడురేకులు (ని-రే.), పెద్దరేకులు (పె-రే), తంజావూరి సరస్వతీ భండారపు వ్రాఁతప్రతి (తం-ప్ర), శ్రీ తాళ్ళపాక వేంకటశేషాచార్యులవారింటి వ్రాఁతప్రతి (తా-వెం.)-అను నైదు మూలములను పోల్చి సరిచూచి పాఠములను నిర్ణయించితిని. పాఠభేదములు క్రింద సూచింపఁబడినవి.

ఆధ్యాత్మసంకీర్తనలు ఏఁబదేఁబది రేకులలోనివి ఒక్కొక్క సంపుటముగా ఇంతకుముందు ప్రచురణకెక్కినవి. ఇఁకముందు శృంగార సంకీర్తనలు నూరునూరురేకులవి ఒక్కొక్క సంపుటముగా చేర్చి ముద్రించు సంకల్పమున్నది. ఈ మహాకార్యము త్వరగా సాఁగుటకిది కొంతయుపకరించుననని, సంపుటములుగూడ చేతికందముగా అందుపాటుగా నుండఁగలవని, నాసమ్మికి.

1937–వ సంవత్సరమున శ్రీ తిరుమల - తిరుపతి దేవస్థానముల వారు ప్రచురించిన ' The works of Thallapaka poets, Vol. III ' అను సంపుటములో అపక్రమముగా ప్రకటితములైన అన్నమాచార్యుల శృంగారసంకీర్తనలు ఈ సంపుటమునుండి యథాక్రమముగా పరిశోధిత పాఠములతో వెలువడుచున్నవి.

శృంగారరసవీధులు వివిధజాతీయ దేశీయభాషావిశేషములకాకరములు. కనుక "విదితార్థ గ్రామ్యోక్తులు – పదిలముగాఁ బొంకమెఱిఁగి పలుకఁగఁ జెల్లుఁ" అనుటయు, "ఉచితభాష పదములఁ జెల్లుఁ" అనుటయు అన్నమాచార్యుల యభిప్రాయమని చినతిరుమలాచార్యుఁడు 'సంకీర్తనలక్షణము' న తెలిపినాఁడు. (ప్ర. ౫౫, ౫౬). మరి వ్యాకృతము అవ్యాకృతమునైన భాషను 'ఇదం బ్రాహ్మమిదం క్షాత్రం' అన్నట్లు నిర్లక్ష్యముగా లొంగఁదీసుకొని ప్రయోగించు సిద్ధహస్తుఁడు అన్నమాచార్యులు. ఆయనరసావేశముతో పాడిన పాటలు విని వ్రాఁతకెక్కించినవారు, రేకులపై చెక్కినప్పుడు చెప్పినవారు, చెక్కినవారును శబ్దస్వరూపములు సంధులు మొదలగు విషయములందు వారి వారి వ్యుత్పత్తికిని అభ్యాసమునకును తగినట్లు ఎన్నో మార్పులు చేసియుండక తప్పదు. అరసున్నలు, బండిఱాల ప్రయోగవిషయమున పద్ధతియు పట్టుదలయు రేకులు గీసినవారికున్నను వ్యుత్పన్నమైన నియమమున్నట్లు గానరాదు. రేఫఱకార నిర్ణయమును ఎంతో శ్రద్ధతోచేసి విధించిన పెద్దతిరుమలాచార్యుల అధ్యక్షత క్రిందనే జరిగిన యీ రేకుల లేఖనములో ఆ రెంటి విషయమునఁ గానవచ్చు అవ్యవస్థ వింతగా తోఁపక పోదు. ని-రే ల లోని పాఠములు సా-రే ల లోను వానిలోనివి పె. రే. ల లోను కొంత కొంత సవరించినట్లున్నవి. ఇట్టిస్థితిలో అన్నమాచార్యులనుగ్రహించిన శబ్దరూపముల యాథాతథ్యము నిర్ణయించుట అసాధ్యము. ఆ కాలపు శబ్దముల వ్యవహారస్వరూపము తెలియుటకై ప్రాయశః ఆయా రూపములట్లట్లే ఇందు నిలువరింపఁబడినవి. నేఁటి పఠనరీతికనువుగా కొన్ని చిఱుమార్పులు మాత్రము చేయక తప్పినది గాదు.

అన్నమాచార్యుల శృంగారభావనలు ఆధ్యాత్మికముగా అసాధారణములైనవి. ఆధిభౌతికముగా అతని యనుభవములును అట్టివేయని యూహింపవచ్చును. కనుక ఈ శృంగారసంకీర్తనలలో ప్రతిఫలించిన పురుషోత్తముఁడగు శ్రీ వేంకటేశ్వరుని విశ్వశృంగారలీలలు, ఆ నిరంకుశ ప్రవాహములో ఈఁదులాడుచు తలమునకలై తనుకులాడు విశ్వజీవనాయికల వింత వింతలైన అనుభవాలు, వానిని వెలువఱుచు వివిధములగు సందర్భములు, వాక్యములు, పదములు, — అన్నియు అసాధారణములుగానే యుండుట యందాశ్చర్యమేమియులేదు. యథాశక్తిగా వానిని తెలిసికొని సంతరించు ప్రయత్నమిందుచేసితిని. కాని ఎన్నో సందేహములు నిర్గుత్తరముగా నిలిచినవి. పరిశోధనరసికులకు ఇఁక ముందు ఎంతోపని యిందు గలదు. భావుకులైన పండితులును గాయకులును ఈ రచనల రసానుభవమును ప్రజలకందఱికిని పంచిపెట్టవలసిన పూఁటకాపులు.

ఈ కార్యము నాచే ఇంతవఱకు చేయించినది, శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల నిర్వాహకులగు శ్రీ చెలికాని అన్నారావుగారి నిర్హేతుక దయయని, ఈ శ్రీనివాసకైంకర్యమును ఫలమును వారివే యని, చెప్పుట పునరుక్తి. దీనిని తుదిదాఁకించు నవకాశము గల్పించి శ్రీ వేంకటేశ్వరుఁడు వారి నన్నుగ్రహించుఁగాక!

శ్రీ తిరుమల తిరుపతి దేవాలయ ముద్రాశాలవారు దీనినింత యందముగా ముద్రించి నా ధన్యవాదములకు పాత్రులైరి.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యా పరిశోధనాలయము, తిరుపతి,
4—10—1956.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ,
సంగీత వాఙ్మయ పరిశోధకుఁడు.

*

# శోధనిక

పీఠికలో

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| ౯ | 7 | అన్నమయ్య అన్నట్లు | అన్నట్లు అన్నమయ్య |

గ్రంథములో

| | | | |
|---|---|---|---|
| 2 | పాదదీపిక సంఖ్య 5 (ఫుట్ నోట్) | తమినీ | తిమినీ |
| 7 | 3 | ఆకే | ఆకె |
| 54 | పాదదీపిక | *విరతంతయోర్నికృతిర్నాస్తి | నిరతంయోర్నికృతిర్నాస్తి? |
| 189 | ,, | మానువంటివాఁడు బుద్ధుఁడా | * మానువంటివాఁడుబుద్ధుఁడా |
| 202 | ,, | * బంట | * బంటు |
| 229 | ,, | * అవి | * అవి |
| 237 | ,, | గోరు + అది | గోరు + అది |



గమనిక :— అచ్చు పాతదగుటచే అక్షరస్వరూపములు అక్కడక్కడ స్పష్టముగ నంటలేదు.

# పీఠిక

* * *

ప్రస్తావన :—

పూజ్యపాదులు శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు 4–10–1956 న ప్రకటించిన పండ్రెండవ సంపుటమిది. దీనితోనే తాళ్లపాక అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు ప్రారంభమైనవి. ఇందు శృంగార సంకీర్తనలు ఒకటవ రేకునుండి ముప్పదియొకటవ రేకులోని రెండు కీర్తనలు కలిసి 174 కీర్తనలు, ఆపై 61వ రేకునుండి 95 వరకు గల 35 రేకులలోని పాటలు 206 వెరసి 380 కీర్తనలు ముద్రితములగుచున్నవి. 31వ రేకులోని మూడవ పాటనుండి 60వ రేకు పూర్తిగానున్న పాటలను కీ. శే. ప్రభాకరశాస్త్రిగారు 1947 వ సంవత్సరమున నాల్గవ సంపుటమున ప్రకటించినారు.

అన్నమాచార్య శృంగార సంకీర్తనల రేకులలో ౧౯, ౯౬, ౯౭, ౯౮, ౯౯, ౧౦౦ సంఖ్యలుగల రేకులు దొరకలేదు. ఈ సంకీర్తనల రేకులు మూడు తరగతులుగ నున్నవి. 1. శృంగార సంకీర్తనల రేకులు 15½ అం. పొడవు, 7 అం. వెడల్పుగలవి (సా. రే.) సాధారణ రేకులని, 2. తాళపత్రాకృతితో 6½ అం. పొడవు. 2½ అం. వెడల్పుగలవి (ని. రే.) నిడుదరేకులని. 3. 28 అం. పొ. 16 అం. వె. గలవి (పె. రే.) పెద్ద రేకులనియు వ్యవహారములో నున్నవి. ఈ కుండలీకరణములో చూపిన అక్షరములు ఆయా తరగతులకు చెందిన రేకులను సంకేతములు

సా. రే.లలోని పాటలే ని. రే; పె. రేలలో గూడ కొంత పాఠభేదములతో నున్నవి. మొదట తాళపత్రాకృతి రేకులలో

వ్రాసి అవి అస్థిరములని తలచి మరల సా. రే.లలో వ్రాసినట్లును, ఐదారు పె. రే.లను ఒక కడియముతో గ్రుచ్చి యాత్రాస్థలములకు ఎత్తుకొనిపోవుట కనువుగా సిద్ధపఱచినట్లును పెద్దలు చెప్పుచుందురు.

శ్రీ శర్మగారు ఈ సంపుటమునందలి పాటలన్నింటిని ముత్తె అగులరేకులతో మరిరెండు వ్రాత ప్రతులతో సంప్రతించి పాఠభేదములను పాదదీపిక (Foot note) లో చూపుచు వెలువరచినారు. ఇది అసాధారణమైన కార్యము.

అన్నమాచార్యుల కృతులను తెలుగు M.A. వారికి విశిష్ట పాఠ్యభాగముగ నిర్ణయించుటచే శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము వారి ఆంధ్ర సాహిత్య ప్రీతి, అన్నమయ్య వాఙ్మయమునందుగల భక్తి, దీనిని గడ్డకు తీసుకొని రావలెనను దొడ్డ సంకల్పమూ మిగుల కొనియాడ దగియున్నవి.

వాల్మీకి మొదలు తమవరకు గల సంస్కృత వాఙ్మయమును, కవిత్రయము మొదలు శ్రీనాథునికి ముందు వరకు గల తెలుగు సారస్వతమును ఆపోశనము పట్టి స్వతంత్ర ప్రతిభావ్యుత్పత్తులతో పలు విధములగు కావ్యరీతులపై చేయివేసి తాము నడచిన సాహిత్య వీథులందంతట సాటిలేని వారని కీర్తిగాంచి, ప్రబంధకవులకు - దాక్షిణాత్యకవులకు తమ సారస్వత ప్రసాదమును పంచిపెట్టినది ఈ తాళ్లపాక వంశము. వీరి సాహిత్యము ఎక్కువ భాగము పద వాఙ్మయమగుట చేతను, వీరి వాఙ్మయమంతయు రాగిరేకుల కెక్కి వేంకటేశ్వరుని ఆలయమున ఒక మూల అరలో చాల కాలము అజ్ఞాతవాసము చేయుటచేతను దీనికిప్పటికి రావలసినంత ప్రసిద్ధి రాలేదు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము వారు పై విధముగ సంకల్పించుటచే ఈ సాహిత్యమునందలి మర్మములు కాలక్రమముగ చాల బైట పడగలవు.

మన విశ్వవిద్యాలయము తెలుగు M.A. విద్యార్థులకు చాలి నన్ని పూర్వ ముద్రణప్రతులు లేనందున ఈ ద్వితీయ ముద్రణము ఆవశ్యకమైనది. విశ్వవిద్యాలయమువారి కోరికను గౌరవించి శ్రీ తిరుమల-తిరుపతి దేవస్థానమువారు ఈ ద్వితీయ ముద్రణమునకు మిక్కిలి ప్రాధాన్యమిచ్చి అన్ని పనులకంటె ముందు ఈ ముద్రణము సాగించినారు. శ్రీనివాసుని కృపతో ఈ యుభయుల సంకల్ప-బలము ఫలించి అన్నమాచార్య సారస్వత సౌరభము నేల నాలుగు-చెఱగుల నెరసి పండి పరిమళించుగాక!

## శ్రీ అన్నమాచార్య చరిత్ర :

శ్రీ అన్నమాచార్యులు పుట్టుకతో నందవరీక స్మార్తబ్రాహ్మణ శాఖకు చెందినవారు. ఈ నందవరీకులందఱును ఋగ్వేదులు; అశ్వలాయన సూత్రులు. ఈ తాళ్లపాకవారిది భారద్వాజ గోత్రము. ఈ యింటిపేరుతో అన్య గోత్రములవారు గూడ ఉన్నట్లు తెలియుచున్నది.

## నందవరీకులు :—

ఈ నందవరీకులందరును పదియవ శతాబ్దమున కాశినుండి ఆంధ్రదేశమునకు వలస వచ్చిన శుద్ధవైదిక బ్రాహ్మణులు. వీరి చరిత్రమిట్లు చెప్పుచున్నది [1] :—

నేటి కర్నూలు మండలములో "బనగానిపల్లి-పాణ్యాం"ల మధ్యనున్న నందవరమను గ్రామము రాజధానిగా పదియవ శతాబ్దమున నందుడనెడు రాజు పాలించుచుండెను. అతనికి, నిత్యము ఉషఃకాలమున కాశిగంగలో స్నానముచేసి తెల్లవారకమునుపే తన గ్రామమును

1. చూ. చౌడేశ్వరీ మాహాత్మ్యము, గొని(ను)పల్లె రామప్పకవి,

చేరునట్టి సిద్ధికావలెనని ఒక పేరాస యుండెనట. దత్తాత్రేయసిద్ధుని వలన మంత్రశక్తిగల పాదుకలను సంపాదించి ఆసిద్ధుడే తెల్పిన ఒక సొరంగము త్రోవతో కాశికివెళ్లి స్నానముచేసి సూర్యోదయమునకు ముందే ఇల్లు చేరుచుండెను. సిద్ధుని ఆదేశముతో తన భార్యకుగూడ చెప్పక ఆమెకును తెలియకుండనే ఈ పని సాగించుచుండెను. ఒక నాడు ఆమె ఉషఃకాలమున మేల్కొని పడకపై భర్తను గానక పరితపించి ఆతని గుట్టు తెలిసికొన్నది. తానుగూడ కాశీ స్నానమునకు రావలెనని మగనితో మారాముచేసి వెళ్లి స్నానము చేసినదట. స్నానమైన తరువాత ఆయమ ఇంటికి దూరమగుటచే మంత్రప్రభావము పనిచేయక రాజు తన భార్యతోగూడ అచ్చటనే నిలిచిపోవలసిన స్థితి యేర్పడినది. అప్పుడచ్చట స్నానముచేయుచున్న బ్రాహ్మణులను చూచి "నా సంకల్పము ప్రకారము ఉదయమునకు ముందే మమ్ము ఊరు జేర్చు మహిమోపేతులు ఎవ్వరైన మీలో కలరా? అట్లైన మమ్ము కడతేర్పుడు" అని ప్రార్థించెను. వారు దానికి సమ్మతింపగా మీరు కోరిన దేదైనను నేనివ్వగలనని చాముండేశ్వరి ఘట్టమున దేవీ సాక్షికముగ వాగ్దానము చేసెను. వారు, మాకాయవసర మిప్పుడు లేదు; కొలది కాలములో మహాక్షామము రాబోవుచున్నది; అప్పుడు మేము మీకడకువచ్చి మీసాయము పొందగలమనిరి. తరువాత వారు చెప్పినట్లు క్షామముగాగా ఆసాయముచేసిన బ్రాహ్మణ కుటుంబములలో కొందరు పెద్దలు నందవరమునకు వచ్చి రాజు చెప్పినమాట గుర్తుచేసి సాయము చేయుమని రాజును వేడిరి. రాజు, "నేను మీకెప్పుడు చెప్పితిని? దీని కేదైవము సాక్షి?" అని ప్రశ్నింపగా వారు కాశికి తిరిగివచ్చి తాము కొలిచెడి చౌడేశ్వరి (చాముండేశ్వరి) దేవిని సాక్ష్యము కోరగా ఆమె, "మీరు ముందుకు నడచుచుండుడు; వెనుకకు తిరిగి చూడరాదు; అట్లైనదైన ఎక్కడనైన తిరిగి చూచిన నేనచ్చటనే నిలిచిపోదును." అని ఖండితముచేసి వారివెంటవచ్చి రాజునకు యథార్థ విషయముతెలిపి రాజుగారిచే నందవరమును గ్రామమును

అబ్రాహ్మణులకు ధారాదత్తము చేయించి వారందరి ప్రార్థనపై ఆ-దేవి నందవరముననే స్థిరపడి పోయినదట. కావుననే కాశిలోని చౌడేశ్వరీదేవాలయము నేటికిని శూన్యగర్భాలయముగ నున్నదని వాడుక.

వీరు కాశినుండి వచ్చునపుడు క్షామపీడితుడైన దుగ్గన అప్పయ్య అను ఆరువేల నియోగి బ్రాహ్మణు డొకరు సకుటుంబముగ వీరితో కలసివచ్చి నందవరముననే స్థిరపడియుండెనట. ఆనాటి ఆ బ్రాహ్మణ కుటుంబముల ఇండ్లపేర్లన్నియు వేదశాస్త్ర పురాణములతో 'మహాభాష్యం', 'కాణాదం' ఇత్యాదిగా ఈ నాటికిని రికార్డులలో దొరకుచున్నవి. కావున వారందరు ఆనాటికి శుద్ధవైదికశాఖకు చెందినవారే. కొంతకాలమునకు, తమతో వచ్చిన దుగ్గన అప్పయ్య అనునతడు తన కుమార్తెను ఈ కుటుంబములలో నెవ్వరికో పెత్తనము చేసి స్వీకరింపుడని ప్రార్థింపగా వీరు. మేమన్యశాఖలో పెండ్లియాడమని తిరస్కరించిరట. దానితో తనకు వేరుఆశ్రయము లేక ఆ అప్పయ్య తన కుటుంబముతోసహా ఆత్మహత్య చేసికొని బ్రహ్మ-రక్షస్సుగా మారి వీరిని బాధింప జొచ్చెను. వీరాబాధపడలేక తమ కులదైవమగు చౌడేశ్వరిని ప్రార్థింపగా ఆమె బ్రహ్మహత్యాదోషముతో మీ మహిమ పొల్లుపోయినది. మీరికపై లౌకిక వృత్తులను (కరణీకం వగైరా) చేపట్టి నన్ను మరువకుండ కొలుచుచు నా భక్తులగు తొగటవీరులకు దేశికులై బ్రతుకుడని ఆదేశించినదట. అది మొదలు ఈ వైదికబ్రాహ్మణ కుటుంబములన్నియు నందవరీకులు అను నియోగిబ్రాహ్మణులుగా ఆంధ్రదేశమున వ్యవహరింపబడుచున్నారు. నిజమునకు వీరు శుద్ధవైదికశాఖకు చెందినవారు. నందరాజుచే కొని తేబడిన వైదికులుగావున 'నందవైదీకులు' అని, నందవరమున నెల కొన్నవారు గావున 'నందవరీకులు' అని ఈ రెండుపేర్లును నేటికి తడబాటులోనున్నవి. ఆనందవరీకశాఖకు చేరిన కుటుంబమే మన

తాళ్లపాకవారిది. క్రమముగా వీర్లయింటి పేర్లన్నియు గ్రామనామధేయములతో సిద్ధములై వ్యవహారములోనున్నవి.

ఈ తాళ్లపాక అన్నమయ్య జన్మస్థలము నేటి కడపజిల్లా, రాజంపేట తాలూకాలోని తాళ్లపాక అను గ్రామము. అదే వీరి యింటిపేరుగ నిలిచినది. ఆ ప్రదేశమంతయు ఆనాటి వ్యవహారము ప్రకారము పొత్తపినాడులోనిది. అన్నమయ్య తల్లి లక్కమాంబ. తండ్రి నారాయణసూరి. నారాయణసూరికి చాలకాలము సంతానము కలుగకుండుటచే ఆదంపతులు మన వేంకటేశ్వరునకు ముడుపు గట్టిరట. ఆనాటి రాత్రి వారికి కలలో స్వామికాలియందెలు, స్వామివారికటారు (కత్తి) దర్శనమిచ్చినవి. వాని ప్రసాదమే మన అన్నమయ్య. శ్రీ స్వామివారి చిరుగజ్జల ప్రభావమే అన్నమయ్య సంగీత సాహిత్య కళారాశియగుటకు కారణము కావచ్చు. పన్నిద్దరాళ్వారులలో ఒకరగు పేయాళ్వారువలె అన్నమయ్యయు స్వామినందకాంశమను ప్రసిద్ధి గలదు. నారాయణసూరి-దంపతుల కలలో స్వామివారి కటారు దర్శనమిచ్చిన ఫలితమిదియే కావచ్చు. 'అన్నం బ్రహ్మేతి వ్యజానాత్' అను శ్రుతి ప్రకారము నారాయణసూరి పరబ్రహ్మవాచకముగా తన పుత్రునకు 'అన్నమయ్య' అని నామకరణము చేసినారు.

[1] అన్నమయ్య జన్మకాలాది చర్చ:

అన్నమయ్య క్రీ. శ. 1424 క్రోధి సంవత్సర వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు విశాఖా నక్షత్రమందు జన్మించినట్లు కీ. శే. ప్రభాకర శాస్త్రిగారు పేర్కొనియున్నారు. శ్రీ శాస్త్రిగారే, వేంకటేశ్వర వచనములకు పీఠిక వ్రాయుచు (1945, పీఠిక - పుటలు, 12, 13) అన్నమయ్య జన్మకాలము క్రీ. శ. 1408 అని వ్రాసి, అన్నమాచార్య చరిత్ర పీఠిక (1949, పీఠిక - పుటలు, 2, 3)లో దానిని సవరించి

1. 1424 – 1503 అని కీ. శే. ప్రభాకరశాస్త్రిగారు.
1408 – 1503 అని నా యూహ.

క్రీ. శ. 1424 అని వ్రాసినారు. డా॥ వేటూరి ఆనందమూర్తిగారు "తాళ్లపాక కవుల కృతులు, వివిధ సాహితీప్రక్రియలు" అను గ్రంథమున (పుటలు 60 నుండి 65 వరకు) దీనినే బలపరచుచు శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి[1] నిర్ణయమును, శ్రీ చాగంటి శేషయ్యగారి[2] నిర్ణయమును త్రోసి పుచ్చిరి.

అసలు రేకులపై నున్న వాక్యమిది:— "స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౪౬ అగు నేటి క్రోధి సంవత్సరమందు తాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన పధ్ధారు యేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను అది మొదలుగాను శాలివాహన శక వరుషంబులు ౧౪౨౪ అగు నేటి దుందుభిసంవత్సర ఫాల్గుణ బహుళ ౧౨ నిరుధానకు తిరువేంగళనాథుని మీఁదను అంకితముగాను తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగార సంకీర్తనములు."

ముందు చర్చించిన వారందరు ఇందలి వాక్యనిర్మాణ పద్ధతిని బట్టియే చర్చ సాగించినట్లు చెప్పినారు. నాయభిప్రాయమిది:— ఈ వాక్యము జన్మనిర్యాణములను తెలుపుట కేర్పడినది కాదు. ఆతని జీవితకాలములో ఏది సారభూతమైన సమయమో దానిని తెలుపుటకే ఏర్పడినది. జన్మప్రభృతి పదహారేండ్లవరకు గడచిన కాలము సారహీనమైనదనియు, పదహారవ యేట తిరువేంగళనాథుడు ప్రత్యక్షమైన తర్వాత, ఆతనిపై దినమునకు ఒక్క కీర్తనమునకు తక్కువ గాకుండ స్వామిని కొనియాడిన కాలమే సారభూతమైనదనియు, ఆతని నిర్యాణ దినమువరకు సాగినందున నిర్యాణ దినము మాత్రము (దుందుభి-ఫాల్గుణ-బహుళ ౧౨) లెక్కకు వచ్చినదనియు తెలుపుచే ఈ వాక్య పరమార్థము. కావున రేకులపై గనపడు 79

---

1. T. T. D. ఎపిగ్రాఫికల్ రిపోర్టు.P. 280.
2. ఆంధ్ర కవి తరంగిణి, సం-8- P. 123.

సంవత్సరములతోపాటు సారహీనముగ గడచిన 16 సంవత్సరములు కలిస్తే 95 సంవత్సరములు అతని జీవితకాలమని తేలినది. 1408 విరోధి వైశాఖ శుద్ధ పూర్ణిమ విశాఖా నక్షత్రమున జన్మమనుట సబబు. విరక్తుడగు అన్నమయ్య ఈ విధముగ లెక్కించెననుట సమంజసము.

ఈ వాక్యమునందు రెండు 'నేడు' శబ్దములున్నవి. ఒక 'నేటి క్రోధియందు' తిరువేంగళనాథుడు ప్రత్యక్షమైనాడు. మరియొక 'నేటి దుందుభి' వరకు ఈ సంకీర్తన రచన సాగినది. ఇది సారభూతమైన కాలము. ఈ రెండు నేడులు, అనంతప్రభవాది సంవత్సరములలో ఒకటి స్వామి దర్శనమునకు, మఱియొకటి తన నిర్యాణమునకు గురుతుగా ప్రస్తావింపబడినవి. 'నేటి క్రోధియందు' అన్నది క్రియ నపేక్షించుచున్నది. 'ప్రత్యక్షమైతేను' అన్న క్రియ దీనికి పూరకము. ఎప్పుడు? అను నాకాంక్ష - ఎదురగుచున్నది. 'అవతరించిన పదారు యేండ్లకు' అన్నవి సమాధానము. అవతరణము ముందే జరిగినదన్నమాట. 'అవతరించిన' అను ధాతుజ విశేషణము 'పదారు యేండ్లకు' అను పదముతో సమసించి సులభాన్వయముగా అర్థము పొసగుచున్నది. ఇట్లన్వయించుట దూరాన్వయమని పెద్దలెందుకు వాకొనిరో తోచకున్నది. అవతరణమే ఈ వాక్యమున చెప్పదలచినచో 'అవతరించినది' అనిగదా యుండవలెను! ఈ విధముగా అన్వయించుటచే అన్నమయ్య తన మనుమలకు బ్రహ్మోపదేశము చేసెనను చారిత్రకాంశము సుపరిష్కృతమగుచున్నది. దీనికై శ్రమపడి సమన్వయము మనము చేయవలసిన పనిలేదు. ఇంతకూ అన్నమయ్య దృష్టిలోనే అసారభూతమైన పదహారేండ్ల వయసునకై చేసిన **ఈ కోలాహలమూ** అసారమే. కాలమూ, పెద్దలూ దీనిని గుర్తింపగలరు.

అన్నమయ్య అడ్డాలబిడ్డడై యున్ననాళ్లలోనే తిరుమలప్ప ప్రసాదమని చెప్పకుంటే ఉగ్గుకూడా త్రాగడట. కొంచెమెదిగి ఐదేండ్ల

వాడైనా అన్నమయ్యా, నారాయణసూరి, శంకరాచార్యులకువలె ఈతనికి ఐదవయేటనే ఉపనయనము చేయించినారు. "నవమే త్వాయుష్కామం పంచమే బ్రహ్మవర్చసకామమ్" అను స్మృతి ననుసరించి, తన కొడుకు బ్రహ్మవర్చస్వి కాగలడని నారాయణసూరి అట్లు చేసియుండును. ఉపనయనమైన గురువునొద్ద విద్యాభ్యాసమునకు చేర్చిరి. అది వట్టి శాస్త్రమర్యాదగనే నడచినది. "ప్రపేదిరే ప్రాక్తన-జన్మవిద్యాః" అన్నట్లు అన్నమయ్యకు అన్నివిద్యలు తమకు తామేవచ్చి నాలుకకొన నాట్యమాడసాగినవి. విద్యాభ్యాసకాలముననే కవితా-వనిత వీరికౌగిట కొదిగినట్లున్నది. ఆనాటినుండియే అన్నమయ్య సంకీర్తనలు పాడి ఆడుచుండెడివాడట. ఆయన ఆడినదిఆట, పాడినది పాటగా లోకులు మెచ్చి కీర్తించుచుండిరట. భగవచ్ఛక్తి కసాధ్యమైనది లేదను ఆస్తికులెవ్వరును ఈ విషయమునందు వింతపడరు.

రానురాను అన్నమయ్యకు శ్రీనివాసునిపై మరులు బలియుచుండెను. పూర్వజన్మ సంస్కారఫలముగ ఒకనాటి వేకువన అన్నమయ్యకు కలలో స్వామి దేవాలయము, గోపురము, బంగారువాకిళ్ళు, గర్భాలయము, అందు శతకోటితేజముతో వెలుగు స్వామిమూర్తి దర్శనమిచ్చి తన్నురమ్మని పిలిచినట్లుండెనట.

భూపాలం

ఇప్పుడిటు కలగంటి నెల్లలోకములకు।
నప్పఁడగు తిరువెంకటాద్రీశుఁ గంటి ॥పల్లవి॥

అతిశయంబైన శేషాద్రిశిఖరము గంటి।
ప్రతిలేని గోపురప్రభలు గంటి।
శతకోటిసూర్యతేజములు వెలుఁగఁగఁ గంటి।
చతురాస్యుఁ బొడగంటిఁ జయ్యన మేలుకంటి ॥ఇప్పు॥

కనకరత్నకవాటకాంతు లిరుగడఁ గంటి।
ఘనమైనదీపసంఘములు గంటి।
అనుపమమణీమయమగుకిరీటము గంటి।
కనకాంబరము గంటిఁ గ్రక్కున మేలుకంటి ॥ ఇప్పు ॥

అరుదైన శంఖచక్రాదు లిరుగడఁ గంటి।
సరిలేని యభయహస్తము గంటిని।
తిరువెంకటాచలాధిపునిఁజూడఁగఁ గంటి।
హరిఁగంటి గురుఁగంటి నంతట మేలుకంటి ॥ ఇప్పు ॥

అధ్యా. సం. ౮ వ రేకు

ఈ పాట పై చరిత్ర వాక్యమునకు సాక్షి. వెంటనే ఇంటివారికి చెప్పక ఒంటరిగా తిరుమలకు పయనమై తన యూరినుండి కాలి నడకతో దిగువ తిరుపతి చేరి, అందలి గ్రామదేవతకు నమస్కరించి, ఆనాటి వేకువన కొండకు పయనమై అలిపిరియొద్ద నున్న చింతచెట్టుకు, ఆ దాపల నున్న నృసింహస్వామికి మ్రొక్కి, జాము ప్రొద్దెక్కునంతకు మోకాళ్ల మెట్టు చేరి, అప్పటికి కలిగిన బడలికతో సొమ్మసిలి నేల వ్రాలి పోయెనట. జగన్మాతయగు అలమేలుమంగ ఆ మైకములో నున్నవానిని లేపి తన కడగంటి చూపులతోడనే ఆతని బడలికలు దీర్చి "నాయనా! ఈ కొండ సాలగ్రామ మయము. దీనిని చెప్పు కాళ్లతో ఎక్కరా" దని చెప్పెను. ఆ యూరడింపునకు తనిసి అన్నమయ్య జగన్మాతపై వేంకటేశ్వర మకుటముతో ఆశుధారగా ఒక శతకము చెప్పెను. ఆపై చెప్పులు వదలి ఎక్కి మెల్లగా కొండ చేరి చూడదలచిన స్థలములన్నియు చూచి ఆ రాత్రి నివసించి మరునాడు వేకువన కోనేటిలో స్నానముచేసి పండ్రెండు నామములు ధరించి దేవళమునకు పోగా గుడి తలుపులు తాళమువేసి యుండిరట. అన్నమయ్య స్వామిని శతకముతో కీర్తింపగనే తలుపులు తమకు తామే వీడెను. వైఖానసులీతని మహిమ గుర్తించి స్వామి దర్శనము

చేయించి స్వామి ప్రసాదమిచ్చి గౌరవించినారు. ఇట్లు స్వామి నాతడెన్ని దినములు సేవించెనో, ఎప్పుడు స్వామి ప్రత్యక్షమాయెనో తెలియదు. ఒకనాడు విష్ణునామధేయుడైన యతికి స్వామి కలలో ప్రత్యక్షమై "నావాడొకడు రేపు నీకడకు వచ్చును. ఆతనికి నీవు చక్రాంకనము చేసి పంచసంస్కారములతో వైష్ణవ దీక్ష నిప్పింపు" మని చెప్పెనట. ఆతడు వెరగంది లేచి ఉదయముననే తన నిత్య-కృత్యములు దీర్చికొని శంఖచక్ర ముద్రలు చేతనూని అన్నమయ్యకై అబ్బులు చాచి చూచుచుండెను. ఇంతలో స్వామి కలలో చెప్పిన-గుర్తులతో అన్నమయ్య ఆ యతి ముంగిలి చేరగనే ఆతడానందపడి అన్నమయ్యకు చక్రాంకనాది పంచ సంస్కారములు చేసి వైష్ణవదీక్ష ఇచ్చెనట. నాటినుండి అన్నమయ్య అన్నమాచార్యులయిరి. అపై గురువుగారి ఆనతితో ఊరికిపోయి పెద్దలమాట మేరకు తిరుమలక్క (తిమ్మక్క), అక్కలమ్మల నొకే సారి వివాహమై అహోబిలమున శఠకోపయతిచే శ్రీ వైష్ణవ సిద్ధాంతమగు విశిష్టాద్వైతమును సమగ్రముగ నభ్యసించి, తన జీవితమంతయు ఆ మతప్రచారముననకే అంకితము చేసినారు.

విరక్తుడు హరిభక్తిపరాయణుడుఅగు అన్నమయ్య మహిమలూ, సాహిత్యమూ నానాటికి బలిసి దేశమంతట వ్యాపించినవి. ఆనాళ్లలో కడప మండలము "టంగుటూరు"ను రాజధానిగ చేసికొని రాజ్యమేలుచుండిన సాళువ నరసింహరాయలు అన్నమయ్య కీర్తి విని ఆయనను తన యాస్థానమునకు పిలిపించుకొని అతనిచే పాడించి విని ఆనందించి కాంచనాంబరా భరణాదులతో సత్కరించెనట. రాజుగూడ హరిభక్తి గలవాడుగదా యని అన్నమయ్యయు ఆతని పిలుపును మన్నించి చేసిన సత్కారమును శ్రీనివాసప్రీతిగ స్వీకరించెను. ప్రతిదిన-మాస్థానమూ. సంకీర్తనలగానమూ, సాహిత్యగోష్ఠి సాగుచుండెను. ఒకనాడు, అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరునిపై శృంగార రసవాహి

నిగా రచించిన - "ఏమొకో చిగురుటధరమున" (12 సం. 82 వ పాట) అనుపాట పాడుటయు, సభయంతయు నిలుపులేని తలయూపులతో మెచ్చుకొనుటయు జరిగినది. కొందరీతనిపాట విని తుంబురుడో, నారదుడో అవతరించెననియు, కొందరీతని కవితను గుర్తెరిగి కాళిదాసుడే జన్మించినా డనియు కొనియాడుచుండిరి. ఆ పాట వినిన రాజు ఆనందపరవశుడై అన్నమయ్య నభినందించి "ఇట్టి కీర్తనము నాపై నొకటిరచింపు" మని ప్రార్థించెనట. వెంటనే అన్నమయ్య రెండుచేతులతో చెవులు మూసికొని "శ్రీహరీ! పరమపతివ్రతాభావముతో శ్రీహరిని కీర్తించు నాజిహ్వా మానవుని కీర్తింపజాల" దనెను. తోడనే రాజుకు ఎనలేని కోపము ముక్కుపై నెదురైనది. "నెచ్చెలివని మెచ్చి ఒక కీర్తన నాపై రచింపుమనగా ఇంత తిరస్కారమా" యని ప్రభుతాహంకారముతో అన్నమయ్యకు సంకెళ్లు వేయించి చెరసాలలోనుంచగా అన్నమయ్య:-

ముఖారి

ఆఁకటివేళల నలపైనవేళను
తేఁకువ శ్రీహరినామమే దిక్కు మఱిలేదు ॥ పల్లవి ॥

కొఱమాలి వున్నవేళ కులముచెడినవేళ
చెఱవడి వొరులచేఁ జిక్కినవేళ
వొఱపైన హరినామ మొక్కటే గతిగాక
మఱచి తప్పిననైన మఱిలేదు తెఱఁగు ॥ ఆఁక ॥

ఆపదవచ్చినవేళ నాఱడిఁబడినవేళ
పాపపువేళల భయపడిన వేళ
వోపినంత హరినామమొక్కటే గతిగాక
మాపుదాఁకాఁ బొరలిన మఱిలేదు తెఱఁగు ॥ ఆఁక ॥

సంకెలఁబెట్టినవేళ చంపఁబిలిచిన వేళ
అంకిలిగా నప్పులవా రాఁగినవేళ
వేంకటేశునామమే విడిపించ గతిగాక
సంకుబుద్ధిఁ బొరలిన మఱిలేదు తెఱఁగు ॥ అఁక ॥

(అధ్యా. సం. 28 వ రేకు)

అని స్వామిని ప్రార్థింపగా సంకెలలు తమకుతామే వీడినవట. రాజీ-సంగతి విని రెట్టించిన కోపముతో చెఱసాలనున్న అన్నమయ్యకడకు వచ్చి "మాయలు నాతో పనికిరావు. చెఱసాల కావలివారికి లంచ మిచ్చి సంకెళ్లూడదీయించుకొని ఇది దైవానుగ్రహముగ చాటుకొను చున్నావు. ఇదిగో నా యెదుట ఇప్పుడే సంకెళ్లు వేయించుచున్నాను. నీకు దైవబలమున్నది నిజమైనచో ఇప్పుడు సంకెళ్లు విడిపించుకొ" మ్మని మరల సంకెళ్లువేయింపగా అన్నమయ్య పైవిధముగనే శ్రీ వేంక టేశు ప్రార్థింపగా వెంటనే సంకెళ్లూడిపోయినవట. అటుపై రాజు అన్నమయ్యకు సాష్టాంగపడి చేసినతప్పుమన్నించుమని వేడుకొని అన్న-మయ్య నందలమెక్కించి ఒకకోపు తాను మోయుచు నూరేగింపుచేసి పశ్చాత్తాపపడి ఘనముగసంభావించెనట. "చేసిన తప్పునకు పశ్చాత్తాప పడితివి. నిన్ను శ్రీహరి రక్షించుగాక!" అని దీవించి అన్నమయ్య యథాపూర్వముగ నుండెనట. అన్నమయ్య చెప్పినది చెప్పినట్లే జరుగుట ఇత్యాది మహిమలింక ననేకములు గలవు.[1]

అన్నమయ్య మతము :—

అన్నమయ్య పుట్టుకతో స్మార్తబ్రాహ్మణశాఖకుచెంది అద్వైతి యయినను తానువలచి స్వీకరించినది శ్రీ వైష్ణవ సిద్ధాంతమగు విశిష్టా ద్వైతమే. ఆ మతమువారే దీక్షఇచ్చి మతప్రబోధము చేసినవారు. ఆ పనిగూడ స్వామియనుగ్రహమువలననే సాగినది.

1. ఇంతవరకుగల ఈ చరిత్ర సంగ్రహమంతయు, చిన్నన్నవ్రాసిన అన్నమాచార్య చరిత్రమును ఆధారముగా చేసికొని వ్రాసినది.

దేసాళం

గతులన్ని ఖిలమైన కలియుగమందును
గతి యీతఁడే చూపె ఘనగురుదైవము ॥ పల్లవి ॥

ఈతని కరుణనేకా యిలవైష్ణవులమైతి-
మీతనివల్లనే కంటి మీతిరుమణి
యీతఁడేకా వుపదేశమిచ్చె నష్టాక్షరమంత్ర-
మీతఁడే రామానుజులు ఇహపరదైవము ॥ గతు ॥

వెలయించె నీతఁడేకా వేదపు రహస్యములు
చలిమి నీతండె చూపె శరణాగతి
నిలిపినాడీఁ తండెకా నిజముద్రా ధారణము
మలసి రామానుజులే మాటలాడే దైవము ॥ గతు ॥

వినయము లీతఁడేకా నిలిపెఁ బ్రపన్నులకు
దయతో మోక్షము చూపెఁ దగ నీతండె
నయమై శ్రీ వేంకటేశు నగమెక్కివాకిటను
దయఁజూచీ మమ్మునిటే తల్లిదండ్రి దైవము ॥ గతు ॥

(అధ్యా – 175 వ రేకు)

పైకీర్తనము స్పష్టముగ నీతని మతమిదియని చాటుచున్నది. వీరి వివిధసాహిత్యప్రక్రియలును ఆ మతముపై నాధారపడి నడచినవే.

"సహజ వైష్ణవాచారవర్తనుల సహవాసమె మాసంధ్య"
ఇత్యాదులుగూడ ఈతని మతస్వరూపమును తెల్పునవియే.

అన్నమయ్య భక్తి:—

మోక్షమును గోరువారికి భక్తి ప్రధాననిరపాయ సాధన మార్గము.[1] ఈ భక్తి నవవిధమని, పంచవిధమని భాగవతాదులలో

1. మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ ।
స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే ॥ అని వివేక చూడామణి.

కీర్తింపబడినది. అశాశ్వత ప్రపంచ విషయములను విడిచి పరమార్థము నందు మనసు నిలిపి సోపాన క్రమముగా పరమార్థమునందే తన్మయీభావమును పొందుట దీని లక్ష్యము. శ్రీ వైష్ణవ సిద్ధాంతమునందు దీనికి కర్మము, జ్ఞానము రెండును పూర్వాంగములు. తనకునియతములైననిత్య నైమిత్తిక కర్మములను శ్రద్ధతో నాచరించుచు, దానితో చిత్తశుద్ధిపొంది ఇహమనిత్యము, పరము నిత్యమనునిత్యానిత్యవస్తు వివేకజ్ఞానముగలిగి తపోధ్యాన సంకీర్తనాది ప్రక్రియలతో వైవిధముగ తన్మయీభావమును సాధించుట దీని క్రమము. తపోధ్యానయోగాది మార్గముల వారు సనకసనందాగస్త్యాదులు. సంతతచింతనసంకీర్తన మార్గమువారు నారద గోపికాదులు. వీనిలో కడపటిదగు సంకీర్తన మార్గము మనఅన్నమయ్యది. ఇదిసున్నితము, సులభము, సూక్ష్మము, సూటియైన త్రోవ. గోపికలు, పరబ్రహ్మయగు శ్రీకృష్ణుని తమపతిగా భావించి ప్రత్యక్షముగ చూచి కట్టుకొని కీర్తించి తరించిరి. అట్లే అన్నమయ్య గూడ మన వేంకటేశ్వరుని మానసికముగా, ప్రత్యక్షముగా చూచి నాయికా భావముతో (తాను నాయికగా) స్వామియందు సర్వశృంగారప్రక్రియలు సాగించి కీర్తించి తరించినాడు. దాని స్థూలరూపమే ఈ మనసంకీర్తనలరాశి. పురుషునకు నాయికాత్వము సిద్ధించునాయని సందేహింపరాదు. వైష్ణవ సంప్రదాయమునందు "పుమాన్ విష్ణురితి ఖ్యాతః స్త్రీప్రాయ మితరం జగత్" అను వచనము సుప్రసిద్ధము. ఈ వచనము ఈ పద్ధతి సనాతనమని చాటుచున్నది. కావున అన్నమయ్యది గోపికాభక్తి.

గోపికలు స్త్రీలు గావున వారికి శ్రీకృష్ణునిపైగల ప్రేమ శారీరక మనరాదు. గోవర్ధనోద్ధరణ - శరద్రాత్రిగాన - రాసక్రీడాదులన్నియు మగసిరి మొలవని ఎనిమిదేండ్ల వయసుననే సాగినవి శ్రీ కృష్ణునకు. ఆ తరువాతనే మధురాగమన కంస వధాదులు. రాసక్రీడా వర్ణనమున విష్ణుపురాణము.

జగౌ గోపజన స్త్రైకం కృష్ణనామ పునః పునః ॥

విష్ణు — 5-13-52

అని కృష్ణుని సార్వత్రిక దృష్టిని, గోపికల కృష్ణైకాగ్రతను చెప్పు చున్నది. అట్లే,

“తా వార్యమాణాః పతిభిః పితృభిర్భ్రాతృభి స్తథా ।
కృష్ణం గోపాంగనా రాత్రౌ రమయన్తి రతిప్రియాః ”॥

5-13-59

సోఽపి కైశోరకవయా మానయన్మధుసూదనః ।
రేమే తాభి రమేయాత్మా క్షపాసు క్షపితాహితః ॥ 60 ॥

తద్భర్తృషు తథా తాసు సర్వభూతేషు చేశ్వరః ।
ఆత్మస్వరూపరూపోఽసౌ వ్యాపీ వాయురివస్థితః ॥ 61 ॥

యథా సమస్తభూతేషు నభోఽగ్నిః పృథివీ జలమ్ ।
వాయుశ్చాత్మా తథైవాసౌ వ్యాప్య సర్వ మవస్థితః ॥ 62 ॥

పై శ్లోకములతో కృష్ణునకు గోపికలకు గలబంధము జీవాత్మ పరమాత్మరూపమేగాని లోకసాధారణమైన శారీరకము మాత్రము గాదని గుర్తింపగలరు.

ఈ విషయమును శ్రీమద్భాగవతము మరీ స్పష్టముగ చెప్పుచున్నది. శరద్రాత్రి, శ్రీ కృష్ణవేణుగానము విని గోపికలు మగలను, బిడ్డలను, తల్లిదండ్రులను, అన్నదమ్ములను విడిచి పరవశలై యమునా తీరమున శ్రీ కృష్ణునొద్దకు పోయిరి. అప్పుడు కృష్ణుడు వారిని చూచి :—

“స్వాగతం వో మహాభాగాః (భాగ - 10 - 29 - 18) శ్లోకముతో ప్రారంభించి దాదాపు పది శ్లోకములతో, ఇట్లు వచ్చుట

పతివ్రతాధర్మము గాదని ధర్మోపదేశము చేసెను. అప్పుడు గోపికలు :—

“మైవం విభోఽర్హతి భవాన్ గదితుం నృశంసం
సంత్యజ్య సర్వవిషయాం స్తవ పాదమూలమ్।
భక్తా భజస్వ దురవగ్రహ మాత్యజాస్మాన్
దేవో యథాఽఽదిపురుషో భజతో ముముక్షూన్॥

భాగ–10–29–30

యత్పత్యపత్యసుహృదామనువృత్తి రఙ్గ
స్త్రీణాం స్వధర్మ ఇతి ధర్మవిదా త్వయోక్తమ్।
అస్త్వేతదేవముపదేశపదే త్వయీశే
ప్రేష్ఠో భవాం స్తనుభృతాం కిల బంధురాత్మా॥”

భాగ–10–29–31

అని సమాధానమిచ్చినదాని సారమును పెద్దలు గుర్తింపగలరు. రాసక్రీడకు దారిదీసిన శరద్వర్ణనమే శ్రీ భాగవతమున విచిత్రమైనది. ఋతువర్ణనలు ప్రకృతి వర్ణనలతో లౌకిక విషయోపమానములతో నుండుట సహజము. అట్లు గాక ఆశరద్వర్ణనమంతయు వేదాంత విషయోపమానములతో నిండియున్నది. గమనింపగలరు. ఉదాహరణకు :—

“సర్వస్వం జలదా హిత్వా న రేజుశ్శుభ్రవర్చసః।
యథా త్యక్తైషణా శ్శాన్తా మునయో ముక్తకిల్బిషాః॥

భాగ–10–21–25.

ఆశరద్రాత్రిజరుగబోవు రాసక్రీడారహస్యార్థమునకు పీఠికగా ఆశరద్వర్ణన మట్లు సాగినది.

అన్నమయ్య అధ్యాత్మ శృంగారభేదముతో సంకీర్తన రచన సాగించినారు. అధ్యాత్మ కీర్తనలందు నానావిధములుగా శ్రీ వేంకటేశ్వరుని తాత్త్వికమూర్తి అభివర్ణింపబడును. శృంగార కీర్తన

లందు శ్రీ వేంకటేశ్వరుడు నాయకుడుగా, నానావిధ నాయికలను జోడించి సంయోగవియోగభేదములతో కొలదిమీరిన శృంగార రీతులతో వర్ణన సాగించినాడు. ఇందలి నాయికానాయకులను, వర్ణించిన చమత్కారములను తూచి చూచినచో క్రొత్త అలంకార శాస్త్రమును సృష్టింపవలసియుండును. అన్నమయ్య స్వీకరించిన శృంగారపరమార్థమును ఆతడే వాకొన్నవిధమిది.

ముఖారి

ఇది గాక సౌభాగ్య మిదిగాక తపము మఱి
యిది గాక వైభవం బిక నొకటి గలదా ॥ పల్లవి ॥

అతివజన్మము సఫలమై పరమయోగివలె-
నితరమోహాపేక్ష లిన్నియును విడిచె
సతికోరికలు మహాశాంతమై యిదె చూడ
సతతవిజ్ఞానవాసనవోలె నుండె ॥ ఇది ॥

తరుణిహృదయము కృతార్థతఁ బొంది విభుమీఁది
పరవశానందసంపదకు నిరవాయ
సరసిజానన మనోజయమంది యింతలో
పరిలేక మనసు నిశ్చలభావమాయ ॥ ఇది ॥

శ్రీ వేంకటేశ్వరునిఁ జింతించి పరతత్త్వ-
భావంబు నిజముగాఁ బట్టె చెలి యాత్మ
దేవోత్తమునికృపాధీనురాలై యిపుడు
లావణ్యవతికి నుల్లంబు తిరమాయ ॥ ఇది ॥

(12 సంపు—17 కీర్తన.)

ఇందు ముముక్షువగు యోగి ఉపమానముగా, విప్రలంభా-వస్థలోనున్న నాయిక ఉపమేయముగా స్వీకరింపబడిరి. యోగికిని, వియోగినియగు నాయికకును సమానధర్మము, సమానఫలము నిర్దేశింపబడినవి.

లౌకికమైన భాగ్యముగాని, పారమార్థికమైన తపముగాని, ఇహాపరసంబంధియగు విభవముగాని ఇంతకంటె (తా నిరూపించుదాని కంటె) వేరులేదని పల్లవితో నిరూఢి చేయుచున్నాడు. ప్రపంచ సర్వస్వమును వదలిన యోగి పరమాత్మను నిరంతరము భావించినట్లు, ఈ వియోగావస్థలో నాయికాత్వము నతిదేశించుకొన్న భక్తుడు పరబ్రహ్మమగు వేంకటేశ్వరుని నాయకుడుగా తన సర్వస్వముగా భావించుటచే ఐహికాముష్మిక ప్రపంచమోహము, తనకు తానుగ వీడిపోవుచున్నదని ప్రథమచరణ భావము. దీనివలన 'ఇహాముత్ర ఫలభోగవిరాగః' అను వేదాంత సోపానము సిద్ధమైనది. ఇంత పరిపాకము కావలెనంటే సంకల్పవికల్పాత్మకమైనమనసు కదలిక లేక నిలువవలె గదా! అట్లు మనసు నిలువవలెనంటే పూర్వజన్మభక్తి-వాసనాబలము గాఢముగ నుండవలెగదా! గాఢవిజ్ఞాన వాసనాబలము-వలననే మనసు నిలిచి తపము కుదిరి యోగిభావమేర్పడినదని భావము. ఇది ఒక జన్మలోని సాధనకు కలుగు ఫలితముగాదు. "బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" అను గీతావచన రీతిగా ఎన్నో జన్మల సాధనకు ఫలము. భౌతిక శృంగారమునందుగూడ ఈ యేకాగ్రత చూపట్టవచ్చును. కాని దాని యానందము క్షణికము, ఫలము మానుషము. ఈ యేకాగ్రత "విచిన్తయన్తీ య-మనన్యమానసా తపోనిధిం వేత్సి న మాముపస్థితమ్" అను శ్లోకమున (శాకుంతలములో) గుఱుతింపబడినది. కాని అన్నమయ్య చెప్పిన పరమాత్మవిషయకమైన ఏకాగ్రతవలని ఆనందము అనంతము, ఫలితము దివ్యమని తేలుచున్నది.

క్రమముగా రెండవ చరణమున మనోజయము, తన్మయీభావము వర్ణింపబడినవి. దీనిచే 'శమదమాది సాధనసంపత్తిః' అను వేదాంత సోపానము సిద్ధమైనది. 'నిత్యానిత్యవస్తు వివేకః' అను వేదాంత ప్రథమ సోపానము ఈ యేకాగ్రభావనకు ముందే బీజరూప

ముగ సిద్ధమైనట్లే. మూడవ చరణమున పరతత్త్వరూప ప్రాప్తి కలిగి దేహి, పరమార్థచరమసోపానము దాటి సాలోక్యసిద్ధి నందినట్లర్థమగుచున్నది. దీనితో 'ముముక్షుత్వం' అను వేదాంతపుకడపటిమెట్టు, దాని సిద్ధియు వర్ణింపబడినట్లైనది. 'నిత్యానిత్యవస్తు వివేకః, ఇహాముత్రఫలభోగవిరాగః, శమదమాది సాధనసంపత్తిః, ముముక్షుత్వం' అను నాలుగు స్తంభములపైననే గదా మోక్షసామ్రాజ్యమంతయు నిలిచియున్నది.

పై విధముగ విప్రలంభమును వర్ణించిన అన్నమయ్య శృంగారము కచకుచాది వర్ణనముతో బయటికి భౌతికముగ గన్పట్టుచున్నను, దాని వెనుక దాగియున్న జీవాత్మపరమాత్మభావనలతో ముడివడిననాయికానాయక బంధము గమనింపవలసియున్నది. అట్లే ఈ సంపుటములోని 223, 235, 301, 314, పాటలుగూడ అన్నమయ్యశృంగారము భౌతికవిషయదూరమని స్పష్టముగ చాటుచున్నవి. విస్తరమగునని విశదీకరింపలేదు.

విషయము శృంగారము గావున, నాయికా - నాయక - సఖి - సపత్ని - ముగ్ధా - మధ్యాది నానావిభేదములతో, ఇతర కవులు స్పృశింపని పథములలో రచన సాగినది. కాని ఎక్కడను వేంకటేశ్వర ముద్ర జారలేదు. ఏ దేవుని పేర్కొని ఏశృంగారము వర్ణించినను అంతా మనస్వామియందే సమన్వయము. కావున అన్నమయ్యాది నాయికా భావసంపన్నమై బయటికి శృంగారముగా లోపలికి స్వామి పరముగా జరిగిన ఈ సంకీర్తనరాశి యంతయు గోపికాభక్తికి ప్రతీకగా నిలుచుచున్నది. ఈ గోపికా భక్తిభావమును నిరూపించులీలాశుకుని:—

"విక్రేతుకామా కిల గోపకన్యా
మురారిపాదార్పితచిత్తవృత్తిః।
దధ్యాదికం మోహవశా దవోచత్
గోవింద దామోదర మాధవేతి॥"

అను పద్యమూ స్మరణీయమే. ఈతనిగోపికాంభక్తికి తన శృంగార-వాఙ్మయమున పలుతావుల పాకొనిన కృష్ణగోపికావిలాసములే సాక్షి.

"పితా చ రక్షకశ్శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః।
స్వామ్యాధారో మమాత్మా చ భోక్తా చాద్యమనూదితః"॥

(ఆద్యమనుః=అష్టాక్షరీ)

అను భాగవత సంప్రదాయము అన్నమయ్యకు పట్టుగొమ్మగా నిలిచినది. అందువలననే శృంగారకీర్తనలందుసయితము పరవశముగా వాత్సల్య - అధ్యాత్మ - స్వామి భావములు పనిచేసిన కీర్తనలు కొన్ని దొరలినవి.

అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వముగా, కులదైవముగా, శృంగారభక్తి భావనలో నాయకునిగా భావించినట్లే అరమరలు లేని నెచ్చెలికానిగా గూడ భావించి ఈ శృంగార వర్ణనలు సాగించినట్లున్నది. కొన్ని తావులలోని పచ్చిదనము నాయీ యూహకు కారణము. పాఠకులా తావులు గమనింపగలరు. సంయో-గమును వర్ణించిన పట్టులందు సంయోగాన్తముగా కీర్తన ముగియుట సహజమే. విప్రలంభమును వర్ణించెడు కీర్తనలందు గూడ చరమ-చరణమునందు ఏదో యొకవిధముగా తలకు మొలకు ముడివేసి సంయోగాంతముగా రచన సాగించి తనిసిన మనీషి యితడు. కీర్తన లందు గూడ స్వామితోడి దీర్ఘకాలిక వియోగమును సహింపనిమెత్తని చిత్తవృత్తి యీతనిది. దీని నంతటినీ మధురభక్తి యని పెద్దలు వ్యాఖ్యానించిరి. ఈ మధురభక్తిని వల్లభచైతన్యాదుల సంప్రదాయ-ములు చాలమూలలకు లాగినవి. అది మన కప్రస్తుతము.

ఈ భక్తి రసమగునసీ కాదనీ అలంకారికులు పెద్దగ చర్చించి

రసాః స్మృతాః" అని కొందఱు, "నిర్వేదస్థాయిభావోఽస్తి శాన్తోఽపి నవమో రసః", "నవ నాట్యే రసాః స్మృతాః" అని కొందఱు వాదదిగ్విజయ స్తంభములను ప్రతిష్ఠాపించిరి. భగవద్విషయక-మైనరతిగూడ ఆనందాశ్రువులు మొదలగు అను భావములతో, అప్పు-డప్పు డేర్పడెడి ధృతిచింతాస్మృత్యాది సంచారి భావములతో, భగవద్వి గ్రహాదర్శన - క్షేత్రదర్శనాద్యుద్దీపనవిభావములతో తన్మయీభావ పర్యంతమై రసశబ్దవాచ్యమగుచున్నదని మధుసూదనసరస్వతి తన- "భక్తిరసాయన" మను గ్రంథమున నిరూపించినారు. పదియవది భక్తి రసమని, పై చెప్పిన ఆలంకారికుల వాదాన్ని నోరు మూయించిన-మహిమోపేతుడతడు.

రతియనగా ప్రీతి. మనసును రమింపజేసి హృదయమునకు తృప్తినిచ్చునదంతయు రతికి పాత్రమగుచున్నది. భక్తులకు భగవంతుడూ అంతే. లౌకికమైన నాయికా నాయకులరతి తన్మయీ-భావముతో రసముగా మారినదని అంగీకరించిన ఆలంకారికులు, భగవద్విషయకరతిని తన్మయీ భావావస్థలో పల భక్తిరసమని పేర్కొనరో తెలియకున్నది.

రతియందు ప్రధానముగ గలుగునది చిత్తద్రుతి (మనసు కరగుట). అది భగవద్విషయమున సంభవించుటలో తప్పేమి? భగవంతుని సౌందర్యము, వాని మహిమలు, ఆ మహిమలు చాటెడిచరిత్ర ఇవి యంతయు భగవద్విషయరతికి రసత్వమును చేకూర్పకుండునా? ఈ విషయమున:—

ద్రుతే చిత్తే ప్రవిష్టా యా గోవిందాకారతా స్థిరా।
సా భక్తిరిత్యభిహితా విశేష స్త్వధునోచ్యతే॥

చిత్తద్రుతేః కారణానాం భేదాద్భక్తిస్తు భిద్యతే।
తాన్యుక్తాని తు సంక్షేపా ద్వ్యాఖ్యాయంతేఽధునా స్ఫుటమ్॥

కామః శరీరసంబంధవిశేషః స్పృహయాఽంచితా।
సన్నిధానాఽసన్నిధానభేదేన స భవేద్ద్విధా॥

తజ్జన్యాయాం ద్రుతౌ చిత్తే యా స్యాద్భక్తిప్రకృష్టతా।
సంభోగవిప్రయోగాఖ్యా రతిః సా సా క్రమాద్భవేత్॥

— భక్తిరసాయనం 2 – 1, 2, 3, 4

భక్తిరసాయనములోని పై శ్లోకములు మనకు ప్రమాణముగ నిలుచు చున్నవి. సంయోగవిప్రయోగాత్మకమైన భగవద్విషయకరతిని కీర్తించి తరించిన మహర్షులు శుక - శౌనక - నారదాదులు. అట్లే అన్నమయ్య - క్షేత్రయ్య - రామదాస - త్యాగరాజాది మహాపురుషులు గూడ. అద్వైతసిద్ధి వ్రాసిన మధుసూదనసరస్వతియే ఈ భక్తిభావమును పెద్దపీట మెక్కించి దానికై భక్తిరసాయనమను గ్రంథమునే రచింపగా, పుట్టుకతోమాత్రమే అద్వైతియైనఅన్నమయ్య యీ-భక్తిభావనకు తలయొగ్గుటలో వింత యేమున్నది? శ్రీమద్భాగవత విష్ణుపురాణాదులందలి గోపికాభక్తి మన అన్నమయ్య నెక్కువగా ఆకర్షించినది. దాని ఫలితముగా మనకు దక్కినది యీ సంకీర్తనల రాశి. తత్త్వదృష్టితో ముక్తినిపొందుటకంటె భక్తిభావముతో ముక్తిని పొందుట సులభమార్గమని ముందే విన్నవించితిని.

ఇతర దేవతాభక్తి కంటె కృష్ణభక్తి చాలగొప్పది. అది కుదురుట తపస్సిద్ధి. "దశాశ్వమేధీ పునరేతి జన్మ కృష్ణప్రణామీ న పునర్భవాయ" అనిరి పెద్దలు. మన అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని సాక్షాత్కృష్ణపరబ్రహ్మగా భావించినాడనుటకు ఆతని శృంగార వాఙ్మయమంతా సాక్షి. అయపురూపమైన కృష్ణభక్తిగల యీ వాఙ్మయము మనకొక గంగాస్నానము.

"మృద్వీకా రసితా సితా సమశితా స్ఫీతం నిపీతం పయః
స్వర్యాతేన సుధాప్యధాయి కతిధా రంభాధరః ఖండితః।

తత్త్వం బ్రూహి మదీయజీవ భవతా భూయో భవే భ్రామ్యతా
కృష్ణేత్యక్షరయోరయం మధురిమోద్గారః క్వచిల్లక్షితః॥''

అని కృష్ణభక్తిని కొనియాడిన పండితరాయలు మనకీ విషయమున స్మృతికర్త.

సామాన్యజనులు తత్త్వదృష్టితో దైవమును చూచి కొలిచి తరించుట వలనుగానిపని. వారి వారి అనుభవములకు తగినశృంగార-లీలలనైతే మధురముగ చేపట్టి పాడుకొనగలరు. అందుకనియే అన్నమయ్య, శృంగారదృష్టితోనైన వేంకటేశ్వరనామాంకితకీర్తన సాగించి కృతార్థులగుదురుగాక యని, గుడజిహ్వికాన్యాయముతో ఈశృంగార కీర్తనలరాశిని పెంచినట్లున్నది. మనబోటివారీస్థాయి నందుకోలేకపోయినను హాస్యము చేయకున్న చాలును. మన మీబడిలో మొదటి తరగతిలో చేరుట కింకా ఎన్నో జన్మలెత్తవలసి యున్నది. పెద్దలు మనబోటివారి నుద్దేశించియే:-

"జ్ఞాతతత్త్వస్య లోకోఽయం బాలోన్మత్తపిశాచవత్।
జ్ఞాతతత్త్వోఽపి లోకస్య బాలోన్మత్తపిశాచవత్"॥

అని వ్యాఖ్యానించినారు.

అన్నమయ్య సాహిత్యము:

ఈయన సాహిత్యమంతయు శ్రీవైష్ణవ సిద్ధాంతముపై నాధారపడినది. ఆ మత ప్రచారమునకు వీరి వాఙ్మయమంతయు నడుము కట్టుకొని నిలిచినది. శైవభక్తి వాఙ్మయమునకు ప్రతిగా వీరి వైష్ణవభక్తి వాఙ్మయ మవతరించి నట్లున్నది. యథావాక్కుల అన్నమయ్య భావములకును మన అన్నమయ్య భావములకును పోలిక గలదు. శైవము నందు ఆవేశ మెక్కువ. అది ఇక్కడ తక్కువ. అక్కడ పాల్కురికి సోమనాథుడు ప్రథముడు. ఇక్కడ మన అన్న-మయ్య ప్రథముడు.

। భాష :—

ఇందలి భాష యంతయు గ్రాంథిక వ్యావహారిక పదములతో సంకీర్ణము. వ్యావహారిక పదము లన్నియు గ్రాంథికసన్నిహితరూప ములలో అరసున్నలు, బండిఱాలను విడువక వ్రాతకెక్కినవి. ఇది భాషాశాస్త్రము (Phylology లో వ్యాకరణశాస్త్రములో సాధన చేయువారికి తంగేటిజున్ను. గ్రంథములకెక్కు యోగ్యత కోల్పో-యితిమే అని వెనుక కొదిగి కుంగుచున్న వ్యావహారికపదములకు ఊఱట దీర్చి, వాటికి తన పదవాఙ్మయమున వలసినంత పీట జేసి, అర్థసౌలభ్యముతోపాటు కావ్యభావనాసౌరభము గూడ గల్పించిన మేటి యీతడు. ఈ పని అందరును చేయలేరు. గ్రాంథిక వ్యావహారిక ముల యందెంతో చొరవ, వానిని కలిపి ప్రయోగించుటలో ఎంతో తెగువ, నలుగు రాపథమున వెరపు లేక నడిచి తన్ననుసరించునట్లు చేయుటలో పెద్ద చట్టరితనము కావలెను. ఈ అన్ని చక్కటులు మన అన్నమయ్యకు కలవు. కావుననే ఆయన మాట వేదముగా, ఆయన నడచినతీరు మహాకవులకు బాటగా పర్వడి ఈతని తరువాతి పద వాఙ్మయ పద్యవాఙ్మయములు చౌకళించి దవుడుదీసినవి. తననాటికే తన ననుసరించు వారి గుంపు కొంత పెద్దదై యుండును. అందువలననే వారికి ఛాయోపహారులని పేరువెట్టి :-

రామక్రియ

వెట్టులాల మీకు వేడుక కలితేను
అట్టు వంచి తడు కల్లంగ రాదా ॥ పల్లవి ॥

ముడిచివేసినపువ్వు ముడువ యోగ్యము గాదు
కుడిచివేసినపుల్లె కుడువఁగాఁ గాదు
బడి నొకరు చెప్పినఁ బ్రతి చెప్పఁబోతేను
అడరి శ్రీహరికి వది అరుహము గాదు ॥ వెట్టు ॥

గంపెడుముక దినఁగా నొక్కవరిగింజ
తెంపునఁ గలసితే తెలియ నెట్టు వచ్చు
జంపులఁ బలవరించఁగ నొకమంచిమాట
ఇంపైతే హరి యందు కిచ్చునా వరము ॥ వెట్టు ॥ 2

ఉమిసినతమ్మలో నొకకొంత కప్రము
సమకూర్చి చవిగొని చప్పరించనేల
అమరంగ ఛాయాపహారము చేసుక
తమమాట గూర్చితే దైవము నగఁడ ॥ వెట్టు ॥ 3

(అన్న. అధ్యా - 196 రేకు)

ఇత్యాదిగ పది పదిహేనుచరణములలో ఇదే ధోరణితో వారిని దూసి పోసినారు. తన కాలమునాటికే వీరు పలువురి కనుకార్యులుగా నయినారని తెలినది.

## 2. శైలి:

ఇది పదవాఙ్మయమైనను శైలి యంతయు ప్రాబంధికముగ సాగినది. పదములు, సమాసఘటన, వర్ణనలు ఇవి యన్నియు ప్రబంధముల ధోరణిలోనివే. ఉదాహరణము:—

సామంతం

చల్లనై కాయఁగదో చందమామా నీ-
వెల్ల (ల్లి ?) గాఁ దిరువేంకటేశు నెదుర
మొల్లమిగ నమృతంపు వెల్లిగొల్పుచు లోక-
మెల్ల వినుఁ గొనియాడఁగాను ॥ పల్లవి ॥

(సం. 12 - 228)

ఈ పాటలోని పద్ధతిని గమనించితిమేని శైలి పైచెప్పిన విధముగ నున్నదనుటలో సందేహము లేదు. అక్కడక్కడ గ్రామ్య—

జనోక్తులవలె శుద్ధాంధ్రవ్యావహారికములు గల శైలియు కలదు. విరివిగా నున్నది పైజెప్పిన శైలియే. అన్వయము గూడ పైనుదాహరించిన పాటను చూచితిమేని ప్రబంధ ఫక్కిలోనే కన్పడుచుండును. యతిప్రాసఘటన మంతయు, తిక్కనవలెనే భూతబలి వేసినట్లుగ, ఛాందసులను చూచుకొండని హెచ్చరించినట్లు కనబడును. అక్కడక్కడ యతిప్రాసస్థలములందు జల్లుపదములు కానవచ్చుట కీదూకుడే కారణము గావచ్చు. విలంబము నోర్వని భావతీవ్రత, దాని నల్లివేయుటలో గలవేగము ఈతని యోర్పును సన్నగిల చేసియుండును.

ఈతని రచన తిక్కన రచనవలె దేశిమాండలికపదబహుళము. వాక్యనిర్మాణముగూడ మనము వ్యవహరించునపుడు మాటలాడునట్టిదిగా అక్కడక్కడ దోచుచుండును. ఈ పద్ధతి తిక్కనయందు అడుగడుగున గన్పట్టుచుండును.

3. సంధులు సమాసములు:

రేకులలోని సంధులన్నియు అన్నమయ్యవవునో కావో తెలియదుగాని అవి కొంత వింతగా దోచుచుండును. ఉకారాంతములపై గూడ అచ్చులకు యవలు సంధించినవి కానవచ్చును. ద్రుత సంధులపై గూడ అచ్చుల కిట్టులే రూపములు గానవచ్చును: వీరిమతమున ఉకారాంతనకారము ద్రుతముగా దోపదు. నకారపుపొల్లు మాత్రమే ద్రుతమనిపించుచున్నది. కొన్ని పదములందు అరవమునందువలె ఉదంతతద్ధర్మార్థకధాతుజ విశేషణములకు ద్రుతముచేర్చి వాడుటయు కలదు. 'పోవుత్రోవ' అనుటకు 'పోవున్ద్రోవ' ఇత్యాదులు.

సమాసములందు ఒక విచిత్ర పద్ధతి చూపట్టుచున్నది యుష్మదస్మదాత్మార్థకశబ్దములు అన్వయింపవలసినపదముదగ్గఱగాక సమస్తపదాదియందే ప్రయోగించుట — 'నీవిందైన మురిపెపువేయిగన్నులు' — (12 — 201 రెండవ చరణం). 'విందైన మురిపెపు

నీ వేయికన్నులు' అని యుండవలెను. కాని వీరి సమాసఘటన ప్రకారము నీ శబ్దము తప్ప తక్కినవాని కన్నిటికి సమాసమేర్పరచు-కొని తరువాత నీ శబ్దముతో సమసింపవలసియున్నది. 'ఎవ్వతో మోము = 'ఎవ్వతె యొక్క మోమో' అనునర్థమున ఈ సమాస ఘటన విచిత్రమైనది. ఇట్టి వచ్చుటచ్చుట గలవు.

4. పదప్రయోగ విశేషములు

సాధారణకవులలో కానరాని పదప్రయోగములు వీరిలో కాన వచ్చుచున్నవి. అందులో వ్యాకరణమునకు నిఘంటువులకు చేరని-వెన్నో కలవు. (పంకి – 2 – చర – 3 – పాద –.1)

1. ఏఁటికి :—

ఈ వాఙ్మయమునందుతప్ప తక్కిన స్థలముల యందెచ్చటను ఈ పదము సార్థానుస్వారముగ నగపడదు. ఇది 'ఏమిటి' శబ్ద-వికారము గనుక మధ్యనున్న మకారము లోపించినప్పుడు తత్స్థాన-మున అర్ధానుస్వారముండుట న్యాయ్యమే. ఈ పద్ధతి ఈ వాఙ్మయ మునందంతటను గానవచ్చుచున్నది. ఇది 'ఏంటిదబ్బా' ఇత్యాది వ్యవ హారమునందుగూడ గుర్తింపవచ్చును.

2. బాయట, బాయిట :— (3 – 3 – 4)

బహిశ్శబ్దభవము 'బయలు' కాగా, బాహ్యాశబ్దభవము బాయట, బాయిట' కావచ్చును. ఈ రెండురూపములు ఈవాఙ్మ యమున తరచుగా నగపడుచుండును. వీని సంగ్రహ - ఔపవిభక్తిక రూపమే 'బయట, - బయటకి, 'బైటికి' ఇత్యాదులు కావచ్చు.

3. అప్పన :– ( 7 – 1 – 1)

ఇది అర్పణశబ్దభవము. మన తెనుగున అందరువాడెడి 'అప్పన' గాదిది. ఆజ్ఞ అను నర్థమున ప్రయోగింపబడుచున్నది. అప్పణె = ఆజ్ఞ అని కిట్టల్.

4. అప్పటి, అప్పటిని (108 – పల్లవి)

అప్పుడు శబ్ద మౌపవిభక్తికము. ఇతర వాఙ్మయమునందు అప్పటికి ఇత్యాది విభక్తి ప్రతిరూపకావ్యయములే కానవచ్చు చున్నవి. ఈ వాఙ్మయమునమాత్రము ఇది క్రియావిశేషణముగ నుపయోగించుట వింత. "విడిచిన నెప్పటి చని" హరి-పూ. భా.5-243 అను ఎఱ్ఱన హరివంశ ప్రయోగమొక్కటి మాత్రము దీని కీడుగా నాకు తోచుచున్నది.

5. బాలులు, బాలులాల (230 - 2 - 2)

అదన్తదీర్ఘపూర్వలో పథములపై విభక్తి లకారమునకు రేఫము లేకుండ ప్రయోగించుట ఈ వాఙ్మయమున విరివిగా గన్పట్టుచున్నది.

6. చింత (112 - 3-3)

జింకకు మారురూపముగనో, మూలరూపముగనో ఈ వాఙ్మయమున నిది పలుతావుల గలదు.

7, మాఁట. (188 - 2 - 1)

ఈ పదము అరసున్నతో కలిసియు, కలియకయు ఈ వాఙ్మయమునమున్నది. అరసున్న కలిగిన ప్రయోగమే ఎక్కువ. పలుతావుల అరసున్నలుండుటచే ప్రామాదిక మనుటకు వీలుగాదు. ఇది మాత్రా-శబ్దభవమైన 'మాత్త్రం' అను అరవపదమునుండి పుట్టినదిగా తోచుచున్నది. సబిందుక నిర్బిందుకప్రాససాంకర్యమునకు ఉదాహరణముగా, అనంతుడు తన ఛందోదర్పణమున ఈ క్రింది లక్ష్యమిచ్చినాడు:-

వీఁపు మూపులు మఱితలమోపులయ్యె
మాఁట లేఁటికి మేటి తాఁబేటి కనఁగ (1 - 52)

ఇట్లే కొన్నియెడల 'మాఁటి మాఁటికి' అనిగూడ సార్థబిందుకముగ రేకులలో గలదు.

8. చదురాలు :— (71 - పల్లవి)

చతురురాలునకు తద్భవముగా తోచుచున్నది.

9. అయిరాణి :— (189 - 2 - 1)

ఇది 'అయిరేని' అని మన ఇతరతెనుగువాఙ్మయమునందు గలదు. 'అరివేణి కుండలు' అని లోకవ్యవహారమీనాడును కన్పట్టు చున్నది. కాని 'అయిరాణి' అను ప్రాకృతరూపము శుద్ధముగా నైకీర్తనలో నున్నది. "అయిరాణి, ధుంధుమారి, పరాచి చ శక్రవల్లి ఛాయామ్" అని షడ్భాషాచంద్రిక-ఝాడాది 318 సూ. ఇది ఇంద్రాణీ శబ్దభవముగా తోచుచున్నది. ఈ అయిరేని కుండలతో జరుపుపూజయు శచీపూజయే. వివాహకాలమున సౌమంగల్యసిద్ధికై శచీపూజప్రశస్తమై యున్నది. 'సాన్నిధ్యయోగాత్కిల తత్ర శచ్యాః' రఘు-7-3 అనిన కాళిదాస ప్రయోగముదీనికి సాక్ష్యము.

10 జాజర :— (274)

ఇదియొక విచిత్రమైన శబ్దము "జాజర = దొంగ, జాజరపాలి కలు = అంకురార్పణ శరావము" అని సూ. ని. ఈ జాజరశబ్దము. పై-రెండర్థములందును యథాక్రమముగా తస్కర-శాద్వల శబ్దభవముగా గానవచ్చుచున్నది. 'శాద్వల' శబ్దభవమనుటయే ఇప్పటి చర్చ నీయాంశము. "శాద్వల" జాజరఅగుట సుప్రసిద్ధమే. అందువలననే 'జాజరపాలికలు' అని సూ. ని. గుర్తించినది.

దీనికొక గ్రామీణమైన ఆచారము తార్కాణగా తోచుచున్నది. వైశాఖ శుద్ధపూర్ణిమను మొలకలపున్నమయని. జ్యేష్ఠశుద్ధపూర్ణిమను ఏరువాక పున్నమయని వ్యవహరించుచున్నారు. వైశాఖశుద్ధ పూర్ణిమకు ఐదారు దినములు ముందుగా పెంకులకుంపట్లలో మట్టివోసి నానాధాన్యములను నారువోయుదురు. అందు ఏధాన్య మేపుగా పెరి-

గిన ఆ ధాన్యము దండిగా బండునని కర్షకుల కొకగుర్తు. దానినాధా రముగా జేసికొని ఏరువాకపున్నమకు వ్యవసాయము సాగింతురు, ఈ మొలకలకుంపట్ల నన్నింటిని దేవాలయములపైన, తమ పితృదేవతల సమాధులపైననుంచి ఆ మొలకలపున్నమనాడు పూజించుట రాయల సీమ పశ్చిమభాగమునందంతట నేటికిని గలదు. వెన్నెలబలిసిన వైశాఖ శుక్ల పక్షమునందు, పూర్ణిమనాడును ఆ మొలకనోముతోపాటు జక్కి మొదలగు పలువిధములగు ఆటలాడుట ఈనాటికిని గలదు. అది యొకవేడుక. ఆ 'జాజర' (మొలక)కు సంబంధించినవేడుక గావున అది జాజరవేడుకయైనది. క్రమక్రమముగా 'జాజర' శబ్దము వేడుకకు పర్యాయముగా నిల్చినది. 'జాజరపాటలు' ఇత్యాదులందుగూడ ఈ యర్థమే కావచ్చు. ఈ నాయూహాను సాహిత్యజ్ఞులు పరిశీలించి తెలి పిన సంతోషింతును. వేఁడి + లు = వేండ్లు, వాఁడి + లు = వాండ్లు ఇత్యాది ప్రయోగములును గలవు.

ఇట్లే ఈవాఙ్మయమున శబ్దచర్చ సాగింపబూనినచో అది అనంతమగును. మచ్చునకు కొన్నిచూపితిని. ఒక్కొక్క పదమున కొక్కొక్క పాటయే ఉదాహరణముగా చూపితిని. తక్కినవి పాఠకులు చూచుకొనగలరు.

5. సామెతలు :—

ఈ 'సామెత' శబ్దము 'సామ్యత' అను సంస్కృత శబ్దమునుండి పుట్టియుండవచ్చును. సామ్యతాశబ్దము వ్యాకరణదుష్టమైనను లోకము స్వీకరించినది. ఒక అర్థమును చెప్పుటకు మారుగా అనంత లోకసిద్ధిగలిగిన తత్సదృశార్థమును చెప్పుటయే సామెతయొక్క పర

(1). ఊరులేని పొలిమేర (55 - పల్లవి.) :—

ఈ పాటయందు చాలసామెతలుగలవు. ఎండలేనినాటినీడ, దండలేనితాలిమి, ఇచ్చలేనినాటిసొబగు, బొంకులేని చెలిమిఇత్యాదులు. సుప్రసిద్ధములను వదలితిని. ఆధారములేనివార్త యనునర్థమున 'ఊరులేని పొలిమేర' అనిపాడినట్లున్నది.

(2). కలగన్నచోటికి గంపయెత్తినయట్లు (64 - పల్లవి) :—

కలలో గనపడినస్థలమునకు గంపతో సంసారమెత్తికొని పోవుట యని యర్థము. అసంభావ్యమైనదానికి ఆశపడుటయని భావము.

(3). కొలిమిగూటిలో సూదులమ్ముట (124 సంకీ) :—

పాటయంతయు సామెతలే. 'మీలకీతలు గరపుట, 'అడవిమృగములకు పల్లము వేయుట' మొదలగునవి. సూదులుత్పన్నమగు స్థలముననే (కొలిమిగూటిలో) సూదులమ్మబోవుట పనిలేని పనియని భావము. జన్మసిద్ధవిద్యలు గల్గినవానికి అభ్యాసముతో నేర్పబూనుట వ్యర్థప్రయాసమని 'మీలకీతలుగరపుట' యనుట కర్థము.

4. 'ఏరు నిద్దుర వుచ్చుట (149): నిత్యప్రవాహశీలియగు ఏటిని కొంతసేపు నిదురింపజేయుట (స్తంభింపజేయుట) అసాధ్యమని భావము. నిత్యజాగరూకుని వంచించుటయు అంతే.'

5. పూటకూటిమీద తమ్మ ఉమియుట (238 సంకీ.) : దీనిలో అన్నియు సామెతలే. 'గోరుచుట్టుపై రోకటిపోటు' ఇత్యాదులు సుప్రసిద్ధములు. పూటకూటిమీద తమ్మ ఉమియుట=కష్టపడి సంపాదించుకొన్నవస్తువును అనుభవదూరము చేయుట అని భావము.

ఇట్టి వెన్నెన్నైన గలవు. అపురూపములైనవానిని కొన్నింటిని మాత్రమే నేనిందు సూచించితిని. తక్కినవి సహృదయులపాలు.

6. జాతీయములు :—

ఇది Idiom అను నాంగ్లపదమున కనువాదము. ఈ జాతీయ శబ్దార్థమే కొంత పరామర్శింపవలసియున్నది. జాతికి సంబంధించినది జాతీయము కావచ్చు. తెలుగు - అరవ - కన్నడ జాతివారు వారివారి అనుభవములనుబట్టి ఆయా భాషామర్యాదలనుబట్టి ఒకవిశిష్టార్థమునందు కొన్ని పదములను వాడుచుందురు. అవి వాక్యములుగావు పదములే. కాని అవి కొన్నిపదముల అధ్యాహారముతో ఒక సమగ్రవాక్యార్థమును స్ఫురింపజేయుచుండును. ఆ పదములు ఆవిశిష్టార్థములలో ఆ జాతివారికి సుప్రసిద్ధములగుటచే, దాని యర్థము చెప్పువానికి, వినువానికి సుగ్రహముగా నుండును. ఉదాహరణమునకు 'సంతసరకు'. గుంపుగా గూడినపదిమందిలో ఏ తలమాసినవానినో మోసగించి విక్రయించువస్తువు అని యర్థము. ఇది ఆంధ్రదేశమున సుప్రసిద్ధము. ఇట్టి వన్నియు జాతీయములని నా భావము. ఇవియే మన పలుకుబడులు, నుడికారాలు కావచ్చు.

1. ఊరువాడెడి చెలమ (75-సంకీ): దీని యందన్నియు జాతీయములే. '1. సంతతగరు, 2. కట్టు వదలినక్రేవు', 3. చిగురు చుట్టిన కండె', 4. తెరవుపెసరు', 5. బట్టబాయిటి ఈత, 6. చెరకు పండిన పండు' (చెరకు + పండిన). 7. తంగేటి జున్ను', 8. జాజులు ప్రసాదము.'

వీని యర్థములన్నియు సుప్రసిద్ధములు గావున వివరింపలేదు.

7. అలంకారములు :

సాధారణముగ కవులు వర్ణనాప్రియులగుటచే శబ్దార్థాలంకారములలో తమ ప్రతిభనంతయు ధారవోసి, కేవల మలంకార కవులుగనే

చెలామణియగుచుందురు. రసదృష్టి కలిగినకొందరుమాత్రము కావ్యజీవనమైనరసమునకు ప్రాధాన్యమిచ్చి దాని కంగముగా వెగటుగ దోపని యట్లు సహజాలంకారములుగా అలంకారములను సమకూర్తురు. రససిద్ధుడైన అన్నమయ్యకు 'నేనే వచ్చెద నేనె వచ్చెదను నేనే వత్తు నేవత్తు' అన్న రీతిని శబ్దార్థాలంకారములు తమకు తామే పరువులెత్తివచ్చి, పీటలు వేసికొని తన వాఙ్మయమున కొలువు సేయుచుండును. ఉదాహరణమునకు శబ్దాలంకారములు ఈసం-పుటము 150, 202, 272, 302 వగైరాదులలో గుర్తింపగలరు. అర్థాలంకారములేని కీర్తనయే లేదనవచ్చును. సాదృశ్యధర్మమను స్తంభ-ముపై అలంకారశాస్త్రసౌధమంతయు నిలిచియున్నది. ఆ-సాదృశ్యమును ఈతడు వాడుకొన్నంత విరివిగా మరెవ్వరు వాడ లేదన్నచో అతిశయోక్తి కాదు. "అలంకారాన్తరాణి హి నిరూప్యమాణదుర్ఘటనాన్యపి రససమాహితచేతసః ప్రతిభానవతః కవేః అహంపూర్వికయా పరాపతన్తి" అని ఆనందవర్ధనుడు.[1]

8. అన్నమయ్య శృంగారము :—

అధ్యాత్మ కీర్తనలలో బాహ్యప్రపంచమును, మరింతగా స్త్రీ జాతిని ఆడిపోసిన అన్నమయ్య, శృంగార సంకీర్తనలలో ఆజాతివారి కరచరణ ముఖ నేత్రాదుల ఇసుమంత కదలికలకు గూడ అనంతభావ పరిమళపరంపరలున్నట్లుగా భాష్యము చేసినారు. అధ్యాత్మ శృంగారములు రెండింటను ఆతని మనసు - మాట - ప్రతిపాదించు ఫక్కి - వానిలోనిలోతు సహృదయుల నూటాడించుననుటలో సందేహము లేదు. ఉదాహరణకు అధ్యాత్మము:—

భవరోగవైద్యుడవు పాటించ నీవొకడవే
నవనీతచోర నీకు నమో నమో ॥ పల్లవి ॥

1. ధ్వన్యాలోకము (చౌఖాంబాముద్రణాలయమువారిది. 1940 ముద్రణ) P. 222.

మతిలేనంతులఁ దిమ్మరిపట్టి దిపాలు
మతిమఱచె నిందుకు మందేదొకో ॥ భవ ॥

పాలఁతులనెడిమహాభూతాలు సోఁకిన
తలమొలలు విడి బిత్తలై యున్నారు
అలరుచెనకులచే నంగములు జీరలాయ
మలసి యిందుకు వీఁక మంత్రమేదొకో ॥ భవ ॥

తరుణికాఁగిళ్ళనే తాపజ్వరాలు వట్టి
కరఁగి మేనెల్ల దిగఁగారఁ జొచ్చెను
విరతి శ్రీవేంకటేశ నీవే లోకులకు దిక్కు-
అరుదుసుఖాననుండే యంత్రమేదొకో ॥ భవ ॥

(8 సం– 67 కీర్తన)

శృంగారమునకు :—

నాదరామక్రియ

ఏమొకో చిగురుటదరమున యెడనెడఁ గస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా ॥పల్లవి॥

కలికిచకోరాక్షికిఁ గడకన్నులు గెంపై తోఁచిన-
చెలువం బిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువునఁ బ్రాణేశ్వరుపై నాఁటిన యాకొనచూపులు
నిలువునఁ బెరుకఁగ నంటిననెత్తురు గాదు గదా ॥ ఏమొ ॥

పడతికి చనుగవమెఱుఁగులు పైపైఁ బయ్యెదవెలుపల
కదుమించినవిధమేమో కనుఁగొనరే చెలులు
ఉడుగనివేడుకతోఁ బ్రియుఁడొత్తినవనఖశశిరేఖలు
వెడలఁగ వేసవికాలపువెన్నెల కాదుగదా ॥ ఏమొ ॥

ముద్దియచెక్కులకెలకుల ముత్యపుజల్లులచేర్పుల-
వొద్దికలాగు లివేమో వూహింపరె చెలులు
గద్దరితిరువేంకటపతి కామినివదనాంబుజమున
అద్దినసురతపుఁజెమటల అందము కాదు గదా ॥ ఏమొ ॥

( 12. సం-82 కీర్తన )

ఈ అధ్యాత్మ శృంగార కీర్తనలు రెండును అనన్యసామాన్య-ములనుటలో వివదించు సాహిత్యమర్మజ్ఞులుండరు.

"బాహ్యమాభ్యంతరం చేతి ద్వివిధం రత ముచ్యతే।
తత్రాద్యం చుంబనాశ్లేషనఖదంతక్షతాదికమ్
ద్వితీయం సురతం సాక్షాన్నానాకరణకల్పితమ్" ॥

అనిన కామశాస్త్రము మూడుపూవు లారుకాయలుగ సంతరించినాడన్నమయ్య పై కీర్తనమునందు. ఆతడు వర్ణించిన వర్ణనను బట్టి ఆతని సాహిత్య మర్మజ్ఞత, అలంకారశాస్త్రపాండిత్యము, భాషాపటిమ, అందరకు తెలియునవియే. అందులో సూక్ష్మమైన శృంగారరసాభిజ్ఞత కొందరు మాత్రమే గుర్తింపగలరు.

ఎఱ్ఱటిపెదవిని నల్లసిరాతో వ్రాసిన జాబుగా ఉత్ప్రేక్షించుట అందరెరుగుదురు. ఆనాయిక తనివిదీర కస్తూరీతిలకాంకితమైన-ప్రియునిమోము పలుమారు ముద్దిడుకొనుటచే పెదవిపై నల్లగుర్తు లేర్పడిన వనిన కారణముగూడ తెలియుచున్నది. ఆ పెదవిని జాబుగా ఉత్ప్రేక్షించుటకు తగినన్ని కస్తురిముద్రలు కలవంటే ఆమె ఎన్నిసార్లు ముద్దిడుకొని యుండవలెనో, దానికి దగిన నాయకునిసౌందర్య మెంతో కొందరే గుర్తింపగలరు. అట్లే ప్రియునిపై నాటినచూపు నిలువున పెరుకుట, దానిచే కన్నెఱ్ఱనగుట, దానివలన అది నెత్తురు మరకగ ఊహించుట పైకి తెలియుచున్నవి. అందులోని ధ్యేకాగ్రత,

మైక వేద్యము. పయ్యెదలోని చనుగవమిసిమి బయట పరువులు వెట్టుట అతిశయోక్తియే. కాని దానికి చూపిన హేతువు శృంగార-రసనిష్ణాతునకు గాని తెలియరానిది. చనుగవపై నఖశశిరేఖలు మొలచినవట. ఆకాంతి వాని వెన్నెల యట. మునుపు నాయికకు చూపినతమకమే ఇప్పుడు కవి నాయకునకు చూపినాడు. ఆసమ్మర్ద మున్ను సహృదయు లూహింతురు. చెమట బొట్లు ముత్యాలజాలుగా వర్ణింపబడుట కవిలోకసహజమే. కాని ఆచెమటబొట్లు అధరా-స్వాదసమయసంజనితమైన సాత్త్వికస్వేదరూపముగ వర్ణించుట అనుభవజ్ఞులగుకొందరే గుర్తింతురు. 'కామినా మధరాస్వాదః సురతా దతిరిచ్యతే 'అని కామశాస్త్రము. ఇంతలోతైన భావమును సహజాలంకార సమన్వితముగ తేటతెనుగుపదములతో వర్ణించు-నేర్పు అన్నమయ్యకు దక్క మరొక్కరికిలేదన్న అత్యుక్తి కానేరదు.

అట్టులే ఈ సంపుటము నందలి 259 వ పాట భావము గూడ ఈతని అప్రతిమభావనాశక్తికి సాక్షిగా సహృదయులు గుర్తింప గలరు ఇట్టి వివాఙ్మయమంతటా నెరపినట్లున్నవి.

ఈతని శృంగార వర్ణనములందు ఎక్కువభాగము అనుభావ ములు, సాత్త్విక భావములు, సంచారి భావములు మాత్రము విరివిగ నుండును. దానికి ఆలంబనోద్దీపన విభావములను మనమూహించు కొని రససిద్ధిని పొందుచుండవలెను. ఇది ఆలంకారిక సంప్రదాయము.

'విభావానుభావసంచారిసంయోగా ద్రసనిష్పత్తిః' అను భరత సూత్రమున, మూడింటి సముదాయము రసనిష్పాదకమా లేక ఏ ఒకటి రెండున్నను రసానుభూతి గలుగునాయని ప్రశ్నించుకొని, "యద్యపి విభావానా మనుభావానా మౌత్సుక్య - వ్రీడా - హర్ష - కోపా - సూయా - ప్రసాదానాం చ కేవలానా మత్రస్థితిః ; తథా-ప్యేతేషా మసాధారణత్వ మిత్యన్యత మద్వయా క్షేపకత్వే సతి

నానైకాంతికత్వమితి" అని మమ్మటాచార్యులు పూర్తిచేసినారు. కావున పైదానిలో ఒకటున్నను తక్కినవి అస్వాదవేగమున ఆక్షేప లభ్యములై రససిద్ధికి దోహదము లగుచున్నవి.

కావ్యప్రకాశః, 4 ఉల్లాసః, 28 కారికావృత్తిః.

"యత్రక్వచిత్ ఏకస్మాదేవ అసాధారణాత్ రసోద్బోధః తత్ర ఇతరద్వయ మాక్షేప్యమ్". అని రస గంగాధరము. కావున ఇందొక్కొక్క పాటయు ఒక్కొక్క శృంగారరస ప్రవాహము. ఈ కీర్తనల సముదాయమంతయు శృంగారరసక్షీరసాగరము. ఈ సాగరమున రత్నములు వెదకువారి వెలితే గాని రత్నములకు వెలితిలేదు.

౪. వింతలు విశేషములు:—

ఈ అన్నమయ్య వాఙ్మయమునందు అపురూపమైన భావచిత్రణముతో పాటు ప్రహేళికాకల్పనముగూడ అక్కడక్కడ కన్పడుచున్నది. ఆ కల్పనమునందుగూడ ఈతడు సాటిలేనివాఁడే. (1) ఈ సంపుటము 155 వ పాట 'దిక్కులేకపోయె నిట్టేదినదినము'. ఇది చిక్కైన ప్రహేళిక గావున దీని భావము స్పష్టమగుటలేదు. (2) ఈ సంపుటము 216 వ పాట 'ఎండలు రేయెండలుగా నిరువంక జూచువాడు' ప్రథమచరణములోని ఒకటవ పాదమునకు శ్వేతద్వీపమున నివాసమేర్పఱచు కొన్నవాడు అని, రెండవపాదములోని 'పాలలోని పాపడు'=వెన్న అనీ అర్థముచేసికొనవలెను, మూడు, నాల్గుపాదములు సుగ్రహములే. అదేపాట రెండవ చరణం ఒకటవపాదము 'ఆలపోతువానితోడ నంటిన మేనివాఁడు'=వృషభాసురుని సంహరించినవాడు గాని, శివునికి అర్ధాంగమైన వాడుగాని కావచ్చును. తక్కినది సులభము. (3) ఈ సంపుటము 235 వ పాట మూడవచరణం ఒకటి రెండుపాదాలు "కొండవింటివాని గుత్తగొనినయట్టి కొండుక పాయపుఁ గూఁతురుతండ్రి"=గంగకు తండ్రియని యర్థము.

(4) 233వ పాట ఒకటవచరణం మూడవపాదము-'గాలిపుంటిసంటి (?) లోనఁ గాపురంబు సేయవచ్చు'-ఇది అర్థముకాలేదు. గాలికి పుండువంటి దగు సముద్రమనెడు ఎసటిలో కాపురముచేయుట అని యుండ వచ్చునా? అప్పుడు 'గాలిపుంటెసంటిలోని అని పాఠముండవలసి వచ్చును. (5) 297 వ పాట - మూడవచరణం రెండవపాదము 'గుల్లకూఁతతోడి నోరు కొనగోరుబలిమి' ఇదియు అర్థముకాలేదు. ఇట్లే చూచినచో ఇందులో ఎన్నో ప్రహేళికలవంటివి మన పండ్లకు మెదుగుటలేదు.

ఒక్కొక్క పట్టున శుద్ధవ్యావహారికముగా సాగించిన ఘట్టము లును గలవు. 268, 367, 373, 378 వగైరా కీర్తనలు దీనికి తార్కాణ ములు. అట్లే వ్రాయుటకు-వ్రయ్యుట. నీయెడకు - నియ్యాడ వంటి పదాలుకూడ.

ఇందు 115 వ పాట, సాదృశ్యము నాధారముగాగొని తన యూరిచుట్టు ప్రక్కలనున్న కనుమలను గురిచేసికొని శృంగారరసాం-కితముగ వర్ణింపబడినది. (1) సోమశిలకనుమ (2) గద్దెరాతికనుమ (3) ఎట్టశిలకనుమ (4) దొంగలసానికనుమ (5) గుబ్బలికొండ కనుమ. ఈ కనుమలకు పాటలోని శృంగారముతో కేవల శబ్దసాదృశ్యమేకాక మరి ఏదో సంబంధము కలదని యూహించి, ఇవి యెక్కడ నున్నవో తెలిసికొనగోరి ఆ ప్రాంతమువారిని విచారించితిని. వారిలో ఒకరు శ్రీ మైనంపాటి సుబ్రహ్మణ్యంగారు (తెలుగు పండితులు) విచారించి ఈ విధముగా వ్రాసిరి—

"........ మహాత్మా! నేను చెప్పినట్టు తాళ్లపాక గ్రామం చుట్టూఉన్న అన్నమాచార్యులు సూచించిన కనుమల వివరం తెలుపు చున్నాను.

(1) దొంగలసాని కనుమ—ఇది సిద్ధవటం తాలూకా ఒబుళం దగ్గఉవుంది. (2) సోమశిల కనుమ-ఇది నెల్లూరుజిల్లా సరిహద్దున

ఉత్మకూరు తాలూకా - సిద్ధవటం తాలూకా హద్దులోనున్నది. (3) గద్దెరాతి కనుమ - ఇది నేడు సుద్దరాతికనుమ అని వ్యవహారం. తాళ్ల పాక సమీపంలోవుంది. (4) ఎట్టుళికనుమ. పోలి - అప్పరాజుపేట సమీపంలో 'కడియాలపల్లెకనుమ' అను వ్యవహారంలోవుంది. (5) గుబ్బలికొండకనుమ - లంజెకనుమ నేడు వ్యవహారం. (6) మంతనాల కనుమ - ఇది నడిగడ్డ దగ్గరవుంది. తేబాకుకు సమీపం. నాగేళ్లకనుమ అని నేడు వ్యవహారం.

ఈ కనుమల విశేషమేమంటే ప్రతికనుమదగ్గఱ ఏవైపుననో ఒకవైపున చెన్నకేశవస్వామి వారి ఆలయంవుంది. నేడు కొన్ని చూడ వచ్చును. కొన్ని శిథిలావస్థనొంది యున్నవి. ఈ కనుమలు షట్చక్రా కృతిలో నున్నవని, షట్కోణాంతర్గతములని పెద్దలంటారు. సుదర్శన చక్రంలోని షట్కోణాలకు, షట్చక్రాలకు వైష్ణవమంత్రశాస్త్ర విషయం ఏదైనా సంబంధ సామ్యములున్నవేమో మీరూహించాలి...."

బుడుగుంట్లపల్లె
కోడూరు P.O
15–7–76

మై. వేం. సు

పీరిపరిశీలన కొంతవరకు నిజమనిపించుచున్నది. ఏవో కను మలనైతే అన్నమయ్య వాడియుండడేమో. ఆనాటికి చెన్నకేశవ స్వామిదేవాలయములు ఆకనుమలలో నుండుట, అవి తాళ్లపాక చుట్టూ ఉండుట, షట్కోణాంతర్గతములని పెద్దలవ్యవహారముండుట కారణముగా ఈ కనుమల నన్నమయ్య వాడియుండును. ఇంత పెద్ద వాఙ్మయములో ఈ కనుమల వ్యవహారము నేనింతవరకు ఈ పాటలో దక్క ఇంకెక్కడా చూడలేదు. చరిత్ర జిజ్ఞాసువులు దీనిపై సాధన సాగింతురుగాక!

ములు, వేదాంతములు. పురాణగాథలు, శృంగారాదిరసములు, తత్త్వము, భక్తి, పదములలో జాతీయత, సందర్భోచితములైన లోకోక్తులు, వ్యంగ్యమర్యాదలు, అలంకారములు, ఓహో! ఒక్కటేమిటి! సాహిత్య సర్వస్వమంతయు తనకు తానే నిండి పండి పరిమళించుచు, శ్రీ వేంకటేశ్వరమహిమలు ఊటలుమియుచుండును. ఈతని కృతులన్నియు, భాష ఏదైనా, గ్రంథ మేజాతిదైనా, తానే-దైవమును పేర్కొన్నా, అదంతా శ్రీ వేంకటేశ్వరునికి జోడించి శ్రీ స్వామివారికే సమర్పించుకొన్నవే.

ఈతని రచనలో గానవచ్చు మర్మమొకటి గలదు. మాటలు తేటగ నుండుట, భావము లోతై యుండుట. దానివలన సాహిత్యమున సాధారణమైన పరిచయము గలవారు పైపై తేటను గ్రహించి మురియుచుందురు. మర్మజ్ఞులగువారు లోతు లాలోచించి తనియుదురు,

10. అనుకరణములు :—

ఈ విద్య మన తెలుగువారికి ఉగ్గుతో వచ్చినది. మన వాఙ్మయములో మొదటిదగు భారతమే అనువాదగ్రంథము. తరచి చూచినచో దేశభాషా గ్రంథములన్నీ అనువాదప్రారంభములే. అంతమాత్రాన అనుకరణము లనరాదు. వస్త్వనువాదమే గానీ భావములు భాషలు భిన్నములు గదా?

సమానవిషయమును వర్ణించునపుడు భిన్నకాలములందలి — కవులకు గూడ భావైక్య మేర్పడవచ్చు. దానిని భావసంవాద మన్నారు పెద్దలు.

"సంవాదాస్తు భవన్త్యేవ బాహుళ్యేన సుమేధసామ్ ।
నైకరూపతయా సర్వే తే మంతవ్యా విపశ్చితా ॥

(ధ్వన్యాలోకము–ఉద్యోతము 4 శ్లో॥)

తరువాతివారు పూర్వకవుల గ్రంథములను చూడకుండవచ్చు గూడ. కాని తరువాతి వానిపై అనుకరించినాడను నపవాదము రాక తప్పదు. అనువాదముగానీ అనుకరణముగానీ పంచమహాపాతకాలలో చేరవని మనము గుర్తింపవలసియున్నది. అనుకరించువానిలో స్వతంత్ర భావనాబలమూ, ఇతరత్రప్రతిభోన్మేషము కనబడినచో, అంతటి-వానిచేత గూడ ననుకరింపబడిన పద-భావ-సంఘటనా-అలంకార-సమావేశ మాధుర్యము గలవాడని అనుకార్యునికి కీర్తి చేకూరును గానీ, అనుకర్తకు తక్కువ దనము రాదు. 'భోజనం దేహి రాజేంద్ర ఘృతసూపసమన్వితమ్ । మాహిషం చ శరచ్చంద్రచంద్రికాధవళం దధి' వలె పర భాగము మాత్రము సారవంతమై సొంతము నిస్సారమైనపుడు ఆకవి నుద్ధరించువా రుండరు. కావున సహజ ప్రతిభాసంపన్నునికి అనుకరణము దోషముగాదు. అట్లు చూచినచో వాల్మీకికి తరు-వాత కవియే లేడు. కాళిదాసాది సంస్కృతకవులకూ నన్నయాది తెలుగుకవులకూ గతియేది? కావుననే సంస్కృతాంధ్ర కవులందరూ తమ ప్రాచీనులను నిర్భయముగ పొగడుచూ, తమ స్వతంత్ర ప్రతిభతో ప్రతిష్ఠితులైనారు.

"వాల్మీకివ్యతిరిక్తస్య యద్యేకస్యాఽపి కస్యచిత్ ।
ఇష్యతే ప్రతిభార్థేషు తత్తదానంత్య మక్షయమ్ ॥"

అని గుర్తించుకోవలసియున్నది.

అనుకరణమే పనికిరాదను మాట నా ఓనామాలు నాకిచ్చేసి నీవేమి వ్రాసుకుంటావో వ్రాసుకో' అనుట వంటిది. అందువలననే,

"వాచస్పతిసహస్రాణాం సహస్రైరపి యత్నతః।
నిబద్ధా సా క్షయం నైతి ప్రకృతి ర్జగతా మివ॥"

ధ్వన్యా – 4–10.

అను సహృదయశేఖరవచనము కవికోటికి జీవగఱ్ఱయైనది. అనంతముగ కవికులము విస్తరిల్లినది; విస్తరించుచున్నది; విస్తరింప గలదు కూడ.

"దృష్టపూర్వా అపిహ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్।
సర్వే నవా ఇవాభాంతి మధుమాస ఇవద్రుమాః॥ ధ్వన్యా –4–4.

అను వాక్యమును కావ్యపరంపరాపరముగ గూడ వ్యాఖ్యానింపవచ్చు.

ఈయనుకరణము 1. ప్రతిబింబ సదృశము 2. ఆలేఖ్యతుల్యము 3. అన్యసామ్యము అని మూడు విధములుగ పెద్దలే వివరించినారు.

"సంవాదో హ్యన్య సాదృశ్యం, తత్పునః ప్రతిబింబవత్।
ఆలేఖ్యాకారవ త్తుల్యదేహివచ్చ శరీరిణామ్॥ ధ్వన్యా – 4–12.

"తత్ర పూర్వ మనన్యాత్మ, తుచ్ఛాత్మ తదనంతరమ్।
తృతీయం తు ప్రసిద్ధాత్మ, నాఽన్య సామ్యం త్యజేత్కవిః॥

ధ్వన్యా – 4–13

అని సామ్యవాదము నంగీకరించినది సహృదయలోకము. ప్రతిభావ్యుత్పత్తి సంపన్నమైన కవి కుటుంబములో, వానికంటె వీడు; వీనికంటె వాడు; ఇత్యాది భేదమునేర్పరచుట సాధ్యముగానిపనియని ఆచార్య దండి:—

"ఇక్షుక్షీర గుడాదీనాం మాధుర్యస్యాంతరం మహత్।
తథాఽపి న తదాఖ్యాతుం సరస్వత్యాఽపి శక్యతే॥ కావ్యాదర్శము.

కావున నేనీపై అనుకరణములను చూపినా అనుకార్యుని పెద్దరికమే తెలుస్తుంది గానీ, అనుకర్తలకు లోకువరాదని పెద్దలు గుర్తింపగలరు.

అన్నమయ్య ప్రాచీన కవుల నెవరిని పేరెత్తి స్తుతించినట్లు లేదు. కానీ, రామాయణము-మహాభారతము-భాగవతము వగైరా గ్రంథములను పేర్కొన్నారు. అట్లే శంకర రామానుజాదులను మతములను పేర్కొన్నారు. అందువలన ప్రాచీన కవుల సాహిత్య రసమును బాగా జుర్రినారనే తెలియుచున్నది. సంస్కృతాంధ్ర కవుల వలె ఏ రామాయణాది గ్రంథకథలనో ఉపాఖ్యానములనో ఆధారముగా చేసికొని వీరి పదవాఙ్మయము నడువలేదు. వీరి కవిత్వమునకు మూలవస్తువు శ్రీ వేంకటేశ్వరుని మూలమూర్తియే. భాషా-భావములుచూస్తే, ఎఱ్ఱన హరివంశమూ, కొన్ని మాండలికములందు సోముని ఉత్తరహరివంశమూ, తిక్కనగారి దేశిపదసంపద కానవచ్చును. కానీ ఇది వీరిది అని తేల్చిచెప్పుటకు తగినయాధారములు లేవు. అది కాలాంతరమున సాధ్యమగునేమో చూడవలసియున్నది. వీరిపాటలు ముక్తకములవలె దేనికదే సంపూర్ణము. ఉత్తరక్రమాన్వయములేదు. ఎప్పుడేమైనా చెప్పవచ్చు. అది ఆయన స్వేచ్ఛకు సంబంధించినది. శబ్దాలంకారములందు పోతన పోలిక కన్పడుచుండును. ఇద్దరూ ఎంచుమించు సమకాలికులు: ఒక మండలమువారు. కొంత పూర్వము వాడైనా సోముడూ అంతే. కావున అనుకరించినట్లు తేల్చి చెప్ప లేము. వీరిరామాయణము దొరికితే చూస్తాము.

ఇక ఈతని ననుసరించినవారు :—

1. ఈ సంపుటము నందలి 264-1-3 లో 'కొనవాండ్లై తేను', ఇది 'వాఁడి' శబ్దబహువచనము. ఇట్లనే 'వేండ్లు' 'వేఁడి' శబ్దబహువచనముగ ఈతని ప్రయోగమునగలదు. "విషమశరుఁడేయు తూపుల

వేండ్లకన్న వాండ్లు వాఘూల మునిశాప వర్ణితులు"-(పాండురంగ మాహాత్మ్యము - 5-314 సాహిత్య అకాడమీ ప్రతి).

'వాఁడి' శబ్దముపై 'వాండ్లు', 'కాఁడి' శబ్దమునకు 'కాండ్లు' వలె వ్యాకరణసంపన్నమైనను అపురూపమైనది. అందువలననే తెనాలివారు దానిని గిల్లుకొన్నారని నా భావము.

౨. తమిళమందువలె, స్త్రీల గమనమునకు నెమలిని ఉపమాన ముగ చెప్పుట అన్నమయ్యయం దక్కడక్కడ కలదు. "గతిమధ్య స్తన కుంతల స్తబక వీక్షాగర్వదుర్వార.............యీ...............బర్హి మృగేంద్ర కుంభిచమరీయూథంబు సేనంబులన్". — పాం - మా. (3-8)

3. ఈ సంపుటమున 261-1-1లో 'మొగమున కెగరెడి మొన ఘాఁడిగుబ్బల' అను అపురూపపదబంధమును, రామరాజ భూషణుడు 'మొగమున కెగయునీవలుదవలి చన్నుగుబ్బలు' (కావ్యాలంకార సంగ్రహము - 5 - 113)లో వాడుకొన్నాడు. రామరాజభూషణుని 'లలనాజనాపాంగ' అను సమాసభాగము కొంత అన్నమయ్యదే. ఆ భూషణుడే, ఈసంపుటమునందలి 143వ పాటపూర్తిగా 'అళిఘటి మీనకేసరి శశాసన గోమకరంబులన్' (వసు చరిత్ర-5-53) పద్యముతో ననుకరించినాడని డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులవారు ఒక యుపన్యాసమున పల్కిరి.

కాని ఇట్టి కల్పనము

"అనయము యంత్రమత్స్యము నొకమ్మన శ్రీనరసింహుఁ డేయఁగా
వెనుకకుఁబారి, పుల్గడఁచి, వేషము మార్చి, బిలంబుదూరి, కా-
ననమునకేఁగి, సిగ్గున నణంగి, భరంపడి వీఁగి, తా విషం—
బెనసి, నతిఁభజించి, నదు లీఁది భ్రమించెను రాసులన్నియున్"

(కావ్యాలంకారసంగ్రహము-4-61)

అను పద్యమున మరింత చమత్కారముగా సాగించినాడనక తప్పదు.

కన్నుల యెంత గనమౌనో యేలాగే" అను పాదములందు చూపిన మీనళని దోషమునందలి కలివును, 'తూలె జగంబు మీనళనిదోషము దాఁకి నిరస్తసస్యమై' అనిధూర్జటి (శ్రీ కాళహస్తీశ్వరమాహాత్మ్యము-3-153.)తో ననుకరించినట్లున్నది. ఇది అనుకరణము కాదన్నను దోషములేదు.

ఈ సంపుటము 348-1

"వనిత లావణ్యంపు వదన శశికలములు-
చనుగిరులపై నేల జారిపడెనే
వెనకఁ దుదుమనురాహు వేవేలురూపులై
తనర ముఖచంద్రుఁడు తలకఁడు గదా।

అను దాని భావమునకు ఛాయగా ప్రభావతీ ప్రద్యుమ్నమున పింగళి సూరన: —

"చంద్రభీత ఘనధ్వాంత సంచయమున—
కభయ మొసఁగి వేణీభరం బనునెపమున
తనవెనుక వేసికొన్నది తరుణి మొగము
చంద్రుఁగైకొనమి కిదియ సాక్షి గాదె। (ప్రభా—2—67.)

అని అనుకరించినట్లు తోచుచున్నది.

6. ఈ వాఙ్మయమునం దక్కడక్కడ 'భేరిజోకొట్టుట' అను పదము విపరీతప్రయత్నార్థమున వాడబడుచున్నది. దానిని పింగళి సూరన:—

'వట్టి మఱుంగుఁబెట్టి నుడువంబనిలే దిదియెల్ల భేరిజో-
కొట్టుట కాక.........' (ప్రభావతీ ప్రద్యుమ్నము-3_72)

అని అనుకరించినట్లు తోచుచున్నది. ఇది సమకాలిక దేశ్య లోకోక్తి కూడ కావచ్చు.

అనుకరణము పదముతో, పాదముతో, విషయముతో, అన్నింటితో గూడ నుండుననుటకు:-

'పాదోపజీవీ పదకోపజీవీ
ఛాయోపజీవీ సకలోపజీవీ.
భవేదథ ప్రాప్తకవిత్వజీవీ
స్వోన్మేషతోవా భువనోపజీవ్యః॥

అను క్షేమేంద్రునివచనము ప్రమాణము.

ఉదాహరణము లన్నియు వీశైనంతగ ఈ సంపుటము లోని కీర్తనలతోనే యుండవలెనను సంకల్పముతో ఇట్లు సంగ్రహించితిని. విస్తారమైన ఈ పదవాఙ్మయములోని ఇతరసంపుటము లన్నింటితో సంప్రతించితిమేని ఇంక నెందరెందరో అనుకర్తలు బయటికి రాగలరు. ఈ సంపుటములోని 51, 81 పాటలు దాక్షిణాత్య శృంగార గ్రంథము లకు ధ్వజములుగా గన్పట్టుచున్నవి. ఇట్టిభావములు దాక్షిణాత్య వాఙ్మయమున గుట్టుగా, రట్టుగా ఉన్నవానిని సహృదయులు గుర్తింపగలరు.

అన్నమయ్య సంగీతము :

పైతెల్పినవిధముగా అనంతసాహిత్యసార్వభౌముడగు నీతడు సంగీతము నూతగొని పదవాఙ్మయమునేల సృష్టించెనా అని ఆలోచింపవలసియుండును. అది ఈతని పరమైకాంతికమైనభక్తికి సంబంధించినదని నాయూహ. నాదోపాసనము, మోక్షసాధనసామ గ్రిలో నిర్గుణోపాసన పద్ధతికి చెందినదని పెద్దలందురు. సగుణమూర్తు లెందరున్నను వారినందరిని సమేళించిన శుద్ధమూర్తిని నాదముతో నుపాసించవచ్చునని :—

" నాదోపాసనయా దేవా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః।
భవన్త్యుపాసితా నూనం యస్మాదేతే తదాత్మకాః ॥[1]

ఈ శ్లోకము తెల్పుచున్నది. అన్నమయ్యకు వేంకటేశ్వరుడు సర్వ దేవతా స్వరూపుడుగా కనబడినట్లు:—

బౌళి

ఎంతమాత్రమున నెవ్వరు దలఁచిన అంతమాత్రమె నీవూ
అంతరాంతరము లెంచి చూడఁ బిండంతె నిప్పటి యన్నట్లు ॥పల్లవి॥

కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుండని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మ మనుచు
తలఁతురు మిము శైవులు తగినభక్తులను శివుఁడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆదిభైరవుఁడనుచు ॥ఎంత॥

సరి నెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీవనుచు
దరిసెనముల మిము నానావిధులను తలఁపులకొలఁదుల భజింతురు
సిరులమిమ్మునే యల్పబుద్ధిఁదలఁచినవారికి నల్పంబవుదువు
గరిమల మిమునే ఘనమని తలఁచినఘనబుద్ధులకు ఘనుఁడవు ॥ఎంత॥

నీవలనఁ గొఱఁతలేదు మఱి నీరుకొలంది తామరవు
ఆవల భాగీరథిదరిబావుల ఆజలమే వూరినయట్లు
శ్రీ వెంకటపతి నీవైతే మముఁజేకొని వున్న దైవమని
యీవల నే శరణనియెద నిదియే పరతత్వము నాకు ॥ఎంత॥

(అన్న—అధ్యా. 179 రేకు)

ఈ పాట తెల్పుచున్నది.

" యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః " ॥ భగ. 4-11.

1. సంగీతరత్నాకరము - p 31. (edn, ఆనందాశ్రమ ప్రెస్—పూనా)

అనిన గీతావచనానుసారముగ,

"యం శైవా స్సముపాసతే శివ ఇతి: బ్రహ్మేతి వేదాన్తినో;
బౌద్ధా బుద్ధ ఇతి; ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః।
అర్హన్నిత్యథ జైనశాసనరతాః; కర్మేతి మీమాంసకాః;
సోఽయం వో విదధాతు వాఞ్ఛితఫలం త్రైలోక్యనాథో హరిః"॥

అనుదానికి దీటుగనున్న దీమాట. దీనివలన నాతని కితరమత ద్వేషము లేదనియు స్పష్టమగుచున్నది. ఎక్కడైన ఇతరమతములను తూలనాడినట్లు కన్పడినను భాగవత సంప్రదాయ మమకారముతో అది 'నహినిందాన్యాయము' నకు చేరినదిగా గుర్తింపవలసియుండును. జన్మసిద్ధమైన అద్వైతవాసనబిడ్డు ఈతనిని వదలలేదని అక్కడక్కడ స్పష్టమగుచుండును.

కావున అన్నమయ్య, తనఇష్టదైవముగు వేంకటేశ్వరుని సగుణ-మూర్తిని నిర్గుణమగు నాదోపాసనా మార్గముతో జోడించుటకే సంగీతమును చేపట్టెనా యనిపించుచున్నది. ఆ మూర్తిని తలచిన వెంటనే భావ పరంపరలు, సాహిత్యసామ్రాజ్యము తన యెదుట నిలిచి ఆ-వేళకందిన ఏదో మెట్టును ఆధారముగా చేసికొని పాడినట్లు కన్పడుచున్నది. అందువలననే ఈతని కీర్తనలందు సంగీతము పాదపీఠముగ మాత్రము నిలిచినట్లు చెప్పవచ్చును.

త్యాగరాజాది కృతులందు కానవచ్చు నాదవిస్తారసౌకర్యము ఈతనికీర్తనలందు కానరాదని సంగీత మర్మజ్ఞుల మాట. ఆయా కీర్తనలందు మాత్రలకు వలసినన్ని యక్షరములు కూరిపోసినట్లుండుటచే, సంగీతజ్ఞుడు స్వతంత్రించి నాదవిస్తారము సంపాదించుకొనలేక పోవుచున్నాడు. కొన్ని పట్టుల కుదించియు, కొన్ని పట్టుల విస్తరించియు పాడుకొను ధైర్యము మనకు కల్గినచో ఈ పాటలు కొంత సంగీతమునకు లొంగి పనిచేయును. ఇంతమాత్రమున మన మన్న-

మయ్యకు చేసిన యపచారము లేదు. కాని సంగీతజ్ఞులకు కొంత అవకాశమిచ్చిన భాగ్యము మాత్రము మనకు దక్కును.

అన్నమాచార్యులు పదకవిత్వమునకు, భావసంపన్నమైన సంగీ-తసంప్రదాయమునకు కల్లు ముల్లులేని చక్కనిబాట వేసిరి. తన అనం-తరము వారగు క్షేత్రయ్య, త్యాగరాజు, సారంగపాణి ప్రభృతులు ఆబాట పొడవునా పెద్ద పెద్ద చెట్లు పెంచి నిలుచు నీడలు విండించిరి. పై పై నడచుబాటసారు లందరు నీడకు మురిసి బాటను మరచిరి. అది నేటిసంగీతవిద్వాంసులవలన అన్నమాచార్యుల కబ్బిన సత్కారము.

త్యాగయ్య మొదలగు వారి కీర్తనలందు సంగీతమునకు ప్రాధా న్యము, సాహిత్యమునకు ఉండీ లేనట్లు రెండవస్థానము. అన్నమాచా ర్యులకీర్తనలలో సంగీతసాహిత్యములు రెండును సమప్రధానము గనో, లేక సాహిత్యము కొంచెము ముందంజ వేసినట్లుగనో కన్పడు చుండును. ఏమైననేమి? సంగీత సాహిత్యవిద్వాంసుల కొకేబంతిలో వడ్డనచేసినధర్మకర్త అన్నమాచార్యు లొక్కరే. కేవల సంగీతజ్ఞులకు కొరుకుడువడని మధురభక్ష్యములు కొన్ని సాహిత్యజ్ఞులకే వడ్డించిన పక్షపాతమూ కానవచ్చును.

పదకవితా పితామహులై, సంగీత సాహిత్య సామ్రాజ్యముల రెండింటి నేలిన తొలి ఆంధ్ర వాగ్గేయకారకు డీతడే.

### తారతమ్యము :—

అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య వీరు ముప్వురును ఆంధ్ర మాత పుత్రులై సంగీత సరస్వతికి ఒక విశిష్టస్థానమును చేకూర్చిన మహనీయులు. అందులో క్షేత్రయ్య శీలము, కొంత రాజాశ్రయణ వేశ్యాసాంగత్యాదులతో దూషితమైనట్లు చరిత్ర చెప్పుచున్నది. శీల మును పరామర్శింపవచ్చినచో ఏకాంతభక్తి భావమునకు చెందినవారు

అన్నమయ్య, త్యాగయ్య. అందునను తన సంగీత సంప్రదాయము, దానిని వ్యాప్తికి తేవలెననెడి తహతహ, అందుకై చేరిన శిష్య సమాజము త్యాగయ్యకు కలదు. ఈ మాత్రముగూడ ఐహికవాంఛలపై మనసు లేనివాడు అన్నమయ్య. ఇతడు ఎంత రక్తుడో, అంత విరక్తుడు. "పాడెడువాడు నేను, వినెడువాడు శ్రీ వేంకటేశ్వరుడు, కావలసినది యతని అనుగ్రహము, తనకు వలసినది ముక్తి, తన సంగీతమునందును, సాహిత్యమునందును రుచి నాస్వాదింప గలిగినవాడు స్వామి యొక్కడే." అని అన్నమయ్య తీర్మానము. కావుననే ఆ సంప్రదాయమును ప్రచారించు శిష్యకోటికొఱకు గాని, వారిని దిద్ది తీర్చవలెనను మమకారముతోగాని ఈతడు పనిచేసినట్లు కనబడదు.

ఒకవిధముగా తలపోసి చూచినచో, 'సంగీత సంప్రదాయ దర్శిని' ఇత్యాది గ్రంథముల వలన, సంగీతకళ ఆంధ్రమున జన్మించి అరవదేశమునకు వలస పోయినట్లు కన్పట్టుచున్నది. నేడీభేదమును రసికు లంద ఱెరుగుదురు.

అన్నమయ్య కృతులు:—

అన్నమయ్య కేవలము పాటలను మాత్రమే వ్రాసినాడను-వారును లేకపోలేదు. కాని సంస్కృతాంధ్ర ప్రాకృతములయందు అడ్డ-మాకలు లేక సాగిన దీతనికవిత. ఈతని కావ్యరాశిని గూర్చి ఈతని మనుమడు చిన్నన్న:—

యోగమార్గంబున నొకకొన్ని, బుధులు
వైరాగ్యరచనతో వాసింపఁగొన్ని,
రాగిల్ల శృంగారరసరీతిఁ గొన్ని.
సారసనేత్రుపై సంకీర్తనములు
సరసత్వమువఁదాళనముఖముల్ గాఁగ

ప్రవిమలద్విపదప్రబంధరూపమున
నవముగా రామాయణము, దివ్యభాష–
నా వేంకటాద్రి మాహాత్మ్యమంతయును
గావించి, రుచుల శృంగారమంజరియు,
శతకముల్ పదిరెండు, సకలభాషలను
ప్రతిలేని నానాప్రబంధముల్ చేసి[1]

(అన్న – చరి – 45–48 పుటలు)

అని వ్రాసియున్నాడు. ఇవిగాక సంస్కృతమున అన్నమాచార్యులు రచించిన సంకీర్తనలక్షణ మొకటి గలదట. ఈ యిన్నింటిలో:—

(1) శృంగారమంజరి, రేకులు 5
(2) అధ్యాత్మకీర్తనల రేకులు 363
(3) శృంగార సంకీర్తనల రేకులు 1921

వెరసి 2289 రేకులు

మాత్రమే మనకు దొరకినవి. సరాసరి రేకునకు ఆరుపాటలవంతున ముప్పదిరెండువేల కీర్తనలకు దాదాపు 5400 రేకులుగదా ఉండవలసినది! అందులో సగానికి తక్కువగనే మనకు లభ్యమైనట్లు.

అన్నమాచార్యుల ద్విపద రామాయణములో 'యుద్ధకాండ' మున్నట్లు, 1975, ఏప్రిల్, 'సప్తగిరి' సంచిక, 29వ పేజీలో శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు పేర్కొన్నారు. అది అన్వేషింపదగియున్నది. వేంకటేశ్వరముద్రతో అలమేలుమంగ పై చెప్పిన శతకము రేకులు ఇక్కడ లేవు గాని, ఆ శతకమును అన్నమాచార్యుల పేరుతో వావిళ్ల వారు ముద్రించియుండిరి.

---

1. పై ద్విపదలో మొదటి నాల్గుచరణములు ప్రాసరహితములుగ నున్నవి. 1, 3 పదములొకటిగ 2, 4 పదములొకటిగ కూర్చిన ఆ దోషముతీరి అన్వయము సులభమగును.

లభ్యమైన రేకులలో శృంగారమంజరి రేకులు 5, "తాళ్లపాక కవుల లఘుకృతులు" (The Minor works of Thallapaka Poets) అను పేరుతో మొదటి సంపుటముగా 1935 లో మన దేవస్థానమున ముద్రితములైనవి. అన్నమాచార్యుల అధ్యాత్మసంకీర్తనల రేకులు 363 పూర్తిగ ముద్రితములైనవి. శృంగారసంకీర్తనల మొదటివంద ఈ సంపుటము. 22వ సంపుటముతో అన్నమాచార్యుల శృంగార సంకీర్తనల రేకులు 8వ వంద ముద్రితములైనవి. నడుమ 16వ సంపుటమున చిన తిరుమలాచార్యుల రేకులు అనుబంధముగ ముద్రితములైనవి. పోగా అన్నమాచార్యుల 9, 10, 11 వందలరేకులు ప్రెస్‌కాపీలు తయారై అచ్చుకు కాచుకొనియున్నవి. 12 వ వంద రేకులు దాదాపు సగము ప్రెస్‌కాపీ తయారైయున్నవి. 13 వ వందనుండి 2000 వరకుగల రేకులు, ఆపై 2001, 2002 సంఖ్యగల రేకులూ వ్రాసి ముద్రింపవలసి యున్నవి.

పండ్రెండవ సంపుటమునుండి ఇరువదవసంపుటమువరకు అన్నమయ్య శృంగారసంకీర్తనలే. 21వ సంపుటము తాళ్లపాక పెద తిరుమలాచార్యుల అధ్యాత్మకీర్తనలు, మఱల 22వ సంపుటము అన్నమాచార్యుల శృంగారసంకీర్తనలు, 23వ సంపుటము తాళ్లపాక పెద తిరుమలాచార్యుల శృంగార సంకీర్తనలు. ఇప్పటికి 16 లో అనుబంధముగా చినతిరుమలాచార్యులవి, 21, 23 లలో పెదతిరుమలాచార్యులవి పోగామిగిలినవన్నీ అన్నమాచార్యులవే.

ఎట్టిన రామాయణము వగైరాలతోపాటు అన్నమయ్యవాఙ్మయముగూడ కొంతభాగము కాలగర్భమున కలసినట్లు పై చిన్నన్న ద్విపదవలన మన మూహింపవలసియున్నది. ఇప్పటి కగపడని రేకులకై తి. తి. దేవస్థానమువారు ఈమధ్య గూడ అహోబలము, సింహాచలము శ్రీరంగము వగైరా దేవస్థానములవారితో జరిపినవిచారణము నిష్ఫలమైనందుకు చింతింప వలసి యున్నది. శ్రీరంగములో 40 రేకులు

ఆ రేకులు త్రిప్పిపంపుట జరిగినదని వార్త.

పై చెప్పిన సంపుటములన్నియు తి. తి. దేవస్థానమువారిచే ముద్రింపబడి విక్రయింపబడుచున్నవి.

రేకులలోని వ్రాత :—

ఈ రాగిరేకులలోని వ్రాత ప్రాతకాలము శాసనములవ్రాతకు చాల సన్నిహితమైనది. (1) ద్విరుక్తములయిన పరుషసరళములకు ముందున్న నిండుసున్న పూర్ణానుస్వారముగా (2) అద్విరుక్తములైన పరుషసరళములకు ముందున్న నిండుసున్న అర్ధానుస్వారముగను (3) మహాప్రాణాక్షరములు, ఊష్మాక్షరములు వగైరాలకు ముందున్న నిండుసున్న పూర్ణానుస్వారముగనే గుర్తింపవలసి యుండును.

(1) విసంధిగా వ్రాయుట (2) ఉకారాంతములపైగూడ అచ్చులకు యవలు సంధించుట (3) ద్రుత సంధులు అక్కడక్కడ యథేచ్ఛముగ మానుట – ద్రుతాంతములపై అచ్చులకును యవలు సంధించుట (4) సకారాది పదములు శకారాదిగా నుండుట (5) 'ఎంత, ఏల' మొదలగువానికి బదులు 'యంత, యాల' అని యుండుట (6) ఇతర ప్రయోగములందు కానరాని అరసున్న కొన్ని పదములందు కానవచ్చుట, (ఈ యంశము భాషావ్యాకరణ శాస్త్రములతో సంవదించి నిర్ణయింపవలసినది.) (7) 'ఎసఁగులో' 'అంట' కు ప్రతి యగు 'అఁట' లో చాల స్థలముల అర్ధానుస్వారము లేకుండుట, (8) గ్రాంథికవ్యావహారిక పదములందు అవ్యవస్థగా శకటరేఫలుండుట (9) ఒకే పదము సాధురేఫ శకట రేఫలలోనుండినను, యతిప్రాసస్థలములలో మాత్రము ఏదైన నొకటే యుండుట, (10) గ్రాంథికరూప సన్నిహితములగు వ్యావహారిక రూపములలోగూడ అరసున్నలు శకటరేఫలు పట్టు విడు

వక నిలుచుట (11) అజాది పదములు యకారవకారాదిగా నుండుట (12) హల్లులపైని ఇ ఈ, ఎ ఏ, ఒ ఓ లకు భేదము లేకుండుట ఇత్యాదులు — ఈ రేకుల వ్రాతలో విశిష్టత.

పదాది యకార విషయమున ఆదివ్యాకర్తయగు నన్నయ్యగారే:—

"అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః" అనిసూత్రించి, 'సర్వత్రాజ్వత్ కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః' అని నిజస్వరూపమును నిలబెట్టిరి. ఈ వ్యాకరణ వ్యాఖ్యాతలుగూడ "యెవ్వాని వాకిట" ఇత్యాదిగ నుదాహరించి సమన్వయించిరి.

పదాది యకార, వు, వూ, వో, వోలు, స స్థాన శకారము ఇవి, సాధారణజనాఖ్యాసమున వ్రాతలలోనిండి, యెంతగా పండితు-లీసడించుకొన్నను తొలగనంత లోకసిద్ధిని సంపాదించుకొన్నవి. ఈ రాగిరేకులపై వ్రాత పెద్దపండితులచేత సాగియుండదు. అవ్యుత్పన్నులైన పోగరపనివారితో సాగియుండును. వారికై వాడమూ కొంత సహకరించియుండును. ఇంతకు ఈ పదకవిత్వమున కవులే పనిబూని వ్యావహారికరూపములను వాడినారు. అది వారి ఉద్దేశమునకు, అభిమానమునకు, హక్కులకు సంబంధించినది. పండిత పరిష్కర్తలుగా ఈ వాఙ్మయముపై తొలుత చేయివేసిన కీ. శే. ప్రభాకరశాస్త్రిగారు, పాటమొదటనున్న య, వు, వూ, వో, వోలను అజాదిగా, శకారాదిగానున్న తెలుగుపదములను సకారాదిగా పరిష్కరించిరి. ఆ పద్ధతియే ఇప్పటికిని సాగుచున్నది.

"పదములు శృంగారవధూ—
మృదుమధురమనోజ్ఞ వాక్య మిశ్రములైన —
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁ బొంకమెఱఁగి పలుకఁగ జెల్లున్

(చినతిరుమలాచార్యుల సంకీర్తనలక్షణము ౫౮)

"వల్లవనారీస్మేచ్ఛా –
ద్వల్లానమనోజ్ఞబంధురోక్తులు చవియై
చెల్లను గ్రామ్యములైనను
హల్లీసకముఖ్యనాటకాదిక ఫణితిన్" (58)

"జగతిఁగల చెల్లుబడిచే
నగి నగి భాషించునట్టినాడుడి పలుకుల్
తగ దన రహి చెడుఁ; బువ్వుల
సొగసుడుగన్ పిసికి కంపు చూచిన భంగిన్" (59)

అని శృంగారపదలక్షణములను,

"దేహాత్మేశవివేకో–
త్సాహంబును లోక వేద ధర్మాఽ ధర్మా –
ద్యూహాపోహంబులు గల
ఆహరి సంకీర్తనంబు లధ్యాత్మంబుల్" (61)

అని ఆధ్యాత్మసంకీర్తనలక్షణమును వివరించిరి చినతిరుమలాచార్యులు.
రేకులపై వ్రాసిన తీరు:–

ఇన్నివేల రేకులపై ఇంత పెద్ద వాఙ్మయమును ఏ సాధనములతో ఎట్లు వ్రాసినారు? అనుజిజ్ఞాస పర్వడుట సహజము. నాకును ఈ సందియము గలిగి అక్కడక్కడ విచారింపగా శ్రీ వల్లంపాటి అశ్వత్థంగారు (సంతపేట -- చిత్తూరు) :–

(1) రాగిరేకునకు తుత్తునాగము పూసి కొలిమిలో ఎఱ్ఱగ కాల్చి పుల్లగోగాకు పసరులో ముంచినచో ఆ రేకు మెత్తవడుననియు, ఆ మెత్తదనము ఐదారు గంట లుండుననియు, ఆ రేకును రంపపు పొట్టుదిండుపై ఒడిలో భద్రముగ నుంచుకొని, పెద్ద దబ్బణము వంటి మొన, పట్టుకొనుటకు బెల్లుచుట్టిన పెద్ద పిడి, దానిపైన బరువైన చెండు గలిగిన 'పిడిపేడు పోగర' అను సాధనముతో వ్రాయు

నలవాటు, తనబాల్యమున చిత్తూరు జిల్లా వాయల్పాడు తాలూకా రొంపిచెర్ల గ్రామములో వీరబ్రహ్మాచారి అను ఒక కంసాలితెయొద్ద చూచినట్లు చెప్పిరి.

2. శ్రీ మైనంపాటి సుబ్రహ్మణ్యంగారు (తెలుగు పండితులు, కోడూరు) :—

రేకులను చదరించుకొని వానిపై, కరగిన మైనములో రంగు గలిపి దానితో గీతలు వైచి దానితోనే అక్షరములు వ్రాయుదురనియు, ఆ వ్రాసిన అక్షరములనన్నిటిని తన క్రిందిపనివారు చెక్కుచుందురనియు చెప్పిరి. ఈ రెండవవార్తయే నాకును నమ్మదగినదిగ నున్నది.

ఇన్ని వేలరేకులను వ్రాతతో నింపుటకు కొన్నిపదుల మంది వాండ్లైనను పనిచేసియుందురు. కొందరు వ్రాయుట, కొందరు చెక్కుటచే ఈ పని కడతేరియుండును. ఈ తాళ్ళపాకవారి వాఙ్మయము దక్క రేకులపై కెక్కి నిలిచిన ఇంత పెద్ద వాఙ్మయము మరొక్కటి వినవచ్చుటలేదు. ఈ వాఙ్మయమున కానాడు ఎంతో ప్రశస్తి యుండి ననేగాని ఇంతపని జరిగియుండదు. తాళ్లపాక పెదతిరుమలాచార్యుల యాజమాన్యమున అన్నమరాజు తిమ్మయ్య అను వ్యక్తి ఈ వ్రాతపని నెరవేర్చినట్లు ని. రే. 5 లో మాత్రము గలదు. అతడు తానొక్కడే ఈ పనిచేసియుండలేదు. తన వంశమువారు, తన శిష్యపరంపర ఈ పని సాగించియుందురు.

శ్రీ అశ్వత్థంగారు చెప్పిన మాట, ఒకటి రెండు రేకులపై వ్రాసికొను యంత్రములు మొదలగు వానికి పనికి వచ్చునేమోకాని, ఇంత పెద్ద పనికి చాలదని నాయూహ.

ప్రథమ ముద్రణము :

ఈ పంద్రెండవ సంపుటము ప్రథమ ముద్రణ పరిష్కరణములు పూజ్యపాదులు శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి చేతిమీదుగా సాగినవి. వారు అన్నివిధముల అన్నమయ్యకు ప్రతిరూపులు. అంతటివారు చేసిన పనిని, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము వారికై నేను మరల పరిష్కరింపబూనుట సాహసమేయైనను, అధికారుల-ఆదేశమును తలదాల్చి చేయక తప్పినదిగాదు. పరిష్కరింపబూని నప్పుడు కొన్ని స్థలములందు నాకు చిక్కులేర్పడినవి. నాయూహా కందినవానినన్నింటిని ఈ సంపుటమున నక్షత్రముగుర్తుతో పాద దీపికలో చూపియున్నాను. ఈ సంపుటము 262 పేజీలోని నక్ష త్రము మాత్రము శ్రీ శర్మగారిదే. 1,3 పాదాంత 2,4 పాదాదులలో సంధి సమాసస్థలములం దడ్డగీతలు నావి. ఆ చిక్కులలో కొన్నిటిని గూర్చి శ్రీ శర్మగారికి వ్రాసితిని. దానికి వారిచ్చిన ప్రత్యుత్తరమిది: —

"........పంద్రెండవ సంపుటము పరిశోధించి విషయపుష్టితో పునర్ముద్రణమునకు సిద్ధపరచుపని మీరంగీకరించుట నాకెంతో తృప్తి కరము. 'ఇట్టి ముద్దులాడి బాలుఁడేడవాఁడు' (12 సం-148) అను ముద్దులాడి కీర్తనము అందులో నాచేయి జారిపోయినదని మీజాబులో చదివినపుడు చాలా వేదనపడితిని. పలుమారు నేను వదరుకొనువది ములలో అదొక్కటి. వ్రాసి పెట్టలేదుగాని దేవగాంధారి రాగ ములో దానికి నేను కల్పించుకొన్న స్వరమూర్తి నాసంకల్పమందే స్థిరముగా నిలిచియున్నది. పొరపడుట నాకు అస్వాభావిక మేమియు గాదని ఎఱుగుదును. కాని ఇది పెద్ద పొరబాటుగా తోచి నొప్పించినది. కాని ఆకస్మికముగా పదకొండవ సంపుటము చూచు చుండగా ఆ కీర్తన అందు కానవచ్చి నిట్టూర్పు వదలితిని. ఆ సంపుటము " నిడు రేకులలోని అధ్యాత్మకీర్తనలు " అను రెండవ భాగమున 175వ పుటలో ని. రే. 30వ దాని మొదటిపాటగా ఇది ప్రకటితమైనది. ముందే ప్రకటితముగాన పునరుక్తి పని లేదని సా. రే.

26లో నుండినా వదలితినేమో. కాని ఆ మాట అక్కడ క్రీగీతతో తెలుపక పోవుట నా లోపమే. కాని కొంతక్షంతవ్య మేమో. 193వ పాట (192) (11-129) "ఏదో-పోదో.........ఆదో-పోదో" అను నాపాఠమును మీనిశితదృష్టి "ఏటో-పోటో....ఆటో-పాటో" గా గుర్తించి సార్థకపరచినది. సంతోషించితిని. ఆ (ఈ) సంపుట మందలి 155వ పాట (154) అర్థము, తాత్పర్యము నా పంటికిని చిక్కలేదు. సమకాలికమైన ఏదో చారిత్రక విప్లవమును, తుదకు దాని ప్రశాంతియు దానిలో ఉద్దేశింపబడినట్లున్నది. ఇంతకంటె స్పష్టపరచు మాట లేవియు అందు కనబడలేదు."...

బెంగుళూరు, 560041
27-7-76.

రా. అనంతకృష్ణశర్మ

26 వ రేకులో రెండవప్రక్క మధ్యపాట ముందుముద్రణమున తప్పిపోయి ఈ ముద్రణమున అచ్చుకెక్కుటచే. మొత్తముపాటలు 379 (పూ. ము.), 380 గా ఇప్పటి ముద్రణమున వచ్చినవి. (శ్రీ) శర్మగారి జాబులో కుండలీకరణములో చూపిన పాటలసంఖ్య పూర్వముద్రణము నకు సంబంధించినది.

ఉపసంహారము :—

ఎంత భక్తియున్నను, మరెంత పాండిత్యమున్నను, ఒక్క వేంకటేశ్వరునిపై అసంకీర్ణములగు ఇన్ని భావపరంపరలను సృష్టింపగలరసికు మింకొక్కరికి లేదనుట నిర్వివాదమైన సత్యము.

ఇన్ని చారిత్రకాంశములతో, ఇంత భక్తిభావముతో, ఇన్ని భాషావిశేషములతో, ఇన్ని లోకోక్తులతో కూడిన ఈ వాఙ్మయము, సారస్వత పట్టభద్రులు (డాక్టరేట్లు) కాదలచిన వారికి ఎంతైనను సాము గరిడీ కావచ్చును. అట్టివారితో ఈ వాఙ్మయము వన్నెకెక్కగలదని ఆశించుచున్నాను. దీనికి నాందిగా మన వేంకటేశ్వర విశ్వవిద్యా-లయమువారు దీనిని పాఠ్యభాగముగా తీర్మానించిరేమో యని తోచుచున్నది. కాల మీవిషయమును తేల్పవలసియున్నది.

కృతజ్ఞత :—

ఎంతగా కంటికి వత్తి వేసికొని చూచినను, అచ్చుకూర్పరు లెంత మెలకువగా పనిచేసినను, మా కన్నులుగప్పి దొరలినతప్పులను సహృదయులు చల్లనిచూపుతో చూచి తెలిపిన మెలకువను పెంపొందించుకొనగలము. అన్ని కార్యములను మూలకుదోసి ఈ సంపుటమును బైటికిదెచ్చుటే ప్రధాన కర్తవ్యముగా ఆదేశించిన తి. తి. దేవస్థానాధికారులు శ్రీ పి. యస్. రాజగోపాలరాజుగారికి, ధర్మకర్తలమండలి అధ్యక్షులు శ్రీ చెలికాని అన్నారావుగారికి నా కృతజ్ఞతాభి నందనములు. ఈ పని ఇంత త్వరగా సాగింప తలపెట్టిన శ్రీ వేంకటేశ్వరవిశ్వవిద్యాలయమువారికి నా హార్దాంజలి. ముద్రణమునందు జాగరూకులై యుండిన ప్రెస్ మేనేజర్ శ్రీ యం. విజయకుమార రెడ్డిగారికి, పుస్తకము వీలైనంత నిర్దుష్టముగా అచ్చుకుదెచ్చుటకు సహకరించిన అచ్చుకూర్పరులకు, అడుగడుగున పరిష్కరణ కార్యమునందు నా మాటకు విలువ ఇచ్చి నన్ననుసరించిన తిరుమల తిరుపతిదేవస్థానం 'సప్తగిరి' సంపాదకులు శ్రీ కె. సుబ్బారావుగారికి నా కృతజ్ఞతాపూర్వకాభినందనములు.

మందవేగము గలిగిన నా చేయి ఈ పీఠికను వ్రాయలేక యున్నసమయమున, శరవేగముతో వ్రాత సాగింపగల చిరంజీవి సముద్రాల లక్ష్మణయ్య, ఈ మధ్యనే ఈ అన్నమాచార్య కార్యములో

ఒక శాఖకు తీర్పరిగా వచ్చి, నాకీపీఠికాలేఖన విషయమున సహాకరించి నందులకు ఆతనిఋణము నేనెట్లు తీర్చుకొనవలెనో తోచకున్నది. ఈ పరిష్కరణ కార్యమున లేఖకుడుగ నియమింపబడిన చిరంజీవి కె. రామచంద్రరాజు తొలుత రెండుదినములు మాత్రము వచ్చిపని చేసి, దైవ దుర్విపాకముతో కాలు విరిగి చికిత్సనొందుచున్నాడు. భగవంతుడు ఆతనిని ఆరోగ్యసంపన్నునిగా చేయుగాక యని వేడుకొనుచున్నాను. అవ్యాజపుత్రవాత్సల్యముతో ఈ పరిష్కరణమునందు నన్నిపాటి-వానినిగా దిద్దితీర్చిన పూజ్యపాదులు శ్రీ మాఁ రాళ్లపల్లి అనంత-కృష్ణశర్మగారికి పరస్సహస్రప్రణామములు. ద్వితీయముద్రణ పీఠిక విపులముగ నుండిన బాగుండునని నన్నాదేశించిన మిత్రులు, గౌరవార్హులునగు శ్రీ జి. యఁ. రెడ్డిగారికి నా ధన్యవాదములు.

చదివెడి సహృదయులకు ఇందులో ఏవైన సందేహములు తోచిన, సోదరభావముతో నన్ను తీర్చిదిద్దగలరని వారిని పునః పునః ప్రార్థించుచున్నాను.

"వేదంబులు, పౌరాణికవాదంబులు, వరకవిత్వవాణీవీణా-
నాదంబులు కృతసుజనాహ్లాదంబులు, తాళ్లపాకయన్నయపదముల్ ॥"

చి॥ తి॥ సంకీ -౧- ౪.

"శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞానసారంబులై
యతిలోకాగమవీథులై వివిధమంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైలవల్లభరతిక్రీడారహస్యంబులై
నుతులై తాళులపాక యన్నయవచోనూత్నక్రియల్ చెన్నగుఁ ॥"

చి. తి. సంకీ–౧– 12.

శ్రీ వేంకటాచలాధీశాఽధీనమానసయోగినే।
తాళ్ళపాకాన్వయాంభోధి శశినేఽన్నాయ మంగళమ్॥

చతుకీకృత గీర్వాణ ప్రాకృతాంధ్రవచోఽబ్ధయే।
పదసాహిత్యకమల భాస్కరాయాఽస్తు మంగళమ్॥

నమోఽస్త్వనంతకృష్ణాయ మమ పుణ్యఫలాఽఽత్మనే
వాణీస్తనద్వయాస్వాద ద్వైరాజ్యాఽఽరూఢ కీర్తయే॥

తిరుపతి,
17–8–76
శ్రీ కృష్ణజన్మాష్టమీ.



గౌరిపెద్ది॥ రామసుబ్బశర్మ
ఆంధ్రశాఖాఽధ్యక్షుడు.
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల.
తాళ్లపాకవాఙ్మయ పరిశోధకుడు.



శుభమస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ తాళ్ళపాక

# అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు



స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౩౪౬ అగు-నేటి క్రోధి సంవత్సరమందు తాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన పదారుయేండ్లకు తిరువేంగళనాథుఁడు ప్రత్యక్షమైతేను అదిమొదలు గాను శాలివాహనశక వరుషంబులు ౧౪౨౪ అగు నేటి దుందుభిసంవత్సర ఫాల్గుణ బహుళ ౧౨ నిరుధానకు [1]తిరువేంగళనాథునిమీఁదను అంకితముగాను తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగారసంకీర్తనలు.

శ్రీ వేంకటేశాయనమః *

1-వ రేకు. శ్రీరాగం

ఏ వూరికేవూరు యెక్కడికి నెక్కడ
నీవు మాకు నిఁకనేల నిజమైనాఁ జెప్పరా ॥ పల్లవి ॥

అద్దమరాతిరిదాఁకా నందునిందు నుండివచ్చి
వద్దువోరా నీకువింత వలసినొల్లములు
విద్దుర గంటికి లేక నీకునుండ వారమా [2]
వొద్దిక చాలని వారముండినా నుండితిమి ॥ ఏవూ ॥

1. ఈశబ్దము అపరిచితము. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 'నిరోధానకు? తిరోధానానకు?' అని సందేహముతో పాఠము సూచించిరి. 'సరిగా' అను నర్థమున ప్రయోగించినట్లున్నది. ఇది యింకను అన్వేషణీయము. 2. వి. రే. ౪౩. నీకు నుండనేలనీ.

* ఈ గుర్తులు గలవన్నియు, రేకులను చూచి, అర్థము ననుసరించియు నేను చేసిన మార్పులు.

పేఁకమైన పరితాప వేదసఁ బొరలలేక
కాఁక పుట్టి తిరిగేవు కన్నుఁగానలేక[1]
యేఁకట దీర నీకు నెందరు గలఁరని[2]
వోఁకల పులుసు కలువులఁ బుచ్చవలెనా[3] ॥ ఏవూ ॥

అందఁగాఁడ తిరువేంకటాద్రీశ పెక్కుఁడ్ల-
విందవై[4] నీవా (కొ?) కతైపై వెచ్చఁదన మున్నదా
మందెమేళమున నీతో మాటలాడితిమి గాక[5]
కందువ మన్నన చాలు కలకాల మెల్లను. ॥ ఏవూ ॥ 1

భైరవి

గందము పూసేవేలే కమ్మని మేన యీ-
గందము నీమేనితావికంటె నెక్కుడా ॥ పల్లవి ॥

అద్దము చూచేవేలే అప్పటప్పటికిని
అద్దము నీ మోముకంటె నపురూపమా
ఒద్దిక తామరవిరినొత్తేవు కన్నులఁ నీ-
గద్దరికన్నులకంటె కమలము ఘనమా ॥ గంద ॥

బంగారు వెట్టేవేలే పడఁతి నీ మెయినిండా
బంగారు నీతనుకాంతి ప్రతివచ్చీనా
ఉంగరాలేఁటికినే వొడికపువేళ్ళ[6]
వెంగలిమణులు నీ వేలిగోరఁ[7] బోలునా ॥ గంద ॥

సవర మేఁటికినే జడియు నీ నెరులకు
సవరము నీకొప్పుసరి వచ్చీనా
యివలఁ జవులు నీకునేలే వెంకటపతి—
సవరని కెమ్మోవిచవికంటేనా. ॥ గంద ॥ 2

---

1 గానసేరక. 2, గలరు ఈ. 3. బుచ్చనేలరా. 4. వి. రే. ౪౩. విందవు నీ. 5. తిమినీ. 6. తా.వెం. వేఁటికే యువిదవివేళ్ళకు. 7. వి. రే. ౧౦౩. గోరిఁ బోలునా.

దంటమాటలనె నన్నుఁ దాఁకనాడేవు వోరి
జుంటితేనె తీపులెల్లఁ జూరలాడేవా ॥ పల్లవి ॥

అత్తయింటికోడల నన్నమ్మమీఁద నేరా నీ—
తొత్తుఁ దిట్టినట్టె తిట్ట దొడఁకొంటివి
మెత్తనైతే దిగఁబడి మేరమీరి యింతలోనే
ఒత్తుక వచ్చేవు చక్కనుండ నేరవా ॥ దంట ॥

పంతపు మగఁడు గల పడఁతి నన్ను నేరా నీవు
కొంతైనా వెఱపులేక గోరనంటేవు
ఇంతలోనే వేలువెట్టి యిమ్ముగైకొని వంపు
దొంతుల వేరిచేవు బిడుకనియ్యవా ॥ దంట ॥

ఊరివారి యింతి నన్ను వుద్దండపుఁదుటారాలఁ
బేరుకుచ్చి సొలయుచుఁ బిసాళించేవు
గారవించి తిరువేంకటరాయ నీవు నన్ను
మేరా నాగుట్టంతయు బాయిట[1] వేసేవా ॥ దంట ॥ ౩

ఆహిరి

సంగతెఱగవు చీ జాణనందువు
మంగలాన జాజులు వేమారు వేఁచేవు ॥ పల్లవి ॥

అంగన వొకతె నీకు ఆకు మడ(డి*)చియ్యఁగా
బంగారుతూఁగు మంచముపై నీవుండి
వుంగరాల వేళ్ళతో నువిదమొలనూళ్ళ
చెంగటఁ జాచిన ఆచేత నన్నంటేవు ॥ సంగ ॥

1. వి. రే. ౩౫. గుట్టంతయు బయలు సేసేవా.

పడఁతి వొక్కతె నీకు పాదములొత్తఁగను
బడలి కప్పురశయ్యపై నీవుండి
కడుఁ దమకమున నెక్కడో మోవఁ జాఁచిన-
పడిగపుఁ బాదాలు నాపైఁ బారఁజాఁచేవు ॥ సంగ ॥

ఇచ్చల నొక్కతె గుబ్బలెదురు చూపఁగను[1]
పచ్చలు దాచిన మేడపై నీవుండి
వెచ్చని మేనితోఁ గూడి వేంకటేఁశుడ నీ-
వెచ్చపుఁ గాఁగిట నన్ను వేసాలఁ బెట్టేవు. ॥ సంగ ॥ 4

కాంబోది

రాకుంటే మానఁగాక[2] రంతులేఁటికే
వేఁకపు గుబ్బలాండ్ల విటుఁడాఁతఁడు ॥ పల్లవి ॥

అంపిన కప్పురమొల్లనంటేఁ హానముఁ గాక
వంపుమోముతోడ నీకు వాదనేఁటికే
చెంపల అప్పలు నిండఁ జెరిగిన కప్పురపు-
గంపకొప్పుల సతుల ఘనుఁడాతడు ॥ రాకుం ॥

ఒద్దికగాకక్కడనే వుంటేఁ దానుండుఁ గాక
ముద్దుమోము వంచి నీకు మొక్కనేఁటికే
చద్దికి వేఁడికి మంచిచక్కనిసతుల మోవి
పొద్దువొద్దుకారగించే భోగి[3] యాతఁడు ॥ రాకుం ॥

అబ్బురపు వేంకటేశుఁడైతేఁ దానవుఁ గాక
గబ్బి చూపులెల్లా నీకై(పైఁ*) గప్పనేఁటికే
జొబ్బిలేటి జవ్వాదిసోనల పన్నీట నన్ను
గుబ్బలంటి సరసానఁ గూడెనాతఁడు.[4] ॥ రాకుం ॥ 5

తగిలిన మునులే యాతనిఁ గందురంటా[1]
మగువ యెవ్వరితోడ మాటాడదిపుడు ॥ పల్లవి ॥

అతులనిరాహారులతనికిఁ బ్రియులంటా
అతివ నిన్నటినుండి యారగించదు
తతి నడవులనుండే తపసులే యతనికి
హితులంటా వనములో నెదయదీతరుణి ॥ తగిలి ॥

తలకొన్న యతనిపై తలఁపే పరమంటా
చెలియ చెక్కిటనున్న చెయి దియ్యదు
వలనైన యతఁడు దేవతలకొడయఁడంటా
కలికి రేయిఁబగలు కనుమొయ్యదిపుడు ॥ తగిలి ॥

అదరి జలధిలోన నతఁడుండునంటా
వదియుఁజెమట దుడువదు మేనను
కడు మంచియతఁడు వేంకటగిరివిభుఁడంటా
పడఁతి యాతనినె గుబ్బలనొత్తీనిపుడు. ॥ తగిలి ॥ 6

## ముఖారి

ఏఁటికి విచ్చేసితివో యెట్టుదెలుసు మాతో
మాటలాడఁగా నీకు[2] మాటవచ్చీఁ జుమ్మీ ॥ పల్లవి ॥

అప్పన[3] గొంటివో లేదా ఆకెచేత నేఁడైనా
ఇప్పుడే మాయింటిదాఁకా నేఁగేనంటా
యిప్పటి యీతమకాన యింతలోని పనికిఁగా
చెప్పక వచ్చిననాకె చేరనీదు సుమ్మీ ॥ ఏఁటి ॥

---

1. ని. రే. ౧౧౩. 'అంట' అని హ్రస్వముగానే వదమంతటను గలదు.
2. పె. రే. ౧. మాఁట. 3. అప్పణ.

అనుచరించితో లేదో ఆకెనే ముందరనైనా
వెనక నాతోడ నవ్వేవు గాని
ఘనుఁడవూఁగకే నన్నుఁ గదిసేవు కడుఁబై—
కొనఁగ నాకె విన్న కోపగించుఁ[1] జుమ్మీ ॥ఏఁటి॥

ఆరగించితో లేదో ఆకెపొత్తుననే యింత—
గారవము లేక మోము కళదేరదు
చేరి కూడితివి నన్ను శ్రీ వేంకటేశుఁడ యింత—
యారసాన నాకె విన్న యేమనునో సుమ్మీ. ॥ఏఁటి॥ 7

ఆహిరి[2]

కోపముఁ బిద్దరిలో గోరగించీఁ జూడరే
పైపైనె జవరాలు పంపెడి నింతులను ॥పల్లవి॥

అమ్మ విలువఁగనంపె నాతని రమ్మనరే
దిమ్మరై పీదులవెంటఁ దిరిగీనని
కమ్మరఁ గమ్మరనేల కలహమిద్దరిలో
దుమ్ములుగాఁ గస్తూరి ధూళి లేచె మేనులు (లు?) ॥కోప॥

దేవులమ్మ విలిచీని దేవుని రమ్మనరే
ఆవలనెవ్వతెకు లోనాయెనో యని
తావుల బుగులడిచి త (చీఁద?) నువెల్లానిదివో
లావాయ జగడాలు లరినకుఁ దనకు ॥కోప॥

లకిమమ్మకేమైనా లంచములిమ్మనరో
శుకవాణి తలుపు మూసుక తియ్యదు
వెకలియై సతిఁగూడె వేంకటేశ్వరుఁడు
ఒకరొకరికి లోలో నొద్దికలు ఘనము. ॥కోప॥ 8

1 వి. రే. ౮౧. కోపగించీఁ. 2. వి. రే. ౩౩. మళారి.

ముఖారి

ఆతఁడే యెఱఁగఁడా ఆకెలాగు
రాతి గుండెతోఁడ[1] దా రాకుంటే మానినీ ॥ పల్లవి ॥

అద్దో నేమెందాఁకానైనాఁ గాచుకుండలేము
వొద్దనే యెంతవడైనా నోసి రావే
అద్దికపువారము నేమమ్మ గడుఁ గోపగించీ
వొద్దువోయు రాకుంటేఁ బోనీవే తాను ॥ ఆత ॥

అంతేవో మదిరాక్షి యాడ మాకెదురు చూచీ
యెంతైనాఁ గద్దుపని యీడనేలోసి
వొంత నూడిగము నేనే పొద్దాయ దేవులకు
కాంతుఁడు మీఁదటియెత్తు గననీవే తాను ॥ ఆత ॥

మేలే వేంకటపతి మెల్లనె విచ్చేసినాఁడు
వేళమె అక్క—కు విన్నవింతమోసి
ఆలకించి వుండుదము ఆందరము వాకిటను
లోలోఁ దానాకెఁ గూడి లోఁజుఁడాయఁ దాను. * ॥ ఆత ॥ 9

ఆహిరి

ఇంత మమ్మిట్లా నెలయించకురా నీ—
సంతములన్నియుఁ బారఁ బట్టింతునోరి ॥ పల్లవి ॥

అతిరాజసపు మాటలాడకురా యే—
కతమైన నాచేతఁ గడు నొత్తువోరి[2]
ఇతరులవలె నన్ను నెంచకురా నీ[3]—
మతి చొచ్చి నీమేను మఱపింతునోరి ॥ ఇంత ॥

1. పె. రే. ౧. గుండెవాఁడై యుండి. 2. ని. రే. ౧౦–నొంతురోరి. 3. యీమతి.
* 'తాను' శబ్ద పునరుక్తి. ఇట్టి వచ్చులచ్చట గలవు.

చెఁగుచు గుంపెనలు సేయకురా నీ-
సిలుగు మాటల నిన్నుఁ జిక్కింతునోరి
చలివలపులు మాపైఁ జల్లకురా యీ-
కులుకు గోళ్ళ నిన్ను గుంపింతు-నోరి ॥ ఇంత ॥

జంకెనచూపులఁ బగ చాటకురా నే-
నింక నిన్నుఁ బోనియ్య నెంతైన నోరి
లంకెల నీ పొందులు దలఁచకురా తిరు-
వెంకటేశ నా నేరుపు [2] వెచ్చింతునోరి. ॥ ఇంత ॥ 10

సామంతం

ఇచ్చకాలు నాకు నీకు నింక నేలరా నీ-
యచ్చపుఁ గోపక [3] నాతో నానతీరా వోరి ॥ పల్లవి ॥

అమ్మితి నామేను నీకు నప్పుడె వోరి చూపుఁ-
జిమ్ముల నేఁచకేమైనాఁ జిత్తగించరా
అమ్మకచెల్ల నే నీకు నడ్డమా వోరి యింపు
గుమ్మరింపుచు నాగుట్టు కొల్లగొంటివోరి. ॥ ఇచ్చ ॥

జట్టిగొంటివెదె నన్నుఁ జాలదా వోరి యీ-
చిట్టకట్ల నీవేఁచక [4] చిత్తగించరా
ఎట్టైనా నే నీకింత యెమరా వోరి నీ-
పట్టిన చలమే చెల్లె బాపురా వోరి ॥ ఇచ్చ ॥

---

1 దీనిలో నీచరణమిట్లున్నది: 'చెంరేగి నీ చేఁత లెల్లఁ జెప్పకురా యీ, పొంయలు కల నిన్నుఁ బొక్కింతునోరి; చలివలపులు మాపైఁ జల్లకురా, చిలుకు మాటఁల నిన్నుఁ జిక్కింతునోరి'. 2. నా నేర్పు వెంచింతు. 3. ని. రే. ౪౪. గోపము. 4. నే వేఁచక.

వేసాల వేంకటగిరివిభుఁడా నేఁడోరి సీ-
నేసిన మన్ననలిట్టె చిత్తగించరా
వాసన కస్తూరిమేని వన్నెకాఁడ సీ-
యాసల మేకులే దక్కెనద్దిరా వోరి. ॥ఇచ్చు॥ 11

3-వ రేకు. శ్రీరాగం

మగువ పూర్వులనైన మనుఁగా చలిగాలి
నిగుడుఁగా జగమెల్ల నిండఁ దనరూపు ॥పల్లవి॥

అతివవదనము వాడ నలరి చందురుఁడైన
బ్రతుకుఁగా వొకకొంత బయలుమెరసి
సతి యెలుఁగు రాయ విరసపుఁ బికావళియైన
తతిఁ జెలఁగుఁగా నేఁడు తమకెదురు లేక ॥మగు॥

తెలివ వేనలి చెదర తేఁటి మొత్తములైన
మెఱయుఁగా వొకకొంత మేలుగలిగి
ఒఱిగి యలసతతోడ నువిద కనుమోడ్పుగా[1]
నెఱిఁ గలువలలరుఁగా నేఁటిమాపైన ॥మగు॥

తరుణి దేహము నాఁటి దర్పకుని శరమైన
పరిమళము నిండుగా బహువిధమున
[2]కరిగమననిపుడు వేంకటవిభుఁడు కౌఁగిటను
కరుణించ లతలైనఁ గాంచుఁగా తెలివి. ॥మగు॥ 12

సామంతం

ఎట్టు వోరిచెనో కాని యింత దడవు- అప్పు-
డట్టు నిట్టుఁ దల్లడించె నతఁడంతలోననే ॥పల్లవి॥

---

1. పె. రే. ౧. మోడ్పుఁగా. 2. ఇది ని. రే. ౧౦౧ లోని పాఠము, అన్వితము. సా. రే. లోని పాఠము 'గరిమ నన్నిపుడు' అనన్వితము.

అంటఁగాక వున్నదానవని యెఱుఁగక యాతఁ-
డింటికిట్టె రాఁగా నీవు నెదురువోయి
వొంటకున్నరీతి దవ్వులనున్న నినుఁ జూచి
అంటఁజేరి చిన్నఁబోయె నతఁడంతలోననే ॥ ఎట్టు ॥

వేడుక నాతఁడు రాఁగా వెనకవెనకకుఁ[1] బోయి
తోడనే సిగ్గును నవ్వుఁ దొలఁకఁగాను
వీడి వీడని కొప్పు విసరుచుఁ దలయూఁచ-
నాడనే మూర్ఛవోయె[2] నతఁడంతలోననే ॥ ఎట్టు ॥

చయ్యనఁ బన్నీటి మజ్జనమాడి నీవు నేఁడు
ఉయ్యాలమంచముమీఁద నుండఁగాను
నెయ్యపు వేంకటపతి నినుఁగూడి పరవశ-
మయ్యీనబ్బురముగ నతఁడంతలోననే ॥ ఎట్టు ॥ 13

రామక్రియ

రాగఁదే చూతఁడిదె రసికుఁడగు కెలవాడి—
కౌఁగిటి రమణితోడి కనకగిరి వాని ॥ పల్లవి ॥

అదిగదె వసంతంబులాడీఁ గూడి
కదలుఁగనుఁగవల చక్కని సతులతో
వెదకి పై కుంకుమలు వేసీ రాసి
వుదుటుచనుదోయిపై నొదిగి వొదిగి ॥ రాఁగ ॥

కడుఁ బేర్చి నేతికడవల గుబ్బెతలఁ జేరి
అడుగడుగునకు నాటలాడి
నడిమి సన్నపుసిరుల నగవు రెప్పల గరుల
తొడికి చెనకీనదివో దొరదైవము ॥ రాఁగ ॥

1. పై. రే. ౧. వెనవెనకకు. 2. పై. రే. ౨౮. నాడఁ దెలిపైనొంగె నాత
3. పై. రే. ౫౭. మేనబో॥.

దప్పి దేరంగ నైఁదపుఁగుకుములును వడలుఁ
బప్పులునుఁ బన్నీటి పానకములు
అప్పుఁడగు కెలవాడి అదె కనకరాయఁడై
కప్పురము చల్లి (ల్లీ*)చక్కని సతులపైని. ॥రాఁగ॥[1] 14

## భైరవి

సి(చి*)న్న వాఁడవని నమ్మ నెల్లదు విన్న
సిన్నైన యాటదెల్ల సిక్కుసీరై పోయను ॥పల్లవి॥

అపుర బాలకిసునరాయఁడ నీవు సంటిపాలు
సపుఁటంటా నెత్తురెల్ల సప్పరించఁగా
కవకవ నవ్వి నవ్వి కన్నులు దేలగిలఁగ
నవరన్ని (ని*)యాటదెల్ల నప్పుసారై పోయను ॥సిన్న॥

రారా గోపాలకిసునరాయ నీవదె[2] గొల్ల –
వారి మగువల సూవు (పు*)వల్లె వేయఁగా
సూరఁబోయె రేపల్లె సొక్కని యా గుబ్బెతల –
నేరలంతల కన్నుల[3] సిన్ని సిన్ని సిగ్గులు ॥సిన్న॥

కిన్నెర వెంకటగిరి కిసునరాయఁడ నీవు
వన్నెలుగ వీది వీది వాయించఁగా
మిన్నుదాఁకి లోకానకు మేఁటియైన లకిమమ్మ[4]
విన్న నేరి సరుగన నిలుసుండే సొక్కెను ॥సిన్న॥ 15

---

1. ఈ రేకులో ఈ సంకీర్తనను పాఠమున కొన్ని ముఖ్య భేదములున్నవి.

'రాఁగదవె సూతమ్మ రసికుఁడతఁడు, ఆ కౌఁగిటి .. వేసీ లాని .. వుదుటఁ గుచములతోడ నొడిగి నొదిగి...వడినార్చి నేతికడువల గుబ్బెతలు సేరి...నాటలాడి యాడి... నడుమునన్న...నడుపురెప్పల...తొడికి చెనకేఁదివాదార...కుదుములునువడపప్పులు... అప్ప (రెండక్షరములు చెక్కుకచోటు వదలినారు) కెలవాడి నదెకనక...కప్పురము గురిసె వేంకటరాయఁడు' వేంకటేశ్వరముద్ర అందలి కడపటిచరణమున లేమి, ఇందుండుట, విశేషము.

2. సా. రే. నీవాడె 3. ని. రే. శా. లంతలు కన్నులు. 4. ని. రే. శా. లగిమమ్మ (సా.రే;ని. రే.లలో అవ్యవస్థితముగా నున్న రూపములను కలిపి సంప్రతించి వ్యావహారికభాషకు సమీపముగా ఈ పదము తీర్పఁబడినది.)

### కాంబోది[1]

పొద్దు వొద్దుకును వలపుల నేఁచేవు వద్దు[2]
బుద్దిగాదు నీకు నేఁప[3] భువనమోహినిని ॥ పల్లవి ॥

అప్పుడు మా విన్నపము లాలకించఁ బొద్దులేక
యిప్పుడు విచ్చేసినాఁడవిఁక[4] నైనాను
చెప్పరానివిన్నియును చిత్తగించి చూతు గాని[5]
చప్పర మంచములోని చక్కని కోమలిని ॥ పొద్దు ॥

అలసి మాతోడ[6] మాటలానతియ్య వేళగాక
యెలయించ[7] వచ్చినాఁడ వింతలోననే
సొలపు మాటలు గావు చూడు నీవే మేడమీఁద
చెలులపై నొరగిన[8] జిగి గుబ్బలాఁడిని ॥ పొద్దు ॥

వేఁగెడి రమణిఁ జూచి వేగినంతకు రావైతి
మాఁగెఁగా యింతట నీ మనసైనాను[9]
వేఁగు వచ్చెనా నీకు వేంకటేశ కృపఁజూడు[10]
కాఁగిట నవధరించు కన్నుల కలికిని. ॥ పొద్దు ॥ 16

### ముఖారి

ఇదిగాక సౌభాగ్య మిదిగాక తపము మఱి
యిదిగాక వైభవంబిఁక నొకటి కలదా పల్లవి ॥

అతివ జన్మము సఫలమై పరమయోగివలె—
వితర మోహాపేక్షలిన్నియును విడిచె
సతికోరికలు మహాశాంతమై యిదె చూడ
సతత విజ్ఞాన వాసనవోలె నుండె ॥ ఇది ॥

---

1. వి. రే. ఆహ సామంతం 2. వి. రే. వేఁచేవు యింత. 3. వి. రే. యేఁచ నీకు 4. వి. రే. విచ్చేసితి నీ వీఁక. 5. వి. రే. చెప్పనేల యింతి నీవె చిత్తగించుగాన. 6. వి. రే. పుత్తరము మాకాన. 7. పె. రే. యెలయించి; వి రే. యెలమి విచ్చేసితి నీ విపుడైన. 8. వి. రే. నొరగుండే జిగి. 9. వి. రే. యింతటను నీ మనసు. 10, వి. రే కయిఁకనేల.

తరుణి హృదయము కృతార్థతఁ బొంది విభుమీఁది
పరవశానంద సంపదకు నిరవాయ
సరసిజానన మనోజయమంది యింతలో
సరిలేక మనసు విశ్చల భావమాయ ॥ఇది॥

శ్రీ వేంకటేశ్వరునిఁ జింతించి పరతత్వ –
భావంబు నిజముగాఁ బట్టెఁ జెలియాత్మ
దేవోత్తముని కృపాధీనురాలై యిపుడు
లావణ్యవతికి నుల్లంబు దిరమాయ. ॥ఇది॥ 17

4–వ రేకు. వసంతం[1]

[2] శోభనమే శోభనమే
వైభవముల పావనమూర్తికి ॥పల్లవి॥

అరుదుగ మును నరకాసురుఁడు
సిరులతోఁ జెరలదెచ్చిన సతుల
పరువపు వయసులఁ[3] (లప?) బదారువేలను
సొరిదిఁ బెండ్లాడిన సుముఖునికి ॥శోభ॥

చెందిన వేడుక శిశుపాలుఁడు
అంది పెండ్లాడఁగ నవగ[4]ళించి
విందువలెనె తా విచ్చేసి రుకుమిణి
సందడిఁ బెండ్లాడిన సరసునికి ॥శోభ॥

దేవదానవులు ధీరతను
దావతిపడి వార్ధి దరువఁగను
శ్రీ వనితామణిఁ జెలఁగి పెండ్లాడిన
శ్రీ వేంకటగిరి[5] శ్రీ నిధికి. ॥శోభ॥ 18

---

1. తా. వెం. సౌరాష్ట్రం. 2. శోభానే. 3. తా. వెం. పయసున. 4. నవఘళించి. 5. వెంకటపతికి శ్రీ

పాడి

దేవరచిత్తం దివ్యనిధి
దేవనిర్మిత విధీ యవధానం ॥ పల్లవి ॥

అతివలు నాట్యంబాడెదమని వు-
న్నతి మెఱయుచు నున్నారిదివో
ప్రతినలతో రంభయు మేనకయును
ధృతి కరుణాంబుధి ధీయవధానం ॥ దేవర ॥

గానవిద్య తమకంబున వినుమని
కానుకలివె సురకాంతలవి
కానుపించుకో గంధర్వపతులను
ధీనుత పంపు సుధీ యవధానం ॥ దేవర ॥

పరియంకంబునఁ బవళించెదవో
సిరుల విభవములఁ జెలఁగెదవో
తిరువేంకటగిరి దేవ యన్నిటా
తిరమందితి విటు ధీయవధానం. ॥ దేవర ॥ 19

శంకరాభరణం [1]

ఇంతే విన్నపమింతేలా నీ-
పంతము చేకొంటి పాలించు ॥ పల్లవి ॥

అలయు సొలయునతివ లోలోనే
చెలిపై నొరగు చెక్కు (గుఁజెక్కు?) నొక్కు
పులకించు నించు వొ (చుఁబొ?) లఁతి చెమట
చిలికించు గోరఁజిత్తగించు ॥ ఇంతే ॥

---

1. వి. రే. ౹ా౭. కన్నడగౌళ.

చెలుల మొరఁగు చిం (గుఁజిం?) తచేఁ గరఁగు
పలుకఁ దలఁచు బడలును
పిలుచు నిన్ను నీపేరుకొనుచును[1]
తొలఁకు కన్నీరు దుడుచును ॥ఇంతే॥

చనుఁగవ చూచు సారె నీనేఁతలు
తనలోనే మెచ్చి[2] తనరును
అనయము వేంకటాధీశ యీ యింతిఁ[3]
జెనకి కౌఁగిటఁ జేకొంటివి. ॥ఇంతే॥ 20

ముఖారి

కలలోనె యిరువురము నలిగి వేగ
కలయనుచుఁ దెలిసి నినుఁ గౌఁగిలించితిరా ॥పల్లవి॥

అలుగుదురెఁ బతులనఁగా వినఁగ—
నలవాటు లేక నే నలుగుచుందుదురా
అలిగితట వురక నీవంత నాతోను మరి-
నలుగులౌనట పూవులఁతలోపలనే ॥కల॥

చందురుఁడె సూర్యుఁడై జరగ మిగుల
కెందమ్ములవుర నాకెంగేలుదోయి
గందమే తోఁచెనట కస్తూరియనఁగ నా—
చందమపుడొకలాగు చందమవునటరా ॥కల॥

విటవరుఁడ కోనేటివిభుఁడ నీ-
వెటు దొలంగిన దేహమెట్టు నిలుపుదురా
యిటువలెనె మనలోన నెలమి మరచి
తటుకననుఁ గలయనుచు తలఁకి తెలిసితిరా. ॥కల॥ 21

1. నిన్ననే పేరుకొనుచు. 2. మెచ్చుఁదన, 3 అనయమ్ము వెంకటాధీశ యింతి.

## నాదరామక్రియ

సకలం హేసఖి జానామి తత్
ప్రకటవిలాసం పరమం దధసే[1] * ॥ పల్లవి ॥

అలికమృగమదమయ మషీకలనో-
జ్జ్వలతాం హేసఖి జానామి
లలితం తవ పల్లవితమనసి ని-
శ్చలతర[2] మేఘశ్యామం దధసే ॥ సకలం ॥

చారుకపోల స్థల కరాంచిత వి-
చారం హేసఖి జానామి
నారాయణ మహినాయకశయనం
శ్రీరమణం తవ చిత్తే దధసే ॥ సకలం ॥

ఘనకుచశైలాగ్రస్థిత విధుమణి-
జననం హేసఖి జానామి
కనదురసా[3] వేంకటగిరి పతే-
ర్వినుత భోగసుఖ విభవం దధసే. ॥ సకలం ॥ 22

## భైరవి

వనితభాగ్యంబు దేవరచిత్తము - మాకుఁ
బనిగాదు యింక నీ పాదంబులాన ॥ పల్లవి ॥

అడబాలసతి బోనమారగించు మటంచు
బడి బడివి కడు విన్నపము సేయఁగా
ఉడుగని పరాకుతో నుండి[4] నెచ్చెలి మీఁద
బడలి వొరగినది నీ పాదంబులాన ॥ వనిత ॥

---

1. 'ధత్సే' యనియుండఁబోలును. ని. రే. ౧౦౬. వదసి, దధంసి, దదంసి, వాసి, అని క్రమముగా ఈ పదరూపములున్నవి. దధాసి అను సాధురూపమును ఇట్లు అవ్యుత్పత్తిచే చెక్కినారు కాఁబోలు. 2. నిశ్చలం మేఘ. 3. ఘనతయా వేంకట. 4. ఇది పె. రే. లోని పాఠము. సా. రే. లో 'పరాకునవుండి' అనికలదు. అది ఛందస్సుకు సరిపోదు.
* 'దధ' ధారణే-అను దావిరూపము కావచ్చు.

అడపంబునతి వీడెమువర్ధింపుమటంచు
అడరి కప్పురపుఁ బలుకందీయఁగా
కడకంటఁ జూడదిదె కాఁతాళమో మరపో
పడఁతి యిప్పుడు నీ పాదంబులాన ॥ పవిత ॥

ఆలవట్టము విసరు అతివలను వలదనదు
పాలిండ్లపై కొంగు పచరించదు
యేలాగవునో[1] వేంకటేశ నీవిపుడిట్టె
పాలించకున్న నీ పాదంబులాన. ॥ పవిత ॥ 23

శంకరాభరణం

అలరులు గురియఁగ నాడెనదే
అలకలఁ గులుకుల నలమేల్ మంగ ॥ పల్లవి ॥

అరవిరి సొబగుల నతివలు మెచ్చఁగ
అరతెర మరఁగున నాడెనదే
వరుస పూర్వదువాళపు తిరుపుల
హరిఁగరఁగింపుచు నలమేల్ మంగ ॥ అలరు ॥

మట్టపు మలపుల మట్టెల కెలపుల
తట్టెడి నడపుల దాఁటెనదే
పెట్టిన వజ్రపు పెండెపు తళుకులు
అట్టిట్టు చిమ్ముచు నలమేల్ మంగ ॥ అలరు ॥

చిందుల పాటల శిరి పొలయాటల
అందెల మోఁతల నాడెనదే
కందువ తిరువేంకటపతి మెచ్చఁగ
అందపు తిరుపుల నలమేల్ మంగ. ॥ అలరు ॥ 24

1. 'లాగానో' అనియే రేకుల పాఠము. ఇందలి ఛందగతికి అది అడ్డువచ్చును.

దేశి

వలపారగించవమ్మ వనిత నీ–
యలుక చిత్తమునకాఁకలి నేసినది ॥ పల్లవి ॥

అడియాసలనె పక్వమైన శ్లోయగపు–
వెడయలుకల మంచి వేఁడి వేఁడి రుచులు
ఎడసేసి తాలిమి నెడయించి పైపైనె
పొడమిన తమకంపు బోనము పెట్టినది ॥ వల ॥

ఆమంచి మధురంపు అధరామృతముల
వేమారుఁ దావులు చల్లు వెన్నెలబయటను
కోమలపుఁ దరితీపు కోరికఁ గుమ్మరించి
భామకు పూఁబానుపు పళ్ళెము పెట్టినది ॥ వల ॥

కన్నుల కాంతులనెడి కళవళములు దీరె
సన్నపు నవ్వులనెడి చనవగ్గలించెను
అన్నువపు మరపు నీ కంతవింతఁ గలిగె నేఁ–
డిన్నియును దిరువేంకటేశుని మన్ననలు. ॥ వల ॥ 25

5-వ రేకు. శ్రీరాగం

అప్పటి యొంద చెమటలట్టే వుండీనా
నెప్పు దప్ప బొంకేవు నే నెఱుంగనా ॥ పల్లవి ॥

ఆవులఁ గాచిన నాటి యడవికంపల జీర–
లావల నేఁడు [1] మాయక అట్టే వుండీనా
యేవంక నెవ్వతో నిన్ను నెనసి చేసిన చేఁత
నీ వెంత మొఱఁగిన నే నెఱుంగనా ॥ అప్పటి ॥

వెన్నలు ముచ్చిలునాఁడు వేఁడి పాలారగించిన-
అన్నువ నీమోవిపొక్కు లట్టే వుండీనా
వన్నెకాఁడ యెవ్వతెకో వలలఁ జిక్కిన నీ-
నిన్న మొన్నటి[1] సుద్దులు నే నెఱుంగనా ॥ అప్పటి ॥

రంగుగ మధురలోని రమణి మెత్తిన నాటి-
అంగడి గందపుఁ బూఁతలట్టే వుండీనా
చెంగట మొఱఁగి కలసితివి వేంకటరాయ[2]
నింగి మోచిన చేఁతలు నే నెఱుంగనా. ॥ అప్పటి ॥ 26

శంకరాభరణం

పోసి పోసిలే నీ పొందులేఁటికి నీ-
యాననము చెమరించె నయ్యో నీ యలుకా ॥ పల్లవి ॥

ఆన వెట్టఁగా విచ్చేనేవమ్మ పాదాల మీఁదనే
కానీ కానీలే యెక్కఁడికో నీవు
మానవతితో బింకాలు మానవా యింకాను నీ-
మేనెల్లా బడలెను యేమిటికి నీ యలుక ॥ పోసి ॥

బంగారు దుప్పటికొంగు పట్టఁగానే పెనఁగేవు
అంగడి వీధిలో నవ్వులే నివు
రంగైన సతికోపమెరఁగవా యింకాను నీ-
తొంగలి రెప్పల నీటఁ దోఁచీలే నీ యలుక ॥ పోసి ॥

తెరవ విన్నరగంటఁ దిట్టఁగానే బిగినేవు
మఱపుఁ దెలివితో మఱియు నీవు
కరఁగి కూడితివి వేంకటగిరి మీఁద నున్న-
నెరజాణ విట్టలుఁడ నేఁడుగా నీ యలుక. ॥ పోసి ॥ 27

1. విన్నటిమొన్నటి. 2 వెంకటేశ నీ; ని. రే. లా. వేంకటేశుఁడ నీ.

ముఖారి

ఎక్కడ నున్నదో చిత్తమేమి దలఁచెనో యింతి
చెక్కులెల్లాఁ జెమరించీఁ జెప్పరమ్మా చెలులు ॥ పల్లవి ॥

ఆతని సుద్దులు చెప్పే అతివలే చుట్టాలు
ఆతనిని వద్దనిన వారందరుఁ బగ
రాతిరెల్లా నిద్దురెరఁగదు పాదములొత్తి
చేతులెల్లఁ బొక్కేనేమి సేతమమ్మా చెలులు ॥ ఎక్కడ ॥

నవ్వులు చెక్కులకుఁ గన్నుపుగందిదొంగలాయ
నొవ్వులాయఁ జూపులు కన్నుల మీఁదికి
దవ్వులాయఁ బయ్యెద గందపు గుబ్బల మీఁదికి
యెవ్వరి నొల్లదు యిఁక నేఁటికమ్మా చెలులు ॥ ఎక్కడ ॥

చిత్తమెల్లా దక్కఁగొనె సిగ్గులు ముంగిట వేసె
వత్తివలె దేహమెల్లా వాడఁబారెను
కత్తిఁ గోసినట్లు వేంకటపతి ఘాఁతలకు
జొత్తుపాపవలె నాయఁ జూడరమ్మా చెలులు. ॥ ఎక్కడ ॥ 28

శ్రీరాగం

చెల్లునంటా వచ్చి వచ్చి చెట్టవట్టేవు
తొల్లియు నెందరిసట్టే దొమ్ములఁ బెట్టితివో ॥ పల్లవి ॥

ఆఁపరాని తమకాన నాసచేసేఁ గాక యింత—
మాఁపు దాఁకా నీ తోడి మాటలేలరా
దాఁపరాని మదనముద్రలు మేననవె నీకు—
నేఁపుచు భ్రమలఁ బెట్టి యెవ్వతె సేసినవో ॥ చెల్లు ॥

ఉండలేక నీ వద్దనే వుసురంటిఁ గాక యింత—
బందు బందు నేసిన యీప్రాణమేలరా
పుంతగాఁ(?)ఁ జిత్తమెల్లాఁ బొక్కఁజేసితివి నా-
యందనందే యెవ్వతెకు నమ్మదు వోయితివో ॥ చెల్లు ॥

తనివోక నేవింత [1] దగ్గరనిచ్చితిఁ గాక
చనవున నిన్నుఁ జేయి చాఁచనిత్తునా
ఘనుఁడ వేంకటరాయ కమ్మని యీ విరులు
ముసువనెవ్వతో (తె?) నీపై ముడిచి వేసినవో. ॥ చెల్లు ॥ 29

రామక్రియ

మీలో మీలో మేలే పెంచిన—
తాలిమి కూటమి దలఁచినను [2] ॥ పల్లవి ॥

అరడిఁ బెట్టిన అలుకలు ముట్టిన—
కూరిమి మచ్చికఁ గూరిచిన
బీరాన మీలో ప్రేమమే పెంచిన—
నేరుపు మీలో నించినను ॥ మీలో ॥

చనవులిచ్చినఁ జదురులెచ్చిన—
కొనచూపులు [3] లోఁగొచ్చినను
అనుగు మోహములచ్చినఁ దెచ్చిన—
వినికి మనికి వెచ్చినను ॥ మీలో ॥

ప్రియములింపులు బిరుదుకెక్కిన—
నయము మీలో నాఁటినను
జయమై వేంకటాచల రమణుఁడ
ప్రియురాలు మీలో బెరసెను. ॥ మీలో ॥ 30

1. వి.రే. ౪౦. నిన్నింత. 2. వి.రే. ౨౩. దంచినను. 3. చూపులలో.

సామంతం[1]

పొదలిన పీదెపుఁ బుక్కిళ్ళో. తమ-
చొదుకుల చెమటల చొక్కిళ్ళో ॥పల్లవి॥

అముకొనిన యధరామృతవేళల
మోముల మోముల మొ[3]క్కిళ్ళో
కామినుల[2] మకరికా పత్రమ్ముల
చీమక(మల?)దొంతర చెక్కిళ్ళో ॥పొదలి॥

కయ్యపుఁ గౌఁగిటఁ గలికి రచనలను
నెయ్యపుఁ బులకల నిక్కిళ్ళో
ముయ్యని మోహపు ముచ్చట మురిపెపు-
తొయ్యలిపాదపుఁ దొక్కిళ్ళో ॥పొదలి॥

మొలకలేనగవు మోముం గోళ్ళ
నలిమేటి వదనపు నుక్కిళ్ళో
అలమేల్ మంగకు నా వేంకటపతి
తలఁపులొనంగిన దక్కిళ్ళో. ॥పొదలి॥ 31

6-వ రేకు. ఆహిరి

ఆఁపరాని వలపాయ నమ్మలాలా - యింతి
యేఁపులకు లోనైతిమిఁక నేమిసేతమే[4] ॥పల్లవి॥

ఆరగించుమనఁ గదరమ్మలాలా - అయ్యో
నీరు వుక్కలించదిదె నిన్నటనుండి
ఆరినది బోనమెలా నమ్మలాలా - అయ్యో
శ్రీరమణుఁడింతటి విచ్చేయఁడేమిసేతమే ॥ఆఁప॥

---

1. వి.రే. ఎతి. దేసాళం. 2. కామినులు. 3. వి.రే. ఎతి. నొక్కిళ్ళో.
4. వి.రే. ఎతి నైతిమిఁక నేమిసేతునే (కడువాత నన్నిచోట్లను 'సేతునే' అనియే) తం.
ప్ర, ఎటలా-వ ప్ర, యేఁపులకు లోనాయ.

అద్దమరాతిరి వోయ నమ్మలాలా - అయ్యో[1]
నిద్దుర గంటఁబెట్టడు నిన్నటనుండి
అద్దపుఁ జెక్కులు వాడె నమ్మలాలా - అయ్యో[1]
యిద్దరికోపము దీరదఁట నేమిసేతమే ॥ అఁప ॥

అలయికే ఘనమాయ నమ్మలాలా - దీని
నిలుప వశముగాదు నిన్నటనుండి
అలమి వేంకటవిభుఁ[2] డమ్మలాలా - దీని-
నెలయించి కూడకున్న[3] నిఁకనేమి సేతమే. ॥ అఁప ॥ 32

సామంతం

ఎక్కడికినెక్కడ యేడకునేడ నే-
నొక్కతెనాతనికటరో సతులు ॥ పల్లవి ॥

అయఁబోయ నాఁడె నాకు నాతనికి నేమివోదు
రాయిడి యీచేఁతలకు రాయఁడితఁడు[4]
పాయమెల్లా జట్టిగొనె[5] పచ్చిగా నన్నింత సేసె-
నోయమ్మ తడవకురో యీరోఁతలు ॥ ఎక్కడి ॥

చెప్పకు చెప్పకు నాకు సిగ్గయ్యీనిఁక నేల
నొప్పి సేసె నాతఁడింత[6] నొచ్చితి నేను
కప్పినఁ బోవు సేఁతలు కాలినపుండ్లలోన-
నుప్పులు చల్లక తలరో సతులు ॥ ఎక్కడి ॥

చాలుఁ జాలు నేఁటి నాఁడే చవిగొన్న కూరలకు
మేలుఁ గీడుఁ గొనియాడ మీఁద మీఁదను
జాలిఁబెట్టి వేంకటేశ్వరుఁడు నన్నిదె రతి -
నోలలాడించెను చూడరో పొందులు. ॥ ఎక్కడి ॥ 33

---

1. తం, ప్ర, లాలా - నేఁడు. 2. తం, ప్ర, వేంకటపతి. 3. తం, ప్ర, కూడకున్నాఁడిక. 4. వి.రే, ఱు, రాయఁడాతఁడు. 5. గొని. 6. డింతె.

వరాళి

తలఁచి వేరొకటాడఁ దడఁబడీని
మలసిన నీ కేల నోర మాట వెళ్ళీనే. ॥ పల్లవి ॥

ఇంచుకంత నెరసున్నా నేఁచిన రెప్పలవెంట
నించి నించి కన్నులలో నీళ్ళుగారీని
యెంచరాని నీకన్నులెదుట నాతఁడుండఁగాను
యెంచిన విదుర నీకు నేల వచ్చీనే. ॥ తలఁచి ॥

ఎక్కువభారము మేనసించుకంత దోఁచినాను
తక్కరి యీ దేహమెల్లాఁ దల్లడించీనే
మక్కువ నీవిభుఁడు నీమతినిండి వుండఁగాను
వెక్కసాన వేరీతి వేగించేవే ॥ తలఁచి ॥

వెలయఁగఁ గోపమొకవీసమంత దోఁచినాను
కలిగిన ముదమెల్లా గాలిఁబోయీని
కలిసితివిదె వేంకటపతి నాతని-
నెలయింత తమకాన నేఁడ దాఁగేవే. ॥ తలఁచి ॥ 34

దేశి[1]

లేఁతచిగురిదె పవ్వళించవయ్య కానికె[2]
బాఁతిగాఁ గమ్మనితావిఁ బాయక[3] మీఁదైనది ॥ పల్లవి ॥

ఇంపుల వెలఁగపండ్లిందవయ్య కానికె
గుంపుఁ దేకుటాకు మడఁగున నున్నవి
కెంపుమోవిపండు చిత్తగించవయ్య కానికె
దింపవి తేనెలపెరతీపులు సోఁకినది ॥ లేఁత ॥

1. ని.రే. ౪౧. ఆద్యదేశి ? ఒక. అద్యులదేశి. 2. శా. వెం. ౨౪౨. 'కానుక' అనియే చదువఁబడు. 3. కొమ్మలావులు పాయ మీఁదై.

వంచల వాఁడమ్మొలివె వట్టవయ్య కానికె
పొంచి తొంగలిగరుల పొది[1] నున్నవి
కొంచెపు వెన్నెలలివె కోవయ్య కానికె
మంచిమొల్ల[2] మొగుడల మాఁటునాఁ బాయనివి[3] ॥ లేఁత ॥

[4]ఇప్పుడె వేంకటేశ నీకెక్కెఁగా నాకానికె
చిప్పలుఁబన్నీటినిండుఁజెలమైనది
దప్పిదేరేమాటలతో దక్కెఁగా నాకానికె
కొప్పునెరుల విరులకుమ్మరిఁతలైనది. ॥ లేఁత ॥ 35

హిజ్జిజి

కటకటా యిట్లాయఁగా పనులు చెలిపలుకు
కిటుకుఁగీరములు మును కిఁడుపడి గెలిచె ॥ పల్లవి ॥

ఇంతిమోఖచందురుఁడు నీకుముదబాంధవుఁడు
నిఁతచలమునఁ బోరిరిన్నాళ్ళును
కాంతుఁడవు నీవలుగఁగాఁ జెలికి[5] నీ విరహ-
సంతాపములు రేఁచి జలజారి[6] గెలిచె ॥ కట ॥

వనజాక్షిచూపులును వలరాజుతూపులును
యెనయకే జగడించె నిన్నాళ్ళును
కినిసి నీవీడుతివకెలనఁ దిరుఁగఁగ విమల-
ననలె కడువాండ్లై నలుగడల గెలిచె ॥ కట ॥

లతలు పూవులతావిలంచములు చెలిమేన
యితవుగా వడినొసఁగె నిన్నాళ్ళును
సతిగెలిచె వేంకటేశ్వర నీ కరుణనిపుడు[7]
ధృతిఁబూని జవరాలు తిరుఁగఁ దా గెలిచె ॥ కట ॥ 36

---

1. తొంగలి రెప్పల పొది. 2. మల్లెమొగడల. 3. మాటున మీఱైనది. 4. దప్పిదేరె మోవివెదకెగా కానుక, చిప్పిలుపన్నీట విచ్చలమైనది. ఇప్పుడె శ్రీ వేంకటేశ నీకెక్కెఁగా నానుక, కొప్పునెరిగురులిగురించి వింతలైనది. 5. సా.రే. బెరిగి నీ విరహ. 6. చలపోరి గెలిచె. 7. సా.రే. శ్వరుకరుణ నీవిపుడు.

సామంతం

చెదరి తిట్టు పుణుఁగు చెక్కులఁ గరగి జార
మదటి నెచ్చెలి మీఁద సోలగిలినది వో ॥ పల్లవి ॥

ఇంతివీఁపు నిమ్మపంట నేమరించి కాఁక వేసి
మంతన మెవ్వరితోనో[2] మాటలాడేవు
అంతలోనే కళదాఁకి అకె మేను జల్లనఁగ
చింతతోనే మోమువంచి సిగ్గుపడినదివో ॥ చెదరి ॥

పొలఁతిగుబ్బలు నొవ్వఁ బూవులచెండున వేసి
కలికతనమున మరలి చూచేవు[3]
కలకంటి యింతలోనే కంతునిబాణమునవి
పలుకనేరక మూనుపడి వున్నదదివో ॥ చెదరి ॥

పొక్కెడిచెలిఁ బచ్చిటి[4] పొట్లానఁ దాఁకవేసి
నక్కరి నవ్వులతోడఁ[5]దలవంచేవు
గక్కన నేఁడతివ వేంకటరాయ నినుఁగూడి
వెక్కసపు మఱపుతో వెరగందినదివో ॥ చెదరి ॥ 37

7-వ రేకు. మంగళకౌశిక[6]

తన్నుఁ బాసి నేనింత దంటనట యీ
వెన్నెలబాయిట రేయి వేఁగుటింత చాలదా ॥ పల్లవి ॥

ఇంటికి రాకుమని నేనంటినట చూడవే
అంటఁగాక వున్నదాన నంటినో యేమో
కంటికి నిద్దురరాక కాఁకలనే పొద్దువోక
వొంటి నేఁబానుపున రేయుంటి[7] నింత చాలదా ॥ తన్ను ॥

---

1. ఏ. రే. ౧౦౪. శ్రీరాగం. 2. మాటలాడేవి. 3. చూచేవి. (ఈ పాదములో యతి కావరాదు. పదలోపమున్నట్లున్నది.) 4. సా. రే. చెలి పచ్చిటి 5. ఏ. రే. నద వులతోఁ దలవంచేవి. 6. ఏ. రే. ౩౩ దేసాళం 7. నదె కాలదా.

అప్పటి దగ్గరి నే రానైతినట చూడవే
కొప్పు జారి సిగ్గుతోడఁ గొంకితి నేమో
చిప్పల రెప్పల జంకించితినట చూడవే
చెప్పరాని మాట నీతోఁ జెప్పుటింత [1] చాలదా ॥ తన్ను ॥

ఊరకే మాటాడక నే నుంటినట చూడవే
ఆరడి పరవశాన నైతినో యేమో
గోరికొనఁ దనుఁ దక్కఁ గొంటినట చూడవే
యేర వేంకటేశ నాతోనింత నీకుఁ జాలదా ॥ తన్ను ॥ 38

శుద్ధవసంతం - రచ్చెతాళం

ప్రలపనవచనైః ఫలమిహకిం
చల చల కుద్యశాళనయా కిం ॥ పల్లవి ॥

ఇతర వధూమోహితం త్వాం ప్రతి
హితవచనైరిహి తు మిహ కిం
సతతం తవానుసరణమిదం మమ
గతజల సేతూకరణ మిదానీం ॥ ప్రలప ॥

వికలవినయ దుర్విటం త్వాం ప్రతి
సుకుమారార్ద్రస్తుత్యా కిం [2]
ప్రకటబహాల [3] కోపసం మమ తే
సకల చర్విత చర్వణమేవ ॥ ప్రలప ॥

శిరసా నతసుస్థిరం త్వాం ప్రతి
విరసాలాపన విధినా కిం
తిరువేంకటగిరి దేవ త్వదీయ-
విరహావిలపనం వృథాచరణం ॥ ప్రలప ॥ 39

1. జెప్పనైతిఁ జాలదా. 2. స్తుతిరిహ (స్తుతిరిహ) కిం. 3. బహుల.

వరాళి

అఁగఁ జేసు[1] నా చూపులటు వోవయ్య
మూఁగిన నా వలపుల మూలకు రానేలా ॥ పల్లవి ॥

ఇమ్ముల నొల్లవి వారమేల నీకు నామేని[2]—
యమ్ముల పులకలొత్తీ నటు వోవయ్య
కమ్మవిలుతునిచేతఁ గాఁగెడి నన్నారనేవు
నెమ్మది నుండి యుండి నీకు నొవ్వనేలా ॥ అఁగ ॥

ఇతవు గావి వారమేల నీకు నామేని—
యతితాపమంటుఁ జేసు నటు వోవయ్య
రతిరాజుచేత నారడిఁబడ్డ నన్నుఁ జేరి
జతనాన వుండివుండి జాలిఁబొంద నేల ॥ అఁగ ॥

ఇంతటి నీ కౌఁగిటికి నేల నేము[3] మాకోప—
మంతరమెఱఁగనేరఁడటు వోవయ్య
వంతగాఁడ వెంకటపతి నీవు నన్నుఁ గూడి
చింతతోడఁ బొరలుచు[4] సిలుగంద నేలా ॥ అఁగ ॥ 40

శ్రీరాగం

ఎన్నఁడును గోపగించవిందుముఖి నీవిట్లా[5]
విన్నవి వదనమెల్లా వింతలాయ నిపుడు ॥ పల్లవి ॥

ఇంతలోని పనికిఁగా నెంత చేసినాఁడవు
కాంత విన్నటినుండి క్షమమాయదాయను
బంతికూటి పతులెల్లాఁ బలుమారు నేఁపగా
చింతతోఁ బళ్ళెముమీఁద జెయి బాఁచదాయెను ॥ ఎన్న ॥

1. పా. రే, అఁగుఁజేసు. 2. వి, రే, ౧౫, మదమని. అమ్ముగోల దాఁకుఁ జేసు నటు. 3. మేము. 4. బొందుచు. 5. ముఖివిట్ల.

ఏమి సేయఁబోయి[1] నీవు యేమి సేసినాఁడవు
సాముకు విచ్చేయదు జవరాలు[2] నేఁడు
దోమతెర మంచముపై తురుము వీడఁగను
తామసించి లేవవిదె తల నొచ్చీననుచు ॥ ఎన్న ॥

ఎవ్వరిని దూరవచ్చు నెవ్వరున్నారిఁకను
పువ్వు సజ్జమీఁదఁ గాఁగె పొలఁతికి[3] దేహము
రవ్వగ వేఁకటగిరి రమణ నీ కౌఁగిటఁ
బవ్వళించి యింతలోనె పరవశమందెను. ॥ ఎన్న ॥ 41

ముఖారి

మతికంటె వెలినున్న మంట (మాట?) మేలు
చతురులాటకంటె జడులాట మేలు ॥ పల్లవి ॥

ఇంటిలోననె వుండి హితవరులై యుండు-
కంటెఁ బగయై యుండు కసరు మేలు
అంటుకొని మరుఁదోఁటి అతివనేఁపుటకంటె
పుంటినొవ్వల విరుల పోట్లె మేలు ॥ మతి ॥

తల్లివలెఁ దానుండి తాపమవుటకంటె
అల్లంతనుండి కీడౌట మేలు
వెల్లిగొని నిట్టూర్పు వేఁడి చల్లెడికంటె
పల్లదపు చలిగాలి బాదలే మేలు ॥ మతి ॥

అలయించి దొరకెడి అమృతపానముకంటె
అలమి పైకొనెడి చేఁదైన మేలు
కలయక కలయు వేంకటశైలపతికంటె
తలపోఁత వేదనల తమకమే మేలు ॥ మతి ॥ 42

---

1. కాఁబోయి, 2. జవ్వరాలు, 3. పొలతికి.

సామంతం

అప్పుడే నే నీకు మోహపుటాలనైతినా [1]
కప్పుకు నీ చేఁత లంతకంటెఁబో నేను [2] ॥ పల్లవి ॥

ఇంచుకంత పసికై నౌ [3] విల్లుచొరనీక విన్ను
లంచములడుగను [4] నే లకిమమ్మనా
వంచనల నీకు నిట్టె వలలఁ జిక్కితిఁ గాక
కంచుఁ బదినునకంత [5] కంటెఁబో నేను ॥ అప్పుడే ॥

సొలపు మాటల నిట్టే చూపులనె జంకించి
చలము సాదించ నీ [6] సత్యభామనా
వలచి నేవిదె నీకు వసమై చిక్కితిఁగాక [7]
కలికి చేఁతలనంత [8] కంటెఁబో నేను ॥ అప్పుడే ॥

రేపు మాపు గోరఁ దమ్మి రేకులనే లేఖవ్రాసి
రూపు నీకుఁ జెప్పిపంప రుకిమిణినా
తీపుల విన్నుఁగూడి తిరువేంకటేశ విరిఁ
గైపు సేయఁగావి (?) అంతికంటెఁబో నేను. ॥ అప్పుడే ॥ 43

8-వ రేకు భైరవి

కోవిల పలుకదు కొమ్మావిలతల
దైవిక మిదివో తలకిందాయ ॥ పల్లవి ॥

ఇటువటు యనుఁడిదె యెండలు గాసీ
పటుగతి గిరుల నరములందు
అటువలెఁ గప్పిన యంధకారమిదె
విటలపుటలుకల సిక్కములాయ ॥ కోవి ॥

1. పా. రే. మోహపాలనైతి - కప్పుకు. 2. లంతాఁగంటెఁబో. 3. పసికిఁగావిల్లి 4. లడుగ పి లకి. 5. వి. రే. ౧౩. బదనున వంత. 6. సాదించఁగనే. 7. పా. రే.

వెగటునఁ దోఁటఁ వెన్నెలగాసీ
ఒగిఁ గలువకొఁలకులుబ్బఁగను
అగపడి ఆటుపలెనైనాఁ జెలి నీ—
మొగమునఁ గోపము ముచ్చటలాయ ॥ కోవి ॥

సొరిది నలుగడలఁ జుక్కలు గాసీ
నరుదుగ నే నిట్లయినాను
తిరువేంకటగిరి దేవుని కౌఁగిట
కరుణ మన్మథ గ్రహణంబాయ. ॥ కోవి ॥ 44

సాళంగనాట

చాలుఁజాలును భోగసమయమున మైమఱపు—
పాలుపడునట యేఁటి బ్రదుకురా వోరి ॥ పల్లవి ॥

ఇందుముఖి నినుఁ గౌఁగిలించి లోపలి జగము
కందునని నీ బిగువుఁ గౌఁగిసే వదలె
పొందైన వారితోఁ బొసఁగఁ గౌఁగిటఁ జేర్పఁ
బొందుగాదట యేఁటి పొందురా వోరి ॥ చాలు ॥

నెలఁత నీ వాలుఁగన్నులు మూసి జగమెల్లఁ
గలయుఁ జీఁకటైన గక్కనను వదలె
వలచినంగనలు తమ వలసిన విలాసముల—
వలను నెరపనిదేఁటివలపురా వోరి ॥ చాలు ॥

కొమ్మ నీవురముపై గోరు దివియుచు నాత్మ—
నిమ్మైన నసుఁదాక పిద్దరిసిఁ దాఁకె
దిమ్మరివి కోనేటితిమ్మ నీపైఁ బ్రియము
కుమ్మరించని దేఁటి కోర్కిరా వోరి ॥ చాలు ॥ 45

### కాంభోది

ఎప్పుడు గావి రాఁడో యెంతదడవాయ కాలి–
చప్పుడాలకించి మతి[1] జల్లురనెనమ్మా ॥ పల్లవి ॥

ఇద్దరమదరిపాటు యేకాంతాన నాడుకొన్న–
సుద్దులు దలఁచిమేను చురుకనెనమ్మా
పెద్దగాఁ గస్తూరిబొట్టు పెట్టిన నాతఁడు[2] గోర
తిద్దుట దలఁచి మేను దిగులనెనమ్మా ॥ ఎప్పుడు ॥

పాయక యాతఁడూ నేనుఁ బవ్వళించే[3] యింటివంకఁ
బోయి పోయి కడుఁ జిన్నఁబోతి నోయమ్మా
తోయపు గుబ్బల[4] చన్నుదోయి మీఁద వాఁడొ త్తిన–
పాయపుఁ జంద్రుల జూచి భ్రమసితినమ్మా ॥ ఎప్పుడు ॥

కూడిన సౌఖ్యములందు కొదలేని వావి నా–
వేడుక మతిఁ దలఁచి వెరగాయ నమ్మా
యీడులేని తిరువేంకటేశుఁడిదె నాతోడ[5]
నాడినట్టే నాచిత్తమలరించె నమ్మా. ॥ ఎప్పుడు ॥ 46

### సామంతం[6]

ఎట్టయినఁ జేయరా నీ వింకనేలా నన్నుఁ
బట్టకుర పలుమారు పదివేలు వచ్చెను ॥ పల్లవి ॥

ఇంత వేసితివి చాలు వింకనేలా తొల్లే
యింతటివాఁడని విన్నెఱఁగనా[7]
ఇంతులపై దయగలదింక[8] నేలా నీ–
పంతములే నీకుఁజెల్లె[9] పదివేలు వచ్చెను ॥ ఎట్ట ॥

---

1. వి.రే. ౧౦. గుండె. 2. పెట్టిన యాతవి గోర. 3. పా. రే. పవ్వళించి
4. వి. రే. తోయగవు గుబ్బచన్ను. 5. నాతో. 6. వి. రే. ౧౨. శుద్ధవసంతం.
7. వి. రే. ౧౨. నేనెఱఁగనా. 8. గలవింక. 9. దక్కె.

ఇచ్చలాడకురా నాతో నీకనేలా నీ-
యచ్చలమ్మురే నిజమా[1] యరుగా
యెచ్చరిక మఱచితివీకనేలా నన్ను
పచ్చిసేయకురా యింత[2] పదివేలు వచ్చెను ॥ ఎట్ట ॥

ఇనుమడించె నీచేత లింకనేలా నీ-
కనుమాయలిన్నియుఁ గంటిమిగా
యెనసి వేంకటపతి యికనేలా నన్నుఁ[3]
బనుపరచితివిట్టె[4] పదివేలు వచ్చెను. ॥ ఎట్ట ॥ 47

లలిత

బండి దొక్కెఁ బాము నెక్కెఁ బనులెల్లాఁ దక్కె
అందఁ జిక్కె గోపికలకందరికి మొక్కె ॥ పల్లవి ॥

ఈతఁడు దొంగిలె వెన్న[5] యీతఁడు నాకంటెఁ జిన్న
నేతఁ బాల నోలలాడె విన్న మొన్న
పాతకపు రాకాసిపల్లెలు చూరలుగొన్న-
యేతరిపై నేరమి మాకేఁటికిఁక నెన్న ॥ బండి ॥

కూరిమినీతఁడు దొల్లి కొనగొనలనే తల్లి (?)
మారిపిళ్ళాడించెనే[6] మారుదల్లి
ఆరుమూరు నేసి విద్యలందరికిఁ బారఁజల్లి[7]
పారితెంచి వోలలాడెఁ బాలవెల్లి ॥ బండి ॥

ముచ్చువలె విప్పుదుండె మూఁడులోకములు నిండె
రచ్చనేసెఁ జూడరే రాతిగుండె
తచ్చితచ్చి వింటినారి దనుజులనెల్లాఁ జెండె[8]
పచ్చిదేర[9] వేంకటాద్రి పానుపుగాఁ బండె. ॥ బండి ॥ 48

1. నిజములాయ. 2. యింతవచ్చి సేయకుర మమ్ము. 3. పా.రే. 'నన్ను' లేదు. ఏ.రే. పరచితివిదె. 5. ఏ.రే. ౧౩. వ్నరితఁడు. 6. ఏ.రే. ౧౩. మారిపిల్లాండ్లిచ్చెనే. ఏ.రే. ౧౩. జల్లిఁబారి. 8. జెండి. 9. ఏ.రే. ౧౩. దేరి.

### ఆహిరి

ఓ యమ్మా వినరో యమ్మా
మాయలాఁడి మానిని ॥ పల్లవి ॥

ఈ॰ యింతికి విభుఁడిచ్చినా* చన-
వేయెడాఁ బోవదిదిగదే[1]
రాయంచ నడపుల రాజసమ్మున
పాయంపు రమణునిఁ బాయదు ॥ ఓయ ॥

సారె నటములు సందడింపుచు
జారీఁ బయ్యెద సరుగనా
దూరి రమణునిఁ దొలఁకుఁ గన్నుల
నీరు నించదు నిలువరే ॥ ఓయ ॥

అంకించి పిలిచినప్పుడా[2] తిరు-
వేంకటేశ్వరు వెరవున[3]
బొంకు లేని యట్టి పొందు చేకొని[4]
పంకజానన పైకొనె[5] ॥ ఓయ ॥ 49

9-వ రేకు. శ్రీరాగం

వద్దు నీకు నాతోడి వట్టిమాటలు
ముద్దులు నీపైఁ గునిసి మురిసీఁబో యిఁకను ॥ పల్లవి ॥

ఈడ వచ్చి ప్రియము నాకేమి చెప్పేవిందాఁకాఁ
గూడినా కెకే ప్రియము గులుకరాదా
వాడిక నిందాఁక నీవు వచ్చిన నేరమికి
సూడుఁ బాడుఁ జెనకీఁ బో నొలపుఁ జేఁతలనే ॥ వద్దు ॥

1. ఎ. రే. జా. దాఁటొదమిదేగది. 2. నప్పుడే. 3. పా. రే. వెరపున.
4. పా. రే. లేనిపొందు పొనగుకొని; 5. ఎ. రే. జా. పనఁబైకొని.
* ఈదీర్ఘము సంగీత సంబంధి. ఇట్టి వచ్చుటచ్చుట గలవు.

ఎదిరి నావంకఁ దప్పకేమి చూచేవిఁక నీ-
ముదితపైనే చూపులు ముంచరాదా
మెదలి నా ముంగిలిది మెట్టిన తప్పువకును
సద చేసి జగడాలు చల్లేదిఁటో యిఁకను ॥ వద్దు ॥

ఇట్టు నట్టుఁ జెఱఁగు నాకేల పట్టేవిదె మున్ను
పట్టినాకెకే చెఱఁగు పట్టరాదా
వెట్టికూటములు చాలు వేంకటేశ యిదె నిన్ను
బెట్టుగాఁగా నలుకలఁ బెట్టుఁగదా యిఁకను ॥ వద్దు ॥ 50

## భైరవి

కాలమెల్లా మోసపోవు (ము?) కానియ్యరా కల-
కాలమెల్లా జరపేవు కానియ్యరా ॥ పల్లవి ॥

ఎడపుల జవ్వనపుటింతి నొకతెఁ గూడి
కడలనే తిరిగేవు కానియ్యరా
మెడగట్టుకొకతెకు మేలువాఁడవై నీవు
కడవ బొంకేవు నాతో కానియ్యరా ॥ కాల ॥

బంగారుమెఱుఁగుచాయ పడఁతినొకతె గూడి
కంగనాదేవు నాతో కానియ్యరా
అంగన నొకతె వెనకమర దాఁచుకొని చా-
క్కంగఁ జేసి ముద్దాదేవు కానియ్యరా ॥ కాల ॥

సంపద గలాపెఁ గూడి సరసములాడుచు
కంపులే పూసేవు కానియ్యలా
వెంపరలాడుచు నీ వెంటనొకతె రాఁగా
కంపించకు వేంకటేశ కానియ్యరా ॥ కాల ॥ 51

## ముఖారి

వెరతుమయ్య చూపు[1] వేఁటకాఁడ
తలతీపు నేసి మమ్మింతటనె యేఁచేవు ॥ పల్లవి ॥

ఉంటవింటఁ గప్పురాన నుబ్బి నన్ను నేసేవు
యింటి వారెవ్వరుంటా యెరఁగవు
కంటిమి నీ యతలింపు కరఁగి నేఁబైకొన్న
వెంట వెంటఁ దిరిగాడి వెతలఁ బెట్టేవు ॥ వెరతు ॥

[2]పేలరివై యేడనైనాఁ బేరుకొని పిలిచేవు
[3]యేలిన వారెవ్వరుంటా నెఱఁగవు
తాలిమి మీరఁగ నీ చిత్తములో మెలఁగఁగ
కాలూఁదనియ్యక యింత[4] కాఁకలఁ బెట్టేవు ॥ వెరతు ॥

కొప్పులోని విరులు చెక్కుల జారఁ జెనకేవు
[5]యెప్పుడైనా నెవ్వరుంటా నెఱఁగవు
కప్పకుర[6] చెఱఁగు వేంకటరాయ చెమటలఁ
దొప్పఁదోఁగి యెవ్వతో పొందులకు నేఁగితివి[7] ॥ వెరతు ॥ 52

## మాళవశ్రీ[8]

దుప్పటెల్లా జవ్వాదినే తొప్పఁదోఁగె నీకడనే[9]
వొప్పదా యింతేసి నీకు వో వలపా ॥ పల్లవి ॥

ఉత్తలపు విరహాన నుడుకుచు వయసు మీఁ—
దెత్తినది సతి నీకు విందుకొరకా
వత్తునని విచ్చేసి వనితల కుచముల
వొత్తగిలి వున్నాఁడ వోహో వలపా ॥ దుప్ప ॥

---

1. సా. రే. చోఁపు. 2. వి.రే. ౧-౨౦. ఇది మొదటిచరణముగా 'ఉంటవింట' రెండవదిగా నున్నది. 3. వి. రే. ఏలినవాడెవ్వరు మంటా. 4. వి. రే. యెంతే. 5. ఎప్పుడు నీవెవ్వరుంటా. 6. సా.రే. కప్పకు చె. 7. వి. రే. నేఁగేవు. 8. వి. రే. ౩౬. ఏకతాళి. 9. నిక్కడనే.

నెదురు చూచీ నీకు నిందుకొరకా
ముదితల కౌఁగిట ముంచిన కస్తూరి నీకు
పుదిరెడి పురమున నోహో వలపా ॥ దుప్ప ॥

కన్నుల కలికి నింత కరఁగించి కవుఁగిట
ఎన్నిక [1] నేసితివి నీ విందుకొరకా
చిన్ని చిన్ని నగవుల శ్రీవేంకటేశ నీ-
వున్నాఁడవారపులై వోహో వలపా ॥ దుప్ప ॥ ౫౩

## సామంతం [2]

మదము దొలఁకెడి యట్టి మంచివయసున మనకు
తుదలేని వేడుకలు దొరకు టెన్నఁడురా ॥ పల్లవి ॥

ఉదుటుఁ జనుదోయి నీ పురముపైఁ దనివార-
నదిమి మోమును మోము నలమి యలమి
వదలైన నీవితో వాలుఁగన్నుల జంకె-
లొదవ నీ మీఁద నే నొరగు టెన్నఁడురా ॥ మదము ॥

కలికితనమునఁ నాదు కప్పురపుఁ దమ్ములము
కులికి నీ వదనమునఁ గుమ్మరించి
పలచనగు గోళ్ళ నీ పగడవాతెర నొక్కి-
చెలువమగు నునుగంటి సేయు టెన్నఁడురా ॥ మదము ॥

గరగరని కురులతో కస్తూరివాసనలు
విరితావులతోడ విసరఁగాను
తిరువేంకటాచలాధిపుఁడ నినుఁ గూడి నే-
నరమరచి సదమదములాట [3] యెన్నఁడురా ॥ మదము ॥ ౫౪

---

1. సా. రె. ఎన్నికె, 2. తం. ప్ర. కాంభోజి, జంపెతాళం, 3. తం. ప్ర. సదమదంబాట.

సౌరాష్ట్రం

ఊరులేని పొలిమేర పేరు పెంపు లేని బ్రతుకు
గారవంబు లేని ప్రియము కదియనేఁటికే ॥ పల్లవి ॥

ఉండరాని విరహవేదన వుండని సురతసుఖమేల
యెండలేని నాఁటి నీడ యేమిసేయనే
దండిగలుగు తమకమనెడి దండలేని తాలిమేల
రెండునొకటి గాని రచన ప్రియములేఁటికే ॥ ఊరు ॥

మెచ్చులేనిచోట మంచిమేలు గలిగినేమి నెలవు
మచ్చికలేనిచోట మంచిమాటలేఁటికే
పెచ్చుపెరుగలేనిచోట ప్రియముగలిగి యేమిఫలము
ఇచ్చలేనినాటి సొబగులేమి సేయనే ॥ ఊరు ॥

బొంకులేని చెలిమిగాని పొందులేల మనసులోన
శంకలేక కదియలేని చనవులేఁటికే
కొంకుగొసరు లేని మంచికూటమలర నిట్లఁగూడి
వేంకటాద్రివిభుఁడు లేని వేడుకేఁటికే ॥ ఊరు ॥ 55

10-వ రేకు. సామంతం

ఒద్దేల మొక్కేవో వుద్ధవుఁడా తన-
ఉద్దండాలె చెల్లెనుద్ధవుఁడా ॥ పల్లవి ॥

ఊరూర వలపులుద్ధవుఁడా నే-
మోరుతుమా యిఁక నుద్ధవుఁడా
ఊరడించ వచ్చేవు వుద్ధవుఁడా తన-
వూరట చెలిములుద్ధవుఁడా ॥ ఒద్దే ॥

ఒప్పులర మావురిసిన పుం–
 త్లుప్పులు వెట్టించె నుద్ధవుఁడా
 చెప్పకు మమ్మిఁక చెలువుఁడాతఁడే
 వొప్పివుంటేఁ జాలు నుద్ధవుఁడా ॥ ఒద్దే ॥

గోపికల మమ్ముఁ గూరిమిఁజిక్కించె–
 నోపమింతేసి నేముద్ధవుఁడా
 పైపై నే మమ్మింత ప్రాణము నిలుప–
 నోపెఁగా తానైన నుద్ధవుఁడా ॥ ఒద్దే ॥

తెగి తన్నుఁ గూడే తెరఁగు దలఁచి
 యుగములైనవి ఉద్ధవుఁడా
 పగటున మా మా ప్రాణము మాకిఁక–
 నొగరే తీపాయె నుద్ధవుఁడా ॥ ఒద్దే ॥

చెల్లించె మాప్రేమ శ్రీవేంకటేశుఁడు
 వుల్లమలర నేఁడుద్ధవుఁడా
 చల్లని కూటపు జనవిచ్చి మామా–
 వొళ్లెల్లఁ జెనకె నుద్ధవుఁడా ॥ ఒద్దే ॥ 56

ముఖారి

పలుమరు వుట్లపండుగను
 చిలుకు చిదుక్కని ఛిందఁగను ॥ పల్లవి ॥

ఊళ్ళ వీధుల వుట్లు కృష్ణుఁడు
 తాళ్ళు దెగిపడఁ దన్నెడును (న్నఁగను?)
 పెళ్లు కఠిల్లు పెఠిల్లు చిఠిల్లని

బంగా(గ*)రుబిందెలఁ బాలుఁ బెరుగులు
ముంగిట నెగయుచు మోఁదఁగను
కంగు కళింగు కతింగు ఖణింగని
రంగుమీరు పెనురవములై ॥వలు॥

విగ్గుగ వేంకటనిలయుఁడుట్టిపా-
లగ్గలికఁ బగుల నడువఁగను
భగ్గు భగిల్లని పరమామృతములు
గుగ్గిలి పదనుగఁ గురియఁగను ॥వలు॥ 57

ఆహిరి

చెడ్డ చెడ్డ మనసుల చెంచువారము - ఆల-
దొడ్డివాఁడ పోవయ్య దూళికాళ్ళ రాక ॥పల్లవి॥

ఏఁటి దాననై తినేమి యెవ్వతె నేనై తినేమి
ఆఁటదాని నన్ను నీకు నడుగనేల
మూఁట మాఁటలనె కడు మోవనాడవద్దు లేటి-
వేఁటకాఁడ పోవయ్య వెంటవెంట రాక ॥చెడ్డ॥

ఎవ్వరి వారై రేమి[1] యేడనేడ నుండిరేమి
దవ్వుచేరువలు నీకుఁ దడవనేలా
నవ్వకుండఁగానె వట్టి నవ్వునవ్వేవెవ్వరైన[2]
పువ్వక పూచెననేరు పోవయ్య రాక ॥చెడ్డ॥

ఎక్కువ కొప్పయిననేమి యెంత గుబ్బలైన నేమి
చక్కఁదనము వొగడ సారె నీకేలా
వెక్కసాలు మావి మాతో వేంకటేశ మా (మీ ?) యింటి-
యిక్కువకే పోవయ్య యింతనంత రాక ॥చెడ్డ॥ 58

---

1. సా. రే. రెవనేమి. 2. సా. రే. నవేఁవిటునేఁడు.

## శుద్ధదేశి

ఎందరిఁ జెనకేవేరా నీవు
    అందపు నీ మేన నలముచు[1] ॥ పల్లవి ॥

ఎక్కడికైనా విచ్చేసి యేరా నీవు
    వెక్కస మాడేవు వెఱవక
యిక్కువలంటఁగ వచ్చేవేరా నీవు
    నిక్కపు నీ ప్రేమ నెరపుచు ॥ ఎంద ॥

ఎప్పుడు మానవు బిగువేరా నీవు
    కప్పురపు నోరఁ గసరుచు
    యిప్పుడె యింతేసి చేసేవేరా నీవు
    వొప్పదు నాతోడి వుడుటులు ॥ ఎంద ॥

ఏతరుణిఁ దలఁచితో యేరా నీవు
    కాతరాన నన్నుఁ గలయుచు
    యేతరి వేంకటేశుఁడ యేరా నీవు
    బూతులమాటాడి పొదలేవు ॥ ఎంద ॥ 59

## హిజ్జిజి

తరుణిపై మరునికి దయలేదు నీవు
    మరునినే పోలితి మరియేఁటిబ్రదుకు ॥ పల్లవి ॥

ఎదురు చూచి చూచి యింతక యేమౌనో
    హృదయము ఝల్లనీ[2] విటుదలఁచి
    పొదల[3] తీగెలయింటఁ బొరలి యేమౌనో
    మదిరాక్షికొకపైన మరియేఁటిబ్రదుకు ॥ తరుణి ॥

---

1. వి. రే. ౪౧-౧౧-౨ పి ప్రేమ నలయుచు. 2. వి. రే. ౩౩-౪౪. ఝల్లవియుటు.
3. పొదలి.

చెలుల దూరిదూరి సిగ్గునవేమానో
  తలఁచి తలఁచి గుండె తల్లడించీని
  కల నిన్నుఁగని లేచి గక్కున[1] నేమానో
  మలసి వెన్నెలమంట మరియేఁటిబ్రదుకు ॥ తరుణి ॥

ఇంతిఁ గలయకున్న[2] నీఁక నెంత యానో
  పంతపు వేంకటరాయ భయమయ్యీని
  ఇంత నీకరుణ[3] నీఁక నెంత యానో
  మంతనమింత లేకున్న మరియేఁటి బ్రదుకు ॥ తరుణి ॥ 60

## రామక్రియ[4]

వద్దే గొల్లెత వదలకువే-నీ-
  ముద్దు (ముద్దు) మాటలకు మొక్కేమయ్యా ॥ పల్లవి ॥

యేలే యేలే యేలే[5] గొల్లెత
  నాలాగెఱఁగవా నన్ను నేఁచేవు
  చాలుఁజాలు నీఁకఁజాలు నీరచనలు
  పోలవు బొంకులు పోవయ్యా ॥ వద్దే ॥

కానీ కానీ కానిలే[6] గొల్లెత
  పోనీలే నీవెందు వోయినను
  మాని మాని పలుమారుఁ జెనకుచు మా-
  తోనిటు పొలయక తొలవయ్యా ॥ వద్దే ॥

రావా రావా రావా గొల్లెత
  శ్రీ వేంకటగిరి[7] చెలువుఁడను
  నీవె నీవె నను నించితి కౌఁగిట
  కైవశమైతివిఁ గదవయ్యా ॥ వద్దే ॥ 61

1. వి. రే. ౪౪ గక్కున. 2. గలయకుంటే. 3. ఇంతా నీకరుణచే. 4. వి. రే. ౬౧ యేకతాళి. 5. సా. రే. ఏలేయాలేయాలే. 6. వి. రే. ౬౫. కానిగా. 7. కటవతి.

11–వ రేకు. శుద్ధవసంతం

మెచ్చితి బళిరా వోరి మేటిజాణ నన్నుఁ
బచ్చి చేసేదింత నీకుఁ బంతమా లోకానను ॥ పల్లవి ॥

ఏకతాన సొలసి నేనేమి నీతోఁ బలికినా
ఆకెతోనే విన్నవించేవాపఁగ లేక
పైకొని వలచి కిందుపడిన యింతులమాఁట
కాకు సేసే మగవాఁడు గలఁడా లోకానను ॥ మెచ్చి ॥

చక్కఁగా నేఁదీసిన సన్నపు నీపై రేక
యెక్కువ నాకెకే చూపేవేతులకును
మక్కువ నిలుపలేవి మగువల వెలిపుచ్చి
వెక్కసమయినవాఁడు విభుఁడా లోకానను ॥ మెచ్చి ॥

ఉండలేక చేతనున్న వుంగరమిచ్చినఁ బోయి
వెండియు నాకెకేయిచ్చి విట్టపీఁగేవు
కండగట్టుకొంటివా వేంకటరమణుఁడ దీన
బండుసేసితివి నన్ను బాపురా లోకానను ॥మెచ్చి॥ 62

ముఖారి, ఏకతాళి

సన్నపు నవ్వుఁజూపుల చల్లులాఁడి యిప్ప–
దిన్నివిధముల మించె నిదివో తపము ॥ పల్లవి ॥

ఏడునిలువుల పైఁడిమేడమీఁద నుండి నిన్నుఁ
జూడ వేడుకైన మించుఁజూపు[1] లాఁడి
వాడుచు నీకునెదురు వడిఁజూడ నంతలో నీ–
వేడనుండో విచ్చేసితివిదివో తపము ॥ సన్నపు ॥

1. సా. రే. మంచిచూపు.

కొత్తలయిన మాణికపు కొలువుటోవరిలోన
ముత్తేల[1] చెఱఁగుదూలు మురువులాఁడి
తత్తరానఁ దమకించి తరుణికోరికలెల్ల—
విత్తునని విచ్చేసితివిదివో తపము ॥ సన్నపు ॥

పుష్పాదితావులు చల్లు పువ్వులచప్పరములో
కొప్పు నన్నుఁ[2] బెట్టుమన్న గుబ్బలాఁడి
తెప్పలుగ నినుఁగూడి తిరువేంకటేశ నిన్ను—
నెప్పుడుఁ బాయకున్నదిదివో తపము ॥ సన్నపు ॥ 63

ముఖారి

కలగన్నచోటికిని గంప యెత్తిన యట్లు
అలవు మీఱినదెట్లసమ్మా ॥ పల్లవి ॥

ఎలయింపుఁ గడకంట నెన్నఁడో వొకనాఁడు
చెలఁగి తను నతఁడు చూచినవాఁడట
పొలిఁతి యదిదలఁచి యిప్పుడు మదనవేదనల—
నలసీ నిఁకనెట్లనమ్మా ॥ కలగన్న ॥

ఎఱుకయును మఱపుగా నేఁటికో వొకనాఁడు[3]
తెఱలి తను నొవ్వఁ బలికినవాఁడట
తఱినదియె చెలి యిపుడు దలఁచి పరితాపాగ్ని—
నఱగీ నిఁకనెట్లనమ్మా ॥ కలగన్న ॥

ఇయ్యకోలుగఁ గలసి యెప్పుడో యిదెనేఁడు
నెయ్యమున చెలిలోన నెలకొనెనట
తియ్యముల సటకాఁడు తిరువేంకటేశ్వరుఁడు
అయ్యో యిఁకనెట్లసమ్మా ॥ కలగన్న ॥ 64

---

1. ని. రే. ౧౩. ముత్యాల. 2. నిన్ను 3. ని. రే. ౬౪౩. కోయిదెనేఁడు.

కాంభోది

పొందెఱుఁగుదునందువు భోగినందువు నీ-
యందరు సతులకు నేనాకు మదిచిత్తునా ॥ పల్లవి ॥

ఎవ్వతెకైనాఁ జనవిచ్చేవు మెచ్చేవు నీ-
నవ్వులకైనాను మన్ననఁ జూచేవు
అవ్వలి[1] యివ్వలి నీ యంగనల వొద్దను
పవ్వళించి వుండఁగా నేఁ బాదములొత్తుదునా ॥ పొందె ॥

ఏపున నెక్కడికైనా నేఁగేవు దాఁగేవు నీ-
కోపాన నాతోనైనా[2] మేకులు నేసేవు
వైపున నీవెందుండైనా వచ్చిన నేనంతలో-
నోపికనప్పుడు[3] నీ కూడిగాలు నేతునా ॥ పొందె ॥

వేడుకలెందైనాఁ బారవేసేవు నీ-
వాడికచేఁతలెన్నైనా వన్నె పెట్టేవు
ఈడు లేని తిరువేంకటేశ కూడితివి నన్ను
వాడుచు నీ తోడ నేను వాసి చూపఁగలనా. ॥ పొందె ॥ 65

పాడి

సుతుని నరకునిఁ జంపఁ జూచినాఁడవు సుమ్మీ
మతి నన్నుఁ దలఁచక మానిన నీకాన ॥ పల్లవి ॥

ఎత్తుక నీతోడఁబుట్టు హిరణ్యకశిపుని
నెత్తురు దాగితి సుమ్మీ నేఁడే రాకుంటే
ఉత్తలాన నేడనైనా నుండుదువో యువి భీతి
విత్తరముగాఁ బెట్టితి పెట్టరాని యాన ॥ సుతుని ॥

1. సా.రే. అవ్వలినీ యివ్వలినీ 2. వి.రే. నాతో నేనే 3. సా.రే. నేనే కూడి.

కప్పుక నీ మేనమామ కంసుని ప్రాణానకు
తప్పినవాఁడవు సుమ్మీ తడసితేను
ఇప్పుడిట్టే నీవు రాని యీరసానఁ ద్రిక్కములు
చెప్పలేక పొడిచితి చెడుగైన యీన ॥ సుతుని ॥

సిరుల మేన మరఁది శిశుపాలు నీ పిట్టే[1]
పొరిగొంటివి సుమ్మీ పోయితే నీవు
తిరువేంకటేశ నన్నుఁ దివిరి కూడి (దే?) వని[2]
కరుణఁ బెట్టితి నీకుఁ గపటాన నాన ॥ సుతుని ॥ 66

శుద్ధవసంతం

చాలదా యీ చవవులు
మేలపు నేఁతల నిన్ను మెచ్చించ గలిగె ॥ పల్లవి ॥

ఎంతటిదిరా నిన్ను వింద్రాఁక రానీక
పంతమాడి వలపించి బానగొన్నది
ఇంతి నోఁచినట్టి నోము యెటువంటిదో నీ—
చెంతఁజేరి నీ మంచి చెక్కు నొక్కఁగలిగె ॥ చాల ॥

ఎవ్వతెరా నిన్ను నెలయించి తన విందు—
జవ్వనము విలువిచ్చి జట్టిగొన్నది
అవ్వల దాని భాగ్యమది యెట్టిదో నీవు
పవ్వళించు పరుపుపై పవ్వళించఁ గలిగె ॥ చాల ॥

ఎట్టిదిరా సతి నిన్ను యింటిలోన వెళ్ళనీక
పట్టుకొని కౌఁగిటిలోఁ బాయనీనిది
అట్టె నిన్ను తిరువేంకటాధీశుఁడా నీవు
దట్టించు నీ కౌఁగిటిలో తగులఁగఁ గలిగె ॥ చాల ॥ 67

12-వ రేకు ఆహిరి

చక్కఁదనములచేత జవ్వన భారము చేత
యెక్కడౌటాఁ గానదిఁక నేమి సేతమే ॥పల్లవి॥

ఒయ్యనె బంగారు తూఁగుటుయ్యాల మంచముమీఁద
పయ్యెద చెఱఁగు జారఁ బవ్వళించి
ముయ్యక మూసిన రెప్ప మూయుచుఁ దెఱచుఁ గాని
నెయ్యమునఁ జూడనేరదేమి సేతమే ॥చక్క॥

ముత్తేల గద్దియమీఁద ముద్దుల కురులు దూల-
నొత్తిలి యొకతె మీఁద నొరగుండి
చిత్తగించి చేతనున్న చెంగలువ బంతిఁ జెక్కు-
లొత్తుఁగాని మాటలొల్లదేమి సేతమే ॥చక్క॥

కమ్మని తావులతోడ కన్నుల నవ్వులతోడ
చిమ్ముఁ జెమటలతోడఁ జెలువొంది
కొమ్మకు నేడుఁగలిగె కోనేటిరాయని పొందు
నెమ్మనము దాఁచ నేరదేమి సేతమే ॥చక్క॥ 68

ఆహిరి

దవ్వుల నుండవే యాల దగ్గరేవు అతఁ-
డెవ్వరౌతా నెఱఁగవిదేమే చెలియా ॥పల్లవి॥

ఒద్దికతో చనుదోయి నొరయుచు కంట-
నద్దలింపుచుఁ దిట్టేవు అమ్మమీఁదను
ముద్దుమోము విరియించి మురిసేవు ఇంత
వద్దువో ఆతనితో గర్వము నీకుఁజెలియా ॥దవ్వు॥

బొమ్మముడి జంకెనలఁ బొలయుచు మోవిఁ
దమ్మఁజూపి సన్నసేసి తనరేవు
చిమ్మేవు నీ చెమటలు చెక్కుమీఁద ఓ–
యమ్మరో యాతనితో వొయ్యార మేలే చెలియా ॥ దవ్వు ॥

మొరయు మెట్టెలు పాదమున మెట్టి
చెరఁగులోపల గోరఁ జెనకేవు
కరఁగి వేంకటపతి కౌఁగిట నీ–
నెరతనములు చూప[1] నేర్తువా చెలియ ॥ దవ్వు ॥ 69

శంకరాభరణం

తరుణి నీ యలుక కెంతటిదింతినీ వేళఁ[2]
గరుణించఁగదర వేంకటశైలనాథా ॥ పల్లవి ॥

ఒకమారు సంసారమొల్లఁ బొమ్మని తలఁచు
ఒకమారు విధినేఁతలూహించి పొగడు
ఒకమారు తనుఁజూచి వూరకే తలవూఁచు–
నొకమారు హర్షమున నొంది మే[3] మఱచు ॥ తరుణి ॥

నిన్నుఁ జూచి వొకమారు నిలువెల్లఁ బులకించు
తన్నుఁ జూచి వొకమారు తలపోసి నగును
కన్ను దెరచి నినుఁజూచి కడు సిగ్గువడి నిలిచి
యిన్నియునుఁ దలపోసి యింతలో మఱచు ॥ తరుణి ॥

వదలైన మొలనూలు గతియించు నొకమారు
చెదరిన కురులెల్లఁ జెరుగునొకమారు
అదనెరిఁగి తిరువేంకటాధీశ పొందితివి
చదురుఁడవు నినుఁ గాయఁజాలదొక మారు. ॥ తరుణి ॥ 70

1. పా.రే. మానేర్తు. 2. పా.రే. దింత యీవేళ. 3. వి.రే. లాగ మైమ.

## బౌళి

మోహము సేయించుకొని మురిసేవు నీ-
సాహసములె[1] దురా చదురాలికిపుడు ॥ పల్లవి ॥

ఒక్క చక్రమె నీకునున్నది[2] గాని, యింతి-
రెక్కల చక్రాలె పో రెండు గుబ్బలు
మక్కువ సేయించుకొని మలసేవు నీ-
చక్కఁదనమెదురా జవరాలికిపుడు ॥ మోహ ॥

నీలమేఘము చాయ నీమేను గాని పెద్ద-
నీలమేఘమే పో నెలఁత కొప్పు
జాలిఁ బొరలించేవు సతిని నీవు నీ-
తాలిమిలెదురా తరుణికి నిపుడు ॥ మోహ ॥

మరుని ప్రతినిధి నీ మహిమ గాని ఆ-
మరుని సంపదే పో మగువ నేఁడు
తిరువేంకటేశ పొందితివి గాని నీ-[3]
సరసము లెదురా సకియకు నిపుడు. ॥ మోహ ॥ 71

## పాడి

వచ్చె(చ్చే*)రా మా యమ్మతోడు వన్నెలుగావు నీ-
మచ్చరములెల్ల మాని మందకేఁగ నియ్యరా ॥ పల్లవి ॥

ఓసోసి యెందు వొయ్యేవే వొయ్యారపుగొల్లెతా
దోసము మమ్మునంటక తొలఁగరటు (రా అటు?)
మూసేవే గుబ్బలఁ గొంగు మురిపెంపుగొల్లెతా
మాసినది చీరకొంగు మందకేఁగ వియ్యరా ॥ వచ్చె ॥

---

1. వి. రే. ౧౪-౮౧. హాసమెదురా. 2. వి.రే. (౧౪లో ఈ చరణములేదు.) ౮౧. నుండేది. 3. వి. రే. వేంకటగిరి దేవుఁడ నేఁడు నీ.

సానఁ బట్టేవే మాటలే చల్లజంపు గొల్లెతా
నేనేమి బొంకితిగా నీకు నెరజాణా
కానిలే రావై తివిగా గబ్బిచూపుగొల్లెతా
మానమువంకఁ జూడక మందకేఁగ నియ్యరా ॥ వచ్చె ॥

జంకించేవే బొమ్మలను జవ్వనంపుగొల్లెతా
వేంకటవిభుఁడ నీకు వెరతుమయ్యా
అంకపు గుబ్బలను నన్ను నదిమేవె గొల్లెతా
మంకుఁ గూటములు మాని మందకేఁగ నియ్యరా. ॥ వచ్చె॥ 72

దేసాళం

కులుకక నడవరో కొమ్మలాలా
జలజలన రాలీని[1] జాజులు మా యమ్మకు ॥ పల్లవి॥

ఒయ్యనే మేను గదలీ నొప్పుగా నడవరో
గయ్యాళి * శ్రీపాదతాఁకు కాంతలాలా
పయ్యెద చెఱఁగు జారీ భారపు గుబ్బల మీఁద
అయ్యో చెమరించె మా యమ్మకు నెన్నుదురు ॥ కులు ॥

చల్లెడి గందవొడి మైజారీ నిలువరో
పల్లకి వట్టిన ముద్దుఁ బణఁతులాల
మొల్లమైన కుందనపు ముత్యాల కుచ్చులదర
గల్లనుచుఁ గంకణాలు గదలీ మాయమ్మకు ॥ కులు ॥

జమళి ముత్యాలతోడి చమ్మాళిగ[2] లిడరో
రమణికి మణుల నారతులెత్తరో
అమరించ[3] కౌఁగిట నలమేలుమంగనిదె
సమకూడె వేంకటేశ్వరుఁడు మాయమ్మకు ॥ కులు ॥ 73

---

1. ని. రే. ౩౨-౬౩. జలజల రాలీజా. 2. సమ్మాళిగ, 3. అమరించెఁ గౌఁగి,
* ఇది కూడని సమాసము. ఇట్టి చిల్లరదోషముల కీవాఙ్మయమున పట్టింపులేదు.

13వ-రేకు. ఆహిరి

కొమ్మ తన ముత్యాల కొంగు జారఁగఁ బగటు
కుమ్మరింపుచుఁ దెచ్చుకొన్నదీవలపు ॥ పల్లవి ॥

ఒయ్యారమున విభుని వొరపు గనుఁగొని రెప్ప
ముయ్యనేరక మహా మురిపెమునను
కయ్యంపుఁ గూటమికిఁ గాలుదువ్వుచు నెంతె
కొయ్యతనమునఁ దెచ్చుకొన్నదీవలపు ॥ కొమ్మ ॥

పైపైనె ఆరగింపకుము పన్నీరు గడు-
తాపమవునని చెలులు దలఁకగానే
తోపు సేయుచుఁ గెంపు దొలఁకుఁ గన్నుల కొనల
కోపగింపుచుఁ దెచ్చుకొన్నదీవలపు ॥ కొమ్మ ॥

ఎప్పుడునుఁ బతితోడ నింతేసి మేలములు
ఒప్పదని చెలి గోర నొత్తఁగానే
యెప్పుడో తిరువేంకటేశు కౌఁగిటఁ గూడి
కొప్పుగులుకుచుఁ దెచ్చుకొన్నదీవలపు ॥ కొమ్మ ॥ 74

ముఖారి

పొదలు[1] నీ సొంటగెల్ల పోదేల కొల్ల
తుదలేని నీ మేలు దొరకెఁగా నాకు[2] ॥ పల్లవి ॥

ఒడలిపై నీచెమట వూరు వాడెకు[3] చెలమ
జడియు నీ తమకంబు సంత తగరు
కడగంటి నీ చూపు కట్టు వదలిన క్రేపు
వడి నిన్నుఁ గరఁగింప వశమా నాకు ॥ పొదలు ॥

చిఱునవ్వు నీపలుకు జిగురు చుట్టిన కండె
    తెలివలకు నీమోవి తెరువుపెసరు
పఱచు నీనునుఁజేఁత బట్టబాయిటి యీఁత
    తఱి నిన్నుఁ బైకొనఁగఁ దరమా నాకు ॥ పొదలు ॥

చెలువంపు నీచెలిమి చెఱకు వండిన పండు[2]
    కెలపు నీయలుక తంగేటి జున్ను
చలివాపు నీచనవు జాజులుఁ బ్రపాదంబు
    కలిగె నీకరుణ వేంకట విభుఁడ నాకు ॥ పొదలు ॥ 75

ఆహిరి

మచ్చికల మొగసిరి మందులాఁడ నీ—
    కిచ్చిన దేహమిది యెట్టయినఁ జేయరా ॥ పల్లవి ॥

ఓడక యెక్కుడనైన నుండి నీవు
    వేడుకతో మాయింటికి విచ్చేయఁగాను
వాడుమోముఁ జూచి నవ్వువచ్చుఁ గాని కోప—
    మేడఁ దెచ్చుకొన్నరాదు యెట్టైనాఁ జేయరా ॥ మచ్చి ॥

ఎంతవొద్దు వోయిఁనైనా యిటునీవు
    వింతలేక మాయింటికి విచ్చేయఁగాను
చింతతో నీ కెదురు చూచితిఁ (చెదః) గాని
    యెంతైనాఁ బాయలేను యెట్టయినాఁ జేయరా ॥ మచ్చి ॥

కుంకుమచెక్కుల మెఱుఁగులతోడ తిరు—
    వేంకటేశ మాయింటికి విచ్చేయఁగాను
వంకలాడి నినుఁ గూడవలెఁగాని
    యింక నిన్నుఁ బాయలేను యెట్టయినాఁ జేయరా. ॥ మచ్చి ॥ 76

1. పా. రే. వంట.

ఆహిరి

వలపు నిలుపలేని వారము నేమటుగాన
పలుమారుఁ బట్టుకొన్నఁ బయికొనవేలరా ॥ పల్లవి ॥

ఒత్తి నీవాడినమాటకోరువఁ జాలక నే-
ముత్తరమిత్తుము గాని ఊరకుండలేమురా
బత్తి గొట్టానఁ బెట్టఁగఁ బనిలేదు వోరి నీ-
చిత్తమింతేకాని యిఁకఁ జెప్పనేమున్నదిరా ॥ వలపు ॥

కాఁకలఁ బెరిగినట్టి కళవళమున నిన్నుఁ
దాఁకనాడుదుము గాని తడవుండలేమురా
యేఁకటఁ జెందినయట్టి యింతుల మాటకు నీవు
సోఁకోరువవలెఁ గాక చురుకనరాదురా ॥ వలపు ॥

సారెకు నీవెడసిన సైఁచలేము నీవు
చేరువనలిగి మమ్ముఁ జేకొనవేరా
ధీరుఁడవు కోనేటితిరువెంకటేశ నన్ను
గారవించి యిట్లానే కరుణించఁ గదరా. ॥ వలపు ॥ 77

శంకరాభరణం

అహో సురతవిహారోయం
సహజ పరాజయశంకా నాస్తి ॥ పల్లవి ॥

యమునాకూలే[1] సుమలతాగృహే
విమలసైకత వివిధస్థలే
రమణీరమణౌ రమతస్తయోః
ప్రమదస్య పరాత్పరం[2] నాస్తి ॥ అహో ॥

---

1. ని. రే. లాలా. హితలతాగృహే. (ఈ పాఠమునకు 'యమునాకూలే' అను పూర్వార్థపాఠము కారణముగా నుండి యుండును.) 2. పరాపరం,

రజనీ కావా ప్రాతః కింవా
త్యజనం భజనం తత్కిం వా
విజయః కోవాపజయః[1] కోవా
భుజపరిరంభ స్ఫుటం నాస్తి ॥ అహో ॥

చీనాంశుక రంజిత మేఖలాని—
తానే జఘనం తరతి సతి
మానవికలనే మానినీమణే (ః?)
హీనాధిక పరిహృతిం నాస్తి (తిర్నాస్తి?) ॥ అహో ॥

కింవా మిళనం కింవాఽ మిళనం
త్వం[2] వాఽహం వా తన్నాస్తి[3]
సంవాదో వా సరసః కోవా
కింవా వాచ్య క్రియా నాస్తి[4] ॥ అహో ॥

ఆదిదేవ పీతాంశుక బద్ధా (?)—
స్వేద సురభి కాశ్మీరజలం
సాదురుంహ్యా (రూహ్యా?) లజ్జావివశతయా
ఖేదేన వచః కించిన్నాస్తి (?) ॥ అహో ॥

వరకుచాగ్ర సంవ్యానం కరేణ
హారౌ పరం[5] పరిహరతి సతి
సరసలోచనంచల (నాంచల?) వివశతయా
తరుణ్యాం చైతన్యం నాస్తి ॥ అహో ॥

[6] సురతాంతశ్రమ సుఖం కింవా
వరలజ్జా సావా కావా
పరవశతను వైభవం కింవా
* నిరతాం తయో నికృతిం నాస్తి (?) ॥ అహో ॥

---

1. సా రే.ని.శే. భజ...; 2. ని.రే. తంవా. 3. సా.రే. తంనాస్తి. 4. సా.రే. ని.రే. క్రియాంనాస్తి. 5. ని.రే. హరంపరి. 6. ని.రే. లో ఈ చరణము లేదు.

* నిరతంయోర్ని కృతిర్నాస్తి?

పరిమళ భరిత ప్రచుర సుశీల—
వరమృదువాయౌ వాతి సతి
తిరువేంకటగిరిదేవ రాధయో—
స్సరసరతి సుఖశ్రాంతిర్నాస్తి. ॥ అహో ॥ 78

14-వ రేకు. శ్రీరాగం

విరహమె సంభోగంబుల[1] వెడుక శృంగారమె యిది
సరసిజముఖిఁగని ప్రాణము జల్లనఁ గలఁగెడిసె[2] ॥ పల్లవి ॥

కుటిలాలకి మైఁబూసిన కుంకుమగంధపు రసములు
చిటిపొటి చెమటలఁ బెనఁగొని చిప్పిలి రాలఁగను
నిటలాయని యలరమ్ములు వీఁపున వెడలఁగ నాఁటిన
తొంట తొంటఁ దొరిగిన నెత్తురుతోఁ దులదూఁగెడినే ॥ విరహ ॥

మృగలోచన చనుఁగవపై మెత్తిన కమ్మని తావుల
మృగమదమంటినచోట్లు మెఱుఁగులు వారెడిని
చిగురాకున మరుఁడేసిన చిచ్చరబాణంబులచే
ఎగసిన పొగలై తోఁచీ[3] నేమని చెప్పుదునే ॥ విరహ ॥

యోగవియోగంబులచే నొనగూడిన యీ చెలియకు
నాగరికంబుల చేఁతలు నటనలు మీరఁగను
శ్రీగురుఁడై చెలువొందిన శ్రీ వేంకటగిరి నిలయుని[4]
భోగించిన పరిణామపు పొందులు దెలిపెడినే[5]. ॥ విరహ ॥ 79

సాదరామక్రియ

[6]చెలియకు విరహపు వేదన సేయని సింగారంబిది
నొలవక వలపుల ముద్రల చొప్పులు మాపకుఁడీ ॥ పల్లవి ॥

1. సా.రే. సంభోగంబో. 2. ని.రే. ౧౧ళ. గరఁగెడిని. 3. తోఁచెడి. 4. గిరిరాయఁడు. 5. దలఁచెడిని. 6. ని.రే. ౫ళ. ఈ పల్లవి పాఠము 'ఎక్కడఁజేసిన విదుఱును యీ చిత్తజు బాణాఘ్నులచే-నొక్కులు దేరెడి కాంతకు నొప్పులు సేయకుఁడీ' అని.

కిక్కిరిసిన చనుగుబ్బలు గీఁటినఁ బిగిలెడి నయ్యో
పక్కనఁ గనుకలి దాఁకీఁ బయ్యెద దెరవకుఁడీ
వెక్కసమగు ముఖకాంతికి పెడవెడ మరుఁగై తోఁచెడి
చెక్కుల చెమటలు గందెడి చేతులు వెట్టకుఁడీ[1] ॥ చెలియ ॥

అంగన మేనికిఁ బులకలు అడ్డము దోఁచెడి నయ్యో
బంగరు మొలకలవంటివి పైపైఁ దుడువకుఁడీ
తొంగలి రెప్పల కెలఁకుల తొరిగెడి కన్నుల మెరుఁగుల[2]
ముంగిటవేసిన చూపుల[3]మురిపెము మానుపుఁడీ (?) ॥ చెలియ ॥

తిరువేంకటపతినింతికిఁ దెచ్చెదమనఁగా నయ్యో
కరుణించినవాఁడాతఁడె[4] కళవళమందకుఁడీ
తరుణీమణి మా దేవునిఁ దగఁ గాఁగిట[5] సౌఖ్యంబుల
పరవశమందినదేమో పలుమరుఁ బిలువకుఁడీ. ॥ చెలియ ॥ 80

## పాడి

అంత సేయకుండితే నే[6] నాఁటదాననా
పంతపు నీ బిగువెల్ల బయట వేయింతునా[7] ॥ పల్లవి ॥

కూరిమి సతుల భీతి గోర నన్ను[8] నంటనీక
సారెకుఁ దప్పించుకొంటా సాము నేసేవు
యేరా నీకు నింత వెరపిటువంటి నిన్ను నే వో
జీరలు మేనెల్లఁ[9] జేసి సిగ్గు విడిపింతునా[10] ॥ అంత ॥

మొక్కుచుఁ గెమ్మోవి మీఁద మోపనియ్యవేర పల్లు
వెక్కసపు తమకాన విఱ్ఱవీఁగేవు[11]
చిక్కితి వెక్కడికి విచ్చేసేవు నిన్ను నే
దక్కగొని మదన విద్యలనే చొక్కింతునా[12] ॥ అంత ॥

---

1. పలుమరు చేతులఁ దుడువకుఁడీ. 2. రెప్పల మఱుఁగుల తొలకరి మెరుఁగుల కన్నుల. 3. ముంగిటవేసెడిఁజూపులు. 4. కరుణించెను దేవుఁడు. 5. యీతనితో తగు కాఁగిట. 6. వి. రే. ఞాళ. కుండిననే. 7. వేయింతును. 8. సా.రే. గోరు నన్నునంట. 9. వి. రే. వొళ్ళెల్ల. 10. పింతును. 11. వెదవీఁగేవు. 12. క్కింతును.

ఎక్కువ నామేని జవ్వాదిందరుఁ దెలిసేరంటా
మిక్కిలి నీ మేనితావి మెరయించేవు
చక్కని వేంకటగిరి స్వామి నన్నుఁ గూడితివి
గక్కన నాచూపు నీకుఁ గావలి వెట్టింతునా[1] ॥ అంత ॥ 81

## నాదరామక్రియ

ఏమొకో చిగురుటధరమున[2] యెడనెడఁ గస్తురి నిండెను[3]
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా ॥ పల్లవి ॥

కలికి చకోరాక్షికిఁ గడకన్నులు గెంపై తోఁచిన
చెలువంబిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువునఁ బ్రాణేశ్వరుపై నాఁటిన యాకొన చూపులు[4]
నిలువునఁ బెరుకఁగ నంటిన నెత్తురు గాదు గదా ॥ ఏమొ ॥

పడఁతికి చనుఁగవ మెఱుఁగులు[5] పైపైఁ బయ్యెద వెలుపల
కడు మించిన విధమేమో కనుఁగొనరే చెలులు
ఉడుగని వేడుకతోఁ[6] బ్రియుఁ డొత్తిన నఖ శశి రేఖలు
వెడలఁగ వేసవికాలపు వెన్నెల గాదు గదా ॥ ఏమొ ॥

ముద్దియ చెక్కుల కెలఁకుల ముత్యపు జల్లుల చేర్పుల
వొద్దికలాగు[7] లివేమో వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున
అద్దిన సురతపుఁ జెమటల[8] అందము గాదు గదా ॥ ఏమొ ॥ 82

## శ్రీరాగం

చిమ్మకువే గోళ్ళంత జీరలయ్యీని
చిమ్ముఁ జెమటల[9] నిన్నుఁ జిక్కించె నతఁడు ॥ పల్లవి ॥

---

1. ట్టింతును, 2. ని. రే. ౫౩. చిగురట అధరము, 3. నించిన 4. శ్వరుమది నాటఁగఁ జూచిన చూ. 5. పడతుక చనుగవ మెరుఁగుల, 6. ప్రేమంబునఁబ్రియు, 7. మెరుఁగు లివే, 8. సా. రే. పతి కౌఁగిటి యధరా మృతముల అద్దిన సురతపు వేళల అందము. 9. ని. రే. ౩౪. జెమ్మటల.

కులికి నవ్వకువే కొప్పు వీడీని బెట్టు-
పలుకకువే మోవి బయలయ్యీని
వులికి పడకువే వొళ్ళు నొచ్చీని నీ-
న్నెలయించి వలపుల నింత నేసె నతఁడు ॥ చిమ్మ ॥

కన్నుల మొక్కకువే కాఁక రేఁగీని నీ-
వన్నెలు చూపకువే వడ చల్లీని
సన్నలఁ దిట్టకువే చలమెక్కీని నిన్ను
మన్ననలనే సిగ్గు మరపించె నతఁడు ॥ చిమ్మ ॥

గుట్టున నడవవే కొంగు జారీని యింత-
తట్టుపుణుఁగేఁటికే తల నొచ్చీని
గట్టిగ శ్రీతిరువేంకటరాయఁడు నిన్నుఁ
బెట్టని చోట్లఁ బెట్టి పెద్దసేసె నతఁడు ॥ చిమ్మ ॥ 83

ఆహిరి

[1] లంజకాఁడవౌదువురా

లంజకాఁడవౌదువు నీ లాగులెల్లఁ గానవచ్చె
ముంజేతఁ బెట్టిన సొమ్ములకద్దమేలరా ॥ పల్లవి ॥

కొంకక యెవ్వతో కాని కోరి నీ బుజము మీఁద
శంకణాల చేయి వేసి కౌఁగిలించఁ బోలును[2]
పంకమైన వొత్తులెల్ల వడిఁ గానవచ్చె నింక
బొంక నేమిటికిరా నీ బూమెలెల్లఁ గంటిమి ॥ లంజ ॥

ఒద్దిక నెవ్వతో గాని వోరి నీవురము మీఁద
నిద్దిరించఁ గంటమాల నీలములొత్తినది
తిద్దిన జాణవుగాన తిరిగి తిరిగి మాతో
బద్దనేఁటికిరా నేఁ బచ్చిసేయఁ జాలను ॥ లంజ ॥

1. సా.రే.లో ఈ పాదములేదు. ని.రే.లా. ప్రాలలోగలదు. 2. ని.రే. ప్రాలా బోలురా.

వేడుక నెవ్వతో తిరువేంకటేశ్వర నిన్ను
కూడిన నీమేనితావి కొల్లవట్టుకొన్నది
తోడనె నాకౌఁగిటిలో దొరకొంటి వింక నిన్ను—
నాడ నేమిటికిరా నాయలపెల్లఁ దీరెను ॥ లంజ ॥ 84

15-వ రేకు. ఆహిరి

లేఁత మాయలు నీకు నింతేసి[1]
పూఁత పిగ్గులే[2] బూమిలో వారికి (?)
యీఁతవలపు చిత్తములోన నెవ్వరికైనఁ దెలుసునే[3] ॥ పల్లవి ॥

కొప్పునఁ జిన్ని కొనలు సాగ కురులు దురుమ నేఁటికే
కుప్పలు గాఁగఁ జెక్కులదాఁక కుంకుమ పూయనేఁటికే
ముప్పిరి గొనఁగ రెప్పల తుదల ముద్దులు గునియ నేఁటికే
విప్పక నెలవిఁబార నవ్వుచు వింతలు నేయనేఁటికే ॥ లేఁత ॥

గుబ్బల మించులు పయ్యెద వెడల కులికి నడవ నేఁటికే
గబ్బితనము చూపులోని కలికిలాగులేఁటికే
వాబ్బిడియైన చెలులలోన వొయ్యారములేఁటికే
అబ్బురపడఁగ జూచిన వారికాసలు నేయు నేఁటికే ॥ లేఁత ॥

కొండల తిమ్మని[4] జూచి లోలో కుతిల కుదువ నేఁటికే
కొండుక వయసు వారికింత గుట్టున నడవ నేఁటికే
యెండయు నీడయు నిపుడె కంటిమెమ్మెలఁ బొరల నేఁటికే
కొండంతమేలు నేసిన వారిని[5]కొడిమెలెన్న నేఁటికే. ॥ లేఁత ॥ 85

తెలుఁగుఁగాంబోది

చెట్ట వట్టేవేరా నన్నుఁ జెంచుదానిని[6]
పుట్టుతేనెలారగించి పోకవుండేవా ॥ పల్లవి ॥

---

1. వి. రే. ఓ. ౫౪. మాయలుకేల నీకింతేసి. 2. వి. రే. ౫౪. సిగ్గులు. 3. వి. రే లోవల నెవ్వరికిన్నియుఁ దెలుసునే. 4. వి. రే. ఓ. తిమ్మయ్య ౫౪. తిమ్మయ. 5. వి. రే. ౫౪. వారికి. 6. వి. రే. ౫౪. యీ పుట్ట.

కుదురు గదలని నా గుబ్బలే చూచితి గాని
గదరుఁ బుఱుఁగు కంపు గానవైతివిగా [1]
చిదిమినా నెఱఁగవు చేరేవు నా పొదగని
గుదికొన్న మరునమ్ము గుండె దాఁకెనా ॥ చెట్ట ॥

తోరంపు నా మెఱుఁగుల తొడలే చూచితి గాని
జీరల నా చెమటమై చిత్తగించవా
కేరేవు నా పొడగని కిందుపడి నీవు నాకు
యీరాని చనవులెల్లా నియ్యనోపుదా ॥ చెట్ట ॥

పిక్కటిల్లు తేనెల నా పెదవే చూచితి గాని
చొక్కపు నా యెంగిలిని చూడవైతిగా [2]
ఇక్కువ గరఁగి వేంకటేశ నన్నుఁ గూడితివి
వొక్కనిమిషమోరువ నోపవైతిగా. ॥ చెట్ట ॥ 86

శ్రీరాగం

తేనెయు నేయు [3] నంపేవు తీపుమాటల
కానీలే తేనెయు నేయుఁ [4] గాదా నీయలుక ॥ పల్లవి ॥

కప్పురమే యంపేవు కటకటా అందుతోనే
అప్పుడైనా నిమ్మపండు నంపవైతివి
కప్పురగంధికి [5] నీ కరుణ లేకుండుటే
కప్పురము నిమ్మపండుఁ గాదా నీయలుక ॥ తేనె ॥

సంపెఁగనూనె యంపేవు సారెసారె నందుతోనె
అంపవైతి గన్నేరలు అప్పుడైనాను [6]
ఇంపులేని కోమలికి నేఁటికి సంపెంగనూనె
కంపులును గన్నేరలుఁ గాదా నీయలుక ॥ తేనె ॥

1. ని. రే. ౧౧౨, వైతివా. 2. వైతివా, 3. సా. రే. నెయ్యి. 4. నెయ్యిఁగా.
5. గంధికిని నీ. 6. అంపరాని గన్నేరలు నంపవైతివి.

నేరేడుఁబండ్లే యంపేవు నెలఁతకు నందుతోనె
　ఆరనియానవాలై నా నంపవైతివి
　కోరి వేంకటేశ యింతిఁ గూడితిగాక లేకుంటే
　నేరేడుఁబండ్లుఁ బాలును నేఁడేపో నీకునులుక ॥ తేనె ॥ 87

### కన్నడగౌళ

ఏమనఁగలదిఁకఁ గాలము యింతయు విపరీతములై
　భామినిదేహము పరితాపంబున వేఁగెడిని ॥ పల్లవి ॥

కప్పురమియ్యని వీడెము గైకొనకొల్లని కాంతకు
　కప్పురమంటిన చోట్లే కడుఁగడుఁ దొక్కెడిని
　పుప్పొడివెన్నెల పొళ్ళు (?) [1] పొలఁతికి వెన్నెల బాయిలు
　నిప్పులఁ దోఁగినయట్లే నిలువునఁ గాఁగెడిని ॥ ఏమన ॥

పానుపు పువ్వులఁ బరవక పవళింపని సతి పూవుల—
　పానుపు కన్నులఁ జూచినఁ బరవశమందెడిని
　లేనగవాదవని మాటలు లేనిలతాంగికి నగవులు
　కానుకపట్టిన [3] నొల్లక కన్నుల విసిగెడిని ॥ ఏమన ॥

కందర్పుని గురుఁడనఁగాఁ గలిగిన తిరువేంకటపతి—
　చందము చూపుల భామిని చనవున నొప్పెడిని
　ఇందు వదనకే దేవుఁడు యింపులఁగడు మన్నించిన
　కందువ పొలయలుకలఁ దమకము వడి రేఁపెడిని ॥ ఏమన ॥ 88

### ముఖారి

అతఁడేపో చెలియా మాయాతఁడు
　చేతనే పరము చూపి (పీ*) చెలువైన యాతఁడు ॥ పల్లవి ॥

---

1. వి. రే. అఆ, లాఆ. లోను 'పొళ్ళు' అనియే. 2. వి. రే. లాఆ. బాయిలి.
3. వి. రే. అఆ. గట్టిన.

కుప్పలుగాఁ గస్తూరియు కుంకుమయు మయినిండ—
నప్పళించుకొని యున్న యాతఁడు
గొప్ప గొప్ప ముత్తేల[1] కుప్పె సవరము పెద్ద—
కొప్పుతోఁ జెలఁగీ నదె * కో మా యాతఁడు ॥ ఆత ॥

మలయుఁ జెక్కుల నవ్వు మకర కుండలముల
అలర నిగ్గులె చల్లే యాతఁడు
బలువైన ముత్యాల పదకాల హారాల
వెలుఁగొందీ నదె చూడవే మా యాతఁడు ॥ ఆత ॥

సంకుఁ జక్రపుఁ జేతుల సందుల బాహాపురుల
అంకెలఁ బ్రభల మించే యాతఁడు
వేంకట నగము మీఁద విభవంపుఁ గౌఁగిలి నా -
కుంకువగా నిచ్చె నదెకో మా యాతఁడు ॥ ఆత ॥ 89

16వ - రేకు. సాళంగం

వద్దు నాతో బొంక నిటువలె[2] నీకు నీ -
సుద్దుల కాఁకల మంట సోద చొచ్చేరా ॥ పల్లవి ॥

కనలి నే నపరాధిఁ గానని కలికి నీ -
కొనచూపులనే యలుగులఁ బారేనే
యెనసి యెవ్వతెకొ మోహింతువని నీ మోవి
మనసార నాలిక మద్దువట్టే రా ॥ వద్దు ॥

మఱచి యెవ్వతెతో నే మాటాడనని నీ -
చిఱునవ్వు నిప్పులు దోసిట ముంచేనే
తెఱలఁ గాఁగిన నీ దేహపు టుక్కుఁ గంబము
కఱతలిన్నియు నని కౌఁగిలించేరా ॥ వద్దు ॥

---

1. వి. రే. ౧౪. ముత్యాల. 2. వి. రే. ౬౧. వలెనా నీకు.

నెలఁత దక్కితినని నీ పెదెవు రసము
చలివాయ నిపుడు పోసము దాగేనే
కలసియు నన్ను వెంకటరాయ కపటాన—
నలయించేవని నీపై నాన వెట్టేరా. ॥ వద్దు ॥ 90

వరాళి

పన్నీరు చల్లేరా నీపై పఁచని దెవ్వతో
అన్నువయలపుతోడ నసలాయఁ [1] జెక్కులు ॥ పల్లవి ॥

కప్పురము చల్లె నీపై కలికి యదెవ్వతో
యిప్పుడె నీ వురమెల్ల నెజ్జ నాయను
చెప్పరాని మురిపెంపు చేఁతలెల్ల నాకును
కప్పినఁ గప్పఁగరాని గతులాయ నిప్పుడు ॥ పన్నీ ॥

మృగనాభి చల్లె నీపై మెలఁత యదెవ్వతో
తెగువ నీమోమెల్ల తెల్లనాయను
నగవు మేలము గాదు నమ్మరా నా పలుకు
సగమాయ నిప్పుడే యీ చక్కని నీ దేహము ॥ పన్నీ ॥

కుంకుమ చల్లెర నీపై కోమలి యదెవ్వతో
సంకె దేరి నీమేనెల్లా చల్లనాయను
వేంకట విభుఁడ నీకు వెచ్చమైతిఁ [2] జెప్పరా
వుంవకుగా నాకు నబ్బె ఉదుటు నీచేఁతలు. ॥ పన్నీ ॥ 91

ఆహిరి

కుందణంపుమై గొల్లెత తా—
నెందును బుట్టని యేతరి జాతి ॥ పల్లవి ॥

---

1. వి. రే. ౪౧. ఆసలాయ. 2. వెచ్చనైతి.

కప్పులు దేరేటి కస్తురి చంకల
కొప్పెర గుబ్బల గొల్లెత
చప్పుడు మట్టెల చల్లలమ్మెడిని
అప్పని ముందట హస్తిణిజాతి ॥ కుంద ॥

దుంప వెంట్రుకల దొడ్డతురుముగల—
గుంపెన నడపుల గొల్లెత
జంపుల నటనలఁ జల్లలమ్మెడిని
చెంపల చెమటల చిత్తిణిజాతి ॥ కుంద ॥

వీఁపున నఖములు వెడవెడ నాఁటిన
కోపపుఁ జూపుల గొల్లెత
చాఁపున కట్టిగఁ జల్లలమ్మెడిని
చాఁపేటి యెలుగున శంకిణిజాతి ॥ కుంద ॥

గారవమున వేంకటపతి కౌఁగిట
కూరిమిఁ బాయని గొల్లెత
సారెకు వతనితో చల్లలమ్మెడిని
భారపుటలపుల పద్మిణిజాతి ॥ కుంద ॥ 92

## ముఖారి [1]

సతి గర్వమిది నీ తేజము గాదా
అతివఁ బ్రేమముతోఁ నాదరించవయ్యా ॥ పల్లవి ॥

కనకపుఁ జమ్మాళిగలు మెట్టియల జ—
వ్వని గర్వమున నిట్టె వచ్చి వచ్చి
వెనక వెనకకె పోయీ వెఱచి దేవరఁగని
కనకపందలము గక్కున నంపవయ్యా ॥ సతి ॥

అడప తొయ్యలి తన[1] కాకు మడిచియ్యఁగా[2]
నడపుల[3] మురిపేన నవ్వుచు వచ్చి
అడరి నీ పొడగని[4] ఆకదే తనకుఁ దానె
మడుచుకొనెడి నీవె మడిచియ్యవయ్యా ॥ సతి ॥

కొప్పున సంపంగిరేకులు గానరాఁ జెరిగి
కప్పుచు నెరుల విన్నుఁ గని కలికి
యెప్పుడునుఁ దిరువేంకటేశుఁడ నీ వెఱపెల్ల
చెప్పరాని తమకమే చిత్తగించవయ్యా ॥ సతి ॥ 93

## భైరవి

గోళ్ళు మీఁటుచునుండెఁ గొన్నాళ్ళు గొల్ల—
వీళ్ళ పాలారగించె వీఁడు కొన్నాళ్ళు ॥ పల్లవి ॥

కోడెకాఁడై తిరిగెఁ గొన్నాళ్ళు తాఁ
గోడెల నావులఁ గాచెఁ గొన్నాళ్ళు
కోడెల వల్లెతాడై గొల్లెతలా తాఁ
గూడి పైకొన నుండెఁ గోరి కొన్నాళ్ళు ॥ గోళ్ళు ॥

గుజ్జు రూపము ధరించెఁ గొన్నాళ్ళు (తా?)
గుజ్జనగూళ్ళారగించెఁ గొన్నాళ్ళు
గుజ్జుబాలకిఁ దగిలెఁ గొన్నాళ్ళు తా
బొజ్జనె లోకము నించె పొందుగఁ గొన్నాళ్ళు ॥ గోళ్ళు ॥

కొండ గొడుగుగాఁ బట్టెఁ గొన్నాళ్ళు తాఁ
గొండముచ్చుల నేలెఁ[5] గొన్నాళ్ళు
కొండల కోనేటివాఁడై కోరికలా తాఁ
గొండుక చేఁతలు దొంకొనియెఁ గొన్నాళ్ళు ॥ గోళ్ళు ॥ 94

1. ని.రే. ౩౬. తన్నకాకు. 2. య్యగాను. 3. నడపుల్ల. 4. అడరుచు నినుఁగన్ని.
5. ని.రే. ౧౫. లనేయేల.

ముఖారి

దొరకెఁగా పూజ కందువపూజ నీ—
విరహపు తనుతావి విరవాదిపూజ ॥ పల్లవి ॥

కలికి నీ కనుచూపు కలువరేకులపూజ
లలన నీ నగవు మొల్లల[1] పూజ
తలపోఁత చింత చిత్తపుఁ గమలపు పూజ
చలివేఁడి వూర్పు నీ సంపంగి పూజ ॥ దొరకె ॥

కనలుఁ జెక్కునఁ జేయి కరపల్లవపు పూజ
తనుపులకలు జాజినవలపూజ
తనరు నీ వలులు దొంతరపూవుల పూజ
మొనయుఁ జెమట మల్లెమొగ్గలపూజ ॥ దొరకె ॥

చెనకు నీ గోళ్ళ చిఱుగేదఁగుల పూజ[2]
గువియు గుబ్బలు పూవుగుత్తుల పూజ
ఘనతమైఁ గూడి వేంకటపతి మోము సోఁ—
కిన పీదుమోవి మంకెనపూవు[3] పూజ ॥ దొరకె ॥ 95

17వ రేకు. ముఖారి

పసులు గాచేటి కోల పసపుఁజేల
పొసఁగ నీకింతయేల బుద్ధుల గోల ॥ పల్లవి ॥

కట్టిన చిక్కపు బుత్తి కచ్చకాయల తిత్తి
చుట్టిన పించెపుఁబాగ చుంగుల సోగ
ఇట్టి సింగారము సేయ నింత నీకుఁ బ్రియమాయ
వెట్టి నీచేఁతల మాయ విట్టలరాయ ॥ పసులు ॥

1. ని.రే.ఒ.౩. మల్లెల. 2. సా.రే. చిగురు గేదఁగి పూజ. 3. ని.రే. ఒ.౩. పూవులపూజ

పేయఁ బిలుచుకూఁత పిల్లఁగోవి బలుమోఁత
సేయరాని గొల్లెతల సిగ్గులచేఁత
[1]ఆయెడలఁ దలపోఁత యమున లోపలి యీఁత
వేయరాని మోపులాయ విట్టలరాయ ॥ పసులు ॥

కొంకులేని పొలయాట కూరిములలో తేట
అంకెల బాలులతోడి యాట పాట
పొంకపు తుత్తురు కొమ్ము పొలుపైన నీ సొమ్ము
వేంకటనగము చాయ విట్టలరాయ. ॥ పసులు ॥ 96

## భైరవి

ఉగ్గు వెట్టరే వోయమ్మా చె[2]–
య్యొగ్గినిదె శిశువోయమ్మా ॥ పల్లవి ॥

కడుపులోని లోకమ్ములు గదలీ–
నొడలూఁచకురే వోయమ్మా
తొడికెడి సరుగనఁ దొలఁగఁదీయరే
వుడికెడి పాలివి[3] వోయమ్మా ॥ ఉగ్గు ॥

చప్పలు వట్టుక సన్నపుబాలుని–
నుప్పరమెత్తకురో యమ్మా
అప్పుడె సకలము నదిమీ నోరనె[4]
వొప్పదు తియ్యరె వోయమ్మా ॥ ఉగ్గు ॥

తొయ్యలులిటు చేతుల నలఁగించక
వుయ్యల నిడరే వోయమ్మా
కొయ్య మాటలను కొండల తిమ్మని[5]–
నొయ్యన తిట్టకురోరమ్మా. ॥ ఉగ్గు ॥ 97

1. వి. రే. ౪౧. యేయెడఁ జూచిన నీ యమున. 2. వి. రే. ౮౧. చెయి వొగ్గి. 3. ౮౧. పాలిదె. 4. నోరను. 5. తిమ్మయ.

## దేసాళం

కొలనిదోఁపరికి గొబ్బిళ్ళో యదు—
కులము స్వామికిని గొబ్బిళ్ళో ॥పల్లవి॥

కొండ గొడుగుగా గోవులఁ గాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్ళో
దుండగంపు దైత్యులకెల్లను తల—
గుండు గండనికి గొబ్బిళ్ళో ॥కొలని॥

పాపవిధుల శిశుపాలుని తిట్ల—
కోపగానికిని గొబ్బిళ్ళో
యేపునఁ గంసుని యిడుమలఁ బెట్టిన—
గోపబాలునికి గొబ్బిళ్ళో ॥కొలని॥

దండివైరులను తఱిమిన దనుజుల—
గుండె దిగులునకు గొబ్బిళ్ళో
వెండిఁ బైఁడియగు వేంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్ళో. ॥కొలని॥ 98

## కాంభోది

తమ్ములాల అన్నలాల తల్లులాల నే
నెమ్మనపు హరిఁ బాసి నిలువనేనిఁకను ॥పల్లవి॥

కొమ్మలాల మరుకోట కొమ్మలాల వో—
యమ్మలాల తొలరె నా యక్కలాల
తమ్మిరేకుఁ గన్నుల యాతనిఁ బాసి నే—
నుమ్మల సొమ్మలచేత నుండలేనిఁకను ॥తమ్మ॥

చెలులాల కలికి తొయ్యలులాల వో—
యెల జవ్వనముల మోహినులాల
చెలువంపు హరిఁ దలఁచిన నాకు నే (?)—
[illegible]

బోఁటులాల జవ్వనపు మేఁటులాల వో-
గాఁటపుఁ దురుముల చీఁకటులాల
వాఁటమైన వేంకటేశ్వరుఁ బాసి నే-
నాఁటదాననై జన్మమందలేనిఁకను. ॥ తమ్మ ॥ 99

## పాడి

ఏఁటికిఁ జేరీనేమితఁడు
నాఁటించి రతి నన్నేలె ॥ పల్లవి ॥

కన్నుల మొక్కీఁ గానుకలంపీ-
నెన్నటికెన్నఁడిదేమితఁడు
నిన్నట నుండియు నెయ్యమె పెంచీ
నన్నేలీతఁడు నవ్వీనే ॥ ఏఁటి॥

పువ్వుల వేసీఁ బొంచుక లాసీ-
నెవ్వరికెవ్వరిదేమితఁడు
దవ్వుల నున్నాఁ దాపము రేఁచీ
రవ్వలనే కడు రాసీనే ॥ ఏఁటి ॥

కంపులె పూసీఁ గౌఁగిట మూసీ-
నింపులు నేసీనేమితఁడు
చెంపల చెమటల శ్రీ వేంకటేశుఁడు
అంపరాని విభుఁడాయఁ గదే. ॥ ఏఁటి ॥ 100

## శ్రీరాగం

సామాన్యమా వలపు సతులుఁ బతులనుభవన (ము*)-
[1] లేమరినఁ బ్రాణంబులేరీతి నుండు ॥ పల్లవి ॥

1. ని. రే. ౨౩. వన. యామరిన.

కలికి చూపుల మనసు గరఁగకెటువలె నుండు
అలయింతలను దేహమలయకేలుండు
బలుపుఁ బిలుపుల మేను పులకించకేలుండు
మొలకనగవుల యా (నా?) స మొలవకేలుండు ॥ సామా

పచ్చిచూపులు [1] కాఁడి పారకెటువలెనుండు
వెచ్చనూర్పులు [2] మనసు వేఁచకేలుండు
మచ్చికల హృదయంబు మరులు గొనకేలుండు
అచ్చలంబునఁ గాఁకలలమకేలుండు ॥ సామా

దంటమాటలఁ గూర్మి దగులకెటువలెనుండు
నంటునను మోహంబు నాఁటకేలుండు
గొంటుఁజేఁతల (లు?) మనసు కొల్లగొనకేలుండు
రెంటలను విరహాగ్ని రేఁచకేలుండు ॥ సామా

కింకలను దమకంబు కెరలకెటువలె నుండు
జంకెనలఁ బ్రేమ కొనసాఁగకేలుండు
వేంకటవిభుఁనిఁ గలసి [3] వెడయలుక యేలుండు
పంకజానన వానిఁ బాసియేలుండు. ॥ సామా ॥ 1

18-వ రేకు. మంగళకౌశిక

*నేనేలెవ్వరునేల నీకింక లో—
లోనె వలపు లోఁచీఁ బోవయ్యా ॥ పల్ల

కలువరేకులు నీకుఁ గానుక యిచ్చినదట
చెలఁగి నీవెందో విచ్చేయఁగాను
అలమి కన్నులనె నీ వందుకొఁటివని యాకె
పిలిచీనంటాఁ బిలిచేరు పోవయ్యా ॥ నే

1. పుఁకాఁడి. 2. నూర్పుల. 3. సా. రే. వేంకటాద్రివిభుఁగాంచి వెడ.

చిగురుఁదేనెలు నీపై చిలకించినదట
నగవు నీ వెందో నగఁగాను
జిగిగా నీ వపుడే చేకొంటివంటా నాపె
నొగిలినంటా నొగిలేరు పోవయ్యా ॥ నేనే ॥

* మోవిపండు నీకు మోవినిచ్చినదఁట (?)
మాపికింద నీవు మలయఁగాను
శ్రీవేంకటేశ యిచ్చితివి కౌఁగిలి నాకు
నీ వెందు వలచినా నేనే పోవయ్యా. ॥ నేనే ॥ 102

శ్రీరాగం.

గొల్లెతలకేలరా గోవజవ్వాది నీకు
చెల్లుఁగాక యెటువలెఁ జేసినా నన్ను (ను?) ॥ పల్లవి ॥

కట్టినది అంచులతొగరుఁ జీర సందిఁ
బెట్టినది మొలవంక పెద్దగాజు
మెట్టిన (ది?) కంచుమట్టెల మించుమోఁత చేతఁ
బట్టినది చల్లచాడె పట్టకురా నన్నును ॥ గొల్లెత ॥

మాసినది తురుము చెమరుకంపు నే
వేసినది వెండికుప్పె వెంట్రుకదండ
వోసికొట్లు గొట్టి కంచుటుంగరాల చేయి
తీసేవు నీ చెల్లెతోడు తియ్యకురా నన్నును ॥ గొల్లెత ॥

ముంచినవి చెమటలు మోమునిండ కడు—
నించినది చూడరా నావాలుఁజూపు
యెంచనేల నన్నునిట్టె యేలితివి వోరి
చెంచెతల లంజకాఁడ శ్రీవేంకటేశుఁడా. ॥ గొల్లెత ॥ 103

* 'మోవిపండు' ఇది ఒక జాతిపండు.

పాడి

ఏతులే నెరప వచ్చెనెవ్వఁడే వీఁడు తన-
రాతిగుండెతోడ నన్ను రమ్మనీనే చెలియా ॥ పల్లవి ॥

కదిమిన చూపులకుఁ గన్నుల నవ్వుచు నా-
యెదురయి నిలుచున్నాఁడెవ్వఁడే వీఁడు
ఉదుటు మీరి తిరిగి నొదిగి పీనిమదము
సదనేసి వడి నణఁచఁగదె వోచెలియా ॥ ఏతు ॥

చేరువనె నిలుచుండి చెలితో నవ్వఁగను
యీరసములే యాడీ నెవ్వఁడే వీఁడు
వారించకిటువంటివానిఁ బట్టి కొనగోరఁ
జీరలుగా నొడలెల్లఁ జించఁగదె చెలియా ॥ ఏతు ॥

చెంతనుండి నన్ను వేసీ సేమంతిపూవులనే
యెంత చెప్పినా మానఁడెవ్వఁడే వీఁడు
ఇంతటి యీ తిరువేంకటేశుఁడిదె నన్నుఁ గూడి
పంతము నెరపి పోయీఁ బట్టుకొనవే చెలియా. ॥ ఏతు ॥ 104

లలిత

నిక్కమటే యీ[1] మాట నిజమటేవు
నిక్కముగాక బొంకనేర్తుమా బాలుఁడా ॥ పల్లవి ॥

కంటివటే వెన్న దియ్యఁగా గొల్లెతా ని-
న్నంటిమా మా వెన్న వోయనంటిమి గాక
ఇంటికి నే వచ్చితినటే గొల్లెతా మా-

ఏలే మాకుఁ బాలు లేవచే గొల్లెతా నీకు-
నేలలేవు మమ్మునిట్టె యేఁచేవు గాక
పాలి నేఁబందుట దలంపవే గొల్లెతా ఆ-
పాలు నీకునేల మా పాలేకాక బాలుఁడా ॥ నిక్క ॥

కల్లలాడ దొరకొంటిగా గొల్లెతా యేల
పల్లదాలు వేంకటాద్రిపై బాలుఁడా
చెల్లఁబో నన్నొల్లవచే చిన్నిగొల్లెతా నీకుఁ
జెల్లునిట్టె యేమైనఁ జేయవయ్య బాలుఁడా. ॥ నిక్క ॥ 105

## పాడి

అప్పటిని చెక్కు నొక్కేవందుకా యిది
యెప్పుడో కూడితిరి మీరిందుకా యిది ॥ పల్లవి ॥

కుందనపు బొమ్మవలెఁ గోపగించుకొని రాఁగా -
నందలానఁ బెట్టుకొంటివందుకా యిది
జందెపు ముత్తెపుఁబేరు సందులదండల నిట్టే
యిందమంటానింతికిచ్చితిందుకా యిది ॥ అప్ప ॥

దీకొని కోమలి నిన్నుఁ దిట్టుచు దగ్గరి రాఁగా
ఆకు మడిచియ్యఁ జూచేవందుకా యిది
మీకు మీకే మందటాడి మీరు మీరేమీలోన
యేకమై కూడితిరి మీరిందుకా యిది ॥ అప్ప ॥

ముద్దులమోముల మీ మీ మోవులపై చేఁతలెల్ల
నద్దములోపలఁ జూచేరందుకా యిది
తిద్దుకొంటిరి రతులు[1] తిరువేంకటేశ మీ -
యిద్దరికి నింపులాయ నిందుకా యిది. ॥ అప్ప ॥ 106

1. వి. రే. ౨౪. కొంటిరలపుడు.

పాడి

చక్కని తల్లికి చాఁగుబళా తన-
చక్కెరమోవికి చాఁగుబళా ॥ పల్లవి ॥

కులికేటి మురిపెపుఁ గుమ్మరింపుఁ దన-
సళుపుఁ జూపులకు చాఁగుబళా
పలుకుల సొలపులఁ బతితోఁ గసరెడి[1] -
చలముల యలుకకు చాఁగుబళా ॥ చక్కని ॥

కిన్నెరతోఁ బతి[2] కెలన నిలుచుఁ దన-
చన్ను మెఱుఁగులకు చాఁగుబళా
ఉన్నతిఁ బతిపై నొరగి నిలుచుఁదన-
సన్నపు నడిమికి చాఁగుబళా ॥ చక్కని ॥

జందెపు ముత్యపు సరులహారముల -
చందనగంధికి చాఁగుబళా
విందయి వేంకటవిభుఁ బెనఁచిన తన -
సందిదండలకు చాఁగుబళా. ॥ చక్కని ॥ 107

20-వ రేకు[3] శంకరాభరణం

పోదిగా[4] నేఁడతనికే పొలఁతి మానము గావ
సేదదేరఁ జెమటలు చిలికించెఁ జూడరే ॥ పల్లవి ॥

కుంతలపు నెరుల చిక్కుల చీఁకటులఁ జిక్కె
యింతలోనే ముఖచంద్రుఁడింతికి నేఁడు
చెంత వాయఁ బతివచ్చి జిగిచన్నుఁగొండలపై
పింత చందురుల దండు విడియించెఁ జూడరే ॥ పోది ॥

1. వి. రే. ౨౩. గొసరెడి. 2. కిన్నెరపతితో కెలన. 3. ౧౯-వ రేకు నష్టమైనవానిలో నొకటి. 4. వి.రే. ౫౩. పోదుగా.

ఈతల నిట్టూరుపుల యెండమావులనె వాడె[1]
 లేఁతమోవి చిగురు యీ లేమకు నేఁడు
 పూఁతగాఁ దెచ్చి చెలియ పులకలవెల్లి నించె
 మేఁతలాడి[2] రమణుఁడీ మెలుఁతమైఁ జూడరే ॥ పోది ॥

పుట్టుభోగి సిగ్గుల చూపుల పూవుఁదీగెలపై
 పిట్టపిడుగాయ సతిప్రేమము నేఁడు
 గట్టిగ వేంకటపతి కౌఁగిటనలమి కొమ్మ
 దిట్టఁజేసి భయమెల్ల దిగఁదోసెఁ జూడరే ॥ పోది ॥ 108

నారణి[3]

ఏమి సేయఁగవచ్చు నేకాలమే త్రోవ
 ఆమీఁది దైవగతులటుగాక పోదు ॥ పల్లవి ॥

కనుమాయ నెన్నడిమికరవుననె లలితాంగి
 పనువుచునుఁ గుచగిరుల పాలాయను
 కనలి లోలోని దొంగలచేతఁ బోటువడి
 పొనరఁ గట్టినచీరయును శిథిలమాయ ॥ ఏమి ॥

పెడమరలి నునుఁదురుము పెదచీఁకటినె చెలియ
 బడలి వదనము వంచఁ బాలాయను
 వెడఁదకన్నుల చూపువేడుకల వగలెల్లఁ
 దడవి హితవైన చిత్తంబు నెరవాయ[4] ॥ ఏమి ॥

అరుదైన పరవశంబను అడవిలోఁ దగిలి
 పరిమళపుఁ జెమట నది[5] పాలాయను
 యిరవైన తిరువేంకటేశు కౌఁగిటఁ గూడి
 కురులు సవరించ సిగ్గులునుఁ బగలాయ. ॥ ఏమి ॥ 109

---

1. నాఁడె. 2. మేఁతలాఁడి (డీ?). 3. ని. రే. ౩౩. నారాయణి. 4. త్తంబుఁ బగలాయ. 5. నదిచెమట.

## శ్రీరాగం

అంతేసంతకు గాలినణఁగునా యనలంబు
కాంత నిట్టూర్పులాఁకలి చెరిచెఁగాక ॥ పల్లవి ॥

కలువలూరక సీటఁ గందునా యెంతైనఁ
జెలియకన్నీరిట్లఁ జేసెఁ గాక
జలజంబుపై వేఁడి చల్లునా రవి యిట్ల
నలఁచి మదనాగ్ని వదనము నొంచెఁగాక ॥ అంత ॥

వియలకునుఁ దుమ్మిదలు వెరచునా యెంతైన
మరుబాణముల నెరులు మలఁగెఁగాక
పరుస మంచునఁ దీగె వాడునా యెంతైన
అరిది చెమటలనె దేహము నొగిలెఁ గాక ॥ అంత ॥

కుముదహితుఁడెంతైనఁ గూడునా జక్కవల
కొమరె గుబ్బలమీఁదఁ గూడెఁ గాక
తిమిరంబు తిమిరమునఁ దెమలునా యెంతైన
రమణి వేంకటవిభుని రతిమఱపుగాక. ॥ అంత ॥ 110

## ముఖారి

ఆఁపలేక నిను దూరేనంతె కాక
యేఁపుచుఁ గూడేటి[1] పొందులేలయ్య విభుఁడా ॥ పల్లవి ॥

కోపగించుకొన్నచోట కూరిమితో వినయమే
చూపిన నామాట నీకు సొగసీనచే
యేపు రేఁగి నీకుఁ బ్రియమెక్కుడనో వుండఁగాను
పాపమయ్యో పొందు నీకుఁ దగదయ్య విభుఁడా ॥ ఆఁప ॥

నేఁములెన్నఁగ నేను నిజములు పలికిన
పైఁడములే యౌఁగాక పలపౌనచే
యీపడీఁచుఁ బేను వచ్చినిఁకనేల మాటలు నీ—
వాదము నమ్మిఁకఁ దడవకుమయ్య విభుఁడా ॥ ఆఁప ॥

1. ని. రే. ఆ. గూడెది.

ననిచి కూడినవారు నమ్మక[1] ప్రియునిమీఁద
కనలి యాడినమాట కసరౌనవే
ఘనుఁడవు తిరువేంకటరాయ మనలోని-
కినుకలన్నియు నిట్టె గెలుపయ్యె విభుఁడా ॥ ఆఁప ॥ 111

కాంబోది

అతివ జవ్వనము రాయలకుఁ బెట్టిన (ట్టని*) కోట
పతి మదనసుఖరాజ్యభారంబు నిలుప ॥ పల్లవి ॥

కాంతకనుచూపు మేఘంబులోపలి మెఱుఁగు
కాంతుని మనంబు[2] చీఁకటి వాపను
ఇంతి చక్కనివదన మిందుబింబము విభుని-
వంత కనుదోయి కలువలఁ జొక్కఁజేయ ॥ అతివ ॥

అలివేణిధమ్మిల్లమంధకారపు భూమి
కలికి రమణునకు నేకతమొసఁగను
పొలఁతికి[3] బాహువులు పూవుఁదీగెల కొనలు
పొలసి ప్రాణేశు వలపుల లతలఁ బెనచ ॥ అతివ ॥

పంకజాననరూపు బంగారులో నిగ్గు
వేంకటేశ్వరు సిరులు వెదచల్లఁగా
చింకచూపుల చెలియచేఁత మదనునిచేఁత
యింకా నతనినె[4] మోహించఁ జేయఁగను ॥ అతివ ॥ 112

నాదరామక్రియ

ఏమి సేయుదునమ్మ యిన్నియును నిటుగూడె[6]
తామసపుఁ బ్రేమ వేదనఁ బాయనీదు ॥ పల్లవి ॥

---

1. నమ్మికప్రియు. 2. సా.రే. మనసు. 3. వి.రే. ఉా. పొలఁతికి. 4. ఇంకా నతనిమో. 5. తా. వెం; తం. ప్ర. కాంబోది-జంపెతాళము. 6. తా. వేం. నాతామప.

కినిసి నే సొలసి పలికెద నంటినా యతని-
  నెనయుఁదడఁబాటు నోరెత్తనీదు
  చెనకి యలపార[1] జూచెద నంటినా యతని-
  కనుఁగవ జలంబు సరుగనఁ జూడనీదు ॥ ఏమి ॥

కిందుపడి కదిసి మ్రొక్కెద నంటినా యతని-
  యంది (నంది?) పరవశము[2] చేయాడ నీదు
  డెందంబు మఱచి యుండెద నంటినా యతనిఁ
  జెందిన తలఁపు మఱచియు మఱవనీదు ॥ ఏమి ॥

తిరువేంకటేశుఁ బొందితినంటినా[3] యతని-
  దొరతనము నాగరిమ దోఁచనీదు
  సిరిదొలఁకు రతుల నలసితి[4] నంటినా యతని-
  సరసంబు వేడుకలఁ జాలించనీదు ॥ ఏమి ॥ 113

21-వ రేకు. కాంబోది-రచ్చతాళం

తవ మాం ద్రష్టుం దయాస్తివా
  [5]త్రివిధైర్ఘనాని తే నామాని ॥ పల్లవి ॥

కరరమణీ కంకణైర్ఘనకుచ-
  గిరౌ[6] స్థాపిత కిన్నరీయం[7]
  సరసం ప్లేచ్ఛరచనాని త్వయి[8]
  స్థిరా నదయతి తే నామాని ॥ తవ ॥

కలవర(రవ*) కంపిత కంఠవిలసనం
  కిలకిలమేళన కిన్నరీయం
  లలనా కావా లంఘితవాద్యం
  తిలకయతి తదా తే నామాని ॥ తవ ॥

---

1. తా. వేం. యెలవార. 2. తం. ప్ర. అందినా పరవశత. 3. తం. ప్ర: తా. వేం గలసెద నంటినా. 4. నలసెద నంటి. 5. ని. రే. ఉ౯. త్రివిశీర్ఘనా. 6. గిరియో. 7. కిన్నెరియాం. 8. శ్వేసుసిరా.

నిరత మూర్ఛనా నిబిడతాళరవ[1]
 గిరాయోజిత కిన్నరీయం
 తరుణీ రణయతి తదా సమీపే
 తిరువేంకటవర తే నామాని. ॥ తవ ॥[2] 114

### వరాళి

సొంపుల నీ వదనపు సోమశిల కనుమ
 యింపులెల్లఁ జేకొనఁగ నిల్లు నీపతికి ॥ పల్లవి ॥

కలికి నీపిఱుఁదనే గద్దెరాతికనుమ
 మొలనూళ్ళలతలనే ముంచుకొన్నది
 కలయఁ బోకముడినే కట్లువడ్డది
 అలరువిలుతుదాడికడ్డము నీ పతికి ॥ సొంపు ॥

ఇదివో నీ కెమ్మోవి యెఱ్ఱశిల కనుమ
 కదిసి లేఁజిగురులఁ గప్పుకొన్నది
 వదలకింతకుఁ దలవాకిలైనది
 మదనుని బారికి మాఁటువో నీ పతికి ॥ సొంపు ॥

కాంత నీ చిత్తమే దొంగలసాని కనుమ
 యింతటి వేంకటపతికిరవైనది
 పంతపు నీ గుబ్బలే గుబ్బలికొండకనుమ
 మంతనాల కనుమాయ మగువ నీ పతికి. ॥ సొంపు ॥ 115

### కన్నడగౌళ - అటతాళం

తురుము నీవియు జార తొయ్యలి వెరగంద
 సిరులఁ బరవశము సేసితిగా నీవు ॥ పల్లవి ॥

---

1. రవంచితా 2. ఈ సంకీర్తన [illegible]

కొమ్మమోవి నీకుఁ బిల్లఁగోవిగాఁగ నిడుకొని
కుమ్మరించుఁ గుత్తుకలోఁ గులుకుచును[1]
కమ్మవిలపు రసము చిత్తడిగా[2]ఁ గురియుచు
చిమ్మిరేఁగ రాగము నించితివిగా నీవు ॥ తురుము ॥

దంతిగుబ్బలు నీకుఁ బాంచజన్యములుగా
కడివోసి మొనలోలిఁ గదియ[3] నొత్తి
తడయక మదనయుద్ధము గెలిచితినంటా
వొడలి చెమటలార[4]నూదితిగా నీవు ॥ తురుము ॥

వెంటవీఁపిది నీకు వీణె వాళవుగా[5]
మొలపాఁడి కొనగోళ్ళ మోఁపి మోఁపి
కలసి కౌఁగిటను వేంకటగిరి విభుఁడ[6] నీ—
మెలుపుఁగళల తంత్రి మీఁటితివిగా నీవు ॥ తురుము ॥ 116

కన్నడగౌళ[7]

రమణి సురటిగాఁ జెరఁగు విచీని
చెమరించెనంటాఁ జెలి దూరీని ॥ పల్లవి ॥

కలిగంటినంటా కొటుకకసుల నీరు
వొలికఁగా మలగు[8]పై నుసురనీని
తల నొచ్చినంటా దంతపుటోవరిలోన
పలుకదు పిలిచినాఁ బవ్వళించీని ॥ రమణి ॥

తొలఁగితినంటా తూఁగుమంచముమీఁద
నెలపినవ్వులతోడ శిరసూఁచీని
అలసితినంటా నలరుఁబానుపుమీఁద
పులకలమేనితోఁ బొరలెడిని (లాడీని?) ॥ రమణి ॥

---

1. వి. రే. ౫౭. గులుకులను. 2. చిత్తరముగా. 3. గమియ. 4. టజార.
5. విదె.....గాఁగ. 6. కటగిరీంద్రుఁడ. 7. వి. రే. ౧౧౦. తెగదమ్మటతాళం. 8. గుమలు.

సొరిగితినంటా సురతపరవశాన—
నరవిరి కనురెప్పలల్లాడించీని
తిరమాయనంటాఁ దిరువేంకటేశ్వరుఁ
దరుణి గలసి యింకాఁ దమకించీని. ॥ రమణి ॥ 117

ఆహిరి

చెంగటనె చెలువంపుఁ జీఁకటి దవ్వఁగను
ముంగిట నిధానమబ్బె మొక్కుదుఁగాకిఁకను ॥ పల్లవి ॥

కొండుకవయసు కొమ్మగుబ్బలపైఁ [1] బ్రేమపు—
టెండదాఁకి పులకలనెన్ను వెళ్ళఁగా
బెండుపడి కైవాలెఁ బెనుదురుమిఁకనేమి
పండెఁ గోనుకొందుగాక పనులేఁటికిఁకను ॥ చెంగ ॥

చక్కని జవ్వని కన్నుఁజాయల పాదరసము
పుక్కిటి వెచ్చని వూరుపుల నూదఁగా
గక్కన బంగారాయ. కడలేని కోరికలు
దక్కెఁ దీసుకొందుగాక తడవేల యిఁకను ॥ చెంగ ॥

పల్లదపుఁ జెమటల పాల జలనిధి దచ్చి
వెల్లిగొన సిరులెల్ల వేంకటేశుఁడా
పల్లవాధరిచనవు పచ్చిదేర వేడుకెల్ల
కొల్ల చేకొందువుగాక కొంకనేఁటికిఁకను. ॥ చెంగ ॥ 118

ముఖారి

ఏలే దగ్గర నియ్యవిట్టె నన్ను
తూలపుచ్చి మరుబారిఁదోయ దొరకొంటివి ॥ పల్లవి ॥

---

1. ని. రే. ఙఙ గుబ్బపై.

కాలు దాఁకీ మొక్కేమయ్యా గబ్బిననేవు[1] గనక
యేల దగ్గర విచ్చేసేవిట్టె నన్ను
వాలుఁగన్నుల రెప్పలు వంచి వంచి మొక్కేవు
చాలదటే నన్ను నిట్టె చంపనెత్తుకొంటివి ॥ఏలే॥

తమ్మరసము వడీని[2] తలవయ్య నీ మీఁద
యెమ్మెలకడ్డము[3] వచ్చేవు యేఁటికే[4] నీవు
వమ్ముదొలి[5] మాటలనె (?) (నే*) వాఁడివసులనె నన్ను
కుమ్ముచుఁ బ్రాణమునిట్టె కొనదొరకొంటివి ॥ఏలే॥

గుబ్బలచెమట దాఁకీఁ[6] గోపగించేవు గనక
అబ్బురంపుఁ దిరువేంకటాధీశుఁడా[7]
జొబ్బిలు నా చెమటల సోనల నించక యట్టే[8]
బొబ్బలుగా నామేనెల్లాఁ బొక్కించ దొరకొంటివి ॥ఏలే॥ 119

22—వ రేకు, పళవంజరం

ఏమిటికిఁ జింత యిదె నీకు
ప్రేమపుఁ బెండ్లి బెరసెఁగా నీకు ॥పల్లవి॥

కలికి నీ చూపుల కలువదండలు దెచ్చి
తలఁకకాతవిమెడఁ దగులవేసి
మొలక నగవుల నీ ముత్యపుసేసలు చల్లి
తొలఁగని పెండ్లి దొరకెఁగా నీకు ॥ఏమి॥

చనవుఁ గూరిముల కొసరులను గరమిడి
ఘనమైన కాఁకలఁ గాలుదొక్కి
పనివడి వెన్నెల పాలకూడు గుడిచి
తనివోని పెండ్లి దగిలెఁగా నీకు ॥ఏమి॥

---

1. ని, రే. ౧౩. గబ్బివనేవు. 2. వడిసీఁదల 3. కడ్డాలు. 4, వచ్చేవేఁటికి. 5. దొని. 6. దాఁకికో. 7. టాద్రీశుడా. 8. జొబ్బలిన నీ చెమటల సోనల నించక కదే.
* విరసముకలైన తొలిమాటలనెడి పదనైన మొనలతో ?

తరుణి నీ హృదయపుఁ దమ్మిపరపుతోడ-
విరవైన సిరులతో నిల్లు నించి
తిరువేంకటగిరి దేవునితోఁగూడి
పరసపుఁ బెండ్లి జరగెఁగా నీకు. ॥ ఏమి ॥ 120

కాంభోది

చెంపల యేరు[1] ముండ్ల చెంచువారము నీకు-
నింపుగాని[2] మా పొందులేలయ్యా ॥ పల్లవి ॥

కమ్మనిమామయి[3] పూఁత గదరుఁబిల్లుల గబ్బు
యెమ్మెల మాపట్టుచీర యేపెనార[4]
సొమ్ములుఁ బెంచపుకన్నుఁ[5] జూపులయమ్మలనె
వొమ్మదు నీ పొందు నాకు[6] నొల్లమయ్యా ॥ చెంప ॥

కొప్పుగేదఁగులు మాకు కొన నమలీకలు
గొప్పముత్యాలివి మాకు గురిగింజలు
కప్పురంబు మాకేటి[7] గడ్డల తెల్లని మన్ను
వొప్పదు మాకేల యిచ్చేవొల్లము నేమయ్యా[8] ॥ చెంప ॥

కుంకుమ మా కిపుడు జేగురుఁదొడి నుదుటికి
బింకపుఁ దిప్పె[9] మా ప్రియములు
కంకిగాఁగ నెలయించి కౌఁగిటఁ గూడితి నన్ను
వేంకటవిభుఁడ యిఁక పీడవయ్యా. ॥ చెంప ॥ 121

వరాళి

కటకట సతిశృంగారము కన్నులపండువు దోఁపుచు
యిటువలె నిలిచి చిత్తంబిందరినేఁపెడిని ॥ పల్లవి ॥

1. వి రే. ౧౦౦. చెంపల్లయేదు. 2. గాము. 3. పైపూఁత. 4. యేపినార. 5. సొమ్ములఁ బిచ్చేవు నన్ను. 6. మాకు. 7. కప్పురపు మానికింది. 8. వొల్లమయ్యా. 9. దేంట్లే.

కోమలి కొప్పునఁ జెరివిన క్రొవ్విరులాత్మజు శరములు
వేమరుఁ బొదిగొన నాఁటిన విధమున నొప్పెడిని
కామిని పూసిన కస్తురి కంతుని బాణారుణిమే
యీమైఁ బైపైఁబేరిన యిటువలె నొప్పెడిని ॥ కట ॥

అతివకు భూషణజాలంబంతయు మరువస్త్రములకు
జతనంబగు మైమరుపై సరిఁ జెలువొందెడిని
సతి గట్టిన వెలిపుట్టము చంపెడు మదనుని బారికి
సితకరుఁడడ్డము చొచ్చిన చెలువము దోఁపెడిని ॥ కట ॥

బలుపగు చెలిచనుగుబ్బలపై వేంకటపతి నించిన-
లలితపురేఖల చిత్తరిలాగులు దోఁపుచును
వలరాయని చి(చీ*)రునమ్ములు (?) వడిఁదాకిన గంట్లవలెఁ
బొలుపుగఁ జూచినవారల బొమ్మరపరపెడిని. ॥ కట ॥ 122

ఆహిరి

అన్నిజాతులు దానె యైవున్నది[2]
కన్నులకలికి మాయగరచెనో యనఁగ ॥ పల్లవి ॥

కన్నె శంకిణిజాతి గాఁబోలు వీఁపునను
సన్నపు మదనాంకములు జడి[3] గొన్నవి
వన్నెలుగ వలరాజు వలపు తలకెక్కించ
పన్నినటువంటి సోపానములో[4] యనఁగా ॥ అన్ని ॥

తెలువ దలపోయ చిత్తిణిజాతి గాఁబోలు
నెలులు విచ్చుచు వీధి నిలుచున్నది
నెఱతనము[5] మరుఁడు తను[6] నిండనేసిన యంప-
గరులిన్ని యనుచు లెక్కలు వెట్టుగతివి ॥ అన్ని ॥

1. వి రే. ౨౬. వరా౯. 2. యీకన్నుల. 3. నాంకురములజడ. 4. పానంబు

కాంత హస్తిణిజాతి గాఁబోలు కరమూలము[1] –
లంతకంతకు నలుపులై యున్నవి
పంతపు మరుఁడు తన భండారమిండ్లకును
దొంతిగా నిడిన కస్తురి ముద్రలనఁగా ॥ అన్ని ॥

ఘనత[2] పద్మిణిజాతి గాఁబోలు నీలలన
తనువెల్ల పద్మగంధంబైనది
మినుకుగా మరుఁడు తామెరలమ్ములనె[3] మేను
కనలించి వడిఁ బువ్వుగట్టెనో యనఁగా ॥ అన్ని ॥

ఇదియు జగదేక మోహిణి[4] దానె కాఁబోలు
కదలు కనుఁగవకెంపు గలిగున్నది
వదలకిటు వేంకటేశ్వరుని కుంకుమపూఁత
చెదరి చెలికనుఁగొనలఁ జిందెనోయనఁగా ॥ అన్ని ॥ 123

ఆహిరి

కెరలి బయట దాఁగీ వీఁడు తన–
వారపులు చూపుచు నొరగీ వీఁడు ॥ పల్లవి ॥

కొమ్మ చూడవే కొలిమిగూటిలో–
నమ్మెడి సూదులె యదె వీఁడు
ఎమ్మెలు నెరపుచు నెక్కడఁ దిరిగో
నమ్మికబొంకుల నను సొలసీని ॥ కెరలి ॥

వాఁతిరో చూడవే నవ్వుచు మీలకు–
నీఁతలు గరపీనిదె వీఁడు
కాఁతాళంబునఁ గనలెడి నాపై
చేఁతలు నేసీఁ జెలఁగుచుఁ దాను ॥ కెరలి ॥

---

1. మూలమంత..........యున్నది. 2. వశఁబద్మి. 3. యమ్ములనె. 4. మోహిని.

అల్లనె చూడవె అడవిమృగములకుఁ
బల్లము వేసీఁ బైఫీఁడు
వొల్లని ననునిదె వుల్లమి (ము ?) చేకొనెఁ
గల్లరి తిరువేంకటపతి వీఁడు. ॥ కెరలి ॥ 124

ఆహిరి

మూసిన ముత్యాన[1] కేలే మొరఁగులు
ఆసల చిత్తానకేలే అలవోకలు ॥ పల్లవి ॥

కందులేని మోము [2] కేలే కస్తూరి
చిందు నీ [3] కొప్పునకేలే సేమంతులు
మందయానమునకేలే మట్టెలమోఁత
గందమేలే పైపై కమ్మని నీ మేనికి ॥ మూసిన ॥

భారపు గుబ్బలకేలే పయ్యెద నీ—
బీరపుఁ జూపుల [4] కేలే పెడమోము
జీరల బుజాలకేలే చెమటలు నీ—
గోరంట గోళ్ళకేలే కొనవాఁడ్లు ॥ మూసిన ॥

ముద్దుల మాఁటలకేలే ముదములు నీ—
యద్దపుఁ జెక్కులకేలే అరవిరి
వొద్దిక మాటల [5] కేలే వూర్పులు నీకు—
నద్దమేలే తిరువేంకటాద్రీశుఁ గూడి ॥ మూసిన ॥ 125

23–వ రేకు శ్రీరాగం

కలకి కాఁతాళములు కారింపులా
లలితంపు వలపులకు లంచములు గాక ॥ పల్లవి ॥

---

1. వి. రే. ఆ౫. ముత్యాల. 2. మేనికేలే. 3. చిందవి.........కావలతుఱు.
4. చూపున. 5. కూటమికే.

కొసరు గుంపెనల సిగ్గుల[1] పిశంబంబులా
దుసికిలని[2] మోహముల దొంతరలు గాక ॥ కలికి ॥

అబ్బురములైన పొలయలుక లోలంబులా[3]
గబ్బుఁ దమకముల మీఁగడలు గాక[4]
గబ్బిమాటల సాళంగంబులవి యేతులా
గుబ్బతిలు మోహముల[5] కుంటెనలు గాక ॥ కలికి ॥

కొనబు కొనగోళ్ళ తాఁకులవి మే(ని) నొప్పులా *
ననుపులకు నుబ్బుఁగవణములు గాక
వనితకీవేంక[6] టేశ్వరు సిరులు మరపులా
మనసు మర్మముల తన్మయములవి గాక[7] ॥ కలికి ॥ 126

## భైరవి

భామ నోఁచిన నోము ఫలము సఫలముగాను
కామతాపంబునకు కాండపము నోమె ॥ పల్లవి ॥

కొమ్మ చలిమందులకు గొంతిబామెర నోమె
కమ్మఁదావులకు మును గౌరినోమె
నెమ్మదివి కన్నీట నిండుఁగొలఁకులు నోమె
ముమ్మడించిన వగల ముచ్చింత నోమె ॥ భామ ॥

చెదరు గందంబునకు చిట్టిబొట్లు నోమె
కదియు పులకలకు మొలకలనోము నోమె
ముదిత మాటాడకిదె మోనదాగెలు నోమె
పొదలు చెమటలకు వినుపులనోము నోమె ॥ భామ ॥

---

1. వి. రే. ౧౮. గుంపెనలు మంకుల విడంబం. 2. సా. రే. దుసికిలెట్టి 3. సా. రే. లొల్లబులా. 4. వి. రే. గుబ్బుఁ దమకముల గుంపెనలుగాక. 5. కోరికల. 6. సా. రే. వనిత తిరువేంకట. 7. తనివోని సురతముల తన్మయముగాక. * మేనియొక్క ఒప్పులా

నెలఁత మొగమునకు వెన్నెలమించులటు నోమె
వెలయుఁగాంతికి వీధివెలుఁగు దా నోమె
ఎలమితోఁ దిరువేంకటేశుకౌఁగిటఁ గూడి
లలితాంగి నిచ్చకల్యాణంబు నోమె ॥ భామ ॥ 127

## సామంతం

అపురూపమైన మోహము దాఁచి యిటువంటి—
కపటపు నటనలు గడియించనేలే ॥ పల్లవి ॥

కిన్నెరకాయలఁ బోలు కిక్కిరిసినట్టి గుబ్బ—
చన్నులపై నునుఁగొంగు జారఁగ
కిన్నెర మీఁటుచు మంచి సన్నపు నడపుతో
కన్నులు దేలఁగమేను కదలించేవేలే ॥ అపు ॥

పీడియు పీడనికొప్పు వేగస ముడుచుచు
ఆదెడి బిత్తరిమాటలమరఁగా
చూడనొప్పె నీ మంచి సుద్దులు చెప్పఁగనెంతే
వాడక వాడుదురే వైతాళమేలే ॥ అపు ॥

చెక్కుటద్దములమీఁది చెమట చిత్తడితోడ
సొక్కులు దేరఁగ మేను సుదతికి
చిక్కించి నిన్నుఁగూడె శేషగిరీంద్రుఁడు నీ పయి
మక్కువగలిగి కొంత మనసియ్యఁదేలే ॥ అపు ॥ 128

## పాడి

ఒఱపో మెఱపో వొయ్యారమో నీకు
వెఱతుమయ్య గోవిందుఁడా ॥ పల్లవి ॥

కపటమో నిజమో కరుణయొ కోపమో
వుపచారమో వుపతాపమో
విపులత త ((ద?) నపై నెయ్యమే నేసేవు
విపరీతము గోవిందుఁడా ॥ ఒఱ ॥

ననుపో నగవో నయమో ప్రియమో
చనవో చలమో సరసమో
కనుకూరిమియో గయ్యాళితనమొ
వెనుతగిలేవు గోవిందుఁడా ॥ ఓఅ ॥

మంకో మరులో మదమో ముదమో
జంకో లంకో జగడమో
శంకలేక నను సరుగనఁ గూడితి
వేంకటగిరి గోవిందుఁడా ॥ ఓఅ ॥ 129

ఆహిరి

లలితలావణ్య విలాసముతోడ
నెలఁత ధన్యత గలిగె నేఁటితోడ ॥ పల్లవి ॥

కుప్పలుగా మైనసలుకొన్న కస్తూరితోడ
తొప్పఁదోగేటి (గెడి?) చెమటతోడ
అప్పుడటు శశిరేఖలైన చనుఁగవతోడ
దప్పిదేరేటి (రెడి?) మోముఁదమ్మితోడ ॥ లలిత ॥

కులుకుఁ గబరీభరము కుంతలంబులతోడ
తొలఁగఁ దోయని ప్రేమతోడ
మొలకనవ్వులు దొలఁకు ముద్దుఁజూపులతోడ
పులకలు పొడవైన పొలుపుతోడ ॥ లలిత ॥

తిరువేంకటాచలాధిపుని మన్ననతోడ
సరిలేని దివ్యవాసనలతోడ
పరికించరాని అరవిరిభావముతోడ
సిరి దొలఁ (లం?) కెడి చిన్నిసిగ్గుతోడ ॥ లలిత ॥ 130

సామంతం

చింతాపరంపరలు చిత్తంబునకుఁ దొడవు
ఇంతి సౌభాగ్యంబులిన్నిటికిఁ దొడవు ॥ పల్లవి ॥

కలికి నెమ్మోమునకుఁ గబరీభరము తోడవు
తళుకుఁజూపులు చక్కఁదనమునకుఁ దోడవు
ఎలమిచెక్కుల మించులిరువంకలకుఁ దోడవు
మొలకనగవులు సొబగు మురిపెముల తోడవు ॥చింతా॥

కరమూలరుచులు బంగారంబునకుఁ దోడవు
గురిగాని కొఁదీగె గుబ్బలకుఁ దోడవు
సిరిదొలఁకు జఘనంబు చిన్నినడపుల తోడవు
నిరతంపుఁ బాదములు నిలువునకుఁ దోడవు ॥ చింతా ॥

శ్రీవేంకటేశుకృప చెలియకెప్పుడుఁ దోడవు
భావసంగతులకునుఁ బరవశమె తోడవు
ఈ వెలఁది నునుఁబలుకులించువిలుతుని తోడవు
లావణ్యములకు నీలలన దాఁ దోడవు ॥ చింతా ॥ 131

24-వ రేకు పాడి

అవి యెటువంటి రహస్యములో
సవరని సతులకు ఝల్లనె మేను ॥ పల్లవి ॥

కల గని చెలితో కాంత నాయకుని–
చెలువము చెప్పుచు చిడిముడితో
పలుకఁగనేరక భ్రమసిన మాటలు
తలఁచి చెలులు కడుఁ దత్తరపడిరి ॥ అవి ॥

రమణుఁడు కలలో రమణితో ననిన[1]–
ప్రమదపు దైన్యపు పలుకులివి
చెమరించఁగ విని శిరసులు వంచుక[2]
కొమెరలు దలఁచిరి కూరిమిసతుల ॥ అవి ॥

---

1. ఇది ని.రే. ౨౬.పాఠము; 2. పా. రే. నగిన. వంపుచు.

వేంకటరమణుఁడు వెలఁదియుఁ గలలో
బింకపుఁ గూటమిఁ బెనఁగుటలు
లంకెల పొందులు లలనలు విని విని
కొంకక కనుఁగొనఁ గురిసిరి సీరు ॥ అవి ॥ 132

## సామంతం

కొనచూపులనె వింతకోరికలు దైవార
పెనగొన్న తమకములఁ బెనఁగు టెన్నఁడురా ॥ పల్లవి ॥

కమ్మ (ని) కస్తూ (స్తు ?) రితావి కప్పురపువాసనల-
తమ్ములము నోరిలోఁ దగఁ గులికి కులికి
ఉమ్మగింతల రతులనుడివోని వేడుకల
ఇమ్ములను గూడి సుఖియించు టెన్నఁడురా ॥ కొన ॥

బిగువుఁ గౌఁగిటఁజేర్చి బిత్తరపుఁ జూపులను
నగవు దేరఁగ మనసు నాఁటించి మించి
మొగము మొగమునఁజేర్చి ముద్దుమాటలను నునుఁ-
బగడవాతెర గదలఁ బలుకు టెన్నఁడురా ॥ కొన ॥

కడు మోహమున సిగ్గు గదియు టెన్నఁడు లేక
యెడలేవి కూటముల యెచ్చరికె లేక
విడువకిటువలెనె తిరువేంకటేశుఁడ సీవు
వడిఁ దలఁచి నాకడకు వచ్చు టెన్నఁడురా ॥ కొన ॥ 133

## శ్రీరాగం

దైవకృత మెవ్వరికిఁ దప్పింపరాదనుచు
భావించి జనులాడుపలుకు నిజమాయ ॥ పల్లవి ॥

కందువకుఁ బెడఁబాసి చందురుఁడింతి ముఖ-
చందురుఁడైన నది అందును గలిగె
కందువగు చెలినొసలి కస్తూరితిలకమను-
కందు ముఖచంద్రునకుఁ గడునందమాయ ॥ దైవ ॥

జలజములు శశిచేతనులికి యీ కాంతకుచ–
జలజంబులైన నదిసరుసనే కలిగె
లలితమగు ప్రాణవల్లభుని సురతాంకమున
విలువ సేయఁగరాని విదియచందురులు ॥ దైవ ॥

తీగె బహుంజలములకుఁ దెమలి కామినిమేనుఁ–
దీగె యయ్యిన నదియుఁ దిరుగ మరి కలిగె
ఈ గతులఁ దిరువేంకటేశ్వరుని సమసురత–
యోగంబువలన ఘర్మోదకశ్రీలు ॥ దైవ ॥ 134

## ముఖారి

జానామ్యహంతే సరసలీలాం
నానావిధ కపటనాటక సఖత్వమ్ ॥ పల్లవి ॥

కిం కరోమి త్వాం కితవ పరకాంతాన–
ఖాంకురప్రకటన మతీవ కురుషే
శంకాం విసృజ్య మమ సంవ్యాన కర్షణం
కింకారణమిదం తే ఖేలన మిదానీం ॥ జానా ॥

కిం భాషయసి మాం కృతకమానసతయా
డాంభికతయా విట విడంబయసి కిం
గాంభీర్యమావహసి కాతరత్వేన తవ
సంభోగ చాతుర్య సాదరతయా కిం ॥ జానా ॥

కిమితి మామనునయసి కృపణ వేంకటశైల–
రమణ భవదభిమతసురతమనుభవ
ప్రమదేన మత్ప్రియం ప్రచురయసి మానహర
మమతయా మదననిర్మాతా నకిం త్వం ॥ జానా ॥ 135

ఆహిరి

వట్టిటసలు గాక నాకు వలతు ననెడి మాటలెల్ల
నెట్టుకొన్న మోహమైన నిలువనెట్టు వచ్చురా ॥పల్లవి॥

కొప్పువెట్టుకొనుచునున్న కొమ్మ బాహుమూలమిపుడు
చొప్పుదప్ప రెప్పలెత్తి చూడనెట్టు వచ్చురా
అప్పుడుపరిసురతవేళలందుఁ బచ్చి దోఁచునట్టి-
చెప్పరాని పనులవంకఁ జిత్తగించినాఁడవో ॥వట్టి॥

మొలకనవ్వు నవ్వుచున్న ముదితముద్దుమోవిమీఁది-
చిలుకవోటు చూచి సన్న సేయనెట్లు వచ్చురా
వలను మెరసి నీకునందు వన్నెలైన చేఁతలెల్లఁ
గలయఁ జేయుపనికిఁ గొంత కన్నువేసినాఁడవో ॥వట్టి॥

తట్టుపుణుఁగు శిరసుమీఁద దైలువారనంటి నొసలఁ
బట్టువెట్టుకోరి నన్నుఁ బట్టనెట్టు వచ్చురా
వెట్టిగాదు వేంకటాద్రివిభుఁడ నీవు మదనరచన-
లట్టు నిట్టుసేయ నన్నునంగవించినాఁడవో. ॥వట్టి॥ 136

మాళవి

ఏమిసేయఁగనగు నెట్టువలసిననౌ
కాముకుల పూర్వసంకల్పమో కాక ॥పల్లవి॥

కమలలోచనహృదయకమలంబె మరుచేతి-
కమలమై తనమనసు గాఁడి పారినది
గములైన యాపదలు గదిరినప్పుడు దమ్ము
తమచేతియమ్ములే తాఁకునో కాక ॥ఏమి॥

లోలలోచన మేనిలోనియనలము లోని—
గాలి గూడ (డు?) క చిచ్చుగాలివలెనాయ
తాలిమెడతెగి రతులు దప్పినప్పుడు లోని—
తాలిమే తమకములతాపలో కాక ॥ ఏమి ॥

శ్రీ వేంకటేశ్వరుఁడు చెలియఁ గరుణించినను
కైవశంబయిఁ యవియ కడునితవులాయ
దైవకృప గలిగినను తమకు నాపదలెల్ల
భావింప నిత్యవైభవములో కాక. ॥ ఏమి ॥ 137

25-వ రేకు, సామంతం

పొద్దిఁకనెన్నఁడు వొడచునొ పోయినచెలి రాదాయను
నిదుర గంటికిఁ దోఁపదు నిమిషంబొకయేఁడు ॥ పల్లవి ॥

కన్నుల నవ్వేడి నవ్వులు గర్వితనంబుల మాటలు
నున్నని యొయ్యారంబులు నొచ్చినచూపులును
విన్నఁదనంబుల మఱపులు వేడుకమీరిన యలపులు
సన్నపుఁజెమటలుఁ దలఁచిన ఝల్లనె నామనసు ॥ పొద్దిఁక ॥

అఁగినరెప్పల నీరును నగ్గలమగు పన్నీటను
దోఁగియుఁ దోఁగనిభావము దోఁచిన పయ్యెదయు
కాఁగిన దేహపు సెకలును కప్పిన పువ్వుల సొరబులు (?)
వేఁగిన చెలితాపమునకు వెన్నెల మండెడిని ॥ పొద్దిఁక ॥

దేవశిఖామణి తిరుమలదేవునిఁ దలఁచినఁ బాయక
భావించిన యీ కామిని భావములోపలను
ఆవిభుఁడే తానుండిఁక నాతఁడె తానెఱఁగఁగవలె
నీ వెలఁదికిఁ గల విరహంబేమని చెప్పుదము. ॥ పొద్దిఁక ॥ 138

మలహరి

కంటఁ బుట్టినవాఁడు కమలముఖులకడ–
కంటఁ బుట్టినవాఁడు గవగూడి
జంట వాసినఁ జంపుదుమని లేని–
వెంటలు గడియించి వేఁచేరే ॥ఎంద॥

*ఏఁటఁ బుట్టెడివాఁడు నేడు దెరువులై
వూఁటాడెడివాఁడు నౌనగూడి
మాఁటమాఁటకు మాయపు మనసులు
తీఁటలు రేఁచుక తిరిగేరే ॥ఎంద॥

కొండలరాయఁడు కోనేటి తిమ్మయ్య
వుండినచోట నేనుండఁగా
వండిన మోహము బాధలఁ జిత్తము
మెండైన వేడుక మెచ్చినే. ॥ఎంద॥ 139

నాట

చిత్తము నిజమైనఁ జేరు నేపనులైన
బత్తి సౌఖ్యమునకుఁ బ్రాణము ॥పల్లవి॥

కన్నుల కలికికిఁ గలిగెఁబో కడ–
కన్నులమీఁది బింకపు నవ్వు
చిన్నిచెక్కులమీఁది చెమటలు – మేన–
నన్నువ మురిపెపుటలపులు ॥చిత్త॥

తోయజగంధికి దొరకెఁబో మన–
మాయ నియతితోడి మఱపులు
సోయగమగు మోము సొబగులు – కడు–
రాయిడి చనుదోయి రచనలు ॥చిత్త॥

* వసంతుఁడా ?

శ్రీవేంకటేశుని చెలువులు
తావి చల్లెడి కమ్మఁదనములు - పాసి-
పోవని విభుతోడి పొందులు. ॥ చి త్త ॥ 140

కాంబోది

ఒయ్యనె దగ్గరరమ్మ వూడిగాల సతులు
అయ్యో విసరరమ్మ అలసున్నవాఁడు ॥ పల్లవి ॥

కరఁగుఁజెమటలతో గందపుఁ బేంట్లతోడ
ఒరగి పవ్వళించున్నాఁడొ త్తగిల్లి
సరసపు మాటలతో చాఁచిన పాదములతో
గురియైన సతులతో గోవిందరాజు ॥ ఒయ్య ॥

తెల్లని కన్నులతోడ తేనెగారు మోవితోడ
చెల్లుబడిఁ బవ్వళించీ శేషునిమీఁద
వెల్లిగొను పూర్పులతో వెన్నెల నవ్వులతోడ
కొల్లవలపులతోడ గోవిందరాజు ॥ ఒయ్య ॥

బొట్టు పూఁపకొడుకుతో పుక్కిటి తమ్ములముతో-
నొడ్డిన రతులతోడ నోలలాడీని
వెద్దు వెట్టి కూడెనిదె వేంకటేశుఁడింతులను
గొడ్డువోని వరముల గోవిందరాజు. ॥ ఒయ్య ॥ 141

ఆహిరి

కామించి నీవరుగఁ గలయు నాయకుఁడు నేఁ-
డేమి భాగ్యము సేసెనే తరుణి ॥ పల్లవి ॥

కాఁగిన గుబ్బలమీఁద కమ్మఁజెమటలఁ దొప్పఁ-
దోఁగిన పయ్యెదకొంగు దూలఁగను
వేఁగైన కొప్పున క్రొవ్విరులు దురిమి విఱ్ఱ-
వీఁగుచు నీవెటు వొయ్యేవే తరుణిం ॥ కామి ॥

ఒప్పైన శిరసుమీఁదఁ గుప్పళించిన జవ్వాది
చిప్పిలి చెక్కులవెంటఁ జిందఁగను
అప్పళించిన కస్తూరిలప్పలు రాలఁగ నీ—
విప్పుడెక్కడికి నేఁగేవే వోతరుణి ॥ కామిం ॥

పీడినది మొలనూలు విరులు చెదరెఁ గొంత
వాడినది కెమ్మోవి వన్నెలై
యీడులేవి తిరువేంకటేశుఁడిదె నిన్నుఁగూడె
యీడఁ గొత్తలివి యేఁటివే వోతరుణి ॥ కామిం ॥ 142

శుద్ధరామక్రియ

ఇన్ని రాసులయునికి యింతి చెలువపురాశి
కన్నె సిరాశికూటమి గలిగినరాశి ॥ పల్లవి ॥

కలికి బొమవిండ్లుగల కాంతకును ధనురాశి
మెలయు మీనాక్షికిని మీనరాశి
కులుకు కుచకుంభముల కొమ్మకును కుంభరాశి
చెలఁగు హరిమధ్యకును సింహరాశి ॥ ఇన్ని ॥

చిన్నిమకరాంకపుఁ బయ్యెద చేడెకు మకరరాశి
కన్నెపాయపు సతికి కన్నెరాశి
వన్నెమై పైఁడితులఁదూఁగు వనితకుఁ ధులారాశి
తిన్నవివాఁడి గోళ్ళసతికి వృశ్చికరాశి ॥ ఇన్ని ॥

ఆముకొను నౌరపుల మెరయు నతివకు వృషభరాశి
గామిడి గుట్టుమాఁటల సతి కర్కాటకరాశి
కోమలపు చిగురుమోవి కోమలికి మేషరాశి
ప్రేమ వేంకటపతిఁ గలసె ప్రియమిథునరాశి ॥ ఇన్ని ॥ 143

26-వ రేకు. సామంతం

ఎట్టు ధరింపఁగనగు భువినిట్టి వియోగావస్థల—
నట్టును నిట్టును విధి దమునారడిఁ బెట్టఁగను ॥ పల్లవి ॥

కాంతునిచూపులఁ జిక్కినకాంత వియోగాగ్నికిఁ దగ
శాంతికిఁ జెంగలువలుపైఁ జల్లిరి నెచ్చెలులు
కాంతుఁడు చూచినతొల్లిటి కనుచూపులె బహుళములై
కాంతశరీరంబంతయుఁ గప్పిన తెఱఁగాయ ॥ ఎట్టు ॥

రమణునిమాటలఁ దగిలిన రమణికి నంగజతాపం—
బమరఁగ మకరందముపై నలికిరి నెచ్చెలులు
రమణుని తియ్యని మాటలరచనలె కడునగ్గలమై
కమలదళాక్షికిఁ బైపైఁ గట్టినతెఱఁగాయ ॥ ఎట్టు ॥

ప్రాణము సందియమై యీ పడతికిఁ బ్రాణము వచ్చెను
ప్రాణేశుఁడు తిరువేంకటపతి గరుణించినను
ఏణాక్షికి నొకతెఱఁ గాదీయఖిలంబునకీ దేవుఁడు
(దీయఖిలమునకు దేవుఁడు?)
ప్రాణము ప్రాణంబనియెడి పలుకిది నిజమాయ ॥ ఎట్టు ॥ 144

కాంభోది

ఇంతగాఁ జేసితి[1] నన్ను వింతలోననె వోరి
సంతవలపుబేరాల జట్టికాఁడ రారా ॥ పల్లవి ॥

గంపంత దురుముతోడి గబ్బిచూపుఁగన్నుల[2]
గుంపెన గుబ్బలది మేకులు నేయఁగా
అంపలేక మాటలాడే వాపె[3] తోడనె వోరి
జంపు వలపుబేరాల జట్టికాఁడ రారా ॥ ఇంత ॥

గుద్దలింపుఁగులుకుల కొనవంపుచూపుల[1]—
అద్దపుఁ జెక్కులది నిన్నద్దలించఁగా
పెద్దరికా[2] లాకెతోడ బెరయించేవా వోరి
చద్దివలపుబేరాల జట్టికాఁడ రారా ॥ ఇంత ॥

మెల్లనె మురిపెములమ్మేడి లేఁతమాటల—
గొల్లెతచిత్తమంతయుఁ[3] గొల్లగొంటివి
వెల్లిగా నన్నుఁ గూడితి[4] వేంకటేశుఁడా వోరి
చల్లువలపుబేరాల జట్టికాఁడ రారా ॥ ఇంత ॥ 145

## సామంతం

సింగారరాయునిఁ దిట్టీఁ జెంచెత వేలి—
వుంగరాలచేత నన్నొత్తకు నీవనుచు ॥ పల్లవి ॥

గురువింద పొదమరఁగున నుండి బిగిసీని
సిరివరు నెదుటనే చెంచెత
దొరలకే కాక నెత్తురుమన్ను మాకేల
బురదచెమటనామై పొలసుకంపనుచు ॥ సింగా ॥

గుదిగొన్న మొగలిరేకుల యెన్ను కొనగోరఁ
జిదిమి దేవునివేసీఁ జెంచెత
గదరుఁ బిల్లల నేలికంపు నీవాళ్ళెల్ల
కదియకు నా మేను కంటగించీననుచు ॥ సింగా ॥

కప్పురపుఁ దావి వేంకటపతికొఁగిటఁ
జెప్పక యేతులే చెప్పీఁ జెంచెత
దప్పిదేరు తేనెల తనివార నీ మోవి
యెప్పుడుఁ బాయక ఇట్టె ఇచ్చేవో యనుచు ॥ సింగా ॥ 146

---

1. మాఁటల. 2. పా. రే. పెద్దరికలాకె; తం. ప్ర. గద్దరి కలికితోడ కదుబేరయిం. 3. తం. ప్ర. పల్లవపాణిచిత్తము. 4. వెల్లిగా నన్నేలు తిరు.

## ఆహిరి

అయ్యో వీఁడు నన్నుఱఁకించీనే వీని-
కొయ్యతనాలణఁచక కోపమేల తీరునే ॥పల్లవి॥

పట్టున వాఁడిందు రాఁగ గొబ్బున నే ముంగురులు
పట్టుకొని పరపుపైఁ బడఁదీసి[1]
గట్టిగ గుబ్బలమీఁది కస్తూరిచెమటలనే
అట్టునిట్టు సేయక నాయలపేల తీరునే ॥అయ్యో॥

గక్కన వాఁడిందు రాఁగా గదెపెట్టి[2] తమకాన
చెక్కుదోయి నాకొనచేతనే నొక్కి
పుక్కిటితమ్ములమిడిపొదిగొన్న కౌఁగిటిలో
నొక్కనఁగాని నానొగులేల తీరునే ॥అయ్యో॥

కూరిమి వాఁడిందు రాఁగా కొంకక నా వాఁడిగోళ్ళ
జీరలుగా నొడలెల్ల[3] జిమ్ముచుఁ దీసి[4]
ధీరత వేంకటగిరి దేవుఁడైన వానికి నా-
నేరుపెల్లఁ జూపక నా నెగులేల తీరునే ॥అయ్యో॥ 147

## దేవగాంధారి

* ఇట్టిముద్దులాఁడిబాలుఁ డేడవాఁడు వానిఁ
బట్టితెచ్చి పొట్టనిండఁ బాలు పోయరే ॥పల్లవి॥

గామిడై పారితెంచి కాఁగేటివెన్నలలోన
చేమపూవుకడియాలచేయి వెట్టి
చీమ గుట్టెనని తనచెక్కిటఁ గన్నీరు జార
వేమరు వాపోయె వాని వెడ్డువెట్టరే ॥ఇట్టి॥

---

1. తం. ప్ర. పడఁగ దిగిచి: ని. రే. ౧౨౩. పడవేసి. (ఈ రేకులో ఇది రెండవ చరణము.) 2. రే. ౧౨౩. గద్దెమెట్టి. 3. నురమెల్ల. 4. తం. ప్ర. చిమ్ముచును జేరి.
* ఈ పాట. పూర్వముద్రణమున తప్పిపోయినది.

ముప్పువలె వచ్చి తనముంగనై మురువులచేయి
తచ్చేటిపెరుగులోనఁ దగఁ బెట్టి
నొచ్చెనని చేయి దీసి నోరనెల్లఁ జొల్లుగార
వొచ్చెలి వాపోవువాని నూరడించరే ॥ ఇట్టి ॥

యెప్పుడు వచ్చెనో మాయిల్లు చొచ్చి పెట్టెలోన
చెప్పరానివుంగరాల చేయి వెట్టి
అప్పఁడై నవేంకటేశుఁ డాసపాలకుఁడు గాన
తప్పకుండ పెట్టె వానితల కెత్తరే ॥ ఇట్టి ॥ 148

శ్రీరాగం

వద్దు వోరా నీవు గడు వచ్చి తడవాయనేరు[1]
నిద్దురవుచ్చేవు నేము నీకొలఁదివారమా ॥ పల్లవి ॥

గయ్యాళి యెవ్వతో కాని కస్తురివాట్లు చూడ
నొయ్యారముగా వేసె నుదుటైన గుబ్బల
కయ్యపుఁ గూటముల నీకొఁగిలెల్లానంటె నీవు
పుయ్యక పూసిన కమ్మఁబూఁత వింతలాయరా ॥ వద్దు ॥

గొంటెత యెవ్వతోకాని కొదలేని తమకి తా-
నంటఁగాక నిన్నుఁగూడె నదిరి[2] పాటునను
వెంటనే తెచ్చితివోరి వెడగెంపునీరు కోక-
నంటినది నీవు మమ్ము నంటక తొలఁగరా ॥ వద్దు ॥

కొంగలలో నెలకొన్న కోనేటిరాయఁడ యెందు
వుందిన[3] నామనసులోనుండి పోయలేవుగా
విందైన కౌఁగిటఁజేర్చ నీవు దానై కూడి-
యుండినట్లనే పాయకుండె నెవ్వతెరా ॥ వద్దు ॥ 149

1. వి. రే. ౧౦. వాయె యేరు. 2. నద్దరి. 3. సా. రే. వుండినామన.

27-వ రేకు. రామక్రియ

కొంచెము[1] మాకులము గుణము చంచలము
చెంచెతతో నీకు నేల చెప్పవయ్య చలము ॥ పల్లవి ॥

గదరుఁ గస్తూరిమన్ను కమ్మని మై[2] పూఁత
చెదరిన[3] పట్టునార చీరపాఁత
పదిలమైన పండు ఫలము మామేఁత
ఇదివో నే[4] మెవ్వరికి నేలయ్య రోఁత ॥ కొంచె ॥

గుబ్బలపై వెడజారు గురుగింజ[5] పేరు
సిబ్బపుఁ జెక్కుల నవ్వు చిక్కుఁజీరు
మబ్బు మబ్బు నెరుల దిమ్మరి కొప్పుతీరు
గబ్బిచూపు కన్నుల[6] మాకడనేల నోరు ॥ కొంచె ॥

అడవి లేఁతచిగురదివో[7] మాపరపు
వెడ వెడ నగవే మావింత వొరపు
మెడయక తిరువేంకటేశ మాపై వెరపు
గొడవకూటమి నిన్నుఁ[8] గూడిన మైమరపు ॥ కొంచె ॥ 150

వరాళి - ఏకతాళి

తక్కులచేఁతల మాయదారివట బొంకు—
నిక్కములు సేయనేమి నేరవా యీనీవు ॥ పల్లవి ॥

గుట్టున నూఁదిన పిల్లఁగోవి నీరవమున
వట్టిమాఁటల నిగురు వెట్టీనట
పట్టినఁ గందెడి నామై పై పులకలిగురు—
వెట్టఁగా నన్నింతసేయ బెట్ట (ట్టా?) యీ నీవు ॥ తక్కు ॥

1. ఏ.రే.౧౦౪. కొంచెపుమా. 2. మే పూఁతఁ. 3. సా.రే. చెదరినా. 4. ఏ.రే. మేమె.
5. గురివింద. 6. కావలమా. 7. చిగురులవివో. 8. నన్నుఁగూ.

పాదపుచెమటనీరు పరపి దురితముల
నేదదేర నిందరిని జేసీనట
మేదినీధరుఁడ నీ మేని చెమటలతావి-
నాదరించి నను(గాచుటరుదా యీ నీకు ॥ తక్కు ॥

అల నీమదిఁబుట్టిన అంగజుఁడు లోకులను
చెలరేఁగి కాఁపురాలు నేయించీనట
కలసి వేంకటేశ్వర కందువరతుల నన్ను
కలకాలమునేలుట ఘనమా యీ నీకు ॥ తక్కు ॥ 151

సౌరాష్ట్రగుజ్జరి

కన్నులనే నవ్వితే నే గబ్బిదాననా నీవు
నన్ను నేల యిట్లా సన్నలనే తిట్టేవు ॥ పల్లవి ॥

గొల్లచల్లంటానే యక్కునఁ బోయుమనేవు
చెల్లఁబో గొల్లవారింత చెడఁబోయిరా
గొల్లువేసి యలకల కొప్పున నే ముడిచిన
మల్లెపూవులేల నీకు మనసాయ నిపుడు ॥ కన్ను ॥

కొంత కోక నల్ల [1]నైతే గొరుపడము నవేవు (?)
అంత నేను నదరమనైతినా నీకు
పంతగాఁడపట్టియాకంబళి నీవు ధరియించి
అంత వింతనుండి యాల అవులఁగాచితివి ॥ కన్ను ॥

మాఁటలాడ నేరకుంటే మాయదారిననేవు
వేఁటలోన ననునింత వేఁచుమంటినా
యేఁటికింత తిరువేంకటేశ నన్నుఁ గరఁగించి
పూఁట పూఁటకింతేసి బూమెలు నేసేవు. ॥ కన్ను ॥ 152

1. వి.రే. ౪౪. కొఁత నల్లనైతే.

శ్రీరాగం

అతఁడు చొచ్చినవేళ నలరు యడవి
సతి నీదుమురిపెంపు జవ్వనపుటడవి ॥ పల్లవి ॥

గురుకుచముగిరుల నెక్కువయైన యడవి
తరుణంపు బాహులతల యడవి
పురిగొన్న వాలుఁజూపుల తేట (లేటి?) యడవి
గరిమతోఁ దనుతావి కప్పురపుటడవి ॥ అత ॥

గనియైన నెరులచీఁకటి పెనుయడవి
ఘనమైన జఘనకందకములడవి
నునుపు నడపుల యేనుక పెద్దయడవి
చెనకు నట్టనడిమి సింహపుటడవి ॥ అత ॥

అతివ నీ వూరుల యరంట్లయడవి
కత కఱపుల చిలుకల యడవి
ప్రతిలేని వేంకటపతి యాఁక యడవి
తతి నీకుఁగ్గానతఁడు తపమున్న యడవి. ॥ అత ॥ 153

శంకరాభరణం

తలపట్టు వెట్టుకొన్న[1] తరుణీమణి నిన్ను
నలసి వేమరుదూరు నాకెవో యీకె ॥ పల్లవి ॥

గొప్పలయిన గుబ్బలవేఁగుల నలయు సతులు
కొప్పులు జారఁగఁ దన్నుఁ గొలిచి రాఁగా
చెప్పరాని వటనల పింగారపుఁ దోఁటలోన
అప్పుడు నిన్నుఁ జూచిన ఆకెవో యీకె ॥ తల ॥

1. వి. రే. ఒళ. వెట్టుకున్న.

పాదపుఁబెండేలు మ్రోయఁ బడఁతులిరువంకల
సేదలు దేరుచుఁ దనచెంగట రాఁగా
మేదకపు తొలుకరి మెఱుఁగంటా నీ వప్పు[1]—
వాదిగొని చూచిన ఆకెవో యీకె ॥తల॥

బంగారు చెరఁగుచీర పయ్యెదకొంగు దూలఁగా
అంగన వాకిటె దనకాకు చుట్టఁగా
ఇంగితమెఱిఁగి వేంకటేశుఁడ నిన్నుఁ గలసి
అంగడినెల్లఁ బెట్టిన ఆకెవో యీకె ॥తల॥ 154

ఆహిరి

* దిక్కులేక పోయెనిట్టే దినదినము
వెక్కసపు లోకమేలే విభుఁడెవ్వఁడో ॥పల్లవి॥

గుత్తముగా నెల్లవారుఁ గుడిచేటి కంచము
ఎత్తుక పోఁబెట్టుకొనె నెవ్వఁడో దొంగ
కొత్తగానే యింటి గట్టేకోక బయట వేసిన
మెత్తనిదంటాఁ బట్టి మింగె నెవ్వఁడో ॥దిక్కు॥

బంతిగాఁగ నెల్లవారుఁ బండేటి మంచమూర—
గుంతలో విరుగఁదోసె కూళఁడెవ్వఁడో
దొంతుల కడవలోనఁ దొరలి దాఁచిన పెద్ద—
పొంతకూటికుండ గొంటఁబోయె నెవ్వఁడో ॥దిక్కు॥

సొరిది సంతలలోని సుద్దులెల్లా విని విని
విరసములెల్లఁ బాపె వీఁడెవ్వఁడో
తిరువేంకటగిరిదేవుఁడై యిందరికిఁ
గరుణ లోకముగాచె ఘనుఁడెవ్వఁడో. ॥దిక్కు॥ 155

1. పా. రే. గంటావిప్పుడా. * దీనిలోనిభావము స్పష్టమగుట లేదు

28-వ రేకు. ముఖారి

చిన్ననాఁడు మద్దులు వంచినవాఁడు తా-
నున్నవాఁడే యిపుడు నాయొడయఁడై నేఁడు ॥ పల్లవి ॥

గోవులఁ గాచినవాఁడు గొల్లెతల మేనిగబ్బుఁ-
దావుల పెనుభ్రమలఁ దగులువాఁడు
కోవిదుఁడెట్లనాయఁ గోమలులఁ బదియారు-
వేవురను వలపించే వెరవరెట్టాయెనే ॥ చిన్న ॥

వెన్నలారగించువాఁడు విడువక వెకలియై
కన్నచోనే తిరిగేటి గద్దరీఁడు
వన్నెకాఁడెట్లానాయ పది గోపవనితల-
నెన్నరాని చేఁతలెల్ల నెట్టు సేసినాఁడే ॥ చిన్న ॥

కొండలెక్కి దాఁటువాఁడు కొండమోచునట్టివాఁడు
కొండలే నెలవుగాఁ గైకొన్నవాఁడు
కొండుక పాయపువాఁడు గుబురైన తిరుమల-
కొండమీఁద నెలకొన్న కోనేటివాఁడు. ॥ చిన్న ॥ 156

ముఖారి

కలికి కోరికల సంగరము వెట్టిననాఁడె
చెలువంపు విరహాగ్ని సేసెఁగా పెండ్లి ॥ పల్లవి ॥

గరిమెఁ [1] గేయూరకంకణహస్తముల సతులు
మురియుచును నిన్నుఁ గరములఁ జూపఁగా
తరుణి నినుఁ జూచినంతటనె మదనుఁడిద్దరికి-
వరవిరుల సేసలిడె [2] నాయెఁగా పెండ్లి ॥ కలికి ॥

పొదరిండ్ల చవికెలో పువ్వుఁదేనెల చెమట
చెదరకిరువంక నభిషేకములుగా
కొదమ తేంట్ల (తేఁటులః) విప్రకోటి మిమ్మిద్దరిని
పొదలించఁ జిత్తములు పొసఁగెఁగా పెండ్లి ॥ కలికి ॥

సోలుచును పేరఁటపు శుకపికంబులు మిమ్ముఁ
బాలుపడి నలుగడలఁ బాడఁగాను
తేలించి లలితాంగి తిరువేంకటేశ నినుఁ
గాలు దొక్కినదిపుడె కలిగెఁగా పెండ్లి. ॥ కలికి ॥ 157

కన్నడగౌళ

వంచన ప్రియములవారే కాక
ఎంచిన కన్నీటి[1] నేనేల నీకు ॥ పల్లవి ॥

గిలుకు మట్టెలతోడ కిందిచూపులతోడ
వెలవి నవ్వులు నీ పైఁ జిందఁగాను
వలతువుగాక యెవ్వతి[2] కైనఁ జిత్తము
విలువఁగనోపవి నేనేల నీకు (ను) ॥ వంచన ॥

గోడచాట్లతోడ కో(కొ*)నచిఁకటితోడ
వాడల నెలయించువారేకాక
వాడుచు లేమావి వడచల్ల వెడమాయ-
నీడలనెండే నేనేల నీకు ॥ వంచన ॥

జగడంబులతోడ సణఁగు సొలపుతోడ
వగ విన్ను భ్రమయించువారె కాక
దిగులులేక విన్ను తిరువేంకటేశుఁడ
నెగులెఱుఁగక కూడు నేనేల నీకు ॥ వంచన ॥ 158

---

1. పా.రే. కన్నియయిది నేనేం. 2. పా.రే. ఎవ్వరి.

## అహిరి

వేడుక నెవ్వతెరా విడువక నిన్నంటి
వాడుదేరే వలపుల వన్నెలు వెట్టినది ॥ పల్లవి ॥

గద్దరి యెవ్వతెరా నీ గారవంపు చెక్కుల
నిద్దంపు చంద్రరేఖ నిలిపినది
అద్దిరా దానిగయ్యాళితనమెట్టిదో
ముద్దుఁదనమోము నీ మోమున రాచినది ॥ వేడు ॥

దిట్టైన యాది యెవ్వతెర నీ యధరమందు
కొట్టుఁగొన మరుచిలుకులొత్తినది
గట్టిగఁ జూడర దానిగబ్బితనమెట్టిదో తన-
గుట్టెల్ల నీకు నాకున * వ్రానెంపినది. ॥ వేడు ॥

చక్కనిదెవ్వతెర నీ సరిలేని మేనఁ దన-
మిక్కుటంపు మేనికావి మేళవించినది
అక్కరగాఁ దిరువేంకటాధీశ కూడితివి
మక్కువతో నీకు పరిమళములంపినది. ॥ వేడు ॥ 159

## పాడి

అలమేలుమంగ నీవభినవరూపము
జలజాక్షుకన్నులకు చవులిచ్చేవమ్మా ॥ పల్లవి ॥

గరుడాచలాధీశు ఘన వక్షమున నుండి
పరమానందసంభరితవై
నెరతనములు చూపి నిరంతరము నాథుని
హరుషించఁగఁ జేసితి గదమ్మా[1] ॥ అల ॥

---

1. ఈ పాదమున యతిభంగము. 'జేసితౌఁగదమ్మా' అని యుండఁ బోలును.

* వ్రాసి + అంపినది.

శశికిరణములకు చలువల చూపులు
విశదముగా మీఁద వెదచల్లుచు
రసికత పెంపునఁ గరఁగించి యెప్పుడు నీ-
వశము చేసుకొంటి వల్లభునోయమ్మా ॥ అల ॥

రట్టడి శ్రీ వేంకటరాయనికి నీవు
పట్టపురాణివై పరఁగుచు
పట్టిమాఁకులిగిరించు వలపుమాటల విభు
బట్టిగొని పురమున సతమైతివమ్మా. ॥ అల ॥ 160

## దేశాక్షి

ఒడయఁడవు నినుఁబాసి యుండవశమా తరుణి
చిడుముడియలుక చేతిచిలుకఁ బగచేసె ॥ పల్లవి ॥

గారవపు జలరాశికన్య నీతో వలిగి
ఆరామములలోన నేయుఁగాను
వైరంపుబాణమై వనటమిరుమై గాఁడె
ఈ రీతి నీ యలుక యిల్లు పగఁజేసె ॥ ఒడ ॥

ఎలజవ్వనిటు నీకు నెదురుచూచుచు వెడలి
చెలఁగి వెన్నెలకు విచ్చేయఁగాను
నలువొందఁ జంద్రకిరణములు మయివడిఁ బొక్క-
బులుపుఁ గోపము తోడఁబుట్టుఁ బగచేసె ॥ ఒడ ॥

పంతంపు శ్రీసతికిఁ బతివి వేంకటరమణ
కాంతహృదయంబెఱిఁగి కలయఁగాను
అంతలోననె మదనుఁడలయించె నిప్పుడిటు
కొంతవడి నీకసరు కొడుకుఁ బగచేసె. ॥ ఒడ ॥ 161

29-వ రేకు

## సామంతం

ఎన్నినేఁతలైనఁ జేయునిపుడు యీతఁడు
కన్నెవయసువారినెలఁ గాఁక దేర్చె నీతఁడు ॥ పల్లవి ॥

గుబ్బచన్నుదోయి మెఱుఁగుఁ గుబుకరించి చెలఁగి నడచు
గబ్బితావిరమణి చల్లకడవతోడను
సిబ్బమైన చెక్కుటందు చిన్నిచెమటగారఁ జెనకి
గబ్బినేఁతలెల్లఁ జేసె కళలుగరఁగ నీతఁడు ॥ ఎన్ని ॥

వాలుఁగన్నుదోయి మెఱుఁగు వల్లెవేసివేసి రతికి
కాలుదవ్వురమణి చల్లకడవతోడను
కేలుదమ్మి కంకణాలు గిలుకరించి చెలఁగి నడచు (వ?)
కీలుగొప్పు సడిలి జారఁ గిందుపరిచె నీతఁడు ॥ ఎన్ని ॥

కొదలుదేరు కోవిలెలుఁగు కుత్తికందు సొళగించి
కదలుమోవిరమణి చల్లకడవతోడను
ఎదురమెరయు వేంకటేశుఁడింతి ప్రేమదీరఁ జెనకి
కదిసి మదనకదనమందు కలికిఁజేసె నీతఁడు ॥ ఎన్ని ॥ 162

## పాడి

ఏలేయేలే మరఁదలా చాలుఁజాలు చాలును
చాలు నీతోడి సరసంబు బావ ॥ పల్లవి ॥

గాఁటపు గుబ్బలు గదలఁగఁ గులికేవు
మాటలఁ దేటల మరఁదలా
చీటికి మాటికిఁ జెనకేవే వట్టి—
బూటకాలు మాని పోవే బావ ॥ ఏలే ॥

అందిందె నన్ను నదలించి వేసేవు
మందమేలపు మరఁదలా
సందుకోఁ దిరిగేవు సటకారి వోబావ
పొందు గాదిఁకఁ బోవే బావ ॥ ఏలే ॥

మక్కువ నేసిన మరఁదలా
గక్కన నను వేంకటపతి కూడితి
దక్కించుకొంటివి తగులైతి బావ ॥ ఏలే ॥ 163

ఆహిరి

కామిని నీసౌభాగ్యము గలిగిన ఫలమిది గలిగెను
ఆమని వెన్నెలకేఁటికి నలయుచు వచ్చెదవే ॥ పల్లవి ॥

గుబ్బల చెమటల పయ్యెద కొనగొంగున నల్లార్పుచు
ఉబ్బున గమనావస్థల నూఁటాడెదవేలే
బబ్బిలికాయల రవములు పదనూపురములఁ గెలయఁగ
తబ్బిబ్బుగ నునుపాదము తాటించెదవేలే ॥ కామి ॥

ఎత్తిన కరమూలవురుచులిరుగడ మెఱుఁగులు దొలఁకఁగ
తత్తరమందుచు నెవ్వనిఁ దలఁపుచు మ్రొక్కెదవు
ముత్తెపుసరముల వేఁగున మురియుచు నెచ్చరివై నీ-
వొత్తిలి నిట్టూర్పులతో నొయ్యన పలికెదవే ॥ కామి ॥

తావులు చల్లెటి దేహము తలఁపులుమీరిన హరుషము
లోవెలుతుల వెడయాసలు లోపలి కోరికలు
శ్రీ వేంకటగిరినాథుని చెలువపు కౌఁగిటి వుయ్యల
భావజసౌఖ్యాంబుధిలో పలుమరుఁ జెలఁగెదవే ॥ కామి ॥ 164

కాంబోధి

చెలికిఁ జక్కఁదనము నేసిన యజుఁడు భూమిఁ
గలవారికెల్లఁ బ్రేమ గలిగించెఁ గదవే ॥ పల్లవి ॥

గుబ్బలపై కొనగోరిగురుతులంటినచోటు-
లబ్బురమై మృగమదమంటినది చూడవే
గబ్బికన్నుల కలికి కప్పిన పయ్యెదలోన
విబ్బరపుఁదనువల్లి నిగ్గులు వెళ్ళఁబారెనే ॥ చెలికి ॥

కొప్పునఁ దట్టుపుణుఁగు కొలఁదిమీరఁగ నంటినఁ
జిప్పిలి చెక్కులవెంటఁ జిందినది చూడవే
ఒప్పయిన నీ నడపున నొదికపుమట్టియల—
చప్పుడు విన్నఁ జిత్తము జల్లురనెఁ గదవే ॥ చెలికి ॥

చక్కఁదనములచేత సరిలేనివాఁడు గన
దిక్కుల వెలసినట్టి తిరువేంకటేశుఁడు
మక్కువలరఁగ నింతి మరగించి ప్రియమెల్లఁ
జక్కఁదనముగఁ జేసెఁ జాలదా యింతయును. ॥ చెలికి ॥ 165

## రీతిగౌళ

రాధామాధవరతిచరితమితి[1]
బోధావహం శ్రుతిభూషణం ॥ పల్లవి ॥

* గహనే ద్వావపి గత్వా గత్వా
రహసి రతిం ప్రేరయతి సతి
విహరత స్తదా విలసంతౌ
విహతగృహాశౌ[2] వివశౌ తౌ ॥ రాధా ॥

లజ్జాళజళ విలాసలీలయా
కజ్జలనయన వికారేణ
హృజ్జావ్యవహృత (హిత ?) హృదయా[3] రతి
స్పజ్ఞా సంభ్రమచపలా జాతా[4] ॥ రాధా ॥

పురతో యాంతం పురుషం[5] వకుళైః
కురంటకై ర్వా కుటజై ర్వా
పరమం ప్రహరతి పశ్చాల్లగ్నా
గిరం వినాపి వికిరతి ముదం ॥ రాధా ॥

1. వి. రే. ౧౦౬. చరితం—బోధా 2. సా. రే; పె. రే. విహితగృహావశా. 3. హృదయరతి. 4. జాత. 5. పురుషైర్వకు. * ప్రేరఁకుడు మదనుఁడా ?

[illegible]
పరిరంభణ సంపాదితపులకై—
స్సురుచిర్జాతా సుమలతికేవ ॥ రాధా ॥

విధుముఖదర్శన విగళితలజ్జా—
త్వధరబింబఫలమాస్వాద్య
మధురోపాయనమార్గేణ కుచౌ
నిధివద (ద్ద?) త్వా నిత్యసుఖమితా ॥ రాధా ॥

సురుచిరకేతక సుమదళ నఖరై—
ర్వరచిబుకం సా పరివృత్యి (వర్త్య?)
తరుణిమసింధౌ తదీయదృగ్జల—
చరయుగళం సంసక్తం చకార ॥ రాధా ॥

వచన విలాసై ర్వశీకృత (త్య?) తం
నిచులకుంజ మానితదేశే
ప్రచురసైకతే పల్లవశయనే
రచితరతికళా రాగేణాస ॥ రాధా ॥

అభినవకల్యాణాంచితరూపా—
వభినివేశ సంయతచిత్తా
బభూవతు స్తత్పరౌ వేంకట—
విభుణా (నా?) సా తద్విధినా సతయా ॥ రాధా ॥

[2] నచ లజ్జాపీశణో భవతి తం
కచభరం (ర?) గంధం ఘ్రాపయతి
నచలతిచేన్మ్రవవతీ తథాపి
కుచసంగాదనుకూలయతి ॥ రాధా ॥

---

1. ఇది మొదలు ౩ చరణములు సా. రే. పె. రే. లలో మాత్రముకలవు. ని. రే. లో వేఱు ౩ చరణములున్నవి. అవి యీ పదము కడపట చేర్పఁబడినవి. 2. ఈ చరణము మొదలు ౩ చరణములు ని. రే. ౧౦౬ లో నుండునవి.

ం

అవనతశిరసాప్యతి సుభగం
వివిధాలాపైర్వివశయతి
ప్రవిమల కరరుహరచన విలాసై—
ర్భువనపతి (తిం?) తం భూషయతి ॥ రాధా ॥

లతాగృహమేళనం నవసై—
కతవైభవ సౌఖ్యం దృష్ట్వా
తత స్తతశ్చరసౌ (శ్చరతస్తౌ?) కేళీ—
వ్రతచర్యాం తాం వాంఛంతౌ ॥ రాధా ॥

వనకుసుమ విశదవరవాసనయా
ఘనసారరజోగంధైశ్చ
జనయతి పవనే సపది వికారం
వనితా పురుషౌ జనితాశౌ ॥ రాధా ॥

ఏవం విచరన్ హేలా విముఖ—
శ్రీవేంకటగిరి దేవోయం
పావనరాధాపరిరంభసుఖ—
శ్రీ వైభవసుస్థిరో భవతి ॥ రాధా ॥ 166

30—వ రేకు. ధన్నాసి

ఏవం దర్శయసి [1] హితమతిరివ
కేవలం తే ప్రియసఖీవా తులసీ ॥ పల్లవి ॥

ఘటిత మృగమద మృత్తికా స్థానకం
పటు శరీరే తే ప్రబలయతి
కుటిలతద్ఘనభారకుచవిలగ్నంవా
పిటర స్థలే మృత్ప్రీతా తులసీ ॥ ఏవం ॥

1. పె. రే. సా. రే. దర్శయతి ఈ కీర్తనభావము సుగ్రహము గాదు.

లలిత నవ ఘర్మలీలా విలసనో-
జ్జ్వలనం తవ తనుం వంచయతి [1]
జల విమలకేలీవశా సతతం
అలిక ఘర్మాంచిత విహారా తులసీ ॥ ఏవం ॥

సలస నఖచంద్రలేశా స్తే సదా
పరమం [2] లావణ్యం పాలయతి
తిరువేంకటేశ తత్కరుణా గుణా వా
వరరూప నవచంద్రవదనా తులసీ ॥ ఏవం ॥ 167

సామంతం

సారెసారె విన్నవించఁ జాలమిఁక నీవు
దారిదప్పఁ దిరిగేవు తగవా వోరి ॥ పల్లవి ॥

చెప్పరాదు కడు వలచిన వానివలె నా-
కొప్పులోవి సవరము కొంటఁబోయి
అప్పుడే వొక్కతికిచ్చితట వోరి నా-
తప్పుగావి నీవల్లఁ దప్పులేదు వోరి ॥ సారె ॥

కదలేవి మోహంబు గలవానివలె నా-
కడిఁబాసు (?) చీర నీవు కానెవోసి
వడిగా నేఁగెదవు యవ్వతికియ్యవలెనో [3] వన్ను
వడిఁబెట్టి యింత నేయవలెనా వోరి ॥ సారె ॥

---

1. పె. రే. పా. రే. వంచయతి. 2. వి. రే. ౨. సా. రే. పరమలావణ్య
3. వి. రే. ౧౧౩. నేఁగెద వెవ్వతికినా.

ముద్దుల నా వేలనున్న ముద్దుటుంగరము నీవు
వుద్దండానఁ గొంటఁబోతి వోరి
తిద్దలేము నీగుణాలు తిరువేంకటేశ నీవు
వొద్దికతో నన్నుఁబాయకుందరా[1] వోరి ॥సారె॥ 168

## సామంతం

తలనొక్కమాటాడఁ దలకెక్కె వలపు దీని-
తలఁపు రేఁచక మీరు తలరమ్మా ॥పల్లవి॥

చిత్తజు నమ్ములు దాఁకి జీర వారినందుకు పూ-
వత్తులు వేయక కాని వాడదమ్మా
బత్తిగల వారిందరు పచ్చకప్పురము[2] మేన
మెత్తకకాని మానదు మెత్తరమ్మా ॥తల॥

కంటిచూపు కాయజుని వింటిబాణములు దాఁకి[3]
గంటిలేని పోటులాయఁ గదరమ్మా
అంట ముట్టరాని తాప మగ్గలమైనది ముల్లు
ముంటఁగాని పోదు మేను మూయరమ్మా ॥తల॥

అప్పుడింత సొబగు లేదతివమొగమునందు
చొప్పులెల్ల బాగులాయ చూడరమ్మా
అప్పఁడు శేషాద్రిరాయఁడంగనఁ[4] గలిసెఁ గాన
యెప్పుడూఁ బాయని చనవిచ్చె నమ్మా. ॥తల॥ 169

## పాడి

చింతల చిగురులె[5] చిచ్చులట
యింతటిలోనిఁక నేలాగే ॥పల్లవి॥

1. సా. రే.తో మమ్ముఁగూడుకుండరా. 2. సా.రే. పచ్చకప్పురపుమేన. 3. వి.రే
౧౦౫ వింటిబాణమె మేను. 4. దతివెఁ గలశిఁ. 5. సా.రే. చిగురేచి.

చక్కని మన్మథ సంవత్సరంబున
చుక్కలరాజే సూరియుఁడై
యెక్కువరాత్రుల యెండగాయునట[1]
యెక్కుడిదిఁక బ్రదుకేలాగే ॥ చింత ॥

కాంతల నడుములఁ గఱవయ్యేడినట
అంతట జవ్వనపామవిని
వింత మీన స (శ?) ని [2] వెలఁదులకన్నుల—
నెంత గనమౌనో[3] యేలాగే ॥ చింత ॥

కుంకుమగుబ్బల కుంభరాశికిని
వంకల చంద్రుఁడు వచ్చెనట
వేంకటరమణుఁడు వెలఁదిఁ గూడెనట
యింక నీ తమక మేలాగే [4] ॥ చింత ॥ 170

## పాడి

మారుకు మారు సేయ మఱచి నీ వంతలోనే[5]
నేరములెంచుకొనేవు నేఁటిలోనే తప్పెనా ॥ పల్లవి ॥

చొక్కపు నీ గుబ్బలపై జూజపు[6] నేఁతలవలె
చిక్కులు జీరలువారఁ జించెనాతఁడు
తెక్కుల నీ వూరకుండి తెలిగన్నుల నీళ్ళ
గుక్కపు నీ చేతులేమి కూరగోయఁ బోయెనా ॥ మారు ॥

ముసిముసి నగవుల మోవిమీఁది కెంపులవి [7]
కసిగాటు సేఁతలనే కప్పె నతఁడు
అసురుసురై నీవు ఆతనిఁ జేయఁగలేక
వుసురనేవప్పుడేమి వూరలేక వుంటివా ॥ మారు ॥

1. వి.రే. ౩౪. రాత్రులు యెండలు గాయఁగ. 2. మీనసాని. 3. వింతె గవమాయనే. 4. వితమకంబేలాగే, ౫౩. తమకమ్మేలాగే. 5. వి.రే. ౫౬-౧౨౦. నీ వింతలోనే. 6. వి.రే. ౫౩. జూదపు. 7. ౧౨౦. కెంపులు, కని.

కూఁటమి నీ కౌఁగిటిలోఁ గూడి నీ చిత్తమనెడి [1]
వూరిలోనఁ గాఁపురమైవుండె నాతఁడు
వేరులేని మహిమల వెంకటేశుఁడతనిమై
చూరగొంటి వప్పుదేమి జోడువెట్టుకుండెనా [2] ॥మారు॥ 171

కాంభోది

ఉయ్యాల మంచముమీఁద నూఁచి వేసారితిమి
ముయ్యదించుకయు రెప్ప మూసినాఁ దెరచును ॥పల్లవి॥

చందమామ పాదమాన సతికి వేఁగినదాఁకా
యెందును నిద్రలేదేమి నేతమే [3]
గందపుటోవరిలోనఁ గప్పురంపుటింటిలోన
యిందుముఖి పవ్వళించు నింతలోనే లేచును ॥ఉయ్యా॥

పంచసాయకుని పుష్పబాణమాన యిందాఁక
మంచముపైఁ బవ్వళించి మాటలాడదు
నించిన వాలుగన్నుల నిద్దురంటానుండితిమి
వంచిన రెప్పలవెంట వడిసీఁ గన్నీరు ॥ఉయ్యా॥

వెన్నెలల వేంకటాద్రివిభుని లేనవ్వులాన
నన్నుఁ జూచియైనాఁ [4] జెలి నవ్వదాయను
ఇన్నిటాను సంతసిల్లి యీ దేవదేవుని గూడి
మన్ననల యింత (నింత?) లోన మలసీని [5] జెలియ ॥ఉ॥ 172

31-వ రేకు. కాంభోది

ఉండఁబాసీ నడవిలో వొంకతె నేను
ఎండలు నీడలు గాసీ నేమి సేతురా ॥పల్లవి॥

1. ఏ.రే. కా౩-౧౨౦. గూడిన చిత్తమనెడి. 2. వేంకటేశ్వరుఁడు నిన్ను చూరగొనేటప్పుడేమి జోడు వెట్టుకుంటివా. 3. ఏ.రే. ౩. దేమి సేతునే. 4. జూచినాఁ. 5. మన్నన యింతలోనే మలసీనే.

చిన్నినానడుము చూచి సింహము దగ్గరెనంటా
ఉన్నతపుఁ గుచములకొరనెఁ గరి
మున్నిటి పొందులు వైరమును జేసె మృగవతి
యిన్నిటికి నగ్గమైతి[1] నేమి సేతురా ॥ ఉంద ॥

నిండు నా నడపు చూచి నెమలి దగ్గరి[2] వచ్చె
బండు సేసి నారుసూచి పాయదు పాము
రెండుఁ జూచి పగయుఁ గూరిమి దోఁచె[3] నింతలోనే
యిండె వట్టె నిన్నిటికి నేమి సేతురా. ॥ ॥ఉంద ॥

కోరి నాపలుకు విని కోవిల దగ్గర వచ్చె
చేరీ నామోవికిదె చిలుక నేఁడు
గారవాన నిన్నియు వేంకటగిరి విభుఁడా
యేరా యిట్టె చేకొంటివేమి సేతురా ॥ ఉంద ॥ 173

శంకరాభరణం

వెక్కసమగుఁ గుచవిభవములు
జక్కవా (వ?) పులుగుల[4] జగడములే ॥ పల్లవి ॥

చింతచేత నిదె చెలియ నుదుటిపై
చెంతలఁ జెదరిన చిరునెరులు
కాంత కన్నులను గండుమీలకును
కంతుఁడు వేసిన గాలములే ॥ వెక్క ॥

తమకంబునఁ గాంతకుఁ గరమూలపు-
చెమటల తావుల చెలువములు
మమతలఁ బెంచిన మరుని కొంతముల-
జమళిఁగెలకు జలకములే ॥ వెక్క ॥

---

1. వి. రే. ౧౦౩. నేవగ్గమైతి, వి.రే-౪. కి వగ్గలమైతి. 2. దగ్గర. 3. వి.రే. ౧౦౩. రెండుఁజూచి శిఖికిఁ బగయుఁ దోఁచె. 4. వి.రే. ౫. జక్కవ చూపుల.

తెఱమోవిపై[1] తిరువేంకటపతి
గుఱుతులు నేసిన కురుఁబసలు
ఒఱగి వివశతల నుండఁగ సురతపు
మఱపులు దెలిపిన మర్మములే ॥ వెక్క ॥ 1

31-వ రేకు[2] కొండమలహరి

భోగీంద్రశయనుని బోయతి దివ్య-
భోగాలు మరిగిన బోయతి ॥ పల్లవి

పొదిగొన్న[3] పెనుఁగొప్పు బోయతి మించుఁ-
బొదలిన గుబ్బల బోయతి
పొదలఁ[4] బూవులు చూచి బోయతి యంప-
పొది సవి[5] వెరచెనె బోయతి ॥ భోగీ

పొదల గందపుమేని బోయతి పచ్చి-
పొదికప్పురపుఁ బూఁత బోయతి
పొడవైన హరిఁ జూచి బోయతి నేఁడు
పుడుకు వేఁదురుగొన్న బోయతి ॥ భోగీ

పొందైన రచనల బోయతి పతిఁ
బొందక పొందిన బోయతి
పొందులెరఁగని[6] బోయతి రతిఁ[7]
బొందె వేంకటపతి బోయతి ॥ భోగీ ॥ 1

ముఖారిపంతు[8]

ఎవ్వఁడో వీఁడేల తంగి వచ్చి
నవ్వీ నవ్వీ నాతోనే ॥ పల్లవి

1. మోముపై. 2. ఈ ౩౧-వ రేకులోని మిగిలిన నాల్గు పాటలు IV-వ సంపుట
కుదలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారిచే పరిశోధింపఁబడి చేర్పఁబడినవి. ౩౨-వ రేకు మొ
౬౦-వ రేకు వఱకుఁగల పదములు వారు ఆ సంపుటమున చేర్చి ప్రకటించినారు. 3. వి.
౩౨. పొదిగిన. 4. పొదలఁ బూ. 5. సా-రే. సవ్వి. 6. వి. రే. పొందులు యరఁగ
7. రతి అన్న మాటలేదు. 8. వి.రే. రా. ముఖారి

పచ్చిపాలే పచ్చిపాలే
వచ్చిపాలే తోడంటుఁబాలే
వచ్చి వచ్చి వాద వాడలఁ
జొచ్చియారగించెఁ జూడరే ॥ ఎవ్వ ॥

పెంట పెరుగే పెంట పెరుగే
పెంటమంద పెనుఁబెంట పెరుగే
అంటకంటకు మనఁగానే వాఁడు
వొంటి నారగించీ నోయమ్మా ॥ ఎవ్వ ॥

బొంకుగోరో బొంకుగోరో
బొంకుగోరో కోరో పొలఁతులు
వేంకటేశుఁడు వేసాలరాయఁడు
అంకెలా నన్ను నలరించెనే[1] ॥ ఎవ్వ ॥ 176

## సామంతం

ఎటువంటి భోగి వీఁడెటువంటి జాణ
వటపత్రమున నున్నవాఁడా వీఁడు ॥ పల్లవి ॥

పొదిగొనఁ బూచిన పున్నాగతరులలో
పొదలుఁ బువ్వొళ్ళపైఁ బూఁదేనె సోనలు
గదలుచు జడివానకాలంపుఁ బెదపెద్ద-
నదులై పారనున్నతిని
కదలని నడిగడ్డ కల్పభూజంబుల
వదిలమైన నీడ బంగారు చవికెలో
కదిసిన జలరాశి కన్నెకౌఁగిటఁ గూడి[2]
వదలకెప్పుడు నున్నవాఁడా వీఁడు ॥ ఎటు ॥

---

1. అంకెలా నన్ను నలయించెనే. 2. వి. రే. ఒ.తి. కౌఁగిటిలోన.

వలనగు తావుల వాసంతికలలోన
కెలఁకుల నరమోడ్పుఁ గెందామరలయందు
పొలయుచు గొజ్జంగపూవుల దూళితో
లలితంపు గాలి చల్లఁగను
కొలఁదిమీరిన మంచి కోనేటి పన్నీటి-
జలములలో నున్న జలజముఖులఁ దాను
అలరుచుఁ దగనోలలాడుచు నేప్రొద్దు
వలపులు చల్లినవాఁడా వీఁడు ॥ ఎటు ॥

లోకము లోపలి లోలలోచనలెల్లా
జోకైన తనవాలుఁ జూపులచేఁ జిక్కి-
యీకడాకడ చూడనెఱఁగక నిజమైన-
సాకారమునకె[1] మెచ్చఁగను
పైకొన్న సరసపుఁ బలుకులఁ గరఁగించి
యేంకాతమున సౌఖ్యమెల్లఁ జేకొనుచుఁ దా-
నీకడఁ దిరువేంకటేశుఁడై యున్నాఁడు
వైకుంఠపతియైన వాఁడా వీఁడు ॥ ఎటు ॥ 177

## శ్రీరాగం

వేవేగన రావివిభునితోడి పొందు
యేవూరికేవూరు యేవూరే ॥ పల్లవి ॥

ప్రేమమెఱఁగి రాఁడు పిలిచిన సతితోడ
యేమందమేమందమేమందమే
భామిని తను నొవ్వఁబలికెననుచు నాడె
యేమాఁటకేమాఁట యిది యేఁటికే ॥ వేవే ॥

1. సాకారములకె.

జామాయ నిదె వచ్చి సటలెల్లఁ బచరించి
యేమేలుకేమేలు ఇదియేఁటికే
కాముని శరములఁ గాఁగునింతకుఁ జెలి
యేమిటికింక మనమేమిటికే ॥ వేవే ॥

దిమ్మరితనములఁ[1] దిరువేంకటేశుని
రమ్మను రమ్మను రమ్మనవే
నెమ్మనమలరఁగ నేఁడింతలోననే
కమ్మరఁ గమ్మరఁ గరుణించెనే ॥ వేవే ॥ 178

దేసాళం

నెయ్యములల్లో నేరేళ్ళో
వొయ్యన వూరెడి వువ్విళ్ళో ॥ పల్లవి ॥

పలచని చెమటల బాహుమూలముల-
చెలమలలోనాఁ జెలువములే
థళథళమను ముత్యపుఁ జెఱఁగు సురటి
దులిపేటి నీళ్ళతుంపిళ్ళో ॥ నెయ్య ॥

తొటతొటఁ గన్నులఁ దొరిగేటి నీళ్ళ
చిటి పొటి యలుకల చిరునగవే
వటఫలంబు నీ[2] వన్నెల మోవికి
గుటుకలలోనా గుక్కిళ్ళో ॥ నెయ్య ॥

గరగరికల వేంకటపతి కౌఁగిట
పరిమళములలో బచ్చనలు[3]
మరునివింటి కమ్మనియంప విరుల-
గురితాఁకులినుపగుగ్గిళ్ళో ॥ నెయ్య ॥ 179

శుద్ధవసంతం

ఎన్ని నేసినా నీకు నిది గొత్తలా
అన్నిటిలోపల నుండే ఆతఁడౌదో కావో ॥ పల్లవి ॥

---

1. వి.రే. ఒ.వి. ములతిరువేం. 2. ని.రే. లా.ఆ. లంపు యీ వన్నె. 3. బచ్చనలే.

వాలఁతి మొయిఁదీగెపై పులకలు వొడమించే-
విల నిన్నుఁ దలఁపించి యిది గొత్తలా
తలకొన్న వేణునాదముననె వట్టిమాఁకు-
లలరఁ జేసినవాఁడవౌదువో కావో ॥ ఎన్ని ॥

గుట్టునఁ బయ్యెదకొంగు గుబ్బలనె జారించే-
విట్టె నీ ప్రేమనే యిఁతికిది గొత్తలా
మట్టుకొని వేణురవమున గొల్లెతల చీర-
లట్టు నిట్టు వదలించి నాతఁడౌదో కావో ॥ ఎన్ని ॥

కాంత కవుఁగిటను వేంకటగిరి విభుఁడా నీ-
వింత మేను మఱపించుటిది గొత్తలా
పంతమాడి యడవిలో పసుల సీరాగాల-
రంతులనే మఱపించే రాజవవుదో కావో. ॥ ఎన్ని ॥ 180

62-వ రేకు. ఆహిరి [1]

ఎంతవడి దాఁక నీ యెల [2] యింపులు
సంతమై విభునికిటు చనవియ్యరాదా ॥ పల్లవి ॥

పొగరుఁగెమ్మోవి గిరుపుల నగవులాఁడి నీ-
పగడవాతెర దెరచి పలుకవమ్మా
బిగువుఁ బొలయలుక మురిపెముల నీ సొబగెల్ల [3]
సగమాయఁ జలమింకఁ [4] జాలించరాదా ॥ ఎంత ॥

కలికి నునుమెఱుఁగుఁ బుల [5] కల గుబ్బలాఁడి నీ-
సొలపుఁగన్నులు దెరచి చూడవమ్మా
వలపు వసివాడ జవ్వనపు లేఁదీగతో [6]
తలఁకేవు కోపంబు తలఁగించరాదా ॥ ఎంత ॥

1. వి. రే. ౧౦౧. ముఖారి. 2. నీ వెల. 3. పములనే తనువల్లి 4. తెలి యింక.

లావణ్యముల సొబగులాఁడి నీ ప్రియుఁడైన-
కోవిదునిపైఁ బ్రేమ గులుకవమ్మా
శ్రీ వేంకటేశ్వరుఁడు చెలఁగి నిను మన్నించె-
[1] నీ వేఁడుకలనైన నిట్లుండరాదా. ॥ ఎంత ॥ 181

## ఆహిరి

* శిఱుత నవ్వులవాఁడు శిన్నెకా వీఁడు
వెఱపెఱఁగడు సూడవే సిన్నెకా ॥ పల్లవి ॥

పొలసుమేనివాఁడు బోరవీఁపువాఁడు
నెలసు మోరవాఁడు సిన్నెకా
గొలసుల వంకల కోరలతో బూమి
వెలసినాఁడు సూడవే సిన్నెకా ॥ శిఱుత ॥

మేఁటి కుఱుచవాఁడు మెడమీఁది గొడ్డలి-
సీటకాలవాఁడు సిన్నెకా
ఆఁటదానిఁ బాసి అడవిలో రాకాశి-
వేఁటలాడీఁ [3] జూడవే సిన్నెకా ॥ శిఱుత ॥

బింకపుమోఁతల పిల్లఁగోవివాఁడు
సింక సూపులవాఁడు సిన్నెకా
కొంకక కలికియై కొసరి కూడె నన్ను
వేంకటేశుఁడు సూడవే సిన్నెకా. ॥ శిఱుత ॥ 182

## శ్రీరాగం

చెల్లఁబో అలుగ నేఁడు సిగ్గుగాదా
వొల్లని వీనిఁ బాసి వుడికీ నామనను ॥ పల్లవి ॥

---

1. యీ వేడుకలనైన యిట్లు 2. వి. రే. ౪౦. సామంతం. 3. లాడె సూడ.
* ఇందు దశావతార సమన్వయము కలదు.

పొలసి యీ ప్రాణమిట్టే పోయినాఁ బోయఁ గాక
తలవంపు సేసే యీ తను వేఁటికే[1]
కలసియుఁ గలయని కఠి (న*) చిత్తుని వీని
సొలసి కమ్మరఁ జూచీ నా మనసు ॥ చెల్ల ॥

మరుతాపమున మేను మాఁడిన మాఁడెఁగాక
పరులవారికిఁ జిక్కె బ్రదుకేఁటికే
విరహాన నొకతెపై వేదనఁ బొరలు వీని-
కరుణలే కోరీని కష్టపు నామనసు ॥ చెల్ల ॥

సడిఁబెట్టి వయసిట్టే చంపినఁ జంపెఁగాక
వడిఁబెట్టి వేఁచే నావయనేఁటికే
కడు జాణఁడైన వేంకటగిరీంద్రుఁడు వాని-
వాడలు సోఁకిన నిట్టే వుబ్బెడి నామనను ॥ చెల్ల ॥ 183

కాంభోది

ఇదె మొగంబిదె యద్దమిఁకనేఁటికే మిగులఁ
బదరేవు చెలివద్ద[2] బవళించి నీవు ॥ పల్లవి ॥

పెట్టినది నాయకుని బిరుదు పెనుఁబెండెంబు
కట్టినది యతనిమెడ కంటమాల
యెట్టు బొంకెదవె చెలి యిందాఁక బంగారు-
పట్టెమంచముమీఁదఁ బవళించి నీవు ॥ ఇదె ॥

పుక్కిటిది నాయకుని పొందైన తమ్మలము
చెక్కిటిది పతినొసలి చిన్నిచెమట
యిక్కువెరిఁగియు బొంకనిఁకనేలె చెలి యతని-
పక్కనే యిందాఁకఁ బవళించి నీవు ॥ ఇదె ॥

---

1. వి. రే. ౪౦. తగులేఁటికే. 2. సా. రే. పతివద్ద

లచ్చెనలు కొనగోళ్ళలాంచనములు
ఇచ్చుకునిఁ దిరువేంకటేశుఁ గూడితివె చెలి[2]
పచ్చలోవరి [3] లోనఁ బవళించి నీవు ॥ ఇది ॥ 184

శ్రీరాగం

పిడికిట తలఁబ్రాల పెండ్లికూఁతురు కొంత
పెడమరలి నవ్వీనె పెండ్లికూఁతురు ॥ పల్లవి ॥

పేరుకల జవరాలె పెండ్లికూఁతురు పెద్ద-
పేరులముత్యాలమేడ[4] పెండ్లికూఁతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లికూఁతురు విభుఁ
బేరు కుచ్చ[5] సిగ్గువడీఁ బెండ్లికూఁతురు ॥ పిడి ॥

బిరుదు పెండెము వెట్టెఁ బెండ్లికూఁతురు నెర-
బిరుదు మగనికంటెఁ బెండ్లికూఁతురు
పిరిదూ (పిరుఁదూ?) రినప్పుడె పెండ్లికూఁతురు పతిఁ
బెరరేఁచీ నిదివో పెండ్లికూఁతురు ॥ పిడి ॥

పెట్టెనె[6] పెద్దతురుము పెండ్లికూఁతురు నేఁడె
పెట్టెఁడు చీరలుగట్టెఁ బెండ్లికూఁతురు
గట్టిగ వేంకటపతికౌఁగిటను వడి[7]-
వెట్టిన నిధానమైన పెండ్లికూఁతురు. ॥ పిడి ॥ 185

బౌళి

పెట్టని కోటిందరికిఁ బెండ్లికొడుకు బొమ్మఁ
బెట్టె నసురలకెల్లఁ బెండ్లికొడుకు ॥ పల్లవి ॥

---

1. వి. రే. ౨౩. పైకతని 2. టేశ్వరునిఁ గూడితివి. 3. సా. రే. పచ్చల వోవరి
4. వి. రే. ౨౩. ముత్యాలపెండ్లి. 5. కుచ్చి. 6. పెట్టెడి 7. కౌఁగిటను పెట్టిన.

పెల్లగించి భూమెత్తీఁ [1] బెండ్లికొడుకు వాఁడె
పిల్లఁగోవి రాగాల పెండ్లికొడుకు
పెల్లైన యావుల పెండ్లికొడుకు వాఁడె
పిల్లఁదీపుపెన్నుద్ది పెండ్లికొడుకు ॥ పెట్టని ॥

పెంచెపు శిరసుపాగ పెండ్లికొడుకు గుం-
పించిన కోపగించీఁ బెండ్లికొడుకు
పెంచకప్పుడే పెరిగెఁ [2] బెండ్లికొడుకు వల-
పించెఁ జక్కనిసిరిఁ బెండ్లికొడుకు ॥ పెట్టని ॥

పెంటపెరుగులదొంగ పెండ్లికొడుకు భూమిఁ
బెంటి పోతులఁ గూరిచెఁ బెండ్లికొడుకు
గెంటులేని వేంకటగిరిమీఁదను వాఁడె
పెంట వెట్టుకున్నవాఁడు పెండ్లికొడుకు ॥ పెట్టని ॥ 186

63-వ రేకు. ముఖారి

పైపై దూరక పదరో యింతి
కోపాన బాసైనఁ గొసీఁ గాని ॥ పల్లవి ॥

పరివారపుఁ బడఁతులేఁటికే
దొరలనంటేరు తొలరో
సరసపు తమ జగడాల విఛ్ఛే
వరుల దూరేరు పచ్చిగనే ॥ పైపై ॥

చక్కని విభుని సారెకుఁ జెలులు
వెక్కసాలాడక విడరో
దిక్కులకెల్లాను తెలివఁ బాసి తా-
నొక్కఁడే విచ్చేయుటొచ్చెమని ॥ పైపై ॥

1. వి. రే. ౩-౨. మెత్తెఁ బెండ్లి 2. కపుదే పెరిగే పెండ్లి.

శ్రీ వేంకటేశుఁడు చెలువుఁ డొక్కఁడే
యేవంక కేఁగిన నేమౌను
భావించి యురముపైనున్న కొమ్మదా-
నేవేవి గడించె నెఱఁగరా[1] ॥ పైపై ॥ 187

ఆహిరి

గుట్టునఁ గోరికలెల్లఁ గొల్లవట్టే నీ[2]—
పట్టపుదేవికి నీకుఁ బల్లాండు పల్లాండే ॥ పల్లవి ॥

పచ్చల సందిదండలు బాహుపురులు మెరయ
నెచ్చెలిపై మేను సోఁక నిలుచుండి
పచ్చవిలుకానితల్లి బంగారు దోసిట నీపై
జిచ్చకప్పురము చల్లిఁ బల్లాండు పల్లాండే ॥ గుట్టు ॥

మంతనపు మాఁటలతో మాఁటుగ నిన్ను నొలసి
కొంతపు గోళ్ళ నిగ్గు గుమ్మరింపుచు
చెంతలఁ జెంగలువలు చెలులు చేనందియ్యఁగ
పంతమున నీపై వేసి ప(సేఁబ?) ల్లాండు పల్లాండే ॥ గుట్టు ॥

అలరుల మేడలోన అలమేలు మంగ నీ[3] —
యలయిక దీరఁ బ్రేమ నలరఁ జేసి
కలసి వేంకటేశ నీ కాఁగిలి చేకొని నిదే[4]
పలుమారు మీకు మీకుఁ బల్లాండు పల్లాండే ॥ గుట్టు ॥ 188

మాళవి

తలచు సూసకపు ముత్యపుఁ దలఁబాలతో
నెఱుల తుఱుము వంచీనే నెలఁత ॥ పల్లవి ॥

---

1. సా. రే. నెఱఁగదా 2. ని. రే. ఇక. ట్టేని నీ 3. ఇది పె. రే. పాఠము సా. రే. వి. రే. మంగ ఇదే. 4. వి. రే. చేకొనె నిదే.

పచ్చఁ దోరణముఁ బలుకులింటికిని
పచ్చిముత్యాలనే కట్టె బాసికము
ముచ్చటలేనగవుల ముంగిట ముగ్గులువెట్టి
నిచ్చకల్యాణములాడీనే నెలఁత ॥ తఱచు ॥

బచ్చెనల మెఱుఁగు గుబ్బల అయిరాణి[1] దెచ్చి
*కుచ్చుఁ బులకల (ఁ) బూజ[2] గుండలాయను (?)
డిచ్చరిమరునిఁ దెచ్చి తెరమరఁగెడలించి[3]
హెచ్చిన పెండ్లికూఁతురే నెలఁత ॥ తఱచు ॥

మరువింటి పేరింటి మంచిలగ్నమునందు
పరువంపుఁ జనుదోయి పరుపుమీఁద
తిరువేంకటగిరిదేవునికౌఁగిటఁ గూడి
నిరతంపు సిరులందెనే నెలఁత ॥ తఱచు ॥ 189

నారణి దేశాక్షి[4]

ఎందరికి మోహించి యెందువోతివో నీ-
యందపుఁ జేఁతలు నాతో నానతియ్యరాదా ॥ పల్లవి ॥

పాదమున నంటిన పచ్చకప్పురములోన
వేదుగాఁ దులసితావి విసరీని
యేదెసఁ బవ్వళించితి వెవ్వతె పాదములొత్తె-
నాదరముతోడ నాతో నానతియ్యరాదా ॥ ఎంద ॥

చెలువంపు నొసల నించిన[5] పచ్చ కస్తూరి
తులసి పరిమళము దొలఁకీని
యెలమి నెక్కడకేఁగి యెవ్వతెకు మొక్కితివో
అలవి దేరఁగ[6] నాతో నానతియ్యరాదా ॥ ఎంద ॥

1. వి. రే. ప్ర. లనైరేనిదెచ్చి. 2. బుఱకలె బూజ. 3. లించె. 4. వి. రే. ప్ర. నారాయణి దేశాక్షి. 5. మించిన. 6. దీరఁగ.

సము నీ మాణికాన వొనరిన జవ్వాది
సరిగాఁ దులసితావి చల్లీవి
తిరువేంకటేశ పొందితివి నన్నిదె నీ—
యరవిరి విధమైన నానతియ్యరాదా. ॥ ఎంద ॥ 190

## శ్రీరాగం

ిగాలి వేఁదేల చల్లీనె కప్పురంపు—
మలయజము తానేల మండీనే ॥ పల్లవి ॥

పంపు మననేల పారీనే నలుగడల
చూపేల నలువంకఁ జూచీనే
తాపంపుమేనేల తడవీనె పూవింటి—
తూపేల చిత్తంబు దూరీనే ॥ చలి ॥

యెత్తి చిలుకేల వదరీనె పలుమారు
కోయిలలు దామేల గొణఁగీనే
రాయడికి నలులేల రాసీనె మాతోను
కాయజుఁడు తానేల కసరీనే ॥ చలి ॥

ంతముననేల యెదురైతినే తనకు
లోకాధిపతికేల లోనైతినే
చేకొనిదె మన్నించె శేషాద్రివల్లభుఁడు
పైకొనిదె మమ్మేల పాలించెనే ॥ చలి ॥ 191

## వరాళి

లిచి బిందెలఁ దోసుకొనుఁగాక యీ—
మలయుఁగోరికలనెడి మాడలే పండె ॥ పల్లవి ॥

పొలఁతి[1] సిగ్గులపోఁడు వోడిచి చిత్తపుటడవి
తొలుచూపుఁబదనునసె దున్నఁగాను
తలపోఁత విత్తఁగా తను చెమటవానలనె
బలుపైన[2] తమకమను బంగారు పండె ॥ కొలిచి ॥

ఇచ్చకపుఁ జిరునగవులింటిలోపలి తోఁట
మచ్చుఁజేఁకల్లై పలుమరుఁ దవ్వఁగా
ఎచ్చుకుందుల సొలపులేతపుజలము వారి
నచ్చుఁగాఁకల పైఁడినక్కులే పండె ॥ కొలిచి ॥

తగిలి వేంకటవిభుని తనివోని కౌఁగిటను
జగడంపుఁ గూర్మి సరసము చల్లఁగా
నిగనిగని పలుకుఁదేనియలు వేమఱుఁ బారి
నిగుడు విరహాగ్నిమాణికములే పండె. ॥ కొలిచి ॥ 192

64-వ రేకు. శంకరాభరణం

నాకుఁ జెప్పరె వలపు నలుపో తెలుపో
నూకి పోవఁగరాదు నుయ్యో కొండో ॥ పల్లవి ॥

పొలఁతి మరునికి వెరవ పులియో యెలువో
వులుకుఁదుమ్మిదమోఁత వురుమో మెరుమో
తిలకింపఁ జందనము తేలో పామో
యెలమిఁ గోవిలకూఁత *యేదో పోదో (?) ॥ నాకు ॥

పొదలిన చలిగాలి పొగయో వగయో
వదలిన కన్నీరు వాఁగో వంతో
వుదరమునఁ బన్నీరు వుడుకో మిడుకో
యెదుటఁ దలవంచుకొను టెగ్గో సిగ్గో ॥ నాకు ॥

అసమశరుపై పరపుటదనో పదనో
పసగలవాని మోవి పంచదారో తేనో
అసమగతి వానిరాక *ఆదోపాదో
రసికు వేంకటేశు పొందు రాజ్యమో.లక్ష్మి. ॥ నాకు ॥ 193

వరాళి

చెలఁగి కూతాకుగాఁ జేసేవునీ—
తలమీఁదనుండే తరుణిఁబో నేను ॥ పల్లవి ॥

పిసుకకు పలుమారు పసురువేసీ నంత
వసివాడుకోర్చిన వనితఁ గాను
పస రేఁచి నీవింత పాలించు తొల్లిటి—
సిసువయిన[1] నీ పెట్టుఁజెట్టఁబో నేను ॥ చెలఁగి ॥

చిదుమకు పరుమారు చెక్కునొచ్చీ[2] నీవు
వదనము నొక్కేటి వనితఁ గాను
ఎదురెదురనే భూమినెందరు లేరు నీ—
విదురవుచ్చినవారు నేనెవ్వతిని ॥ చెలఁగి ॥

కందించకు నన్నుఁ గౌఁగిట కాఁకల
అందునిందును గడు నలముచును
ఇందిరాపతి వేంకటేశ నీరతుల[3]
పొందు నాకిదె మఱపులకెల్ల నెలవు. ॥ చెలఁగి ॥ 194

శంకరాభరణం

శేఁతచేమటలనె తెలిసె మాకు నీకు
సీఁతలు మోఁతలునైన యింటిలోని సాము ॥ పల్లవి ॥

---

1. వి.రే. ౭౪. శిశువనైన. 2. చెక్కుఱునొచ్చీ. 3. నీ రచనల.
* అటోపాటో అని రేకు.

పొదలు నీ నిట్టూరుపులనె తెలిసె మాకు
తుద మీరు వలరాచతొలిసాము
చెదరు నీ నెరులు చూచిననె తెలిసె మాకు
వెదచలు కాఁకల విరహపు సాము ॥ లేఁత ॥

పొలిఁతి[1] నీ చూపువంపులనె తెలిసె మాకు
తలపోఁతవగల వి త్తరిసాము
పలుకకుండిన నీ కోపాననె తెలిసె మాకు
అలవోక నగవు నీ అరవిరిసాము ॥ లేఁత ॥

వొద్దికఁ గస్తూరితావులనె తెలిసె మాకు
గద్దరి నీ రతుల చీఁకటిసాము
ముద్దుల నీ నగవుల మోమునఁ దెలిసె మాకు
విద్దపు వేంకటపతి నెరపిన సాము. ॥ లేఁత ॥ 195

శ్రీరాగం

ఎనలేని బీరములెండ[2] మావులు
ఇనుపగుగ్గిళ్ళు నీవేమి సేసేవే[3] ॥ పల్లవి ॥

పల్లదపుఁ గోరికల బలిమి గలుగఁబట్టి[4]
తల్లదపుఁ దమకము దక్కెఁగాక
వెల్లిగొను మమతపై విసిగేవు యీ-
యిల్లులేని ముంగిలి నీవేమి సేసేవే ॥ ఎన ॥

లేఁత నీచి త్తములోఁ ధాలిమి గలుగఁగఁ బట్టి
చేఁతల నీయలుకెల్లఁ జెల్లెఁగాక
పూఁతమాఁటల సొలపుటొంకులనె దూరేవు[5]
యీఁతలేని చల్లులాట యేమిసేసేవే ॥ ఎన ॥

1. పె.రే. ౨౩. పొలఁతి. 2. వి.రే. ౩౨. ములేయెండ. 3. సేసేవు.

నెరతనముల నీ నెయ్యము గలుగఁబట్టి
తొరలి వేంకటపతి దొరకెఁగాక
తెరవ నీకితనికిఁ దియ్యపుఁగూటముల
యెరుకలేనిమఱపులేమి సేసేవే. ॥ ఎన ॥ 196

ఆహిరి

బయలీఁదించేవే గొల్లపడుచా - నీవె
బయలీఁదించేవు[1] లోపలనె కన్నులను ॥ పల్లవి ॥

పాలు వోయవుగా గొల్లపడుచా - యీ-
పాలకుండలివి లోలోపల[2] నున్నవి
పాలుమాలేవేలే గొల్ల[3] పడుచా - మా-
పాలు నీ కేలయ్య పాలవారివాఁడవు ॥ బయ ॥

పచ్చితేనె దేవే గొల్లపడుచ - మాకు
పచ్చితేనె లేదు మోవిపంటనే కాని
పచ్చిమాటలేలే గొల్లపడుచ - పూవుఁ-
బచ్చితేనెలివివో నీ పలుకుల కొనలు ॥ బయ ॥

పసితల్లమ్మే గొల్లపడుచా - నీవె
పసివడి తిరిగేవు బడివాయక
పసిబాలవటె గొల్లపడుచా - కురుఁ-
బసల వేంకటగిరిపతి నన్నేలితివి. ॥ బయ ॥ 197

ధన్నాసి

ఇందూ నందును రుచులెట్లుండునో
కందువెరిఁగి మేలుకై కొందువు ॥ పల్లవి ॥

---

1. చేవే. 2. లివి లోపల. 3. లేవేగొల్ల.

పదివేలు పళ్యాల పళ్ళిభోగము నీ-
వదన నారగింతువప్పాలతో
పొదవిన యింతేసి పొందైన మతితో నీ-
సుదతికెమ్మోవినే చొక్కితివిగా[1] ॥ ఇందూ ॥

సరిలేని కల్పభూజముల పూవుల పూజ
సిరులుగా సురలచేఁ జేకొందువు
పరిపరివిధముల పరిమళములనెడి-
తరుణి పువ్వులతావిఁ దగిలితిగా ॥ ఇందూ ॥

కొత్తయిన కస్తూరితోఁ గోరి తట్టుపుణుఁగు
మెత్తుకొందువు నీవు మేనిందను
ఇత్తరిఁ దిరువేంకటేశ యీ చెలిఁగూడి
హత్తిన చెమటలతో నలరితిగా ॥ ఇందూ ॥ 198

65-వ రేకు. కాంభోది

కూరిములే కదవమ్మ కోపమయ్యీని కడు-
భారమైన పోటుగాదా పచ్చిదేరే పలుకు ॥ పల్లవి ॥

పున్నమచందురుని తోఁబుట్టుగైన నీమోము-
వెన్నెలలే కదవమ్మ వేఁచఁజొచ్చీని
పన్నిన పగల వెలుపటివారికంటెను
ఎన్నరాని పగగాదా యింటిలోని పోరు ॥ కూరి ॥

చిత్తజుని జనియించఁ జేసే మొక్కలపు నీ-
చిత్తమిదే కదవమ్మ సిగ్గు వాపీని
మిత్తివలెఁ జెలరేఁగి[1] మీఁదఁగాసే యెండకంటే
నెత్తిమీఁదిచిచ్చుగాదా నీడలోని యెండ ॥ కూరి ॥

* కట్టఁగడ చందనపుగాలికి మీరిన నీ—
నిట్టూరుపులేకావా నిగ్గుదేరినవి
యిట్టె యిదె[1] తిరువేంకటేశుఁగూడఁబట్టి నీకు
చుట్టపుఁబగలే మంచిచుట్టములైనవి ॥ కూరిమి ॥ 199

## సామంతం

కడు నీకు మోహించుఁగాని చక్కనివిభు—
నెడసి నిమిషమైన నెట్టోరిచేవే ॥ పల్లవి ॥

పసిఁడిమంచముమీఁదఁ బవళించి యతనితో
కసరులాడెడియట్టు గాదువో నేఁడు
విసిగించెఁ గదవె యీ విరహానలము విన్ను—
నిసుమంత దడవైన నెట్లోరిచేవే ॥ కడు ॥

అడుగులొత్తుచు నీ యడుగులు[2] నతనిమై
కడఁగి వొత్తినయట్లు గాదువో నేఁడు
బడలించెఁ గదవె యీ పరితాపమున నిన్ను—
నెడయెడ యలుకలనెట్టోరిచేవే ॥ కడు ॥

ఒరపైన యతనిపై నొరగి యాతనిమతిఁ
గరఁగించునటువలెఁ గాదువో నేఁడు
వెరవక కలసితి వేంకటపతితోడ—
నెఱిఁగెఱుంగని చేఁతలెట్టోరిచేవే ॥ కడు ॥ 200

## శ్రీరాగం

వనితలఁ గరఁగించు వన్నెకాఁడవు యిట్టె
తనివి దీరవేమిటఁ దగునయ్యా విట్ఠల ॥ పల్లవి ॥

---

1. యిదె. 2. వి. రే. ... యడుగుల. * ఇందరమును విచారణీయము

పై పైనె యేరమణిగుబ్బలకో యిచ్చితివి నీ—
వైపైన కరముల వాఁడిగోళ్ళు
దూపిలిన రతితోడఁ దోయఁ(యొ?)డు చేతులతోడ
యేపునసున్నాఁడవిపుడేమయ్య విట్ఠల ॥ వనిత ॥

పొంద్రైన యేలలన చూపులకొ యిచ్చితివి నీ—
విందైన మురిపెపు(నీ) వేయిగన్నులు
అందపు రెండుగన్నులరవిరి నీ మోమున[1]
చెందమ్మిరేకులఁ బోలఁ జెల్లునయ్య విట్ఠల ॥ వనిత ॥

కింకల నేసతికో చిక్కెను నీ చిత్తమెల్లను
అంకెల నన్ను నేలితివబ్బురంబుగా
పంకంపుఁ గస్తూరిమేన పండరంగిపతివైన—
వేంకటనగముమీఁది వెడమాయ విట్ఠలా ॥ వనిత ॥ 201

ముఖారి - ఏకతాళి[2]

కలసి కాఁకలఁబెట్ట కనుసన్నలనె తిట్ట
చలపట్ట నీకుఁ జెల్లే జాణఁడే యతఁడు ॥ పల్లవి ॥

పగటుగుబ్బలురాయ పసిఁడి మట్టెలు మ్రోయ
నగవువెన్నెల గాయ నడచేవు
వగ నిన్ను భ్రమయించ వలపువారిధి ముంచ
జగడాలు వచరించ చతురుఁడే యతఁడు ॥ కలసి ॥

చూపులనె పగచాట సొబగులఁ గనుగీఁటఁ
దీపు పైపైమీఁటఁ[3] దిరిగేవు
కోపగింతలనేఁప కూరిములు పైఁజాఁప
రాపులు పెరరేఁప రసికుఁడే యతఁడు ॥ కలసి ॥

---

1. వి. రే. తా. గన్నుల అరవిరి; సా. రే. గన్నులవరవిరి నీమోము. 2. సా. రే. యకతాళి. 3. ఇది వి. రే. లోని పాఠము; సా. రే. దీపుల పైపైమీఁద.

సందుల దండలు జార జవ్వాదిచెమట గార
నందములు దైవార నలసేవు
కందువుల నినుఁగూడి కరఁగి సిగ్గులు వీడి
విందై నీతోడుతనాడే వేంకటేశుఁడితఁడు ॥ కలసి ॥ 202

ఆహిరి

ఎంతపని యిది యానతియ్యరాదా యీ—
చింతచే[1] నీ మనసు చిముడఁబెట్టేవు ॥ పల్లవి ॥

పండువెన్నెల బయటఁ బవళించి వేడుకల—
నుండి చెలి యేఁటికో వుసురంటివి
కొండుకవయసు నిడుకోరికల[2] నిట్టూర్పు—
టెండలనె యీ చిత్తమేల వేఁచేవు ॥ ఎంత ॥

తూఁగు మంచముమీఁదఁ దురుముఁ బయ్యద జార—
నూఁగుచును నేఁటికో వుసురంటివి
కాఁగేటి[3] కుచగిరులు కమ్మఁజెమటలఁ దొప్ప
దోఁగగా తమకంబు తొలఁగ దాఁచేవే ॥ ఎంత ॥

నిద్దంపు వేడుకల నీవు వేంకటవిభుని—
వొద్దికై యేఁటికో వుసురంటివి
వొద్ద నీకెపుడాతఁడుండవలె నాతనిని
వద్దనఁగ రాదనుచు వాడఁబారేవు ॥ ఎంత ॥ 203

బౌళి

కావరాదా కరుణించి

పచ్చిదేరునగ్గి బిగబిగ మండేటి—
చిచ్చరకోలల చేఁతల
వెచ్చియు వేవని వేదనఁ[1] బొరలుచు
అచ్చపుటాసల నలసీఁ దరుణి ॥ కావ ॥

నీడలేని మాఁకు నిక్కపుటెండల
తాడులేని కట్టుఁదగులున[2]
గోడలేని పెద్దకోరిక చిత్తరు
వాడుచు లోలోనె వ్రాసీఁ దరుణి ॥ కావ ॥

పొందు[3] లేని పొందు భోగపుఁ బ్రియముల
కందెడి తనలోని[4] కరఁగుల
కందువెటిఁగి వేంకటగిరిపతి నినుఁ
బొందిన[5] తమకానఁ బొరలీఁ దరుణి ॥ కావ ॥ 204

66—వ రేకు. దేశి[6]

ముదిత చిత్తమునకు మొక్కరమ్మా
తుదలేని పతినిదె తోడితెంచె[7] నిపుడు ॥ పల్లవి ॥

పొలఁతి గుబ్బలనేడి పొడవు గుబ్బలిమీఁది—
మొలకచందురునకు మొక్కరమ్మా
నెలవుగఁ దనపతి నిద్దిరించే యింటిలోన
వెలయు వెన్నెలతీగె వెంటఁదెచ్చె నిపుడు ॥ ముదిత ॥

వనిత కన్నులనేటి వనజదళములపై
మొన చెంగలువలకు మొక్కరమ్మా
పెనగొన్న తనవిభు పెదపెద కన్నుల
గొనకొన్న పొందులెల్లఁ గొంటవచ్చె నిపుడు ॥ ముదిత ॥

1. వి. రే. ౹ఇ. వేదనలఁ. 2. సా. రే. వి. రే. తగులునా. 3. వి. రే. పిరందు.

అంచగమనకుఁ దొడవైన జవ్వాది నటి
మించిన మేనితావికి మొక్కరమ్మా
యెంచరాని తిరువేంకటేశుఁ గూడి యాతని—
లంచపుఁ గాఁగిటితావి లంకెఁ బెట్టె నిపుడు. ॥ముదిత॥ 205

ముఖారి

రాఁడుగాక సరుగన రసికుఁడు యిట్టే
నేఁడే మచ్చికలనే విధులు నిలుపఁడా ॥ పల్లవి ॥

ప్రేమపు నీ యధరమే పెట్టరానిజీతము
కోమలి నీ తమ్ములమే కొంగుభత్యము
జాము నిన్నుఁ గొలిచిన చక్కని నీ విభుఁడు
యేమరక వలపులయేకరాజ్యమేలఁడా ॥ రాఁడు ॥

పూఁత నీ గర్వముల చూపులే వారకములు
లేఁత నీ నగవులే పళ్ళెములో కూడు
పూఁతగాని చిత్తమనే వుప్పరిగెనుండినా
బాఁతి పడి నీ గుబ్బలపైఁడి కుండలెత్తఁడా ॥ రాఁడు ॥

పయ్యని నీ మేనితావి పువ్వుల చప్పరము
తొయ్యలి నీ కౌఁగిలిది తూఁగుమంచము
కయ్యపుఁ గూటముల వేంకటగిరివిభుఁడు
గయ్యాళి నీ కోరికల గద్దెమీఁద నుండఁడా[1] ॥ రాఁడు ॥ 206

ముఖారి

ఇందరినేలితి వీఁకనేలే (మే?) నీ—
యందపుఁ బనులకు నంపుదు గాక ॥ పల్లవి ॥

---

1. వి. రే. ౧౨౦. నుండఁగా.

పొక్కుచు నిదె వలపుల సింహాసన-
 మెక్కితి వంగన[1] యింకనేమే
 పుక్కిటి నిట్టూర్పుల ప్రసాదములు
 చక్కని చెలులకుఁ జల్లుదు గాక ॥ ఇంద ॥

పరిమళపు నుదుటఁ బట్టునఁ బట్టము
 ఇరువుగఁ గట్టితివింకనేమే
 తరగని మేని ప్రతాపానలమున
 అరుదగు సిగ్గుల నణఁతువు గాక ॥ ఇంద ॥

రాఁపుల మోహపురతుల రాజ్యమిది
 యేపునఁ జేసితివింకనేమే
 పైపై వేంకటపతిరూప సిరులు
 చేపడె నిన్నిటఁ జెలఁగుదు గాక. ॥ ఇంద ॥ 207

ముఖారి

వెరవకువే యింత వెరగేలా నీకు
 నెఱిఁ గురిసీఁ గొప్పున నీలాలు[2] పల్లవి ॥

పగడాలు వాతెరఁ బాయక కురియఁగ
 మొగిఁ గురిసీఁ గన్నుల ముత్యాలు
 మగువ నీవిటుని ప్రేమపుఁగూటమి గన్నుల
 మగుడఁ గురిసీ నింక మాణికాలు ॥ వెర ॥

పడఁతి నీపుట్టానఁ బచ్చలు గురియఁగా
 వడిసీని నీమేన వజ్రాలు
 కడఁగి నీరమణుని కాఁకలఁ గూడఁగ[3]
 తొడరీ నీగోళ్ళతుదఁ గెంపులు ॥ వెర ॥

1. సా. రే. వనిఁకనేమే. 2. ఇది వి. రే. ౧౨. లోనిది. సా. రే. గురిసీ నీలా[illegible]
[illegible]

హితవైన తిరువేంకటేశుకౌఁగిట మోహ—
రతులఁ బొడమె నవరత్నాలు
ప్రతిలేని లప్పులైన పచ్చి[1] కస్తూరి శయ్య
మితిలేక రాలెనే గోమేధికాలు ॥ వెర ॥ 208

ముఖారి — అటతాళం

ఎవ్వరిపై నింతేసి యేల దూరేవే
పువ్వులు నిన్నే తాఁకఁ బొంచెనటవే ॥ పల్లవి ॥

పండువెన్నెలలు నీపైఁ గాయఁగా నీ—
కెండలాయెనంటా నేల తిట్టేవే
నిండిన చందురుఁడు నీకు నాతనికి
కొండుకపాయము రూపు కూడపెట్టె నటవే ॥ ఎవ్వ ॥

చల్లగాలి నిన్నును జాలిఁబెట్టెనంటా
వెల్లిగ నాకేలేలట్టే విఱిచేవే
మెల్లనే నీవిభుని మేనితావి యింతేసి
చల్లుమని గాలియేమి చాటెనటవే ॥ ఎవ్వ ॥

కోవిలలు నిన్నుఁ గోపగించెనంటా
యీవల నావలనెల్ల నేల దూరేవే
శ్రీ వేంకటేశుని చెలియ నీకౌఁగిట
చేవగాఁ గూడుమని చెప్పెనటవే. ॥ ఎవ్వ ॥ 209

సాళంగం

నీవు దురగముమీఁద నేర్పు మెరయ
వేవేలు రూపములు వెదచల్లితపుడు ॥ పల్లవి ॥

1. సా. రే. వచ్చ.

పదిలముగ నిరువంక పసిఁడిపింజల యంప-
పొదుల తరకసములొరపులు నెరపఁగ
గదయు శంఖంబుఁ జక్రము ధనుఃఖడ్గములు
పదివేలు సూర్యబింబములైనవపుడు ॥ నీవు ॥

సొరిది శేషుని పెద్దచుట్టు పెనుఁగేవడము
సిరిదొలఁక నొకచేతఁ జిత్తగించి
దురమునకుఁ దొడవైన ధూమకేతువు చేత-
నిరవైన బల్లెమై యేచెనందపుడు ॥ నీవు ॥

కరకజడతో రమాకాంత జయలక్ష్మియై
తొరలి కౌఁగిట నిన్నుఁ దొడికి పట్టి
చరచె వెను వేంకటస్వామి నిను గెలువుమని
మెరుఁగు కుచకుంభముల మిసిమితో నపుడు. ॥ నీవు ॥ 210

67-వ రేకు. కాంభోధి

కాంత నీ నెరుల చీఁకటినతఁడు భ్రమయఁగా
చింత చీఁకట్లు ముంచినది యరుదా ॥ పల్లవి ॥

పొలఁతి[1] నీ చిఱునవ్వు పువ్వులాతఁడు గోసి
కులికి కన్నుల నొత్తుకొనఁగాను
వలరాయఁడపుడు తన వాఁడి పువ్వు (పు?) టమ్ములను
చలముకొని[2] మిమ్ము ముంచక మానునా ॥ కాంత ॥

నెలఁత నీపలుకుఁదేనియలాతఁడిటు గ్రోలి
సొలయుచును మైమరచి చొక్కఁగాను
తలఁపఁ గోవిలల యమృతంపుఁ బలుకుల వెల్లి
అలర మీమీఁదఁ గురియక మానునా ॥ కాంత ॥

పరగు నీ మెఱుఁగు గుబ్బలనెడి (నేటి?) గిరులపై
తిరువేంకటేశ్వరుఁడు తిరుగఁగాను
పరువంపు వలపు తాపలపెద్దకొండలై
గరిమతో మీకుఁ బెరుగక మానునా ॥ కాంత ॥ 211

## శ్రీరాగం

పతిఁ గలసి మేనెల్ల పరవశంబగుకంటె
హితవిరహమున నెదిరి నెఱుఁగుటే మేలు ॥ పల్లవి ॥

పరపీడ గావించి బతుకు బతుకుటకంటె [1]
పరహితము చేయునాపదలె మేలు
సిరుల నడిమికి భయముసేయు చనుఁగవకంటె
తరుణి నీ [2] నెన్నడిమిదైన్యమే మేలు ॥ పతి ॥

కాంత నితరులకింద గరువించుకంటె (?) మతిఁ
జింతఁగందుచు నలయు సిలుగె [3] మేలు
కుంతలంబుల కిందఁ గులుకుఁ జూపులకంటె
చెంతలను నీతురుము చెదరుటే మేలు ॥ పతి ॥

తొడరి సరివారి పొత్తుడుకు నోర్చుటకంటె
గొడవతో వాఁడి గైకొనుటె మేలు
పడఁతి నీ వేంకటప్పనిరతి నలయుకంటె
కెడపి కొనగోళ్ల సోఁకించుటే మేలు ॥ పతి ॥ 212

## ముఖారి

వన్నెమాటల వలతువా నీవు నామనను
కన్నపెట్టఁగఁ గదా కదుబేలనైతి ॥ పల్లవి ॥

---

1. వి. రే. ౨-౩. బతుకుకంటె. 2. దుణినెన్న. 3. సిరుతె.

పట్టుకొని నిన్నుఁ గోపముదీర చూపులనె
కట్టివేసినఁగదా [1] గర్వమడఁగు
అట్టునిట్టును నీకు నయ్యలునసాదలును
* బెట్టెకా నీచేతఁ బిరివీకులైతి ॥ వన్నె

మరిగించి నిన్ను నా మనసారఁ గుచగిరుల–
చరులఁ దోసినఁ గదా చలమణఁగును
అరిది మోహమున నీ యడుగులకు మడుగులేఁ
బరచికా విరహతాపమునఁ బడవలనె ॥ వన్నె

చెనకి నిన్నిట్ల నాచేయారఁ గోరికల
తనివి దీర్చినఁగదా [2] తగులవుదువు
ఘనమూర్తివైన వేంకటగిరీశ్వర నీకు–
నొనర లోనైకదా వొడలెరఁగనైతి. ॥ వన్నె ॥

## ముఖారి

కొలనిలోన మును గోపికలు
మొలక నవ్వు (వు ?) లతో మ్రొక్కిరి నీకు ॥ పల్ల

పిరుఁదులు దాఁటిన పింపెపుటలకల
తురుములు వీడఁగఁ దొయ్యలులు
అరిదినితంబములందునె దాఁచుక
మురిపెపుఁ గరముల మొక్కిరి నీకు ॥ కొల

విద్దపు మానము నెలఁతలు లోఁగుచు
గద్దరి తొడలనె కట్టుచును
ముద్దుటుంగరంబుల కరములతో
ముద్దులు గునియుచు మొక్కిరి నీకు ॥ కొల

1. వి. రే. ౩౧. నివఁగాక: 2. ర్చినఁగాక. * బెట్టికా

పాలిండ్ల పెనుభారంబుల కర—
మూలపు మెఱుఁగులు ముంచఁగను
వేలపుఁ బ్రియముల వేంకటేశ నిను
మూలకుఁ బిలుచుచు మొక్కిరి నీకు ॥ కొలని ॥ 214

రామక్రియ [1]

మానరె మాయలు మగువలు నేఁ
గాను కాననుచుఁ గనలీ శిశువు ॥ పల్లవి ॥

పాలట [2] దొంగిలె బాలుఁడు గో—
పాలులఁ గూడుక పలుమరును [3]
బోలవీమాఁటలు బొంకులు యిది [4]
యేలె యేలె మీరెలజవ్వనులు ॥ మాన ॥

సారెకు వెన్నలు చవులట [5] యీా—
దూరులు మీకిఁక [6] దొసగులు
చేరువ గరిమలు చెల్లవు మీరు
పోరె పోరె వారవుం [7] నెర సతులు ॥ మాన ॥

కింకలు మీకివి [8] గెలుపులు నెల—
వంకలు మీకివి [9] వన్నెలు
వేంకటపతి మీ విభుఁడట మీరు
బొంకక బొంకక పొలఁతులు మనరే ॥ మాన ॥ 215

ముఖారి

ఎండలు రేయెండలుగా నిరువంకఁ జూచువాఁడు
కొండలుఁగోట్లునయిన గుణములవాఁడు ॥ పల్లవి ॥

---

1. వి. రే. ౩౪. అహిరి. 2. పె. రే. ౨౪. పాలుదొం. 3. సా. రే. వి. రే. మారుమ. 4. సా. రే. కుబ మీ. కే. 5. సారెకు మిక్కిలి చవవులు. 6. వి. రే. మీకివి దొసరులు. 7. సా. రే. వారవరి 8. సా. రే. మీరినగెలు. 9. మీకివన్నె

పాలవెల్లి కొండమీఁదఁ బల్లెగట్టినవాఁడు
పాలలోని పాపఁడన్న ప్రాణమైనవాఁడు
పాలఁబుట్టినట్టికూడు పంచిపెట్టినవాఁడు
పాలునేయి ముచ్చిలించి బదికినవాఁడు ॥ ఎంద ॥

ఆలపోతువానితోడ నంటినమేనివాఁడు
ఆలఁగాపరులతోడ నాడినవాఁడు
ఆలజాలమైన నీటనలరఁ దేలినవాఁడు
ఆలపోతు కొండమీఁద నసువైనవాఁడు ॥ ఎంద ॥

పాఁపరేని మేను దన పానుపు నేసినవాఁడు
మోఁపరయి సకలము మోచినవాఁడు
కోపము శాంతములేని కొండలకోనేటివాఁడు
పాపముఁ బుణ్యము లేక బదికినవాఁడు. ॥ ఎంద ॥ 216

68-వ రేకు. శంకరాభరణం[1]

వేఁటకాఁడనంటా నా[2] వెంటఁ బాయవు వోరి
చీటకపు చెంచెత నాచేతిలాగెరఁగవా ॥ పల్లవి ॥

పొదలో నేనేసిన పులి నీవేసితినని[3]
పెదపెద్ద యెలుగుఁల బెదరించేవు
కుదురుగుబ్బల నిన్నుఁ గుమ్మదునో వుండేవో మేను[4]
చిదియఁగా మేటిచెంచెత నన్నెఱఁగవా ॥ వేఁట ॥

చేరువ నామోఁటునఁ జేరిన నామెకముల[5]
నేరుపరినంటా నీవునేసేవు[6]
జీరలుగా కొమ్మ గోరఁ జింతునో వూరకుండేవో
పేరుకల చెంచెత నాబిరుదులెరఁగవా ॥ వేఁట ॥

---

1. ఏ.రే. ౹౬. వరాళి. 2. నంటా వెంట. 3. సా.రే. పొదలోన నుండేటి పులిని వేశితినంటా. 4. ఏ.రే. దేవో చిదియ. 5. సా.రే. చేరి నామోఁటునఁ జేరిన మెకముల. 6. ఏ.రే. నీవయేసేవు.

చొల్లెపు చుట్టలతోడ[1] చూపులకు నడ్డాలు
చెల్లునంటా వచ్చి చెట్టవట్టేవు
వొల్లననఁగా[2] గూడేవు వుద్దండపు వేంకటేశ
జల్లివింటి చెంచెత నాచలములెరఁగవా ॥ వేఁట ॥ 217

భైరవి

* ఏమీననకురే యెప్పుడు మీరు
గామిడియై కాలిసన్నఁ గదలీని బిడ్డఁడు ॥ పల్లవి ॥

పొలసీననకురే పొదిగి యిందరుఁగూఁడి
పులికి తలదీసుకవున్న బాలుని
పలుకఁడనకురే బలుమోరతోపుఁ గోపి
తలఁకి సిబ్బితిగొని త (నీఁద?) లరమ్మ బిడ్డఁడు ॥ ఏమీ ॥

అడిగిననకురే ఆసదీరదనకురే
కడఁగి చలమరియై గాసిఁబెట్టీని
జడలున్న వనకురే జననుతుఁడీశిశువు
కడు దూరీ గిరులకు గమనించి బిడ్డఁడు ॥ ఏమీ ॥

బిత్తలున్నాఁడనకురే పృథివిలోఁ బిన్నవాఁడు
మత్తులై వున్నవారి మదియించీని
చిత్తిణివాఁడనకురే శ్రీ వేంకటేశుఁడు
యెత్తుక యీరేడులోకాలేలీని బిడ్డఁడు ॥ ఏమీ ॥ 218

సామంతం

అడుగడుగుకు నీ వాడఁగాను మా—

పాదికెత్తు మెరుఁగారు బంగారుగుండు
సేదదేర మెడఁగట్టచిత్తగించితి
యేదెస కానికదెచ్చి యిచ్చిరి నీ కెవ్వరో
పాదపుగజ్జెలు మోయ పండరంగిరాయ ॥ అడు ॥

మద్దికాయలు చెవుల మాణికాల పోఁగులు
పెద్దపెద్దముత్యాలు పెంపు మీరఁగా
ముద్దల వెన్నపాలు ముచ్చిలించు నేఁతలవి
బద్దుల పనులై పోయ పండరంగిరాయ ॥ అడు ॥

వెల్లిగొను వేడుకల వేంకటాద్రిపతివై
తెల్లనికన్నుల నవ్వుతీగె సోగల
గొల్లెతల గుబ్బలపై కూరిమి మెరయఁగా
పల్లకి నీకిప్పుడాయ పండరంగిరాయ. ॥ అడు ॥ 219

మంగళకౌశిక

అబ్బురంపు శిశువు ఆకుమీఁదిశిశువు
దొబ్బుడు రోలశిశువు త్రుప్వి త్రుప్వి త్రుప్వి ॥ పల్లవి ॥

పుట్టు శంఖుచక్రములఁ బుట్టిన యాశిశువు
పుట్టక తోల్లే మారుపుట్టువైన శిశువు
వొట్టుక పాలువెన్నలు నోలలాడు శిశువు
తొట్టెలలోని శిశువు త్రుప్వి త్రుప్వి త్రుప్వి ॥ అబ్బు ॥

నిండిన బండి దన్నిన చిన్నిశిశువు
అండవారి మదమెల్ల నణఁచిన శిశువు
కొండలంతేళసురులఁ గొట్టిన యా శిశువు
దుండగంపు శిశువు త్రుప్వి త్రుప్వి త్రుప్వి ॥ అబ్బు ॥

వేఁగైన వేంకటగిరి వెలసిన శిశువు
కౌఁగిటి యిందిర వొలఁగవి శిశువు
ఆఁగి పాలజలధిలో నందమైన పెనుఁబాము
తూఁగుమంచము శిశువు త్రువ్వి త్రువ్వి త్రువ్వి. ॥ అబ్బు ॥ 220

## ముఖారి[1]

పలుకుఁదేనియల నుపారమియ్యవే
అలరువాసనల నీ యధరబింబానకు ॥ పల్లవి ॥

పుక్కిటి లేనగవు పొంగుఁబాలు చూపవే
చక్కని నీవదనంపు చందమామకు
అక్కరో నీవాలుఁగన్నులా[2] రతిగా నెత్తవే
గక్కన నీచెక్కుతొలుకరి మెరుపులకు[3] ॥ పలుకు ॥

కమ్మని నీమేని[4] తావి కానుకగా నియ్యవే
వుమ్మగింత చల్లెడి నీవూరుపులకు
చిమ్మల[5] నీచెమటలఁ జేయవే మజ్జనము
తిమ్మరి నీమురిపెపు తీగమేనికి ॥ పలుకు ॥

పతి వేంకటేశుఁగూడి[6] పరవశమియ్యవే
యితవైన నీమంచి హృదయానకు
అతనినే తలఁచఁగ నానతియ్యఁగదవె
తతితోడ నీలోవి తలపోఁతలకు. ॥ పలుకు ॥ 221

## భైరవి[7]

ఆన వెట్టుదువు నీవప్పటి[8] నానోరణఁచి వోరి[9]
నీ నిజానకు నాతో నేఁడైన మానరా[10] ॥ పల్లవి ॥

---

1. వి.రే. ౧౦౫. శ్రీరాగం. 2. వాలుఁజూపు అర. 3. తొలుకారు మెరుఁగులకు. 4. మెయి. 5. చెమ్మల. 6. పేశుపై. 7. తం. ప్ర. ౩౦. ధ్రువతాళం. 8. తా. వేం. ౨౦౨; తం-ప్ర. అతలువెట్టేవు సారె అప్ప; 9. 'వోరి' లేదు. 10. తం-ప్ర. ఆనాలు నీ కేతోదగురా అదియింకా మానవురా; తా-వెం.ఆనలు. నీకు తోడారా నేడింక మానవురా.

పచ్చడాన జవ్వాది పరిమళమేడదిరా
పచ్చినేఁతలు చెక్కుళ్ళపై నీకేడవిరా
గచ్చుమోవిమీఁదనున్న కసిగాటులేడవిరా
యిచ్చకుఁడ కనుఁగెంపులేడవి గలిగెరా[1] ॥ఆన॥

ముద్దుల[2] చక్కని నీదు మోముకళలేడవిరా
కొద్దిగాని సందొత్తుగోరేడదిరా[3]
గద్దరీఁడ యీ చిట్లు[4] గందము నీకేడదిరా
తిద్దెను గస్తూరిబొట్టు దిమ్మరి యెవ్వతెరా[5] ॥ఆన॥

భీతితో నీవాడేటి[6] తబ్బిబ్బుమాటలేడవిరా
రాతిరేడ నుంటివి[7] వెరవక చెప్పరా
యేతరీఁడ తిరువేంకటేశ నన్ను నేలితివి[8]
యేతులతో వలపించ నెంత కలికివిరా[9] ॥ఆన॥ 222

69-వ రేకు. కన్నడగౌళ

కామయాగము చేసెఁ గలికి తన—
ప్రేమమే దేవతాప్రీతిగాను ॥పల్లవి॥

పొలుపలర సురతతాంబూలరసపానంబు
నలినాక్షి సోమపానంబు గాను
కలకలంబుల మంచి గళరవంబుల మోఁత
తలకొన్న వేదమంత్రములుగాను ॥కామ॥

---

1. తా-వెం. గెంపులివి యేడవిర. 2. తం-ప్ర. ముద్దుగారేనీ. 3 కొద్దిగా నొక్కిన సంది గోళ్ళేడవితా; తా-వేం. కొద్దిగా నూఁదిననంది. 4. తా.వేం. చిట్లిన. 5. సా.రే. తిద్దినది గోరు జాటుదిమ్మరి యెవ్వతెరా. (తా.వెం. లో ఈ చరణము ౧.౨ పాదములు తారుమారైనవి.) 6. సా. రే. బీతులేక నీవాడే. 7. తా. వెం. రాతిరెందు వోతివో. 8. తం.-ప్ర. ఈ తరి శ్రీవేంకటేశ యిట్టె నను(గూడితివి. 9. ఈ తీరు సారె వలపించ యెంత కలికివిరా; తా.వెం. ఈతరి చొక్కించితివి యెంత.......

పడఁతి తన విరహతాపమునఁ బుట్టిన యగ్ని
అడరి దరికొన్న హోమాగ్నిగాను
ఒడఁబడిక సమరతుల నుదయించిన చెమటఁ
దడియుటే యది యవభృథంబుగాను ॥ కామ ॥

తనరఁ గుచముల రుచులు దంతా (త?) క్షత క్రీడ
ననువైన పశుబంధనంబుగాను
యెనసి శ్రీతిరువేంకటేశ్వరుని పొందు
ఘనమైన దివ్యభోగంబుగాను ॥ కామ ॥ 223

## శ్రీరాగం[1]

పట్టనీఁకనోప నాప్రాణంబులు నీ[2]—
పట్టు దైవమె యెరుఁగు బ్రదుకవయ్యా ॥ పల్లవి ॥

పడితివిన్నాళ్ళు నిర్బంధమున నాచేత
కడమొదలు లేని కాఁకల సొలపుల
బడలెఁ గడు నామేను పట్టనీఁకనోప నీ[3]—
పడఁతులను గూడుకొని బ్రదుకవయ్యా ॥ పట్ట ॥

నొగిలితివి నాచేత నొప్పిమాటలనెంతె[4]
వగలఁ గడు నన్ను విడువఁగనోపక
జగడమిఁక లేదు విరసము మాని సుఖివియై[5]
పగలేక[6] యిఁకనైన బ్రదుకవయ్యా ॥ పట్ట ॥

ఎంత నొగిలినను నాకేమాయె[7] నీకు నీ—
సంతోషమబ్బినను చాలుఁగాక
యింతసేసియు వేంకటేశ కూడితివి నీ[8]—
పంతంబు చెల్లెనిఁక బ్రదుకవయ్యా. ॥ పట్ట ॥ 224

1. వి.రే. ౧౦౬౯. ముఖారి. 2. నాపట్టుదయ్యమెరుంగు. 3. పట్టకిఁక నీవు పీ 4. మాటలనె పీ. 5. వెయ్యె. 6. పగదీరెనిఁక. 7. ఎంతసేసిన నీకు నేమాయె. 8. సా.రే. ఇంతసేసి తిరువేంకటేశ నను కూడితివి

## శ్రీరాగం

కవయఁగవలెనంటి కాఁగలించేవా నీ-
 వువిదలఁ దలఁచకవుండనోపేవా ॥ పల్లవి ॥

పారిటాకులు గట్టి పారనోపేవా
 యేరులెల్ల దాఁటి కొండలెక్కనోపేవా
 యీరీతి వెదురువియ్యమేరనోపేవా
 పేరినతేనెలు తెచ్చి పెట్టనోపేవా ॥ కవ ॥

యెడమఁ గుడిని వింటనేయనోపేవా
 అడవిమెకాల వేఁటలాడనోపేవా
 కడఁగి చెంచెత నాతోఁ గలకుండేవా
 అదరి నాపొత్తుల నారగించేవా ॥ కవ ॥

యిప్పటిమాఁటలు యీడేరించనోపేవా
 చెప్పినట్టి కాఁపురము నేయనోపేవా
 కప్పురంపుళయ్యపై వేంకటరాయఁడా
 యెప్పుడుఁ బాయని చనవియ్యనోపేవా ॥ కవ ॥ 225

## మాళవి

చూడవమ్మ యశోదమ్మ
 వాడల వాడల వరదలివిగో ॥ పల్లవి ॥

పొంచి పులివాలుఁ బెర్దుగు[1]
 మించు మించు మీఁగడలు
 వంచి వారలువట్టిన
 కంచపుటుట్లు కాఁగులివిగో ॥ చూడ ॥

1. పె. రే. ౨౪. బెరుగులు.

పేరీఁ బేరని నేతులు
చూరల వెన్నల జున్నలును
ఆరగించి యట సగఁబాళ్ళ
పారవేసిన బానలివిగో ॥ చూడ ॥

తెల్లని కనుఁదీగెల సోగల
చల్లలమ్మేటి జవ్వనుల
చెల్లినట్లనే శ్రీవేంకటపతి
కొల్లలాడిన గురుతులివిగో ॥ చూడ ॥ 226

ధన్నాశి

బండి విరిచి పిన్నపాపలతో నాడి
దుండగీఁడు వచ్చె దోబూచి ॥పల్లవి॥

పెరుగు వెన్నలుఁ బ్రియమున వే-
మరు మెచ్చిలించు మాయకాఁడు
వెరవున్నాఁ (వునఁ?) దనవిధము దాఁచుకొని
దొరదొంగ వచ్చె దోబూచి ॥బండి॥

పడుచు గుబ్బెత పరపుపై పోక-
ముడి గొంగు నిద్రముంపునను
పడియుఁ దా (?)వద్దఁ బవళించినట్టి-
తొడుకుదొంగ వచ్చె దోబూచి ॥ బండి ॥

గొల్లపల్లెలో యిల్లిల్లూ చొచ్చి
కొల్లలాడిన కోడెకాఁడు
యెల్లయినా వేంకటేశుఁడు ఇదె
తొల్లిటిదొంగ వచ్చె దోబూచి ॥ బండి ॥ 227

## సామంతం

చల్లనై కాయఁగదొ చందమామా నీ
వెల్ల(ల్లి ?) గాఁ దిరువేంకటేశునెదుర
మొల్లమిగ నమృతంపు వెల్లి గొల్పుచు లోక–
మెల్ల నినుఁ గొనియాడఁగాను ॥ పల్లవి ॥

పొందైన హితులు నాప్తులు రసికులును గవులు
నందమగు నునుమాటలాడ నేర్చిన ఘనులు
చిందులకు నాడేటి సీమంతినీ మణులు
చెలఁగి యిరుగడఁ గొలువఁగాను

వందిమాగధులు గైవారింపఁ దనదివ్య–
మందిరోపాంత ఘనమార్గమునఁ గోనేటి–
ముందటను మంద మందప్రయాణములతో–
నిందిరాపతి మెరయఁగాను ॥ చల్లనై ॥

ఏకాంత సుఖగోష్ఠినింపొంద మానవా–
నీకంబులెడఁ గలసి నిలిచి సేవింపఁ గాం–
తాకదంబముల (లు?) హస్తముల కంకణఝణ–
త్కారములు నిగుడఁ జామరములిడఁగ
జోకైన మణిగణస్తోమాంకితంబులై
సొంపొందు నాలవట్టములు గరములఁ దాల్చి
యేకాంతులిరువంక నెదిరి కొలువఁగ సకల–
లోకేశ్వరుఁడు మెరయఁగాను ॥ చల్లనై ॥

బంగారుప్రతిమలకు ప్రతులైన దివిజలో–
కాంగనలు ఘనవిమానాంగణంబుననుండి
చెంగలువలును మంచి సేవంతిరేకులును
చెలఁగి యిరుగడఁ జల్లఁగాను

మంగళాత్మకములగు మహితవేదాంత వే-
దాంగవిద్యలకు ప్రియమంది చేకొనుచుఁ దిరు-
వేంగళేశ్వరుఁడు గడు వేడుకలతోడఁ దిరు-
వీథులను విహరించఁగాను ॥ చల్లనై ॥ 228

70-వ రేకు. పాడి[1]

మూలమూల నమ్మేదుఁజల్ల ఇది
రేలుఁ బగలుఁ గొనరే చల్ల ॥ పల్లవి ॥

పిక్కటిల్లు చన్నుల గుబ్బెత వొకతి కడుఁ-
జక్కనిది చిలికిన చల్ల
అక్కనఁ జెమటగార నమ్మీని[2] యిది
యెక్కడఁ బుట్టదు గొనరే చల్ల ॥ మూల ॥

వడచల్లు మేని జవ్వని[3] వొకతి కదు-
జడియుచుఁ జిలికిన చల్ల
తడఁబడు కమ్మనితావులది మీ[4]-
రెడయకిపుడు గొనరే చల్ల ॥ మూల ॥

అంకులకరముల వొయ్యారొకతి కడు-
జంకెనలఁ జిలికిన చల్ల
వేంకటగిరిపతి వేడుకది[5]
యింకానమ్మేఁ[6] గొనరే చల్ల. ॥ మూల ॥ 229

పాడి

అదిగాక సౌభాగ్యమదిగాక వలపు
అదిగాక సుఖమింక నందరికిఁ గలదా ॥ పల్లవి ॥

---

1. వి. రే. ఱ౩. శ్రీరాగం-యేకతాళి. 2. చెమటగారనమ్మేడిది. 3. చూపు జవ్వని. 4. సా. రే. లది యిప్పుడెడయకిపుడు. (ఇందంతటను 'చల్లా' అనియేరూపము) 5. వి. రే పతి వేడుకది యిటి. 6. నమ్మెదఁగొన.

ప్రాణవల్లభునిఁ బెడఁబాసి మరుబాణముల
ప్రాణబాధల నెగులుపడుటేఁటి వలపే
ప్రాణేశ్వరుఁడు దన్నుఁ బాయఁజూచిన యపుడు
ప్రాణంబు మేనిలోఁ బాయంగవలదా ॥ అది ॥

ఒద్దికై ప్రియునితోనొడఁగూడి యుండినపు-
డిద్దరై విహరించుటిది యేఁటివలపే
పొద్దువోకలకుఁ దమపొలయలుకకూటముల
బుద్ధిలోఁ బరవశము పొందంగవలదా ॥ అది ॥

చిత్తంబులోపలను శ్రీవేంకటేశ్వరుని
హత్తించి వాఁడు దానయివుండవలదా
కొత్తయిన యిటువంటి కొదలేని సంగతుల
తత్తరము మున్నాడి తగులంగవలదా ॥ అది ॥ 280

భూపాళం

ఎట్టుసేయనైన నేర్చు నిందునందు నీతఁడు
నెట్టుకొన్న విద్యలెల్ల నేర్పుఁగాన యీతఁడు ॥ పల్లవి ॥

పలుదెరఁగుల దొంతులైన పాలపెరుగుకుండలెల్లఁ
దొలఁగ దించి పాలుద్రాగి దొంతివేర్చె నీతఁడు
తొలఁగఁదోసి జగములెల్లఁ దొల్లిటట్ల బహువిధముల
నెలవుకొలిపి దొంతివేర్చ నేర్పుఁగాన యీతఁడు ॥ ఎట్టు ॥

పాలమీఁగడెల్లఁ దిగిచి పలుదెరఁగులఁ దోడనాడు
బాలులైనవారికెల్లఁ బంచిపెట్టె నీతఁడు
మేలిమైన పాలజలధి మీఁగడఖిలదేవతలకు
నోలిఁబంచిపెట్టినట్టి యోగిగాన యీతఁడు ॥ ఎట్టు ॥

తలుపుదెరచి కన్నె మేలుకొలిపి విభుఁడు గానివాని—
నెలమిఁ గలపినట్టి వేంకటేశుఁడమ్మ యీతఁడు
తలఁపులోని నాగకన్నెఁ దెలిపి పరపురుషునిఁ గూడి
కలయఁ జేయనేర్చినట్టి ఘనుఁడు గాన యీతఁడు ॥ఎట్టు॥ 231

కాంభోది

వెలినుండి లోనుండి వెలితిగాకుండి
వెలి లోను పలుమారు వెదకేవె గాలి ॥పల్లవి॥

పండువెన్నెలలకునుఁ బ్రాణమగు గాలి
నిండుఁగొలఁకులలోన నెలకొన్న గాలి
బొండుమల్లెలతావిఁ బొదవైన గాలి
యెండమావులఁ బొలితేలయ్యె గాలి ॥వెలి॥

కొమ్మ్మావిచవికెలోఁ గొలువుండు గాలి
తమ్మికుదుకులఁ దేనె దాగేటి గాలి
యిమ్మయిన చలువలకిరవైన గాలి
కుమ్మరింపుచు వేఁడి గురిసేవె గాలి ॥వెలి॥

తిరువేంకటాద్రిపైఁ దిరమైన గాలి
సురతాంతముల జనులఁ జొక్కించు గాలి
తొరలి పయ్యదలలోఁ దూరేటి గాలి
విరహాతురులవింత వేఁచకువె గాలి ॥వెలి॥ 232

సామంతం

రెప్పవేసి లోకమెల్ల రేయుఁ బగలుఁ జేయనేర్చుఁ
చెప్పరాని చేఁతలెల్ల చెప్పిచూపనేర్చునే ॥పల్లవి॥

పాలలోను దచ్చి వెన్న పలుదెరఁగులఁ దివియనేర్చు
రాలువేసి నీరుమీఁదఁ దేలఁజేయ నేర్చును
గాలిపుంటి సంటి(?) లోనఁ గాఁపురంబు సేయనేర్చు
ఆలికట్టుఁ జీరలోన నాలిఁబడయనేర్చును ॥ రెప్ప ॥

ముద్దులాఁడికొడుకుచేత ముజ్జగములు దిప్పనేర్చు
చద్దికంట వేఁడికంటఁ జక్కఁజూడ నేర్చును
గద్దెరాతి కొండవింట గసికయై చెలఁగనేర్చు
సుద్దులెల్ల మందులనఁగ సొంపుమిగులనేర్చును ॥ రెప్ప ॥

పాఁపఁరేని కొండమీఁదఁ బందివేఁటలాడ నేర్చు
గోపసతుల మానమెల్ల కొల్లలాడనేర్చును
యేపు మీరినట్టి వేంకటేశుఁడనెడివాఁడు పిన్న-
పాఁపడై యశోదయెదుట పరువులిడఁగ నేర్చును ॥ రెప్ప ॥ 233

బౌళి

ఏమి సోద్యమిది యెంతయును వెరగాయ
ఈ మగువ విభుఁ గలయుటెట్లనో యనుచు ॥ పల్లవి ॥

పొలసి నునుఁజెమటలుబ్బుచు నణంగుచున్న-
చెలియభావము చూచి చెప్ప వెరపాయ
కలికి వలరాజు బింకపుశరము వాఁడిగా
పలుమరునుఁబదనిడిన భావమో యనుచు ॥ ఏమి ॥

చలముకొని వేఁడి వెదచల్లు చూపులతోడి
నెలఁతఁ గని కట్టెదుర నిలువ వెరపాయ
చెలఁగి లోపలనున్న చిత్తజానలమెల్ల
వెలికి వెళ్ళుచు వెల్లివిరిసెనో యనుచు ॥ ఏమి ॥

తిరువేంకటేశుఁ బొందిన యింతివనుదోయి—
కురునఖాంకములు గనుఁగొనఁగ వెరపాయ
తరుణినేఁపిన విధుఁడు దైవయోగమువలన
అరుదయిన శకలంబులాయనో యనుచు. ॥ ఏమి ॥ 234

71–వ రేకు. కాంభోది

ఏల రాఁడమ్మ యింతిరో వాఁ—
డేల రాఁడమ్మ నన్నేలినవాఁడు ॥ పల్లవి ॥

పచ్చని పులుగుల బండిమీఁద నుండు—
పచ్చవింటి పిన్నబాలుని తండ్రి
పచ్చనిచాయలఁ బాయవి బంగారు—
పచ్చడము గట్టి (న) బాగైనవాఁడు ॥ ఏల ॥

తెల్లని పులుగుపైఁ దిరుగ మరిగినట్టి—
తెల్లని సతిపాలి దేవరతండ్రి
తెల్లని పరపుపైఁ దేలివోరలు వెట్టు—
తెల్లని కన్నుల తెలివైనవాఁడు ॥ ఏల ॥

కొండవింటివాని గుత్తగొనిన యట్టి—
కొండుక పాయపుఁ గూఁతురుతండ్రి
కొండలరాయఁడు కోనేటి తిమ్మయ్య
కొండ తలనెత్తి గుఱుతైనవాఁడు. ॥ ఏల ॥ 235

శ్రీరాగం

చంపరాని పగ (మా?) [1] నంబు; చల్లగాలి వేఁడి; చిగురు—
టంపకోల దాఁకి దేహమప్పుడెట్లనోర్చునే ॥ పల్లవి ॥

1. రేకు దెబ్బదిన్నది. అక్షరము స్పష్టముగాదు.

పువ్వుటమ్ము దాఁకి చెలికిఁ బొక్కె మేను విభునిచూపు-
లివ్వలవలఁ గాఁడినప్పుడెట్లనోర్చెనే
జవ్వనంపుఁ గుచభరము (మున?) జడిసె నడుము కొప్పు వేఁగు
రవ్వదోఁప నడపుచేతి రాయిడెట్లనోర్చెనే ॥ చంప ॥

తప్పుకెపుడు నతనిఁజూచి తపివివోని తరుణి నేఁ-
డిప్పుడింత దడవు వాసి యెట్లనోర్చెనే
నొప్పికించుకోర్వలేక నొసలఁబట్టు వెట్టుకొంత
దప్పిదేరునట్టి విరహతాపమెట్లనోర్చెనే ॥ చంప ॥

ఇంచుకంత కప్పురమున * (నెట్టఁ?) ఁబారు తనువుమీఁద
నెంచరాని మదనరేఖలెట్లనోర్చెనే
మించి వేంకటాద్రివిభుఁడు మీఁదమీఁదనొరసి కూ (డ
వం?) చరాని కంటసరులు వనిత యెట్లనోర్చెనే. ॥ చంప ॥ 236

## ఆహిరి

ఆపదలె సంపదలకాధారమై తోఁచె
పైపైనె తమకంబె పరిణామమాయ ॥ పల్లవి ॥

పురిగొన్న మదనాగ్ని పుటము దాఁకినవలన
తరుణిదేహంబు కుందణమువలెనాయ
సురుగక వియోగాగ్ని చొచ్చి వెలువడెఁ గాన
మరుజన్మమై మహామహిమఁ బొగడొందె ॥ ఆప ॥

పొలుపైన యిరు (విరు?) లచేఁ బూవుగట్టిన వలన
సొలయకే మేను జాజుల పొట్లమాయ
నెలకొన్న గొజ్జంగనీటఁ దడియఁగఁబట్టి
కలకంటిమేను పులు గడగినట్లాయ ॥ ఆప ॥

---

* ఈ సూచన లేకున్న అర్థాన్వయము కాకపోవుటయేగాక యతి భంగముకూడ.

అందుపైఁ దిరువేంకటాద్రీశు నిజకృపా-
నందంబు తనకు బ్రహ్మానందమాయ
పొంద్రైన వేడుకలు పొదిగొన్న చెలువంబు-
నందమయి సౌభాగ్యమగ్గలంబాయ. ॥ అప ॥ 237

సాళంగనాట

తనువెల్లఁ గోమలము తలఁపు వెగ్గలమాయ
వనితభాగ్యము గంటివా తరుణి ॥ పల్లవి ॥

పోఁకలంతేసి ముత్యముల కంటసరులవి
వేఁకపు గుబ్బలమీఁద వేఁగుఁగాక మానునా
కాఁకల నడుము చిక్కెఁగదె గోరుచుట్టుపై
రోఁకటిపోటాయనమ్మరో తరుణి ॥ తను ॥

ముమ్మడించినట్టి పెద్దమొగపుల మొలనూలు
యిమ్మైన పిరుఁదుమీఁద నింతభారమేఁటికే
బొమ్మరవోయెడి నవ్వులఁ బూఁటకూటిమీఁదఁ
దమ్మ పుమియఁగాదా తరుణి ॥ తను ॥

సరసరూపవిలాసముల నింతికి నెందు
తిరువేంకటాచలాధిపుఁడెట్ల నిచ్చెనే
అరిదిబంగారునకు నపురూపమగుమణి
దొరకినట్లాయఁ గాదో తరుణి. ॥ తను ॥ 238

ముఖారి

ఎవ్వరు గలరీతవికిఁక నేమిటికిని వెరవకు మన-
నెవ్వరుగలరాత్మరక్ష యేప్రొద్దునుఁ జేయను ॥ పల్లవి ॥

పసిబాలకు బండివిరిగి పడి మేనెల్ల నొచ్చెను
కసుగందుకు నీరుపాముకాటున మై గందెను
నసికొట్లఁగోడెచేత నరుమాయను శిశువింతయు
వసముగాని చను ద్రావినవలనఁ బాపఁడు వాడెను ॥ ఎవ్వరు ॥

పెనుమాఁకుల పైపాటున బెదరి వెరచెఁ బిన్నవాఁడు
ఘనమగు సుడిగాలి దాఁకి కనుమూయనోపఁడు
అనువున వేంకటగిరిపై నన్నిసంకటములుఁ బాసి
మునిజనముల (హృదయ?)గేహమునయుండెడి దేవుఁడు. ॥ ఎ ॥ 239

ముఖారి

ఎంత నేరఁడీదైవమిందరికి
భ్రాంతి గడుఁ బుట్టించి పరము మరపించె ॥ పల్లవి ॥

ప్రాయమనియెడి మహాబహురూపమిది యొకటి
కాయములఁ గరఁగించీఁ గళలనెక్కించి
సోయగంబగు కన్నుచూపులనియెడు మహా-
మాయములఁ బొరలించి మనసు నాటించె ॥ ఎంత ॥

చక్కఁదనమనెడి వేషంబొకటి మేనిపై
నిక్కించి యది గోర్కెనెలవుగాఁజేసి
తక్కువలు నెక్కువలు తమకములు నొల్లములు
మక్కువలు గలిగించి మల్లువెనఁగించె ॥ ఎంత ॥

ఇట్టి మోహము వేంకటేశ్వరుఁడు దనమీఁదఁ
బెట్టించుకొనె నయినఁ బ్రేమగల ఫలము
నెట్టుకొని తానతని నిజమెఱిఁగి మేలు చే-
పట్టెనైనను జన్మపరుఁడైన ఫలము ॥ ఎంత ॥ 240

పుడమిలోన మగలు గలుగు పొలఁతులకును దిరుగఁబాసె
అడవివారినుండనియ్యఁడమ్మ నీ కొమారుఁడు ॥ పల్లవి ॥

భారమైన కుచభరంబుపై చెరంగు జారనొకతె
జారుఁజూపులాఁడి మంచిసాళగంపు టెలుఁగున
కోరా చల్లయనుచు మెరుఁగుగుచములదర మెట్టినడవ
గోరుదీసి పారితెంచె కొమ్మ నీ కుమారుఁడు ॥ పుడమి ॥

నెరులు (*) దొంగలించినట్టి నీలవేణి యొకతె పెద్ద
తురుము దురిమి చల్లకడవతో విలాసమమరఁగా
చెరఁగుదూల వాఁడిగోళ్ళ చేయివీచి పిలిచి గోప[1]–
తరుణిఁ గొంగువట్టి తీసె తల్లి నీ కుమారుఁడు ॥ పుడమి ॥

కంచుమట్టియల రవంబు గజబజింపఁ బదము దా–
టించి గబ్బినడపు నడచు మించుగుబ్బలాఁడిని
ఇంచుకంతవాఁడు వేంకటేశుఁడంటఁబట్టి కౌఁగి–
లించి మోవి గంటిసేసె నిపుడు నీకుమారుఁడు. ॥పుడమి॥ 241

శంకరాభరణం

కొలమున మొదలనె[2] గొల్లవారము యీ–
చలమునఁ బగ నిన్ను సాదించ నేరుతుమా ॥ పల్లవి ॥

బూతులఁ దిట్టుచు సొలపుఁ జూచేవు మేని–
నేతులకంపుల నేము నీ కేలరా
యేతులు రేఁపుచు మమ్మునెలయించేవు యేర
మాతోనే యింతేసి నేము మాటలు నేరుతుమా ॥ కొల ॥

---

1. ని. రే. జా. ౩. నడచు గోప. 2. ని. రే. ౩ మొదలే.

* నెరులు + తొంగలించినట్లు

కన్నుల నదలింపుచు గయ్యాళించేవు వోరి
నిన్ను మెప్పించఁగలేము నేమేలరా
వెన్నలుఁ బాలునమ్మేటి వెఱ్ఱివారము యీ—
కిన్నెర మీట్ల [1] గిలిగించఁగ నేరుతుమా కొల ॥

చేరి నన్నుఁ బోసీనని చేయివట్టేవు యేమీ
నేరనివారము నీకు నేమేలరా
గారవపు తిరువేంకటగిరివిభుఁడ [2] యీ
కూరిమినిట్టే నిన్నుఁ గూడఁగ నేరుతుమా. ॥ కొల ॥ 242

## శ్రీరాగం

ఊరకుంటే [3] నన్ను నుండనియ్యవు ఇంత
పేరుకుచ్చి తిట్ట నన్నుఁ బ్రియమా నీకు ॥ పల్లవి ॥

బుజముపైఁ జేయి వేసి బుజ్జగించేవు ఇంత—
నిజమా నామీఁద నీ కరుణ
భజన మెరయ నన్నుఁ బచ్చి సేసేవు ఇంత—
గజిరుఁజేఁతలకోపఁగలనా యిఁకను ॥ ఊర ॥

కాలుమీఁదఁ గాలువేసి కరఁగించేవు యింత—
మేలా నాతోడి సమేళములు [4]
జాలుకచూపుల నాకు వాఁడివెట్టేవు యింత—
యేలికవై యిటు సేయనేలా యిపుడు ॥ ఊర ॥

చక్కఁదనమిది నాది జట్టిసేసేవు నా
చెక్కుల రేకలు వ్రాయఁ జిత్తగించేవు
చక్కని వేంకటగిరిస్వామి నీవు యిట్టే
దక్కిన నన్నింతసేయఁ దగునా యిఁకను. ॥ ఊర ॥ 243

---

1. రా౧. ౩ మీంట్ల 2. కటవిభుఁడ 3. ౨-రే. ౩౮. ౧౦౫. తుందేనంటే.
4. తోడి మేళములు

## నాట

నల్లనిమేని నగవుఁ జూపులవాఁడు
తెల్లనికన్నుల దేవుఁడు ॥ పల్లవి ॥

బిరుసైన దనుజుల పీఁచమణఁచినట్టి-
తిరుపుఁగైదువతోడి దేవుఁడు
చరిఁబడ్డ జగమెల్లఁ జక్కఁజాయకుఁ దెచ్చి
తెరువు చూపినట్టి దేవుఁడు ॥ పల్లవి ॥

నీటఁ గలసినట్టి నిండిన చదువులు
తేటపరచినట్టి దేవుఁడు
పాటి మాలినట్టి ప్రాణుల దురితపు-
తీఁట వాపినట్టి దేవుఁడు ॥ పల్లవి ॥

గురుతు వెట్టఁగరాని గుణముల నెలకొన్న-
తిరువేంకటాద్రిపై దేవుఁడు
తిరముగ ధ్రువునికి దివ్యపదంబిచ్చి
తెరచి రాజన్నట్టి దేవుఁడు. ॥ పల్లవి ॥ 244

## భైరవి

అతనుచే నెట్టయిన నౌదుఁగాక యీ-
గతిమాలి సొలసే కాయము నాకేఁటికే ॥ పల్లవి ॥

బాసనేసి యైనఁ గొంత పట్టలేను చిత్తము
దోసము మాటాడఁ దనతో నాకును
ఆసలాఁపలేక చేరి యుంటిఁ [1] గాక యింత-
నేసిన యాతనిమోము చెల్లఁబో నేఁజూతునా ॥ అతను ॥

దగ్గరి నావద్దఁ దనతరుణిఁ దలఁచినంత
సిగ్గుపడవలెను నాచిత్తమునందే
నిగ్గుదేరేకాఁకతోడ నిలువలేఁ గాక యింత-
బగ్గన నాదేహమిది పారవేయ సరకా ॥ అతను ॥

దేవుఁడంటాఁ దనమీఁద తెగి సొలపుమాటల
మోవనాడలేక యింత మొక్కితిఁ గాని
శ్రీ వేంకటేశుఁడింత చిత్తిణివిద్యల నాతఁ-
దేవంక కేఁగినను మాయింటికి విచ్చేనెఁ గా. ॥ అతను ॥ 245

## శంకరాభరణం

ఉయ్యాలా బాలునూఁచెదరు కడు-
నొయ్య నొయ్య నొయ్యనుచు ॥ పల్లవి ॥

బాలయవ్వనలు పసిఁడివుయ్యాల
బాలునివద్దఁ బాడేరు
లాలి లాలి లాలి లాలెమ్మ యెల్ల
లాలి లాలి లాలి లాలనుచు ॥ ఉయ్యా ॥

తమ్మిరేకుఁ గనుఁదమ్ముల నవ్వుల
పమ్మఁజూపులఁ బాడేరు
కొమ్మలు మట్టెల గునుకుల[1] నడపుల
ధిమ్మి ధిమ్మి ధిమ్మనుచు[2] ॥ ఉయ్యా ॥

చల్లుఁజూపుల జవరాండ్లు రే-
పల్లెబాలునిఁ బాడేరు
బల్లిదు వేంకటపతిఁజేరి యందెలు
ఘల్లు ఘల్లు ఘల్లనుచు. ॥ ఉయ్యా ॥ 246

1. వి. రే. ౩-౨. మట్టెలగులుకుల 2. దిమ్మి దిమ్మి దిమ్మనుచు.

73—వ రేకు. శంకరాభరణం

సారెకు నంటకురే జడనందురు
ధీరుఁడాతఁడున్నతపు దేహియట ॥ పల్లవి ॥

బాయిటఁ బెట్టకురే పక్షులు పారెడిపొద్దు
వోయమ్మ బాలులకు నొప్పదందురు
మాయపుఁబులుగొకటి మచ్చికనీబాలుని
చేయిచ్చి యెక్కించుకొనఁ జేరీనట ॥ సారె ॥

పంచలఁ దిప్పకురే పాములు వెళ్ళేటి పొద్దు
కొంచెపుబాలులఁ బై కొనునందురు
మించిన పామొకటి మెరసి యీ బాలుని
దించక యెక్కించుకొనఁ దిరిగీనట ॥ సారె ॥

అలమి పట్టకురే అంటఁ గాకుండెడివారు
తొలరమ్మ బాలులకు దోసమందురు
కలికి యీ తిరువేంకటపతిఁ గదిసిన
చెలఁగి వేగమే చీరచిక్కీనట ॥ సారె ॥ 247

శ్రీరాగం

కొప్పుతావి సారె సారె కుప్పళించవలసి
అప్పటి నీ (టిని *) మారుమొగమయ్యేవాతనికి ॥ పల్లవి ॥

భారపు నీ గుబ్బల సంపద చూపవలసి
వోరగా నొరగుమీఁద నొరగేవు
తోరపు నీకన్నుల యేతులె చూపవలసి
సారెకు చూపులఁ బగచాటేవాతనిని ॥ కొప్పు ॥

తట్టెడి నీమట్టెలమ్రోఁతలు చూపవలసి
పట్టఁబట్టఁగానే వుప్పరిగెక్కేవు
వట్టి నీకోపాన చెలువము చూపవలసి
పెటినహారముల గుంపెనలఁ దీసేవు ॥ కొప్పు ॥

తొయ్యలి నీ మేని మృదువు చూపవలసి
కయ్యపు వేంకటపతిఁ గాఁగిలించేవు
చయ్యననే నీ సరసము చూపవలసి
చయ్యాటములనె యిట్టె జంపులనేచేవు ॥ కొప్పు ॥ 248

ఆహిరి

కాల (లి?) కడఁ దెగెఁ జెలియగర్వంపుఁ దాలిములు
కాలగతి యిఁకనెంత గాఁగలదో మీఁద ॥ పల్లవి ॥

బలుపుఁ దురుమరజాతి పగలుచీఁకట్లాయె
పొలయుఁగన్నీట నిప్పులు గురిసెను
చలితాపమున శశియు సవితుం (త్రుం*)డుఁ గవఁబొడచె
ఇం మదనదైవికం బెటుగాఁ గలదో ॥ కాల ॥

చెఱుగు విట్టూరుపుల చిచ్చు గాలియుఁ గూడె
వెడగుఁ జెమటం[1] జలధి వెల్లివిరిసె
కడుఁబులకలనె (*) శిథిలి కన్నచోటనె పొడమె
సుడిసి చెలిసిగ్గెల్ల చూరఁబోఁగలదో ॥ కాల ॥

భామకుచములమీఁదఁ బ్రతిచందురులు వొడచె
చీమ దొంతర లతలఁ జిగిరించెను
వామాక్షి వేంకటేశ్వరుకౌఁగిటను గలసె
ప్రేమమిఁక నిదియెంత పెద్దగాఁగలదో. ॥ కాల ॥ 249

1. ఇది వ్రా-రే. ౨౧ పా: సా-రే. పెతఁజెమటం.

ఇచ్చకాలు రమణికి నెంత[1] చేసేవు నీ-
ముచ్చిమిసేఁతలిన్నియు మూసేటి కొరకా[2] ॥ పల్లవి ॥

బెట్టుగఁ బెద్దతురుము పెట్టేననుచు నింతి-
తట్టుపుణుఁగునెరుల తలదువ్వేవు
గటిగ నెవ్వతెఁ గూడో కౌఁగిటఁదెచ్చిన నీ-
తట్టుపుణుఁగుల తావి దాఁచేటికొరకా[3]- ॥ ఇచ్చ ॥

గబ్బివై[4] నీపదకము గట్టేననుచుఁ జెలి-
గుబ్బల మించుఁజెరఁగుకొంగు దీసేవు
వుబ్బున నెక్కడనో వుండి నీవిదె వచ్చిన-
దెబ్బలవాట్ల తప్పు దీరేటికొరకా ॥ ఇచ్చ ॥

ఇప్పుడిట్లనే విడెమిచ్చేననుచు నీవు
కప్పురము ఘనముగఁ గడునిచ్చేవు
అప్పుడె శ్రీతిరువేంకటాద్రీశ యీ యింతి
చొప్పుదప్ప రతిఁగూడి చొక్కించుకొరకా ॥ ఇచ్చ ॥ 250

ఆహిరి

వద్దు మమ్మింత నెవ్వగల నలయించ నిటు
పొద్దువొద్దునకు నోపుదుమా వోరి ॥ పల్లవి ॥

బీరమున నిన్ను[5] వలపించుకొన నేమంత-
వారమా వట్టిగరువములు గాక
నేరుపే కలిగినను నీచేఁతలకు నింత
దూరుచును కాఁకఁగందుదుమా వోరి ॥ వద్దు ॥

---

1. ని-రే. ౪౪. నేంతేఁజేసే. 2. కొరకే (ఇట్లేముందు చరణములందును) 3. సా-రే: పె-రే. ౨౫. కొరక (షండెల్లనిట్లే). 4. ని-రే. గబ్బివే. 5. ని-రే. ౪౪. నన్ను.

కన్నులనె వలపు చిలుకఁగఁ జూడ నేమంత-
కన్నారమా నీవుదుటు గాక
వన్నెలను[1] నిన్ను నేవలపింతునైన నీ-
వున్నవిధమిటు చూడనోర్తుమా వోరి ॥ వద్దు ॥

నీ నేరములు దక్కె నీకు నిసుఁ బాయఁగల-
నైన నేనిట్టవు[illegible] నటరా
కోనేటిరాయ తక్కులుమాని మచ్చికల-
నూని నాకౌఁగిటనె వుండరా వోరి. ॥ వద్దు ॥ 251

## శ్రీరాగం

మామనునేతు మాగతవానసి[2]
కాముకవిద్యాకల చలరే ॥ పల్లవి ॥

భిల్లవధూకుచపీడన కుతుకో-
త్ఫుల్లకరాంబుజ భూషణ
పల్లవ గోపక పరివృత శతజన-
వల్లభ రతిపరవశ చలరే ॥ మామ ॥

గోపీజన కుచకుంకుమ పంక వి-
లేపన మిళిత లలితదేహా
తాపకరణ సంతత బహువినయా[3]-
లాప రూపమేళన చలరే ॥ మామ ॥

పరవనితామణి పరతంత్రత్వా-
త్పురుష నఖాంకిత పతిరసికిమ్[4]
కురవకభూరుహా[5] కుంజగృహాంతే
తిరువేంకటనగాధిప చలరే ॥ మామ ॥ 252

---

1. వెన్నెలను. 2. ఊహించిన పాఠమిది; సా-రే. పె-రే. మామనురేత్వం

నరచె పెంచరచె కటకటా బిడ్డలను[1]
నేను మీవలెనే కంటి నెయ్యమైన బిడ్డని ॥పల్లవి॥

యిటఁ బారవేసిన పాలు వెన్నలును
చేయివెట్టకుందురా చిన్నిబిడ్డలు
మీయిండ్లు జతనాలు మీరుసేసికొనక
పాయక దూరేరేలే ప్రతిలేని బిడ్డని ॥కాన॥

ూసిన కాఁగుల నేయీ ముంగిటి పెరుగులూ
ఆసపడకుందురా ఆడేబిడ్డలు
వోసరించి మోసపోక వుండలేక మీరు
సేసేరింతేసి దూరు చెప్పరాని బిడ్డని ॥కాన॥

క్కమైన కొప్పెరలజున్నులు జిన్నులును
చిక్కినవిడుతురా చిన్నిబిడ్డలు
మిక్కిలి పూజలు సేసి మెచ్చించఁ దగదా
యెక్కువైన తిరువేంకటేశుఁడైన బిడ్డని ॥కాన॥ 253

కాంభోది

ంగుల జంద్యాలు వేసి పెంచపునమలిపురి
పాగగాఁ జుట్టిన నాబాఁపనయ్య వీఁడివో ॥పల్లవి॥

త్తలై పరువులిడి పిన్నబోడితలతోడ
కొత్తబొమ్మచారియై గోచిగట్టెను
నెత్తురుదానముసేసి పిండిన జడలతోడ
బత్తుఁడైన చక్కని నాబాఁపనయ్య వీఁడివో ॥పేగు॥

1. వి. రే. ౩౬. బిడ్డలనేను.

కలువిద్యలాఁపనిచేఁ గలిచె నేరుపులెల్ల
గులుతులాఁపనిఁ గనెఁ గొడుకుఁగాను
తలితోడ సందెపొద్దు దప్పనీక జలధిలోఁ
బలుపుగాఁ బండిన నాబాఁపనయ్య వీఁడివో ॥ పేగు ॥

పచ్చియిట్టి తోలుచొచ్చి బడలి చొరనిచోటు
చొచ్చి తెచ్చె వేదాలు చూడరమ్మా
మచ్చిక వేంకటగిరి మరిగి నాకౌఁగిట
పచ్చనిదోవతి నాబాపనయ్య వీఁడివో. ॥ పేగు ॥ 254

సామంతం

ఏకాలమేది దనకెట్ల సుఖమైయుండు—
నాకాలవశతఁ దానట్లుండవలసె ॥ పల్లవి ॥

బలువియోగాగ్ని దలఁపంగ నెట్టిదోకాని
చలిగాలి యెండనుచు జాలిఁ బడవలసె
వలరాజుకోపమెటువంటిదో పడఁతులకు
తలిరాకు చేఁదనుచుఁ దలపోయవలసె ॥ ఏకా ॥

భావంబు తలపోఁత బలిమెట్టిదోకాని
నోవి దోఁపనిచోట నొచ్చెననవలసె
ఈ విరహపరితాపమిఁకనెట్టిదో కాని
కోవిలల కూఁతలకుఁ గోపించవలసె ॥ ఏకా ॥

తిరువేంకటేశుకృప తియ్యమెట్టిదో కాని
చిరునవ్వు మోపిపైఁ జెరలాడవలసె
సురతసౌభాగ్యముల సొంపులెట్టివా కాని
మురిపెంపుఁ గనుచూపు ముయ్యఁగావలసె ॥ ఏకా ॥ 255

శంకరాభరణం

అప్పఁడు మజ్జనమాడీనంగనఁ గూడి
కుప్పలుఁ దెప్పలుగాఁ గుమ్మరించరో ॥ పల్లవి ॥

బంగారుకొప్పెరల పన్నీరు నించి
రంగైన పచ్చకప్పురపు ధూళొత్తి
చెంగటఁ గస్తూరిధూళి చికిలి గావించి
పొంగారుఁదట్టుపుణుఁగు పోయరో గిన్నెలను ॥ అప్ప ॥

పటికంపుఁ గాఁగుల పరిమళాలెల్లా
ఘటియించి కుంకుమతోఁ గడు మేదించి
అటునిటు గొజ్జంగనీరందంద నించి
కుటిలకుంతలులు[1] పైఁగుమ్మరించరో ॥ అప్ప ॥

బలుపింగాణులఁ గదంబము గంధమును
కలపము గావించి గంబూరముతో
వెలయ మజ్జనమాడీ వేంకటాద్రివిభుఁడు
చెలఁగి యింతులు చేరి సేస చల్లరో ॥ అప్ప ॥ 256

భూపాళం

కలిమి నిందరిని దగ్గరుకొరకే-వీఁడె
సులభుఁడై తిరిగీని చూడరమ్మా ॥ పల్లవి ॥

భంగపెట్టి గొల్లవారి పాలువెన్నలు
దొంగిలించు కొరకే తోపలనెల్లా
చెంగలించి చేతులెత్తి చెఁగుచును-వీఁడె
దొంగి దొంగి తిరిగీని తోలరమ్మా ॥ కలిమి ॥

గుట్టుదీర రేపల్లెకొమ్మలనెల్లా
రట్టుసేయుకొరకే రచ్చలనెల్ల
గట్టిగాఁ జూచెడి మొలగంటలతోడ-వీఁడె
చుట్టపుబాలునివలెఁ జూడరమ్మా ॥ కలిమి ॥

చెప్పరాని తనమాయచేత నిందరినిఁ
గప్పెడికొరకే వేంకటవిభుఁడు
తప్పెడి నల్లవియలకలనుదురు-వీఁడె
గుప్పెడి ముద్దులు యెత్తుకొనరమ్మా ॥ కలిమి ॥ 257

అహిరి

వలతునందువు నాకు వడినెప్పుడును నేఁ—[1]
దెలమి నొకచో భావ[2] మెట్లుండె నీకు ॥ పల్లవి ॥

బరువైన మదనతాపంబునకు వెరవకిటు
పురవేదనలను[3] నేఁబొరలఁగాను
సరసమున నీవచట సతులకౌఁగిటనుండి
యిరవుకొననపుడు[4] మనసెట్టుండె నీకు ॥ వలతు ॥

వదలిన తురుముతోడ వాడువదనముతోడ
వొదిగినేనిటు చింతనుండఁగాను
సదమదముగాఁగ నొకసతిని గౌఁగిటి రతులఁ[5]
గదియంగఁ జిత్తమేగతి నుండె నీకు ॥ వలతు ॥

1. ని. రే. ౫౩. నెపుదును-యెల. 2. చోఁబాదమెట్టు. 3. దవనలను. 4. కొని

జమలి మొలనూళ్ళతో జవ్వాదిమేవితో[1]
సమరి యీరీతి నేనలరఁగాను
కొమరొందఁ గూడితివి కోనేటిరాయ నీ-
తమకమెందాఁక[2] నెంతటినుండి నీకు. ॥ వలతు ॥ 258

-వ రేకు. ముఖారి

చెప్పరాదీయింతి సిరులు - దీని-
వొప్పులిన్నియుఁ జూడ వొరపులో కాని ॥ పల్లవి ॥

ముదితజఘనముమీఁది మొలనూలిగంటలవి
కదలు రవమెట్లుండెఁ గంటిరే చెలులు
మదనుఁడుండెడి హేమమందిరము దిరిగిరాఁ
గదిసి మ్రోనెడి పారిఘంటలో కావి ॥ చెప్ప ॥

కొమ్మపయ్యెదలోని కుచమూలరుచి వెలికిఁ
జిమ్మటది యెట్లుండెఁ జెప్పరే చెలులు
యిమ్మైన మరుధనములెల్ల రాసులు వోసి
కమ్మకొని చెంగావి గప్పిరో కాని ॥ చెప్ప ॥

లలతకంఠమునందు నీలమణిహారములు
అలరుచెట్లుండు[3] కొనియాడరే చెలులు
లలితాంగి ప్రాణవల్లభుఁడు వేంకటవిభుఁడు
నెలకొన్న కౌఁగిటనె నిలిచెనో కాని. ॥ చెప్ప ॥ 259

ఆహిరి

-ానసీఁడు వుంటినోవి మరఁది వీఁడే
మానముపైఁ జేయి చాఁచీ మందవారిమరఁది ॥ పల్లవి ॥

పూఁతతో. 2. సా-రే. మిందాఁక. 3. వి-రే. ౧౧౪. పెట్లుండెఁగావి.

మంచమెక్కి వావిచూచీ మరఁది పీఁదే
మంచినీటి చెలమల[1] మరఁది.
మంచు గుంచావఁ గొలిచే[2] మరఁది పీఁదే
పింఛెపు శిరసు పొగ పిన్ననాఁటి మరఁది ॥ మాన ॥

మంద మిరియాలు చల్లే మరఁది పీఁదే
మందు నూరీ మాటలనే మరఁది
మందుమాయ నేఁతల మరఁది పీఁదే
కుందణపు వన్నెదట్టికొంగు జారే మరఁది ॥ మాన ॥

మక్కళించే వలపుల మరఁది పీఁదే
మక్కువ నాకౌఁగిట మరఁది
మక్కువలఁ గరఁగించే మరఁది పీఁదే
చిక్కె వేంకటాద్రిమీఁది చిన్ననాఁటి మరఁది. ॥ మాన ॥ 260

సామంతం

చెలువపు నేఁతల శిన్నెకా[3] పెద్ద
వలపువేదనల వాడీనయ్యో ॥ పల్లవి ॥

మొగమున కెగరెడి మొనవాఁడి గుబ్బల—
చిగురుఁబెదవులాఁడి శిన్నెకా
నిగనిగ మెరిచేటి నీలిమేవివాని—
సొగసు చూచి వాని సొలశీనయ్యో ॥ చెలు ॥

మొగ్గల మొలకల మురిపెపుఁ గన్నుల—
శిగ్గుల చిరునవ్వు శిన్నెకా
ఉగ్గువ రేపల్లె వుసురు గొనేటివాని
దగ్గరి తమకానఁ దడవీనయో ॥ చెలు ॥

చంకల బంగారు చల్లిన మెఱుఁగుల
చింకబెదరులాఁడి శిన్నెకా
వేంకటపతిఁ గూడి వేడుక తోడుత
సుంకుల సోఁగల సొలశీనయ్యో. ॥ చెలు ॥ 261

## శ్రీరాగం

మరుని నగరిదండ మాయిల్లెఱఁగవా
విరుల తావులు వెల్లవిరిసేటి చోటు ॥ పల్లవి ॥

మఱఁగు మూఁక చింతల[1] మాయిల్లెఱఁగవా
గుఱుతైన బంగారుకొండల[2] సంది
మఱపుఁ దెలివి యిక్కు మాయిల్లెఱఁగవా
వెఱవక మదనుఁడు వేఁటాడేచోటు ॥ మరు ॥

మదనుని[3] వేదసంత మాయిల్లెఱఁగవా
చెదరియు[4] జెదరని చిమ్మఁ[5] జీఁకటి
మదిలోన నీవుండేటి మాయిల్లెఱఁగవా
కొదలేక మమతలు[6] కొలువుండేచోటు ॥ మరు ॥

మరులుమ్మెతల[7] తోఁట మాయిల్లెఱఁగవా
తిరువేంకటగిరిదేవుఁడ నీవు
మరుముద్రల వాకిలి[8] మాయిల్లెఱఁగవా
నిరతము నీ సిరులు నించేటిచోటు. ॥ మరు ॥ 262

## ఆహిరి

ఏందాఁకా జాగిది[9] యేలే - తన-
అందములచటనె[10] అయ్యోఁగాక ॥ పల్లవి ॥

---

1. వి-రే. ౧౦౫. చింతల్లంమా. 2. కొండల్ల. 3. మదనున్ని. 4. చెదరియ్యు. 5. వి-రే. ౧౧౫. చిమ్ముఁ. 6. ౧౦౫. మదనుఁడు. 7. తల్ల. 8. వాకిల్లి. 9. వి-రే ౧౦ జారిది. 10. సా-రే. అచ్చటనె.

మృగమదమీతఁడు మెత్తీనిదె మై[1]
ధగధగమనఁగాఁ దనకేలే
మగువకుచముల చెమట[2] నంటిన యా—[3]
పొగరుఁబరిమళమె పూసీఁ గాక ॥ ఎందా ॥

వెడిదపుఁ దురమిదె పెట్టీనీతఁడు
తడవుగ నలరులు తనకేలే
పడఁతి శిరసునను పైపైఁ జెరిగిన—[4]
జడివాన విరులు జారీఁగాక ॥ ఎందా ॥

చిమ్ముచు వీడెము నేసీనీతఁడు
తమ్ములము మియ్యఁడు తనకేలే
కొమ్మ వీడెమిఁక[5] కోనేటప్పఁడు
తమ్మివదనమున దాఁచీఁ గాక. ॥ ఎందా ॥ 263

శ్రీరాగం

బిగ్గేఁ గాఁగలించుకోవే పిరితీయక
విగ్గుల యాతనిమేను నేఁడే నొచ్చీనా ॥ పల్లవి ॥

మందరమెత్తినవాఁడు మల్లుల మొత్తినవాఁడు
అందపు నీ గుబ్బల వేఁగాన*[6] లేఁడా
గొందినున్న కుచములు కొనవాండ్లైతేను
చెందిన యాతనిమేను చిల్లులయ్యీనా ॥ బిగ్గ ॥

భూమెల్ల మోఁచినవాఁడు పొడవు దాఁచినవాఁడు
భామ[7] నీ మొలనూలు భారమసీనా
వోమక యాతనితోడి వుపరిసురతానకు
యేమని వేఁడుకొనిన యేల లోఁగేవే ॥ బిగ్గ ॥

1. వి-రే. ౧౦. త్తీనూరకె. 2. చెమ్మటల. 3. వి-రే. ౬౩. నంటినయ్యా. 4. ౧౦ పెరాలెరు. 5. విడియమిదె. 6. వి-రే. ౮. ౧౦౩. గావఁగలే. 7. వి-రే. ౮. ౧౦౩.

వేంకటనగమువాఁడు వెన్నెలమొగమువాఁడు
కింకల నీ చేఁతలకుఁ గిందుపడీనా[1]
పంకజవదన నీకుఁ బాయలేక చెనకిన
కుంకుమగుబ్బల చెనకులకోపఁడా. ॥ విగ్గ ॥ 264

76-వ రేకు. దేశాక్షి

అవ్వలిమాటలే హితవవుఁగాక
రవ్వలై నీకింక నిందు రాఁదీరునా ॥ పల్లవి ॥

మందలించి మధురలో మగువల మాటలే
విందుగాక చెవులకు విందులుగాను
మందల మగువల మా మాటలు చెవులకు గో-
విందుఁడా మాసుద్దులిఁక వినఁదీరునా ॥ అవ్వ ॥

వాసనగాఁ బువ్వులింటివారితోడి పొందులే
నేసి నీవు మమ్మ నీవు చెవకే వింక
దోసాలు గావుగద మాతోడి పొందులివి శ్రీని-
వాసుఁడా మాచేఁతలను వదదీరునా ॥ అవ్వ ॥

మాయలు మందులునేసే మానినుల పొందులే
రేయుఁబగలును నీకు రేసులుగాక
పాయక కూడితి నన్ను బాపురే వేంకటగిరి-
రాయఁడా మాకౌఁగిటి రట్టుకోపుదా. ॥ అవ్వ ॥ 265

శంకరాభరణం

ఇంతి భువనమోహినియైన ఫలము
కాంతునిఁ దలఁచి వగలఁ జిక్కెనిపుడు ॥ పల్లవి ॥

1. అంకెల నినుఁగూడుట అరుదా నేఁడు (సా. రే. లో ఈ పాఠమే కాఁబోలు మొదలు వ్రాసి గిచివేసి పై పాఠము చెక్కినట్లున్నది).

మెఱుఁతకన్నులు గండుమీలైన ఫలము
తొలఁకురెప్పల నీరు దొరకె నేఁడు[1]
లలనమై నవపుష్పలతయైన ఫలము
వలపు చెమట నీట వడిఁ దోఁగె నిపుడు. ॥ ఇంతి ॥

మెఱుఁగారు నెరులు తుమ్మిదలైన ఫలము
నెఱిఁ దమ్మిమోముపై నెలకొన్నవి
పఱచు జక్కవలు గుబ్బలైన ఫలము
తొఱలి తాపపురవితోఁ గూడె నిపుడు ॥ ఇంతి ॥

పలు (బలు ?) వన్నెమోవి బింబమైన ఫలము
చిలుక వోట్లచేతఁ జెలువొందెను
కలికి వేంకటపతిఁ గలసిన ఫలము
సొలసినాడనె[2] నిత్యసుఖమబ్బె నిపుడు. ॥ ఇంతి ॥ 266

## ఆహిరి

ముచ్చటకెవ్వరు లేరు మోహామిది బలుదూరు
యెచ్చట నెవ్వరులేరు యేఁటికే నాపేరు ॥ పల్లవి ॥

మంచముపైనుండరాదు మలఁగుపైఁ బొద్దువోదు
నించిన వుయ్యాలలోనా నిద్దుర రాదు
అంచెలఁ గన్నుల నీరు ఆఁపరాదా తనిఁబాసి
యించుకంత నిలువలే నెట్లు ధరియింతునే ॥ ముచ్చ ॥

పవ్వళించేటిల్లు చూచి ప్రాణము నిలుపరాదు
దివ్వెచూచి తాలిమైనఁ[3] దివ్వెఁగరాదు
దువ్వటపుఁబయ్యెదపైఁ దోఁగిన తట్టు పుణుఁగు
పువ్వటమ్మ బాసటమై పొక్కేనేమి సేతునే[4] ॥ ముచ్చ ॥

1. వి.రే. ౫౫. ౮౫. దొలఁకెనిందు. 2. సొలసియూడనె. 3, ఇది వి.రే. ౧౦౩. లో. సా.రే. తాలిమై దివ్వ. 4. వి, రే. సేతుమే.

*చింతతో ధరించరాదు చెల్లఁబో మేనైనఁ బోదు
ఇంతటఁ జెలులకైన యెఱుక లేదు
ఇంతలోనె వేంకటేశుఁడింతి మరుఁగుననుండి
యెంతసేసెఁ గలికి వీఁడేమని చెప్పుదునే. ॥ముచ్చ॥ 267

మేఁచబౌళి

*శిన్నెక తేవే శెలువుని తా
వెన్నలు సవిగొను వెన్నుని తా ॥పల్లవి॥

మూటల్ మాటల్ మూరల్ బారల్
బాటల్ సదివే బాపలు తా
వేటల్ వీపుల్ వేలుపు గుడుపుల్
శేటలు మరగిన దేవుని తా ॥శిన్నెక॥

వాకుల్ చీకుల్ వాదుల్ పోదుల్
సోకపు తొల్లిటి సుద్దుల్ తా
పోకులు లోకుల్ పొగడఁగ మనిపెడి
కేకిగరుల తల కిష్ణుని తా ॥శిన్నెక॥

బగ్గుల్ నగ్గుల్ బావుల్ సొరె (ర?) గా
దగ్గర వెరపగు తపసుల తా
సిగ్గుల్ వాపెడి శ్రీ వేంకటపతి—
నగ్గపు సొమ్ములయాతని తా ॥శిన్నెక॥ 268

ముఖారి

భావమెరఁగని పడుచా వోసి

మొరఁగు మరఁగు వింత కరఁగుదేనెల—
పరచుమాటల పడుచా
చురుకు మెరుపు వాలుఁజూపుల కన్నుల
ఁ బొడిచి గిలిగించేవే పడుచా ॥ భావ ॥

కెలపు మలపుఁ బయిఁడి గిలుకుల మట్టెల—
బలుపుమోఁతల పడుచా
అలపు సొలపు ముద్దులొలుకు నవ్వుల
జలుకువలపు మీఁదఁ జల్లేవే పడుచా ॥ భావ ॥

వెదకి వెదకి తిరువేంకటేశ్వరుఁ
బదరి కూడిన పడుచా
కదలు గుబ్బల కలికిచేఁతల
పుదుటు నడపులనె పొరగేవే పడుచా. ॥ భావ ॥ 289

శంకరాభరణం

దిమ్మరివలె నిటులఁ దిరుగకువే
చిమ్ముల వలపు నీపైఁ జిలికించీఁ గృష్ణుఁడు ॥ పల్లవి ॥

మెల్లనే పుద్దాలు మెట్టి మీరిన తురుము వెట్టి
తెల్లని ముత్యాలు గట్టి తిరుగకువే
చల్లలమ్మెనంటా నీవు చక్కని గొల్లెతవు
వల్లె వేసీఁ జూపులనే వన్నెకాఁడు కృష్ణుఁడు ॥ దిమ్మ ॥

మట్టెలనే గిలుకొట్టి మణులపెండెము వెట్టి
దిట్టనడపుల వీధిఁ దిరుగకువే
జట్టిగొను చూపుల జంకెన గొల్లెతవు
పెట్టెడుఁ జిక్కుల నిన్ను బిత్తరీఁడు కృష్ణుఁడు ॥ దిమ్మ ॥

చెక్కులదాఁకాఁ గస్తూరి చెలఁగి నొసలఁ బెట్టి
దిక్కులు చూచుచునంత తిరుగకువే
గక్కన శ్రీవేంకటాద్రి[1] ఘనుఁడు కౌఁగిటను
చొక్కులఁ బెట్టెడి విన్న చూరకాఁడు కృష్ణుఁడు. ॥ దిమ్మ ॥ 270

77-వ రేకు. వరాళి

మోవుల చిగురుల చిమ్ముల వేదము
ఆవుల మందలలోని ఆవేదము ॥ పల్లవి ॥

మంచముపైఁ జదివేది మరవకుమీ
కొంచెపు లేఁబలుకుల కొనవేదము
పించెపు శిరసుతోడఁ బిన్ననాఁడే చదివిన
తుంచి తుంచిన మాటల[2] తొలువేదము ॥ మోవు ॥

చల్లలమ్మే గొల్లెతల చక్కనిజంకెనలకు
గొల్లపల్లెలోన దొరకొన్న వేదము
తల్లిబిడ్డలనక యందరినొక్కవావిగా
పిల్లఁగోవి నేరిపిన పెనువేదము ॥ మోవు ॥

పంకజభవాదుల బడిబడిఁ జదివించే
లంకెలు చెలఁగిన[3] మేలపువేదము
వేంకటనగముమీఁద వెలయ నిందిరఁగూడి
కొంకక చదివిన చొక్కుల వేదము. ॥ మోవు ॥ 271

వరాళి

నిండిన[4] వేడుకలెల్ల నీకె గాక
అండనె తాపము చల్లి[5] నమరెగా నాకు ॥ పల్లవి ॥

1. వి-రే. ౫౦. శ్రీ వేంకటఘను. 2. వి-రే. ౬౬. మాఁటతోఁబ. 3. చెలఁగించే. 4. తా-వె. ౧౧౪. విందైన. 5. సా-రే. చల్లె.

మగువకన్నుల మొక్క మట్టెల పాదపుఁ దొక్క
నిగుడు వాతెరనొక్క నీకె కాక
అగడునెరుల చిక్క అరచేతిపై చెక్క
వగల గుక్కను[1] మిక్క వన్నెగా నాకు ॥ నిండిన ॥

తొయ్యలిఁ గూడినరట్టు తుదచెమటలమెట్టు
నెయ్యపుమాటల గుట్టు నీకె కాక
పయ్యద జారినకట్టు భారంపు నొసలిపట్టు
కయ్యపుటలుక తిట్టు గలిగెఁగా నాకు[2]. ॥ నిండిన ॥

మొగలిపువ్వులతావి ముంచినకన్నులకావి
నిగనిగ నగుమోవి నీకె కాక
సగము జారిన నీవి చనవుల నీదేవి–
నగుట వేంకటేశ నేఁడబ్బెఁగా నాకు[3] ॥ నిండిన ॥ 272

శ్రీరాగం

ఆలవట్టములు[4] వట్టేరవధరించఁ గదో[5] పెద్ద–
పాలిండ్ల బరవున భామ[6] బడలితివి ॥ పల్లవి ॥

మజ్జనమవధరిఁతు మగువ విచ్చేయవో
గొజ్జంగ కస్తూరినీటఁ గుంకుమనీట
గజ్జెల గరుడునిపై కలికి విభునిఁగూడి
ముజ్జగములఁ దిరిగి మొగినలసితివి ॥ ఆల ॥

బోనము వెట్టినారిదె[7] పొలఁతి విచ్చేయవో
ఐనకూరలెల్లఁ జల్లనారీనిదే
తేనెలూరెడి కెమ్మోవితీపులు నీ విభునకుఁ
గానుకగా నిచ్చియిచ్చి కడునలసితివి ॥ ఆల ॥

---

1. కుక్కరు మిక్క. 2. వి–రే. ౧౧. నీకు. 3. పీకు; వి–రే.౮౧. నాకునూ, 4. వి–రే. ౯. వట్టము. 5. రించఁగ పెద్ద. 6. బరవున బడలితివి. 7. వడ్డినదిదె.

చప్పరమంచముపైకి సరుగ విచ్చేయవో
అప్పఁడు వేంకటరాయఁడలరీ వాఁడే
కొప్పెరగుబ్బలమీఁది కొనగోరిరచనల
కప్పురము మెత్తిమెత్తి కడునలసితివి. ॥ అల ॥ 273

## హిందోళవసంతం

జగడపుఁ జనవుల జాజర
సగినల మంచపు జాజర ॥ పల్లవి ॥

మొల్లలు దురుముల ముడిచిన బరువున
మొల్లపు సరసపు మురిపెమున
జల్లనఁ బుప్పొడి జారఁగఁ బతిపై
చల్లేరతివలు జాజర ॥ జగ ॥

భారపుఁగుచముల పైపైఁ గడు సిం–
గారము నెరపేటి గందవొడి
చేరువ పతిపై చిందఁగఁ బడఁతులు
సారెకుఁ జల్లేరు జాజర ॥ జగ ॥

బింకపుఁ గూటమి పెనఁగేటి చెమటల–
పంకపుఁ బూఁతల పరిమళము
వేంకటపతిపై వెలఁదులు నించేరు[1]
సంకుమదంబుల జాజర. ॥ జగ ॥ 274

## ముఖారి

* పొద్దువోకలివి నీకు భువిలో నెన్నఁగ నీ–
సుద్దులు చెప్పేదమన్న చూడఁజూడఁ గొత్తలు ॥ పల్లవి ॥

---

1. ని–రే. ж. వెలఁదులప్పళించేరు. * ఇందు దశావతార సమన్వయము గలదు.

మోఁతనీటిలోని యీఁత మూఁపునఁ బుట్టిన[1] పోఁత
మూఁతిమీఁది కత్తికోఁత మొసగోరివాఁత[2]
బాఁతిలేని దారవోఁత పాపముచూడనిచేఁత
నాఁతిమీఁది తలపోఁత నాఁగేటిగీఁత ॥ పొద్దు ॥

వలపు చల్లినలాగు వాజినెక్కినబాగు
వలసి నొల్లముల్లైన వలవనిజాగు
తెలిసితిమిదె నేఁడు తిరువేంకటేశ్వర
తలఁపు ప్రాణులమీఁదఁ దగులంటేలాగు[3]. ॥ పొద్దు ॥275

## శ్రీరాగం

నేనెందు వోయె తా (యేఁ దా?) నెందు వోయీ
రానీలే రానీలే రానీలే ॥ పల్లవి ॥

మీనైన నాఁటి తన మిడుకెల్ల దిగవలె
కానీలే కానీలే కానీలే[4] ॥ నేనెం ॥

తలచూపేనాఁటి తలఁపెల్ల దిగవలె
తలఁచనీ తలఁచనీ తలఁచనీవే ॥ నేనెం ॥

కిరియైన నాఁటి కిటుకెల్ల దిగవలె
తిరుగనీ తిరుగనీ తిరుగనీవే ॥ నేనెం ॥

హరియైన నాఁటి అదపెల్ల దిగవలె
జరగనీ జరగనీ జరగనీవే ॥ నేనెం ॥

వడుగైన నాఁటి వస విడువఁగ వలె
తడవను తడవను తడవనువే ॥ నేనెం ॥

కలుషించే నాఁటి కడమెల్ల దిగవలె
అలుగనీ అలుగనీ అలుగనీవే ॥ నేనెం ॥

---

1. వి–రే, ౧౮. బెట్టిన; తా–పెం. ౧౩౩. మోఁత. 2. వి–రే, వ్రాఁత.

సతిఁ బాసేనాఁటి చలమెల్ల దిగవలె
తతిగానీ తతిగానీ తతిగానీవే ॥ నేనెం ॥

ముసలైన నాఁటి ముసుపెల్ల[1] దిగవలె
విసుగనీ విసుగనీ విసుగనీవే ॥ నేనెం ॥

* మానైన నాఁటి మదమెల్ల దిగవలె
పోనీవే పోనీవే పోనీవే ॥ నేనెం ॥

కలికైన నాఁటి గజరెల్ల దిగవలె
చెలఁగనీ చెలఁగనీ చెలఁగనీవే ॥ నేనెం ॥

వేడుకతో నాఁటి[2] వేంకటపతి నన్నుఁ
గూడనీ కూడనీ కూడనీవే ॥ నేనెం ॥ 276

78—వ రేకు. భూపాళం

ఎందరు వలె నీకింకాను - యీ —
యిందరు చాలర యింకాను ॥ పల్లవి ॥

మోహపు సతితో ముచ్చటఁ గలసిన—
దేహము మనసునిదియు కాదా
సాహసమున నది చాలక మదిలో
యీహలఁ దిరిగే వింకాను ॥ ఎంద ॥

కసరుల మురిపెపు గయ్యాళిసతులతో (గయ్యాళులతో?)
అసురుసురులతో నలసితివి
కొసరుచు నాతోఁ గూటమిసేసే—
ఎసరెత్తకుమీ యింకాను ॥ ఎంద ॥

కాఁకల నటనలఁ గరగింపుచు నను
దేఁకువఁ గూడితి దిమ్మరివై
వేఁకపు వలపుల వేంకటేశ నీ—
యేఁకట దీరదు యింకాను ॥ ఎంద ॥ 277

---

1. ని-రే. లా౦. ముసిపెల్ల 2. వేడుకనాఁటి. మానువంటివాఁడుబుద్ధుఁడా రేక

## ఆహిరి

ఇట్టే నాఁడదిఁ గోపమెచ్చరించేవు
వట్టి వలపే నాపై వారించ వలెనా ॥ పల్లవి ॥

మోహపు సంకుటుంగరముల వెలిగోర నా-
దేహముపై నునురేక దియ్యఁజూచేవు
సాహసివిరా వోరి వెచ్చపు నీవలపులోని-
దాహమెల్లా నాతోనే యింతటఁ జూపవలెనా. ॥ ఇట్టే ॥

తళుకుబంగారంచుల దట్టి చీరకొంగు[1] -
అలర నీమేను నాపైనప్పళించేవు
వలదు వోరి వెచ్చపువలపు నీదెల్లాను
పలుమారునిట్ల నాపైఁ బూయవల (లె?) నా ॥ ఇట్టే ॥

సన్నపుమణుల కుప్పెనవరము[2] కొప్పు నా -
కన్నులు దాఁకఁగ నాపైఁ గడు వీఁగేవు
కన్నుల కలికి వేంకటరాయ నీకౌఁగిటి
వన్నెలెల్ల నాపై నిటువలెఁ జేయవలెనా ॥ ఇట్టే ॥ 278

## శ్రీరాగం[3]

ఉండవద్దా యిటువంటి వొదికాలను[4] చను -
గొండలపై నుదయించెఁ గొండుక చందురుఁడు ॥ పల్లవి ॥

మింటిమీఁది చందురుఁడు మేదినిపై కలువల
నంటు నేసెనెట యేఁటి నాటకములే
కంటిచూపు[5] కలువల కలకకోరిచెఁ బైఁడి-
వంటిమేని జవరాలి వదన చందురుఁడు ॥ ఉండ ॥

---

1. ని-రే. ౪౦. కొంగువెలి అలత. 2. పై-రే. ౨౫. సరము. 3. ని-రే. ౨౪. ౨౬, ముఖారి. 4. వొద్దికలను. 5. ని-రే కంటిదోయి.

జలజములకు నేఁటి శాంతములే
మెలుఁతమోమై నేఁడు మెత్తనికరళలము—
జలజానఁ బవళించెఁ జక్కని చందురుఁడు ॥ ఉంద ॥

చింకచందురుఁడు కందుఁజీఁకటి మైచీఁకటే
యింకఁజేసి పారఁదోలీనేఁటిపొందులే
వేంకటేశుని కౌఁగిట వెలఁదిమోమై నేఁడు
వంక నెరిచీఁకటి వలఁచె జందురుఁడు ॥ ఉంద ॥ 279

దేవగాంధారి

ఎంతటివాఁడవు నిన్ను నేమందును యిట్టె
సంతమైతివింతితోడ చాలదా నీకు ॥ పల్లవి ॥

మాణికపుటుంగరాల మగువ దా వాయించేటి—
వీణలోనే చల్లీఁ దనవిరహమెల్లను
ఏణనయన నింతేసి యెలయించినట్టి నీ—
జాణతనమె యింత చాలదా నీకు ॥ ఎంత ॥

గిలుకుఁగంకణముల కీరవాణి కిన్నెరలో
కులికీనిదె పై [1] కోపమెల్లాను
సొలపుఁజూపులనిట్టే సుదతినింతేసి నీ —
చలము సాదించితివి చాలదా నీకు ॥ ఎంత ॥

కుంకుమగుబ్బలతోడి కోమలిచెక్కుచెమట —
వంకనే వచ్చీ [2] నీపై వలపెల్లను
వేంకటగిరిరమణ వేడుక నీలలితాంగి
సంకెదేరఁ గూడితివి చాలదా నీకు. ॥ ఎంత ॥ 280

---

1. పె—రే. ౨౫. నీపయిఁగో. 2. పె—రే. వంచీ.

## శ్రీరాగం

పువ్వుగట్టినట్టి మేనఁ బుక్కిలించీఁ జెమట నీ—
జవ్వనపు మదమె పో చలపట్టీని ॥ పల్లవి ॥

మొలకనవ్వు చిగురుమోవి మోపనీక [1] నీ—
పలుకుఁగోవిలలె పో పగచాటీని
తిలకపుమోమునకుఁ దేంట్లు రానీక నీ—
యలకల చెదరె పో యదలించీని ॥ పువ్వు ॥

చనవున నీముఖచందురుని వంక [2] నీ—
చనుజక్కవలె పో చాడిచెప్పీని
మనసు చీఁకట్ల నీమదనతాపపుఁ జింత
కనుఁగవలె [3] పో గాదెఁబోసీని ॥ పువ్వు ॥

దట్టపుఁదమకపు మైదావానలానకు
నిట్టూపురులె పో నీడవెట్టీని
గుట్టుతోనుండిన కూరిమిపంపులే పో నీ—
పట్టపు వేంకటపతిఁ బట్టి తెచ్చీని. ॥ పువ్వు ॥ 281

## భూపాళం

ఇన్నిచేఁతలును జేసెనిందుకొరకే — వీఁడు
కన్నులనె పొద్దుపుచ్చీఁ గదవె నీకొరకే ॥ పల్లవి ॥

మీనమాయఁ జెమటల మేను ముంచుకొరకే
తానే కమఠమునాయ దాఁగుకొరకే
అనుకొని కిటియాయ నదలించుకొరకే
మానఁడు కంబముచాటు మారుమోముకొరకే

1. ఇది పె–రే. ౨౫. పా; సా–రే, వి–రే. ౩౦. మోఁపనీఁక., 2. వి–రే [illegible]
3. వి–రే. గఱువలె.

కాలుచాఁచె నేలమీఁద గమనించుకొరకే
డాలిఁబెట్టె చేఁతలనే చంపుకొరకే
యేలికాయ విరహాలనేఁపెడికొరకే
శైలమెత్తె నీకుచములెత్తే[1] కొరకే ॥ ఇన్ని ॥

కలవెల్ల నిరసించెఁ గదవె నీకొరకే
కలికియాయెను నీసంగతికొరకే
వలపుల వేంకటేశ్వరుఁడు లోకమున
చెలువముతో మెరసెను నీకొరకే ॥ ఇన్ని ॥ 282

79—వ రేకు. కేదారగౌళ

రమ్మనవే వాని రమ్మనవే - యీ—
తమ్మికనుఁగొనల తళుకులవాని ॥ పల్లవి ॥

మెలుపున నేను మేడమీఁద యీ—
చిలుకఁ బేరుకొని పిలువఁగను
అలపున వీథిఁ దానరుగుచును ననుఁ
బిలిచితినంటాఁ బలికినవాని ॥ రమ్మ ॥

కేరడమైన కిన్నెరలో యీ—
సారణి ముట్టుచు [illegible]గడను
[illegible]వల తాఁజెలఁగుచును యిటు
పేరుకొనుచు ననుఁ బిలిచినవాని ॥ రమ్మ ॥

[illegible]మై నేఁ బానుపున యీ—
గిరికుచముల నొద్దగిలఁగాను
తిరువేంకటఘనగిరిపతి నను [illegible][3]
సిరులుగ ననునిటు చెనకినవా[illegible] ॥ రమ్మ ॥ [illegible]

1. వి-రే. శాం. లెత్తుకొరకే. 2. వి-రే. శాః. నలరఁగను. 3. [illegible] యనుచును.

ముఖారి — ఆటతాళం

చేయరాని చేఁతలెల్లఁ జేసితివి యింత
పాయరాని సతిమీఁద భయము నీకెట్టిదో ॥ పల్లవి ॥

ముత్తేల[1] పెండెమిది ముదితది ఆ[2]—
గుత్తపుఁ బాదమునకుఁ గొలఁదైనది
బిత్తరపు ముంజేతనే పెట్టితివి యీ—
మత్తగజగమనపై మన్నన నీకెట్టిదో ॥ చేయ ॥

కుందనంపు మట్టెలివి కోమలివి మోఁత—
లందెలతో జగడించనందమైనవి
యిందు నీకు నుంగరాలై యేచినవి యీ[3]—
యిందుముఖి మీఁదిమోహమెంత[4] నీకునెట్టిదో. ॥ చేయ ॥

గట్టివలిపెపు చంద్రకావి యిది యింతి
కట్టి విడిచిన నేఁటికమ్మఁదావిది
కట్టి కాసించితివి వేంకటరాయా యీ—
బెట్టైన చెలిమీఁది ప్రేమము నీకెట్టిదో ॥ చేయ ॥ 284

ముఖారి

నెల్లునంటా నేమైన చేయవచ్చేవు నే—
నొల్లనిన్ను సక్కసాయ[5] నుండేవో వుండవో ॥ పల్లవి ॥

మేసవారి పిన్నదాని మేకునేసి యింటిలోనఁ
దోసుకొంటివెఱఁగవా దుండగీఁడ
ఆసలఁ బెట్టేవు నన్ను నట్టనే యింతేసి
వేసాలఁబోక కొంగు పీదేవో[6] పీదవో ॥ నెల్లు ॥

1. వి-రే. గా. ముత్యాల. 2. అ. అ. అ. అ. 3. యీ-యీ. 4 మిఁకనీ. 5. వి-రే.

పాయపు వలపులనే[1] పైడివంటి గొల్లెతల
 సాయసంపి తొలఁగవా సటకాఁడ
 మాయలఁ బెట్టుచు నీవు మంచునీరు కుంచాలఁ
 బోయుచు నన్నేఁపక పోయేవో పోవో ॥ నెల్లు ॥

గాఁటమైన గుబ్బల చక్కనిదాని నమ్మనంటా
 ఆఁటదాని బానగొనేవడవిలోనే
నాఁటకపు వేంకటేశ నన్నుఁ గూడితివి యిట్టె
 మాఁటనెందూనాడక మానేవో మానవో ॥ నెల్లు ॥ 285

ఆహిరి

ఇన్నియుఁ జేసితివిఁకనేలా నీ—
 చిన్నినగవు మూనెర నీచేఁత ॥ పల్లవి ॥

మఱవకురా నీమాటలు ని—
 న్నెఱుఁగుదు విన్నియు నిఁకనేలా
 మొఱఁగకురా నీమోహము నా—
 చెఱఁగు మానెనిదె చెల్లె నీచేఁత ॥ ఇన్ని ॥

చిందకురా నీ చెలువములు ఇపు —
 డిందరునున్నారిఁకనేలా
 కందకురా నీ కాఁకలను యిటు
 కిందుపడితినిదె గెలిచె నీచేఁత ॥ ఇన్ని ॥

నొంపకురా నే నొగులఁగా నీ—
 యింపులు నెరపేవిఁకనేలా
 జంపుల వేంకటశైలపతీ నా—
 తెంపుమోవి (కి) దక్కెర నీచేఁత. ॥ ఇన్ని ॥ 286

1. వల్లపులన్నే.

బౌళి—ఏకతాళి

ఎవ్వరు గలరమ్మ యింక నాకు
    నెవ్వగలలోఁ జిత్తము నెలకొన్నదిపుడు ॥ పల్లవి ॥

మనసుకోరిక దీవి మానిపెదనంటినా
    వొనగూడి మనసు నావొద్దలేదు
    పెనఁగి తమకము వా[1] పెదనంటినా మేన
    అనయమువెరవు దానై[2] యున్నదిపుడు ॥ ఎవ్వరు ॥

చింత తాలిముల ముంచెదనంటినా మేన
    సంతాపములు సేయఁ జలపట్టెను
    అంతరంగము నాదియంటినా నెలవున
    సంతతమునాతఁడే జట్టిగొనె నిపుడు ॥ ఎవ్వరు ॥

సింగారపుమేను నాచేతికి లోనంటినా
    అంగవించి పరవశమై యున్నది
    యింగితమెరిఁగి వేంకటేశుఁడు నాకంటినా
    కంగి నన్నుఁ గార్గించి కలనెనిపుడు ॥ ఎవ్వరు ॥ 287

వరాళి

వెలయు నీకల్యాణవేదిగా మతినుండి
    కలికి జవ్వనపు యాగము సేసెనతఁడు ॥ పల్లవి ॥

మలయు నీనాభిహోమపు గుండమునను[3]
    నెలకొన్న విరహాగ్ని నిండాఁ బోసి
    పొలయు నీ నిట్టూరుపుల విసరుచును
    వొలుకుఁ జెమటల నాహుతి వోసె నతఁడు ॥ వెలయు ॥

---

1. వి-రే. చా-ఖ. మునాపె. 2. పె-రే. ౨౫. తానైనయున్న. 3. వి-రే. కుండమున

కదిసి నీనెన్నడిమి గగనమునందు
పొదలిన యారనే పొగ నిండఁగా
మదిరాక్షి నీమంచి మానపుఁ బళువు
నదనెరిఁగి వేలిచె నతివ నీకతఁడు ॥ వెలయు ॥

కొటుకకన్నుల విన్నుఁ గడునలయించి
బూటకముల చిటిపొటి సిగ్గుల
గాఁటపుఁగరుణ వేంకటగిరివిభుఁడు
కోటిహోమము సేసెఁ గూడి నిన్నతఁడు ॥ వెలయు ॥ 288

80 -వ రేకు. శ్రీరాగం[1]

అంజలిరంజలిరయం తే
కిం జనయసి మమ ఖేదం వచనైః ॥ పల్లవి ॥

మాం కిం భజనే మయా కింతే
త్వం కోవా మే తవ కాఽహం
కిం కార్యమితో గేహే మమ తే
శంకాం వినా కిం సమాగతోసి ॥ అంజలి ॥

నను వినయోక్తేర్న యోగ్యాఽహం
పునః పునస్త్వం పూజ్యోసి
దినదిన కలహాభిధినా తే కిం
మనసిజజనక రమారమణ ॥ అంజలి ॥

దైవం బలవత్తరం భువనే
నైవ రోచతే నర్మ మయి
ఏవమేవ భవదిష్టం కురు కురు
శ్రీవేంకటాద్రి శ్రీనివాస. ॥ అంజలి ॥ 289

1. వి.రే. ౪౩. రాగము పేర్కొనలేదు.

## సామంతం

విరహాన నినుఁ బాసి వేఁగేను
తరుణి నేను నిన్నుఁ దప్పఁ దోయఁగలనా ॥ పల్లవి ॥

మున్ను నీవు రేపల్లెను ముచ్చిలించుకొన్న పాలు-
వెన్నలునారగించి విఱ్ఱవీఁగేవు
సన్నపు నడిమితోడి జవ్వనాన నలయుచు-
నున్నదాన నీతోడ నోపుదునా పెనఁగ ॥ విర ॥

నేరుపునఁ బాలజలనిధిలో నమృతమెల్ల-
నారగించి లావున[1] నన్నప్పళించేవు
బీరమునఁ జిగురాకుఁబెదవితోఁ గనుచూపుఁ-
గూరిమి నేనుం(వుం)డి నిన్నుఁ గుచ్చి పట్టఁగలనా ॥ విర ॥

గుద్దలించి దనుజుని గోరఁ జెనకిన నిన్ను
అద్దలించి చెనక నీయంతదాననా
గద్దరివి[2] తిరువేంకటగిరివిభుఁడ నీ-
విద్దపుఁ గస్తూరిమేను నేనాఁగగలనా. ॥ విర ॥ 280

## ముఖారి

ఎక్కడిదిఁకఁ బరిణామము యీమదనానలమునఁ బ్రియు-
మెక్కుడు దోఁపఁగ ధైర్యంబింతయుఁ దీరెడిని ॥ పల్లవి ॥

మనసునఁ దలఁచిన తలఁపులు మాటల వెడలఁగ నాడిన
గొనకొని కన్నుల నీళ్ళు గుత్తుకవట్టెడిని
కనుఁగవ చూచినచూపులు కౌఁగిటఁ జేర్పఁగఁబోయిన
పనివడి హృదయంబంతయుఁ బరవశమయ్యెడిని ॥ ఎక్కడి ॥

1. వి-రే. ౧౦౫. లావుల. 2. ఇది ని-రే. పాఠము; సా-రే. గద్దరి తిరువేంక

తనువున నాటినమాటలు తప్పక మతిఁ జింతించిన
అనువుగనది పరితాపంబై పెరరేఁపెడిని
వెనకదినంబుల కూటమి వేడుకలని తలపోసిన
పెనగొన పూఁటకుఁబూటకు ప్రేమము వెరిగెడిని ॥ ఎక్కడి ॥

తిరువేంకటగిరినాథుని దేవోత్తముఁ గూడిన మది
యెరగొని దేహవికారములెరవై తోఁపెడిని
పరమాత్మునికరుణారస పానము నేసిన జిహ్వకు
అరుదుగ నితరపదార్థములన్నియు రోసెడివి ॥ ఎక్కడి ॥ 291

## శ్రీరాగం[1]

తానట[2] ప్రాణేశుండట తమకము తమకముఁగూడఁగ
వేనలి జారినఁ దలఁకని వేడుకలెట్టివొకో ॥ పల్లవి ॥

మీఁటినఁ బగిలెడిగుబ్బలమీఁద నలందిన గంధపు-
వేటులతళుకులు పయ్యెద వెలుఁపలఁ బొలయఁగను
నాఁటిన మదనునిశరముల నలఁకువనొయ్యన తోఁపఁగ
మాటకు మాఁటాడదు చెలిమర్మంబెట్టిదొకో ॥ తానట ॥

మించిన తొడల మెఱుంగుల మెలుఁతుక గట్టిన పుట్టము
చించుక వెడలిన నిగ్గులు సిగ్గులు దొలఁకగను
వంచినరెప్పల కన్నుల వడియు జలంబులు చెక్కుల
నించినఁ బలుకనిభావపు నెవ్వగలెట్టివొకో ॥ తానట ॥

కమ్మనితావుల చెమటల గాలికి నొయ్యన మెచ్చుచు[3]
సొమ్ములఁ దేలెడి మరపుల సొక్కులఁ దేలుచును
దిమ్మరికోనేటప్పని తిరువేంకటపతిఁ గూడిన
కొమ్మకు మీఁదటియాసల కోరికలెటివొకో. ॥ తానట ॥ 292

1. తా—వెం. ౧౪౩. ముఖారి. 2. తాను ప్రాణే. 3. మెచ్చును.

నాదనామక్రియ

మలసిన తుమ్మిద మగవాఁడు
నిలిచి నాకు వెరవ నీకేలయ్యా ॥ పల్లవి ॥

మగువలు సురతపు మఱపునఁ గుచములఁ
దగిలిన రేకలతరిఁ జెలఁగి
పగటున సిగ్గులు పదుదురుగాకిటు
నిగిడిన సిగ్గులు నీకేలయ్యా ॥ మలసి ॥

వనితలు రతిపరవశమున మురిపెపు-
కనుఁగవచూపులఁ గరఁగుచును
జునుగుల చూపులు చూతురుగాకిటు
యెనసినెనయములు యిఁక నేలయ్యా ॥ మలసి ॥

లోలో మముబోంట్లు వనితలు వగఁ
దూలుచు జడమౌదురు గాక
తేలించితి రతి తిరువేంకటపతి
నాలికాఁడ నీనగవేలయ్యా ॥ మలసి ॥ 293

దేశాక్షి

ఏడనున్నదో యీతరుణి
చూడక చూచిన చూపులలోన ॥ పల్లవి ॥

మేఁతలు మరిగిన మీల పిల్లలకు
నీఁతలు నేరిపి (పీ*) యీతరుణి
కాఁతాళించిన కన్నుల నీళ్ళ
చేఁతల విండిన చెరువులలోన ॥ ఏడ ॥

ముత్తెపునవ్వుల మురిపెపుఁబువ్వుల
యెత్తులె కట్టి(ట్టీ*) యీతరుణి
లత్తిక మోవికి లంచముగా పై
మెత్తిన దంతపు మెరుఁగులలోన ॥ ఏడ ॥

పసని చీఁకట్ల పలుమరుఁ దవ్వి (వ్వీ*)
యిసుక పాఁతరలె యీతరుణి
కసిగాట్ల వేంకటపతి కౌఁగిట
రసములొలుక నేరములెన్నుచును. ॥ ఏఁట ॥ 294

81-వ రేకు. లలిత

*తెప్పగా మఱ్ఱాకుమీఁదఁ దేలాడువాఁడు
ఎప్పుడు లోకములెల్ల నేలేటివాఁడు ॥ పల్లవి ॥

మోఁతనీటి మడుగులో యీఁతగరచినవాఁడు
పాఁతగిలే నూతికిందఁబాయనివాఁడు
మూఁతి దోసిపట్టి మంటిముద్ద పెల్లగించువాఁడు
రోఁతయైన పేగులపేరులఁ గలవాఁడు ॥ తెప్ప ॥

కోడికూఁతనోరివాని కుత్తుకమ్ముఁడైనవాఁడు
బూడిది పూసినవాని బుద్ధులవాఁడు
మాడవన్నె లేటివెంట మాయలఁ దగిలినవాఁడు
దూడల నావులఁ గాచి దొరయైనవాఁడు ॥ తెప్ప ॥

ఆకసానఁ బారేవూరి అతివల మానముఖ
కాకు సేయువాఁడు తురగముపైవాఁడు
ఏకమై వేంకటగిరి నిందిరారమణిఁ గూడి
యేకాలముఁ బాయని యెనలేనివాఁడు. ॥ తెప్ప ॥ 295

సామంతం

పెద్దపిన్నవరుసఁ బెరుగవలసి తా-
నిద్దరైన యాతఁడీతఁడు ॥ పల్లవి ॥

* దశావతార సమన్వయము గలదు.

మెఱుఁగురెక్కల పెద్దమేని పులుగునెక్కి-
యిరులుకొనెడి యాతఁడీతఁడు
ఎరమంటలెగయంగ నేచిన పురముల-
నెరియించిన యాతఁడీతఁడు ॥ పెద్ద ॥

చల్లని చూపుల సతికి వలచి పోయి
యిల్లిటమున్న వాఁడీతఁడు
తెల్లనీటిపై దిక్కులు వెలుగఁగ-
నిల్లుగట్టిన యాతఁడీతఁడు ॥ పెద్ద ॥

చూచిన చూపుల సుఖదుఃఖములఁజేయ-
నేచిన పెనుదైవమీతఁడు
ఆచందముల వేంకటాద్రిపై నెలకొని
యీచోటనున్న వాఁడీతఁడు. ॥ పెద్ద ॥ 298

ముఖారి

కంటిమి నీలాగులెల్లఁ గన్నుల యాఁకలి దీర
బంచి (?) (బంటు*) తనమేల మాతోఁ బంతమింత
చాలదా ॥ పల్లవి ॥
మింటిమీఁది కంటిచూపు వంటలేని కూడు నీకు
గుంటిమీఁది తోడఁబుట్టు గొల్లవారికలిమి
ఒంటిగాక లోకమెల్లనొక్కటైన మేను మంచి-
జుంటితోడిఁ బుటినాలు సుకమింత చాలదా ॥ కంటి ॥

నాలుగు మోములబిడ్డ నవ్వుల సంసారము
వేలుమోపరానియిల్లు వింతవింతచెలువు
కాలిగోరఁ బుటినట్టి గద్దరికూఁతురు మంచి
పాలమీఁదిపడుక నీ బ్రదుకింత చాలదా ॥ కంటి ॥

---

బంటు కావచ్చును. కాతున్న ప్రాసభంగము.

ఎల్లనాఁడు నురముమీఁద నెండగాయు కావిరాయి
గుల్లకూఁతతోడినోరు కొనగోరుబలిమి
చెల్లురా నీకింతవట్టు శ్రీవేంకటేశ్వరుఁడ
మల్లువారితోడి పోరుమానవింత చాలదా ॥ కంటి ॥ 297

ముఖారి[1]

కడగంటనే[2] కెంపు గదురఁగాను
పడఁతి మురిపెపునటనఁ బాయ[3] దేమియును ॥ పల్లవి ॥

మగువ ముత్తియపుఁ గమ్మల వెన్నెలలుఁ[4] జిన్ని-
నగవువెన్నెలలు నున్నతిఁ బొలయఁగాను
జగడించి విభుని విరసంబులనె సొలయఁగా
మొగముననుఁ గోపంబు మొలవదేమియును ॥ కడ ॥

రమణికుచకుంభభారమును మొలనూళ్ళ భా-
రమును నెన్నడిమి సన్నము దెలుపఁగా
ప్రమదంపు విభునిఁ బెడఁబాసి చెనకుచు లోని-
తమకంపు సంభ్రమము తరగదేమియును ॥ కడ ॥

ముదిత మై సింగారములుఁ జక్కదనములును
పదివేలు విధములై పరఁగఁగాను
కదిసి వేంకటవిభుని కమ్మఁగౌఁగిటి రతులఁ
జెదరు నలకల[5] సిదులు చెదరవేమియును ॥ కడ ॥ 298

బౌళి

బహుకర్మభోగంపు[6] పనులెల్ల నిట్లనే
యిహసుఖంబిందరికి నెట్లనో కాని ॥ పల్లవి ॥

---

1. వి-రే. ౧౧౦. శంకరాభరణం. 2. కడగన్నులనె. 3. నటన పాయ.
4. అలఁజిన్ని. 5. సా-రే. చెదరనలకల. 6. పె-రే. ౨౬. బోరంపు.

మెలఁత విభుఁ బాసియును మితిలేని వేదనల-
నలరి యాతనిఁగూడు నధిరతుల నలసె
ఆలిగినను గూడినను కలిగె వలపులు దనకు-
నెలమిఁ దనసుఖములిఁక నెప్పుడో కాని ॥ బహు ॥

ఉడుగని వియోగాగ్ని నూర్పు గడు వేఁడాయ
కడు రతులతో నూర్పు గాఁగి వేఁడాయ
కడఁగిననుతాపంబె కప్పె * మై తాపంబె (?)
యెడలేని తమి యింత నెప్పుడో కాని ॥ బహు ॥

తిరువేంకటాచలాధిపునిఁ బాసినయపుడు
తరుణి యాతనివిపుడు తగఁ గూడినపుడు
పరవశము దలచాయ పైపైనె ఘనమాయ
యిరవైన యెరుకలిఁక నెప్పుడో కాని ॥ బహు ॥ 299

ముఖారి[1]

కుంకుమచెమటలంటా గొణగేవు మరు-
దొంకెన తామరల నెత్తురుచారలమ్మా ॥ పల్లవి ॥

కోవిదునిమీఁద నేల కోపగించేవతని కె-
మ్మోవి కప్పు మరునియమ్ములతాఁకులే
తావుల వింతలకుఁ గాఁతాళించేవతనిపై
భావజువింటి పూవు[2] బారిఁ బడెనమ్మా ॥ కుంకు ॥

నొసలి కస్తూరంటా నొగిలేవాతనిపై[3]
కసటుఁగాఁకల కందుగందము చూచి
యెసగ గందవొడంటా యెఱ్ఱఁబారేవాతనిపై
వసని మదనుదాడి బలుదుమ్ములమ్మా ॥ కుంకు ॥

---

1. ని-రే. ౧. కాంభోది. 2. పూవుల. 3. వాతనిమీఁద. *మైతాపమై ?

ఆఁటదాని గోరితాఁకుల*నేవాతనిపై[1]
నాఁటినచందురుని సన్నపు[2] రేకలే
గాఁటపుఁగాఁగిటను వేంకటపతి నీకు దక్కె-
యేఁటికి నాతనివింకా[3] నెగ్గులెన్నేవమ్మా. ॥ కుంకు ॥ 300

82-వ రేకు. శ్రీరాగం

ప్రతిలేని పూజ దలఁపఁగఁ గోటిమణుఁగులై
అతివ పరవశము బ్రహ్మానందమాయ ॥ పల్లవి ॥

మానినీమణి మనసు మంచియాసనమాయ-
నానందభాష్పజలమర్ఘ్యాదులాయ-
మీనాక్షికనుదోయి మించుదీపములాయ-
నాననసుధారసంబభిషేకమాయ ॥ ప్రతి ॥

మగువ చిరునవ్వులే మంచిక్రొవ్విరులాయ
తగుమేనితావి చందనమలఁదుటాయ
నిగనిగని తనుకాంతి నీరాజనంబాయ
జగడంపుటలుకలుపచారంబులాయ ॥ ప్రతి ॥

ననుపైన పొందులే నైవేద్యతతులాయ
తనివోని వేడుకలు తాంబూలమాయ
వనిత తిరువేంకటేశ్వరుని కౌఁగిటఁజేయు-
వినయవివరంబులరవిరిమొక్కులాయ. ॥ ప్రతి ॥ 301

ఆహిరి

మోహంపురతిముదము ముద్దుఁజూపుల మదము
దేహంపు సొబగెల్లఁ దెలిపె[4] నదమదము ॥ పల్లవి ॥

మించుమెట్టెల గిలుకు మెఱుఁగుగుబ్బల కులుకు
వంచుఁజూపుల చిలుకు పసివాడుఁబలుకు
మంచుఁ జెమటల తళుకు మనసులోపలి యళుకు
అంచుటధరపుబెళుకు *అలమేఁటి జళుకు[1] ॥ మోహం ॥

కరమూలములఁ గరఁగు[2] కదలుఁబయ్యెద చెరఁగు
సిరులచెలువపుమొరఁగు చెక్కుపై మరఁగు
గరగరికె తతులెరుఁగు ఘాతలంటిన తెరఁగు[3]
గరిమెతో చెలియునికి[4] కప్పురపుటరఁగు ॥ మోహం ॥

కలికితనముల పోఁగు కమ్మఁదావులవేఁగు
వలపుతమకముల పరవశము పెనుజాగు
*కంకంటిబాగు[5] వేంకటపతికిఁ జెలరేఁగు
చెలియ[6] సమరతుల మించిన వింత బాగు. ॥ మోహం ॥ 302

పాడి

ముద్దులు మోమున ముంచఁగను
విద్దపుఁ గూరిమి నించీని ॥ పల్లవి ॥

మొల చిరుఘంటలు మువ్వలు గజ్జలు
ఘలఘలమనఁగాఁ గదలఁగను
ఎలనవ్వులతో సీతఁడు వచ్చి
జలజపుచేతులు చాఁచీని ॥ ముద్దు ॥

అచ్చపుఁ గుచ్చుముత్యాల హారములు
పచ్చల చంద్రాభరణములు
తచ్చిన చేతుల తానె దైవమని
అచ్చట నిచ్చట నాడీని ॥ ముద్దు ॥

---

1. ధరపు నవ్వులలమేటియళుకు. 2. లకరఁగు. 3. గరగరికెలకు తెరఁగు ఘాతలంటిన పెఱఁగు. 4. ఇది ని–రే. పాఠము: సా–రే, పెఁరే. ఆ.. చెలి

నేలకు నింగికి నెరిఁబొడవై
చాలించి (చాల ?) వేంకటాచలపతి దానై
మేలిమిసేఁతల మించిన ॥ ముద్దు ॥ 303

రామక్రియ

చూడరమ్మ యిటువంటి సుధతులు లేరెందు
యేడనైన నిటువంటి యింతులు వుట్టుదురా ॥ పల్లవి ॥

ముదితనడపులలోని మురిపెమే వెయినేసు
కొదమగుబ్బలతీరు కోటివేలు నేసు
సుదతిబిత్తరిచూపు * సొన్నాటంకాలే నేసు
అదరబింబముతీరు ఆరువేలు నేసు ॥ చూడ ॥

సన్నపు నడుము[1] లోని సైకమే లక్షనేసు
పన్నుగాఁ బిరుఁదువన్నె పదివేలు నేసు
యెన్నిక మెఱుఁగుఁదొడలెంతధనమైనఁ జేసు
నున్నఁగా దువ్వినకొప్పు నూరువేలు నేసునే ॥ చూడ ॥

అంగనభాగ్యమెట్టిదో అతిమోహమై తిరు-
వెంగళరాయనికృప వేవేలు నేసునే
బంగారుచవికెలోఁ బడఁతిఁ గూడిన సొంపు
రంగుగాఁ జెలియరూపు రాజ్యమెల్లఁ జేసునే. ॥ చూడ ॥ 304

అహిరి

జవ్వనంపుమదమున జడినేటి తరుణి
పువ్వుల పానుపుమీఁదఁ బొరలీఁ జూడరే ॥ పల్ల ॥

1, పె-రే. ౬౬. నడపులోని.

* 'స్వర్ణటంక' సమాసైకదేశము 'కప్పురగంధి' వలె తద్భవమైనది.

ముత్తేలకంకణాల మురిసేటి కరము
  చిత్తగించు చెలి నేఁడు చెక్కుమీఁదను
  కొత్తనెత్తావి విరుల కొమరైన తురుము
  వత్తుల నెరులతోడ వదలీఁ జూడరే ॥ జవ్వ ॥

పయ్యెదవెలి మించు పగనైన గుబ్బలు
  ముయ్యరాని[1] పెనుతాపమునఁ గాఁగీని
  వొయ్యారపు రచనలతో వొరపైన చూపులు
  వొయ్యనె కన్నులసీట వులికీఁ జూడరే ॥ జవ్వ ॥

కప్పురపుతావితోడ కరఁగేటి తనువు
  వొప్పైన కస్తూరిచేత నొరపైనది
  యిప్పుడిట్టె తిరువేంకటేశుఁగూడి యీ యింతి
  చెప్పరాని వేడుకలఁ జెలఁగీఁ జూడరే. ॥ జవ్వ ॥ 305

కన్నడగౌళ

ఏలా యీ యనుమానములింతి మనంబునఁ బాయని—
  తాలిమి తప్పఁదెరువున దాఁగెఁగదోయమ్మా ॥ పల్లవి ॥

మాయపుమంటలు చల్లెడు మందమారుతము
  పాయము దిరుగఁబారెడు పండుఁజందురుఁడు
  కాయము తల్లడపరపెడు గండుగోయిలలు
  యేమెడనోర్వదు చెలిలాగేలాగోయమ్మా ॥ ఏలా ॥

ఇంటఁ బుట్టిన యాతఁడే యింటఁ బుట్టిన యమ్ముల
  యింటఁ బలుమరునేయఁగ నేమందునోయమ్మా
  వింటఁ బాసిన శరముల వెంటఁ దగిలెడు నారిని
  యంటిన మదనానలమిఁక నారుపరాదమ్మా ॥ ఏలా ॥

1. పె—రే. ౨౬. ముయ్యగాని.

కొండలరాయఁడు చెలిచనుఁగొండల నించిన గురుతులు
కొండుకచందురులైనవి కొత్తగదోయమ్మ
నిండిన విరహంబింతయు నేఁడిదె యమృతంబాయను
పండిన తమకము మేలై పరి[illegible]ంచెనోయమ్మ ॥ఏలా॥ 306

83—వ రేకు

రామక్రియ

కమలాసన సౌభాగ్యము కలికితనంబులు సొబగులు
ప్రమదంబులు[1] నింతంతని పలుకంగా రాదు ॥పల్లవి॥

మించిన చొక్కులు మీరినయాసలు
పంచేంద్రియముల భాగ్యములు
యెంచిన తలఁపులు యెడపని వలపులు
పంచబాణుని పరిణత (తు?) లూ ॥కమలా॥

కనుఁగవ జలములు కమ్మనిచెమటలు
అవయవముఁ [illegible]ులలకు నాడికలు
తనుస్పృశ [illegible]పులు తప్పని [illegible]పులు
వినుకలి కనుకలి వేడుకలు ॥కమలా॥

మోవి మెఱుంగులు[2] ముద్దుల నగవులు
శ్రీ వేంకటపతిచిత్తములు
తావుల పూఁతలు దర్పకు ప్రాఁతలు
ఆ విభుఁ గూడిన యులసములు. ॥కమలా॥ 307

పాడి[3]

విభుని వినయములు వినవమ్మా నిను —
నభయంబడిగీ నయ్యో తాను ॥పల్లవి॥

---

1. పె—రే ౨౫. ప్రమదంబున. 2. మెఱుంగులు. 3. ని—రే ౮౫. పురుష విరహం.

రహస్యమున శ్రీరమణుఁడు పంపిన
విహారణలేకలు[1] వినవమ్మా
అహిపతిశయనంబతితాపంబై
[illegible] తాను ॥ విభుని ॥

అదిమపతి నీ యడుగుల కెరగిన—
వేదాంతరచన వినవమ్మా
నీదయగానక నిమిషమె యుగమై
ఖేదంబున నలఁగీనట తాను ॥ విభుని ॥

కింకరుఁడట నీ కినుక నేఁతలకు[2]
వేంకటపతిగతి వినవమ్మా
సంకెలేక[3] నీచనవున జగములు
కొంకకిపుడె చేకొనెనట తాను ॥ విభుని ॥ 308

ముఖారి

ఎఱఁగవిదివి[4] చంద మిట్టివాఁడనుచు నింతి
తెలివల నీమీఁదఁ దేనొప్పుఁ జుమ్మీ ॥ పల్లవి ॥

రంగుమీరిన మంచిరత్నాలు దాచిన నీ—
పుంగరాలచేతఁ బాదమొత్తుదువమ్మా
అంగన పుట్టెనుఁ బాదమంటి శిలను దొల్లి
కంగి నీకుఁ బ్రతిమొన గడియించీఁ జుమ్మీ ॥ ఎఱఁగ ॥

కొమ్మ నీదు వాలారుగోళ్ళ నితనికిని
యిమ్ములఁ దొడలు నొఁకనియ్యకు[4] వమ్మా
దొమ్ముల[5] సిరుల గోరఁ దొడనింతిఁ బుట్టించె
కమ్మర నీకు[6] నిట్టె కలిగించీఁ జుమ్మీ ॥ ఎఱఁగ ॥

---

1. లేఖలు. 2. కినుక చూపులకు. 3. సంకెదేరె. 4. ని-రే. ఇట. నీకు నమ్మా. 5. కొమ్ములసిరు. 6. నీకునునిట్టె.

నొక్కుచుఁ జెమటల పానుపున వేంకటపతి—
నుక్కున నీచనుఁగొండలొత్తకువమ్మా
పక్కనను గొండవేసి పానుపుజలధి దచ్చె
చక్కని తరుణి నిట్టె సదిఁబెట్టేఁ జుమ్మీ ॥ ఎఱఁగ ॥ 309

భైరవి

కూరిమెరిఁగి కైకోవు — నీ—
బీరములే నెరపేవు ॥ పల్లవి ॥

*రంతులె సేసిటు రావు — యెంతైనాఁ జవపీవు
చెంతలె కదుఁ దలఁచేవు — ఇంతలోనె [1] రవయ్యేవు ॥ కూరి ॥

పొలయుచు నూరకె పోవు — గిలిగింపుచుఁ దిరిగేవు
చెలఁగుచు వది మురిసేవు — విలరా యించుక [2] నీవు ॥ కూరి ॥

బొంకుచు నూరకె పోవు — తెంకికి నెవ్వతెఁ దేవు
వేంకటపతి నవ్వేవు — పొంకమైతివిఁకఁ బోవు ॥ కూరి ॥ 310

పాడి

సత్యభామ సరసపు నగవు
నిత్యము హరిమదినే నెలవాయ ॥ పల్లవి ॥

రుకుమిణిదేవికి రూపయవ్వనికి
సకల విభవముల సౌఖ్యతలు
చికురాంబరమునఁ జెదరిన యలకలు [3]
వికచాబ్జముఖము వెయివేలాయ ॥ సత్య ॥

తొడవుల శ్రీసతి తొలుమెఱుఁగులమై
నడపుల మురిపెపు నగుమోము
తడయక వారిధి దచ్చిన హరికిని
బడలిక వావను పరమంబాయ ॥ సత్య ॥

1. వి-రే. ౫-౨. ఇంతనె యెరవ. 2. విలరాయాంచక (?). ౩. ఇది పె-రే. ౪. పాఠము: పా-రే. అలకలు.

* చిన్నవగుటచే ఈ ౩ చరణములు రెండు రెండు పంక్తులలో వొదిగినవి.

అనుదినమును నీ యలమేలుమంగ
కనుఁగవ జంకెన గర్వములు
దినదినంబులును తిరువేంకటపతి—
చనవుల నొబగుల సంపదలాయ. ॥ సత్య ॥ 311

## శ్రీరాగం

ఎట్టు [1]నైఁతువె వలపు యింతి పరులు
రట్టుసేయఁగ మిగుల రాఁపపునె కొంత ॥ పల్లవి ॥

రాక విభుఁడేఁపేటి రాజసంబొకకొంత
చీకాకు పడఁజేయు చింత వొకకొంత
పైకొన్న చిత్తంబు పట్టరానిది గొంత
మేకులకుఁ జెలులాడు మేలమొకకొంత ॥ ఎట్టు ॥

పలుమారు వలయించు పరవశంబొకకొంత
పొలయలుకలను బొడము బూకలొకకొంత
కలికి కన్నులఁ బొలయు కాఁతాళమొకకొంత
కొలఁదిమీరిన మంచికోపమొకకొంత ॥ ఎట్టు ॥

గరగరిక వేడుకల కలపుకోలొకకొంత
వరుసఁ గోమలమైన వయసులొకకొంత
తిరువేంకటాద్రీశు దివ్యమహిమలు గొంత
సరిలేని పొందికల చనవులొకకొంత. ॥ ఎట్టు ॥

## పాడి

రావే కోడల రట్టడి కోడల
పోవే పోవే అత్తయ్యా, పొందులునీతోఁజాలును ॥ పల్లవి ॥

---

1 [illegible]

రంకెలు వేయుచు రంజులెదుట నీవు
కొంకు గొసరు లేని కోడల
పంకజముఖి నీవు పలుదొడ్డవారిండ్ల
అంకెలఁ దిరిగేవు అత్తయ్యా ॥ రావే ॥

ఈడాడ నలుగురు నేగురు మొగలతో
కూడి సిగ్గులేని కోడల
వాడకుఁ బదుగురి వలపించుకొని నీవు
ఆడాడఁ దిరిగేవు అత్తయ్యా ॥ రావే ॥

దొడ్డునఁ బుట్టిన పూఁపనికే నిన్ను
గొడ్డేరు తెస్తినే కోడల
గుడ్డముపయినున్న కోనేటిరాయని—
నడ్డగించుకొంటివత్తయ్యా. ॥ రావే ॥ 313

84-వ రేకు. సామంతం

ఎచ్చరించెదననిన యీజగంబనఁగాను
సచ్చరిత్రుఁడ నీకు సరకా వోరి ॥ పల్లవి ॥

రుచుల నారాయణ పరో జ్యోతి యని
పచరించి నిను శ్రుతులు పలుకఁగాను
వచియింపరాని యిటువంటి నీ యెదుట నా—
కుచకుంభములకాంతి కొలువునా వోరి ॥ ఎచ్చ ॥

రమణ నారాయణ పరబ్రహ్మమని
ప్రమదమున నిను శ్రుతులు పలుకఁగాను
తమకమున నను నీవు తగిలితివి యీసుఖము
నిమిషమాసుఖము గానేర్చునా వోరి ॥ ఎచ్చ ॥

అరయ నారాయణ పరాత్పరంబని విన్న
సరసవిద్యలు శ్రుతులు చాటఁగాను
సిరుల నను(గూడితివి శ్రీ వేంకటేశ నీ—
కరుణకిటు నేనోర్వఁగలనా వోరి. ॥ ఎచ్చె ॥ 314

భైరవి

వేంకటాద్రివిభునిఁబాసి విరహియైన రమణిఁ జూచి
రంకెలు వేయనేఁటికమ్మ రాజసమునను ॥ పల్లవి ॥

విసప (పు?) కోఁక సోఁకినపుడె వేఁడిలేవి చందమామ
మిసిమిగలుగు వేఁడిచూపు మింట మలయునే
నొసలికంటికాఁకనణఁగి నొగిలినపుడె తొడుగలేక
కుసుమశరము మదనుఁడతివకొరకు దాఁచెనే ॥ వేంక ॥

చిగురుమేఁతకొండ్లెల్ల చెలఁగి మావికొమ్మలెక్కి—
మగువమీఁదఁగూఁతరేఁచి మరునిఁగూడిరే
తగవరైన దశరథేంద్రుతనయు శాపమొనఁగినపుడె
తెగువమీఁదఁగూఁతరేఁచ తెరఁగులెరఁగరా ॥ వేంక ॥

నెయ్యమలర మంచివిరులశయ్య వేంకటాద్రివిభుఁడు
లియ్యమైనచెలికిఁ జనవులియ్యఁ దొణఁగెనే
కుయ్యవెరచెఁ గోవిలలును కుంకెఁ జందమామకళలు
తియ్యవింటివాఁడు వెనకతియ్యఁదొడఁగెనే. ॥ వేంక ॥ 315

శంకరాభరణం

జవ్వాది మెత్తినది తన—
జవ్వనమే జన్నెవట్టినది ॥ పల్లవి ॥

ముద్దుల మాఁటలది చెక్కు—
టద్దముల కాంతినలరినది
గద్దరిచూపులది తన—
వొద్ది చెలియమీఁద నొరగున్నది ॥ జవ్వా ॥

పుత్తడిఁ బోలినది తన—
చిత్తము నీసొమ్ము చేసినది
గుత్తపు గుబ్బలది అల—
చిత్తజుని లెక్క సేయనిది ॥ జవ్వా ॥

ఎమ్మెలు యెఱఁగనిది తన—
కెమ్మోవిఁ జిరునవ్వు గెరలున్నది
కమ్మకొనఁగ వెంకటరాయా నీ—
కమ్మనికౌఁగిటఁ గలఁచున్నది. ॥ జవ్వా ॥ 316

అహిరి

తిట్టినఁ దిట్టినదే తప్పా
బెట్టమ్మా గుంపెన నీచేత ॥ పల్లవి ॥

వెనక మరలి నవ్వినదే తప్పా
వినమమ్మా[1] నీ విభుఁడౌట
చెనకఁగ జంకించినదే తప్పా
అనవమ్మా నీ వాతనిఁ గినిసి ॥ తిట్టిన ॥

ఎదుట నిలిచి తురుమిడుటే తప్పా
వదలిన పయ్యెద వాలఁగను
అదన నలసి వుసురనుటే తప్పా
వుదుటుఁదమకమున నుండఁగలేక ॥ తిట్టిన ॥

---

1. వి—రే. ఆ. వివనమ్మా.

కేలనె[1] యిటు మొక్కినదే తప్పా
కాలు దాఁకి వేంకటపతికి
వోలి నే నతనిపై నొరగుటె తప్పా
మేలములాడుచు[2] మెరయఁగనతఁడు. ॥ తిట్టిన ॥ 317

రామక్రియ

దంతచ్ఛదముద్రా మదనాస్త్రల-
కాంతశాంతికృతిరహో భవతి ॥ పల్లవి ॥

వనితాకుచయోర్వరనఖరేఖా-
ర్జన[3] శశిచిహ్నం సఫలమిదం
ఘనకరుణాం మయి ఘటయ చంద్ర ఇ-
త్యనునయకారణమహో భవతి ॥ దంత ॥

సతీమణీ విలసత్కరమూలే
చతురలాంఛనం సఫలమిదం
ప్రతతిభయహృతే వరదాస్య[4] కలన-
మతిఘాతాకృతిరహో భవతి ॥ దంత ॥

తరుణీ తనుగంధ విలేపన వి-
స్తరసౌభాగ్యం సఫలమిదం
పరిరంభసుఖే తిరువేంకటగిరి-
హరేః పూజనమహో భవతి. ॥ దంత ॥ 318

శ్రీరాగం

ఇంతి కన్నీరొలుకనిట్లఁ జదివె
కొంతంపు కనుఁగొనల కోపమును జదివె ॥ పల్లవి ॥

---

1. వి-రే. ౭౫. కెలనన. 2. మేలమాడుచును. 3. వి-రే. ౬౫. రేఖాజన.
4. వరదుస్య. ఈ సంకీర్తన వి-రే. '', ౬౫. పె-రే. ౨౩. లోను ఇట్లే కలదు.

వెలఁది వినుకలినే వినికి విని తోడనే
తలపోఁతనదివో చింతనసేసెను
తలకొన్న నేలవ్రాఁతలనె పొలుపుగ వ్రాసె
తొలుతఁ బాదపువేలి ధూళక్షరములు ॥ఇంతి॥

పడఁతి కనుకలినే పులకవ్రాలును వ్రాసె
తడవి నీ చెలువ (వు?) చిత్తపుఁ బలకనే
కడుఁదెలివికిని బాసి[1] కలవెల్ల మఱచి తన-
వెడఁగుఁ జెక్కు[2] చేతితో వెదకీనిదివో ॥ఇంతి॥

వరుస గంటపువ్రాలు వ్రాసెఁ గొనగోరనే
కురుఁబసల నీవు చెక్కులు గిల్లఁగా
తిరువేంకటాచలాధిపుఁడ నీతోఁగూడి
సరిలేని శబ్దశాస్త్రములెల్లఁ జదివె. ॥ఇంతి॥ 319

85-వ రేకు. సామంతం[3]

పడఁతి నినుఁదలచి పో పలుకఁడతఁడు, నీ-
వెడసినను బ్రాణంబులెరవులాతనికి ॥పల్లవి॥

వెదచల్లు నీ మోము వెన్నెలలఁ దలఁచిపో
పొదలు వెన్నెలబయటఁ బొలయఁడతఁడు
ముదిత నీ నెరులు దురుమును దలఁచిపో యతఁడు
కొదమతేంట్లఁ (టుల?) గనిన గుండె జల్లనును ॥పడఁతి॥

లలితాంగి నీ దేహలత దలఁచి పో యిపుడు[4]
చెలఁగి వనమునకు విచ్చేయఁడతఁడు
వెలఁది నీమోవికావిరి దలఁచి పో యతఁడు
తలిరాకు గని గుండె తల్లడంబౌను ॥పడఁతి॥

1. వి-రే. ౧౪. వ్రాశె; ౩ం. వ్రాశి. 2. ౧౪. గుఁజెకు. 3. వి-రే. ౯. ౧౦౩. కాంబోది. 4. సా-రే. యతఁడు.

(మెలుఁత నీయూర్పు దెమ్మెర దలఁచి యాతనికి
మలయానిలము చూచి మరపాను మేను)[1]

కోమలిరో నీయిట్లకూటములు దలఁచి పో
ప్రేమమితరములపైఁ బెట్టఁడతఁడు
దీమసపు వేంకటాధిపుఁడుగన యాతనికి
సామాన్యసరసతలు సరకుగావరయ ॥పడఁతి॥ 320

ముఖారి

ఏలే[2] పడుసా యేదేని గుడుసా
చాలునేఁపకువే జవ్వనంపు గడుసా ॥పల్లవి॥

ఒద్దేలే కసరు వలవని కిసరు
పొద్దువొద్దులకుఁ జూపుల యసరు
పెద్దైన వలపుల పిసరు లో న-
న్నద్దేవు నేనై తినసురుసురు ॥ఏలే॥

వచ్చేనేసనవే నా వలపు చేకొనవే
మచ్చుచల్లక నామాట వినవే
ఇచ్చేసనవే[3] నీహృదయమింతటనైన
రిచ్చవడిన నాకూరిమి గనుఁగొనవే ॥ఏలే॥

రావే సంగడికి రతుల యంగడికి
శ్రీ వేంకటేశుఁడ[4] నా చెంగటికిని
నీవే కౌఁగిటికి నిధులలోఁగిటికి
మోవీవే వెరవక మోహపుటాఁకటికి. ॥ఏలే॥ 321

1. వి-రే. ౫. లోనిది ఈ చరణపు ఉత్తరార్ధపాఠమిది. 2. వి-రే. ౧౩. ౩౫. యాలేశే. 3. వి-రే. ౩౫. ఇచ్చేనేననవే. 4. వి-రే. ౧౩. ౩౫. వేంకటపతినా.

తెలుఁగుఁ గాంబోది

చక్కఁదనములనే వేసాలఁబొయ్యేవు నీ-
యెక్కువలె యింత సేసె నెక్కడ చొచ్చేవే ॥ పల్లవి ॥

వెన్నెలలకునె యింత వెరచేవు నీమోము
వెన్నెలచే నెట్టు వేఁగించేవే
సన్నపుఁ దేంట్లకిట్టె జడిసేవు నెలఁత నీ-
యిన్ని నెరిఁదుమ్మెదలకెట్ల [1] లోఁగేవే ॥ చక్క ॥

చిలుకలకునే యింత చిమిడేవు నీచిలుక-
పలుకుల నెక్కడికిఁ బారఁదోలేవే
చలిగాలికినె యింత జడిసేవు నెలఁత య-
గ్గలపుటూర్పుగాలికెక్కడ [2] నొదిగేవే ॥ చక్క ॥

మదనుఁడనినను వేమారు గలఁగేవు నీ-
మదనగురునికెట్టు మనసిచ్చేవే
ఇదె వేంకటేశుఁడు నిన్నెనసి కౌఁగిటఁగూడె
పొదలుఁదావులకెట్టు పొంగుచుఁ జొక్కేవే. ॥ చక్క ॥ 322

వరాళి

చూపులనే సొలసేవు చూడరాదా మమ్ముఁ
గాఁపురము సేయనీక కారించేవా ॥ పల్లవి ॥

వదినెంటాఁ బిలిచేవు వద్దు సుమ్మీ యెవ్వరోయి
వదినెలు నీకు [3] వాడవారి మరఁది
యెదురైతే మొక్కేవు యేఁటికోయి యింతేసి
వుదుటులు మాని [4] చక్కనుండనేరవా ॥ చూపు ॥

---

1. వి-రే. ౩౯. కేలలో. 2. ౧౫. ౩౯. నీ-వాలికేటిగాలికెక్కడ. 3. వి-రే. ౨౦. ౧౧౩. వదినెలు వాడ. 4. వుదుటులు చక్క.

అత్తసంటాఁ బిలిచేవు అక్కడ నిక్కడ నీకు
అత్తలెవ్వరోయి వూరఁ బొత్తుటల్లుఁడా
వత్తునంటాఁ జెప్పంపేవు వడదాఁకి కూటుబున
వత్తులనై పోదుఁగాని వచ్చి చూడరాదా[1] ॥ చూపు ॥

చీర వెలిగా నవ్వేవు చెల్లఁ యెక్కడనైన
మారుజాతి వారికైన మానము లేదా
తీరు నీకు నింతేసి తిరువేంకటేశుఁడ
కూరిమి యెరిఁగి నన్నుఁ గూడితివౌరా. ॥ చూపు ॥ 323

కొండమలహరి

కొండలోఁ[2] గోవిల గూన్య గుండె పగిలె నీ—
యండకు రాఁగాఁ బ్రాణమంతలో బ్రదికెరా ॥ పల్లవి ॥

వలచి నిన్ను వెదకి వటి నే రాఁగాను
పులివలె మగఁడుండెఁ బోనియ్యక
తలఁచి నాకంతలోనే తల నొవ్వఁగాను
చిలుకుఁ బులకలెత్తి సిగ్గుమాలె వలపు ॥ కొండ ॥

ఏమరించి యింటివారినెడసి నే రాఁగాను[3]
గామైన బిడ్డయేడ్చెఁ గదలనీక
తామసించి యుండలేక తల్లడించఁగాను
చీమలు మైవాఁకినట్టు చిమ్మిరేఁగె వలపు ॥ కొండ ॥

వుండలేక యిప్పుడు నీవొద్దికి నే రాఁగాను[4]
కొండవలె మరఁదుండెఁ గోపగించుక
బొండుమల్లెపరపుపైఁ బొరలేటి యిట్టి[5] నన్ను
కొండలరాయఁడ నిన్నుఁ గూడించె నావలపు. ॥ కొండ ॥ 324

భూపాళం

రాయడికాఁడు గదమ్మ[1] రంతు సేసీని
పాయపునతులనే గోపాల గోవిందుఁడు ॥ పల్లవి ॥

వట్టిమాయలఁ బెట్టవలదన్న మానఁడు
బెట్టుగ రేపల్లె గోపికలనెల్ల
యెట్టు వేగింతురమ్మ[2] యెల్లవాళలును
రట్టడియైనట్టి రాచగోవిందుఁడు ॥ రాయ ॥

తేని పగలు చాటి లేమలనిందరిని
కాని కానిమ్మనుచుఁ గరఁగించీని
మాని మాని కమ్మర మగుడ మమ్మేఁచీని
రానిలే చూచుఁగాని రాచగోవిందుఁడు ॥ రాయ ॥

పొద్దు వొద్దునకెంతే బూమెలు[3] నేయుచును
వొద్దికై నాతోడ నొనగూడీని
అద్దో యింకా మానఁడాసలఁ బెట్టెడిని[4]
గద్దరి శ్రీతిరువేంకటపు గోవిందుఁడు ॥ రాయ ॥ 325

86-వ రేకు. ఆహిరి

జట్టిగొనెర నిన్ను జవరాలు
చిట్టంటు చేఁతల[5] జెలఁగితివపుడు ॥ పల్లవి ॥

వాలుకచూపులు వాడఁగ నాటక[6]
సాలలోన నిను జవరాలు
చాలుగ మురియుచు సరుగనఁ జివుకన

సొలపుగొనుచు మించుల మొలనూళ్ళ
సళుపుల మురిపెపు జవరాలు
గలగల గజ్జెలు గదలఁగ నునుఁదొడ
బలిమిఁ గదలిచిన బ్రమసితివపుడు ॥ జట్టి ॥

సొంపగు తల [1] చంచుల (?) మునివేళ్ళ—
సంపద నడపుల జవరాలు
యింపులు నెరపుచు నిచె నిసుఁ గదిసిన [2]
కంపించితి వేంకటగిరిరమణ. ॥ జట్టి ॥ 326

సామంతం

అద్దిరా చిమ్ముల మాటలప్పటి నీకు
పెద్దరికాలనె [3] మురిపెములే చిమ్మేవు ॥ పల్లవి ॥

వద్దన్న మానవు నేనెవ్వతెరా నీకు నీ—
నిద్దురచూపులు నాపై నివాళించేవు
బద్దులెల్లనేడ నగపడెరా నీకు యీ—
ముద్దులమాటలాడుచు మోమే వంచేవు ॥ అద్దిర ॥

దెందములో నేనిఁకనేఁటికిరా నీకు నీ—
యందిపాటుచేఁతల నన్నలయించేవు
కిందిచూపులేడ దొరకెరా నీకు నీ—
చెందమ్మిచేతుల నాచెఱఁగువట్టేవు ॥ అద్దిర ॥

బింకములెవ్వతె నేరిపెరా నీకు నీ—
కుంకుమపూఁతలే [4] చెరఁగునఁ గప్పేవు
యింక నిన్నియునేల యిదె నీకు తిరు—
వేంకటేశ నాకౌఁగిట వేడుకఁ గూడితివి ॥ అద్దిర ॥ 327

1. తకచంచుల. 2. చ నిదె వేంకటపతి. 3. ఇది ని-రే; సా-రే. పెద్దరి

## రామక్రియ

పంతమాడి పిలిచినఁ బలుకదెవ్వరితోడ
యింత వలచిన వలపెందునైనఁ గలదా ॥ పల్లవి ॥

పెక్కుసవు గుబ్బలపైవేసిన కప్పురమెల్ల
నొక్కమాటే నీరాయనోయమ్మా
మిక్కుటమైన దీని మేనిమీఁది వెక్కుచూచి
వక్కలాయ గుండె యిట్టి వలపెందుఁగలదా ॥ పంత ॥

గుప్పెడి నిట్టూరుపుల కోమలిహారములెల్ల
వుప్పరాలెగయఁ జొచ్చెనోయమ్మా
వుప్పతిల్లుఁ జెమటల [1] నోలలాడఁగానె మేను
నిప్పువలెనున్నదిట్టి నెయ్యమెందుఁ గలదా ॥ పంత ॥

కొయ్యతనమునిట్టె కోనేటిరాయనిఁగూడి
వుయ్యాలమంచముమీఁదనోయమ్మా
పయ్యెదచెరఁగు జారఁ బచ్చిసేఁతలిన్నియును
ముయ్యఁజూచి నిటువంటిమోహమెందుఁగలదా [2] ॥ పంత ॥ 328

## ధవుళి [3]

ఎపుడు నాయెడ నీకు నిదివలెనా
కపటాలు నిజములు కలిగినాతఁడవు ॥ పల్లవి ॥

వెల్లిగా నీవూర్పు వేదమట వేఁడి
చల్లని శ్రుతికి సుష్ఠము గలదా
పెల్లుగ నిరువంకఁ బిరుపీకులై వేఁడి
చల్లనిదైనా వెచ్చనిది గావలదా ॥ ఎపుడు ॥

1. వి-రే. ఒరా.. ల్లాఁ గోరికల. 2. ఈ చరణము వ్రాయుటకు చోటుపడువఁ బడినది. వి-రే. లో. 3. వి-రే. ౩౦. గుజ్జరి.

నగు నీమాటలే పురాణంబులట బొంకు
దగిలీని చదువులింతయు బొంకులా
తెగి యిరువంకలఁ దీదీపులై నీ
పొగరుల[1] మాటలెప్పుడును నిక్కము[2] లా ॥ ఎపుడు ॥

చలివేఁడిచూపుల జాణవట యిట్టె
బలసి నాపైఁ బరపఁగవలెనా
కలికివై తిరువేంకటవిభుఁడ నన్నుఁ
గలయక యలయించి కలిసితివిపుడు. ॥ ఎపుడు ॥ 329

శ్రీరాగం — రచ్చెతాళం

కనలకువే మతి కలఁగీని యీ—
వనజోదరుఁడిదె వచ్చీనిపుడు ॥ పల్లవి ॥

వడిఁ గుచభరమున వ్రాలెడి వేగము
నడవకువే సన్నపు నడుము
చిడుముడి నన్నుఁజేసిన[3] గోవిందుఁడు
తడయఁడు[4] నిన్నుఁ దగిలీనిపుడు ॥ కనల ॥

కొప్పువేఁగుననె కుదిసిన మెద గడు—
తిప్పకువే కందెడి సరులు
దప్పి వొదలఁ బరితాపము నీమై[5]
కప్పిన శ్రీహరి గదిసీఁ గాని ॥ కనల ॥

పొరలుచు విట్టూర్పులనుసురనియెదు
వెరవకుమెన్నఁడు[6] వేదనల
కరఁగి నీవు వేంకటపతికౌఁగిట
మెరసితివిటు[7] కడు మించిన రతుల ॥ కనల ॥ 330

---

1. సా-రే. పొగురుల. 2. నిక్కము. 3. వి-రే, ౫౩. ముడినే నన్నుఁజే: రా-తి. నినువేఁజే. 4. తడవఁడు. 5. నీవే కప్పిన శ్రీహరిఁగది. 6. వకువే వదు. 7. తివి కదు.

ఆహిరి

అలికి సంపెఁగతావిక ణఁగి[1] నట్టు
తొలఁగీ నుదుట జారి తుమ్మెదల పిల్లలు ॥ పల్లవి ॥

వెలఁదియూరను[2] పాము వెంటఁబెట్టుకొని రాఁగా
తలఁకి చంద్రుఁడు వోయి దాఁగినట్టు
పలువన్నె మెఱుఁగుల పయ్యదలోనె దాఁగె
చలివేఁడి మెఱుఁగుల చందమామపిల్లలు ॥ అలికి ॥

కోవిలపలుకుదాడి కోపగించి వెంటరాఁగా
తావుల చిగురువోయి[3] దాఁగినట్టు
మోవి సూదివాటులై[4] మొనసి కానవచ్చీని
మావుల చిగురులోని మాణికాలపిల్లలు ॥ అలికి ॥

భారమైన విరహతాపపు సూరియుందు[5] రాఁగా
తారితారి చకోరాలు దాఁగినట్టు
కూరిమి వేంకటపతిఁ గూడిన తమకమున
గోరగించీవిదివో చకోరముల పిల్లలు. ॥ అలికి ॥ 331

87–వ రేకు. ముఖారి

చాలుఁ జాలు నీ జాజర నన్ను
జాలిఁ బరచె[6] నీ జాజర ॥ పల్లవి ॥

వలపు వేదవల వాడేను యీ–
తలనొప్పులచేఁ దలఁకేను
పులకలమేవితోఁ బొరలేను కడుఁ–
జలిగొని చల్లకు జాజర ॥ చాలు ॥

1. ౯-రే. ౧౧౩. తావి అణఁగి. 2. తా-వెం. యూరవి పాము. 3. దురోయి
4. వి-రే. వాల్లమొ. 5. సూర్యుఁడు. 6. పె-రే. ౨౩. జరచె.

ఒల్లని నునుఁగని వుదికేను నీ—
చిల్లరచేఁతలఁ జిమిడేను
కల్లగందవొడిఁ గాఁగేను పైఁ
జల్లకు చల్లకు జాజర ॥ చాలు ॥

తివిరి వేంకటాధిప నేను నీ—
తవుఁగిటికబ్బితిఁ గడు నేను
తవరవ చెమటఁ గరఁగి నేఁడు యిదె
చవులాయను నీ జాజర. ॥ చాలు ॥ 332

## శ్రీరాగం

విరహంపుఁ గోమలికి వెలయంగఁ గలవెల్ల
అరుదుగాఁ బంది పొల్లయిన ఫలమాయె ॥ పల్లవి ॥

వేమారుఁ జెలికి నరవిందళయ్యలె పరవ
బాముచెడి యిందునే బడలెఁ గాని
తామెరై[1] దెంపమీ తలిరుదేహములోన
లేమకిది గలిగియును లేని ఫలమాయె ॥ విరహ ॥

వెలఁదిమై సురటులనె[2] విసరఁగా లలితాంగి—
నలమి ఆదియే తాపమయ్యేఁగాని
పెలుచైన నిట్టూర్పు పెనుగాలి లోలోనె
కలిగియును తమవారుగాని ఫలమాయె ॥ విరహ ॥

కాంత కనుదోయి నునుఁగలువలై కలువలనె
అంతకంతకు వగల నించెఁ గాని
యింతలోఁ దిరువేంకటేశుఁ గూడియుఁ జెలికి
చెంతనే కనుదోయి చెంగలువలాయె. ॥ విరహ ॥ 333

1. వి-దే. ౩౨. తామెదె. 2. సురటు విసర.

ఆహిరి

మోవిపై వీడెపు కెంపు ముచ్చటాడఁగ
చేవపచ్చి చిగురుపైఁ జిమ్మిరేఁగినే ॥పల్లవి॥

వాసనగుబ్బలమీఁద వల్లెవాటుగా జార-
వేసిన పయ్యెదకొంగు వెంటఁ దూలఁగ
ఓసిన ఘూతల ముద్దుఁదీగె చందురులమీఁదఁ
గా సేటి వెన్నెలవలెఁ గానవచ్చినే ॥మోవి॥

వేఁకపు నెరులకొప్పు వెక్కసపు విరులతో[1]
తేఁకువమీరఁగఁ గడు[2] దీపించఁగా
చీఁకటిలోపల మించు చిన్నిచిన్ని వెన్నెలల
తోఁకచుక్కలై[3] చూడఁ దొంగలించినే ॥మోవి॥

పాదముల దాటించు పసిఁడి మట్టెల మోఁత
మోదపు కంకణరవముల మీరఁగా
గాదిలి నీ కౌఁగిటి[4] వేంకటపతిమీఁదిపాట
వేదముల మీరినట్లు వెదచల్లినే. ॥మోవి॥ 374

మాళవిగౌళ

దాఁచిన చలముల నటకాఁడ యిట్టె
పేఁచితివిపుడు నీవే కావోరి ॥పల్లవి॥

విరులు గోయఁగ నన్ను వేడుకతోఁ జూచి
విరులెంత ప్రియమో యీ వెలఁదికని
మరుని తియ్యని వింటి మాయపుఁ గ్రొవ్వాఁడి
విరులేయించితివి నీవేకావోరి ॥దాఁచిన॥

1. పె-రే. ౨౩. విదులతో. 2. మీరఁగడు. 3. వి-రే. ౭౫. చుక్కలే.
4. 'కౌఁగిట' అనియే అన్ని రేకులందును రూపము.

జలము గేళాకూళిఁ జల్లులాడఁగఁ జూచి
జలమెంత ప్రియమొ యీ సతికినని
వెలఁగి కాఁక[1] చెమట వెలమ నాపై నేఁడు
వెలయఁ జేసితివి నీవే కావోరి ॥ చాఁచిన ॥

తొడవులిడుచు నేను తొంగలించఁగఁ జూచి
తొడవులే ప్రియము యీ తొయ్యలికని
కడుఁదొడవులే వేంకటరాయ కొనగోర
విడువకిచ్చితివి నీవే కావోరి. ॥ చాఁచిన ॥ 335

దేశాక్షి

ఎప్పుడు వచ్చునో యంటా నెదురు చూచీఁ బతికి
దప్పిదేరు మోముతోడ దాఁచలేదు ప్రియము ॥ పల్లవి ॥

వేఁటవోయినమగఁడు వీధి రాఁగాఁ గిన్నెర
మీఁటుచుఁదా నిక్కిచూచి మేడపైనుండి
గాఁటపు గుబ్బలకొంగు గప్పదు జారిన నింత—
ఆఁటది వలచెనేని ఆఁపరాదు ప్రియము ॥ ఎప్పుడు ॥

ఇంతి చూడఁగానె విభుఁడేతుల[2] గుజ్జము దోలి
చెంతనున్న సతులెల్ల చేతఁజూపఁగా
అంతలోనె యాకె తనువంతయుఁ బులకించె
పంతపుసతులకైనఁ బట్టరాదు ప్రియము ॥ ఎప్పుడు ॥

తేఁకువ మెరసి రాఁగా తిరువేంకటేశుఁ జూచి
వేఁకపుఁదురుముతోడ వెఱ్ఱిపిఁగిని
కాఁకతోడఁ జిత్తమెల్లఁ గరఁగి నీరై మించె
[illegible]

సామంతం

ఎవ్వరికిఁ జెల్లునమ్మ యింతేసి పనులు
నొవ్వని నొప్పులతోడ నొగిలీఁ జెలియ ॥ పల్లవి ॥

పేఁగెడి తురుముతోడ వేఁకపు సొమ్ములతోడ
కాఁగిన దేహముమీఁది కస్తూరితోడ
ఆఁగిన యాసలతోడ నతిరాజసముతోడ
వేఁగెడిఁ బ్రాణేశుఁబాసి విరహానఁ జెలియ ॥ ఎవ్వరి ॥

విప్పని రెప్పలతోడ వేఁడిచెమటల[1] తోడ
పుప్పొడి దాఁకినమేని పొక్కులతోడ
కప్పక కప్పిన మంచి కలికిపయ్యెదతోడ
కప్పురపుటూర్పులఁ గరఁగీఁ జెలియ ॥ ఎవ్వరి ॥

భావపువింతలతోడ పచ్చిసింగారముతోడ
* అవులు వారెడిమేని అలపులతోడ[2]
శ్రీ వేంకటేశ్వరుఁగూడి సిగ్గులగర్వముతోడ
అవలిమోమై మాఁటలాడీఁ జెలియ. ॥ ఎవ్వరి ॥ 337

88-వ రేకు. కాంబోది-ఏకతాళి

భారపుటూర్పులతోఁ బసరించీని పేఁడె
కూరిమిసతులు మేలుకొలుపరమ్మా ॥ పల్లవి ॥

వేగినంతకువిరఁను వెఁదులతోడి రతి
భోగించి వచ్చి నిద్రవోయీని
సోగకనురెప్పలు మూసుక యిప్పుడెంతేసి—
జాగరపుఁ బతితోడ చరచరమ్మా ॥ భార ॥

---

1. చెమటతోడ. 2. అలపుతోడ. * 'అవి' శబ్దబహువచనమా?

వొప్పైన సతులతో వుదరములోపల[1]
యిప్పుడు నితఁడు సుఖియించీని
దప్పిదేరు తనమోముఁదమ్మితోఁదనిదె. వీఁడె
వుప్పవడముగఁ బాదాలొత్తరమ్మా ॥ ధార ॥

వరుగున మేలుకొని సరసపుఁ గౌఁగిట
గరగరికెల[2] నన్నుఁ గలసీని
అరవిరి నురమున అలయుచును వీఁడె
తిరువేంకటపతిఁ దెలుపరమ్మా. ॥ ధార ॥ 338

## కన్నడగౌళ

తరుణికనుఁగవ మోద్పు తగఁ జూడరే
వరునిఁ దనమతి సొలసి వడిఁ జూచినట్లు ॥ పల్లవి ॥

వెలఁది ముక్కున వెడలు వేఁడి నిట్టూరుపుల—
చెలువమెటువలెనుండెఁ జెప్పఁగదరే
చలముకొను నలులకును సంపంగి పెనుగాలి
కలకంటిమేనికిని కాపిడినయట్లు ॥ తరుణి ॥

వడతిపైనునుఁజెమట పన్నీటితావితో
బడిబడినె యెట్లుండె భావింపరే
అడరు విరహానలంబప్పటప్పటికార్ప
కడువేగముదకముదుగక చల్లినట్లు ॥ తరుణి ॥

ఇంతినెన్నుదుటిపై నపుసు చెదరిన కురులు
వింతలై యెట్లుండె వివరించరే
సంతమె వేంకటేశ్వరుఁడు చెలినేఁపు శశి—

### రామక్రియ

తమకమును దలపోఁతయును గలదెందాఁక
అమరుఁ జెలువము దనకు నందాఁకఁ దరుణి ॥ పల్లవి ॥

విరసంపు[1] మరునిపై వెరపు మతికెందాఁక
అరయఁ దనయాపదయు నందాఁక
సిరిదొలఁకు జవ్వనపు సిగ్గు పీకెందాఁక
అరవిరి విలాసంబునందాఁకఁ దరుణి ॥ తమక ॥

ఎనయు ముదములును దనయేతులును నెందాఁక
అనుఁగుఁగోరికలు దనకందాఁక
కనుఁగొనల నవ్వులును కాఁకలును నెందాఁక
అనవరతసుఖము దనకందాఁకఁ దరుణి ॥ తమక ॥

తలఁపు వేంకటవిభుని తగులు గలదెందాఁక
అలరుఁదెలువులు మతులునందాఁక
కలయునాతని చనవు కరుణగలదెందాఁక
అలవోక పరిణతలునందాఁకఁ దరుణి. ॥ తమక ॥ 340

### సామంతం

బొంకకురే చతురుఁడప్పుడె వచ్చీనా
సుంకు దేరీఁ[2] జూపు మంచి సుద్దో మద్దో[3] ॥ పల్లవి ॥

వన్నెలాఁడి చెలి నీవు వచ్చుదాఁకా యిటె
వున్నదానఁ బ్రాణములునుచుకొని
వున్నతుఁడా[4] తఁడు మమ్మునొలిసీనా[5] యేటె
కన్నుల నవ్వేవు చెలి కాయో పండో ॥ బొంక ॥

1. వి–రే–౧౦౧–విరసపు. 2. సా–రే. సుంకుదేరిచూపు. 3. వి. రే. [illegible]. సుద్దోమద్దో. 4. వున్నవాఁడాతఁడు. 5. నొలిచీవా.

చక్కనమ్మ నీమాఁట చల్లుదాఁకా యీ–
చెక్కుమీఁది చేతితోను చింతించేను
నిక్కమునాతనికింక నేనేలే[1] నీవు
నొక్కకువే నాచెక్కు నుయ్యో కొండో ॥ చొంక ॥

కప్పురగంది యింత దగ్గరకువే నీ–
వప్పుడే కౌఁగిట నన్ను నలమేవు
అప్పుఁడు వేంకటవిభుఁడలరించె నిదె
యిప్పుడె యీతనికృప యీఁతో మోఁతో. ॥ చొంక ॥ 341

వసంతవరాళి

నిలు నిలు దగ్గరకు నీ యాన[2] నీకు
వలచితినని మావారెల్ల నగరా ॥ పల్లవి ॥

వద్దు వద్దు కొండలలోవారికి మాకింతేసి
పెద్దపెద్ద ముత్యాలపేరులిన్నేసి
అద్దము చూచిదె నాకు నంతకంటె సిగ్గయ్యీని
గద్దరి మాచెంచువారు గని నన్ను నగరా ॥ నిలు ॥

చాలుఁజాలు బంగారు సరుపణు[3] లుంగరాలు
నీలపుఁగంట సరులు నీకే వుండనీ
మూలనుండేవారు గాక ముత్యాలచెరఁగుల–
చేలగట్టుకొన్న నన్ను చెంచెతలు నగరా ॥ నిలు ॥

రాకురాకు యీడకు[4] నీ రమణులు పాదమాస
నాకు నీకు నింతేసి ననుపేఁటికి
దీకొని కూడితి నన్ను తిరువేంకటేశ యీ–
కాకరిచేఁతలకు లోకమువారు నగరా. ॥ నిలు ॥ 342

మలహరి.

నిద్దిరించి పాల (చీఁ బాల?) జలనిధివలెనే
వొద్దిక శ్రీరమణునికి వొత్తరే పాదములు ॥ పల్లవి ॥

వేగుదాఁకాఁ జిత్తగించి విద్యలెల్ల నాదరించి
బాగుగాఁ గృపారసము పంచి పంచి
యేగతిఁ బవ్వళించెనో యెట్ల భోగించెనో
యోగీంద్రవరదుని వూఁచరే వుయ్యాలను ॥ నిద్ది ॥

వాలుఁగన్నుల రెప్పల వదదాఁకి తనుతావి
చాలుకొన్న వూర్పులు చల్లి చల్లి
నీలవర్ణపుగుణము నెరపుచు నొకయింత—
కాలము గన్నులఁ దిప్పిక (ప్పిఁగ?) ప్పరే దోమతెర ॥ నిద్ది ॥

సరుగన యోగనిద్ర చాలించి లోకమెల్లఁ
గరుణించఁ దలఁచి వేంకటగిరిపై
అరుదుగ సకలలోకారాధ్యుఁడయి మించి (చీ?)
విరివి నాలవట్టాలు విసరరే సతులు. ॥ నిద్ది ॥ 343

89–వ రేకు. శ్రీరాగం

ఆటు గొంతకాలంబులనుభవించఁగఁ గలిగె
ఈటు గొంతకాలంబు యివి[1] చూడవలనె ॥ పల్లవి ॥

వెన్నెలలుఁ జీఁకట్లు వెలఁది సుఖదుఃఖములు
కన్ను దెరచి మూయుటలు గతులు నవగతులు
మన్ననలు వొల్లములు మగువ పగలును రేయి

కింది మీఁదై వచ్చుఁ గినుకలును దాలిములు
ముందు వెనకగుఁ జెలియ మోదఖేదములు
పొందికలు పాయుటలు పొలఁతి[1] సౌభాగ్యములు
ఇందరికి సరిగాఁగ నెదురెదురనుండు ॥ అటు ॥

మరచినను తలఁచినను మనసు తనపైనుండు—
పెరుఁగునది తిరువేంకటేశ్వరుండు
తెరవనిదె కరుణించె దేవుఁడే[2] నాయకుఁడు
తరితీపు సేయుఁ[3] గాని తలఁపులోనుండు. ॥ అటు ॥ 344

ఆహిరి

అప్పమైన నీయరే యమ్మలాలా నేఁ—
డప్పఁడా[4]ర గించీనదె యమ్మలాలా ॥ పల్లవి ॥

వాడుదేరి వదనము వడదాఁక[5] నిందాఁక—
నాడివచ్చెఁ[6] జూడరే యమ్మలాల
నీడకేఁగనెరఁగఁడు నిక్కపు బాలునివలె
ఆడనీడ[7] దిరిగాడీనమ్మలాల ॥ అప్ప ॥

వెడ్డు వెట్టీనాటలకు విచ్చేసేనని నన్ను—
నడ్డములాడకురే యమ్మలాల
దొడ్డివారియిండ్లెల్లాఁ దూరి తూరి పారాడీ—
నడ్డములు వినుపులు నమ్మలాల ॥ అప్ప ॥

వేఁకువజామునసుండి వెయిమారులావగించు
నాఁకటికోఁడవలేఁదమ్మలాల
తేఁకువ వేంకటగిరిదేవుఁడైన బాలుఁడిదె
ఆఁకతాడువట్టి తీసీనమ్మలాలా. ॥ అప్ప ॥ 345

1. పొలిఁతి. 2. దేవుఁడీ. 3. సా–రే. సేను. 4. వి–రే. ౧౧. డప్పుడా.

## నారణి

పంతపు బిగువులఁ బదరేవు నీ-
వంతలు[1] మానుప వసమా వోరి ॥ పల్లవి ॥

వేఁకపుఁ దురుముల వెలఁదుల యలకల-
చీఁకటి దవ్వుచుఁ జెలఁగేవు
ఆఁకటి చూపులనలసి మలయు నీ-
కాఁకలు మానుపఁగలనా వోరి ॥ పంత ॥

సన్నపు నగవుల సతుల కపోలపు-
వెన్నెలలే యిటు వెదకేవు
వన్నెలతనువున వాడుచు నొయ్యన
తన్నేవు నేనితరమా వోరి ॥ పంత ॥

పడఁతుల కుచముల పరిమళపుఁ జెమట-
తడిపయ్యెదలను దాఁగేవు
కడుఁ గౌఁగిట వేంకటగిరివర నను
పుడికెదవంతకోపుదునా వోరి ॥ పంత ॥ 346

## ఆహిరి

పచ్చిదేరే వలపు బయలు వెరపు
నచ్చుగోరి నాటు కిన్నరి తంత్రి మీటు ॥ పల్లవి ॥

వెలయఁ జల్లనిగాలి విరులెవిర్చిన జాలి
తలఁప పూధూళి చిత్తజు వయ్యాళి
కలయ వెన్నెల వెలుఁగు కాలకూటపు నలుఁగు
పలుకుఁ దేనెలచిందు బడబాగ్నివిందు ॥ పచ్చి ॥

1. పె-రే. ౨౬. వంతులా

అగడుఁ గోవిలకూఁత అంగన నొసలిఁవ్రాఁత
నిగనిగని పన్నీరు నిప్పులయేరు
సొగసుచాలనిచోటు చురుకుటలుగుల పోటు
నగవుఁజిలుకల సుడుగు నమ్మించు పిడుగు ॥ పచ్చి ॥

తనివోని రతికాఁక తప్పునేయని యాఁక
వనితకీపతిమాట వలపుమూట
వినయంపు రతికింపు వేంకటేశ్వరు సొంపు
తనువుమెత్తవిపరపు తనువెల్లమరపు. ॥ పచ్చి ॥ 347

ఆహిరి

ఉవిదతనులత యేఁటికులికి పడెనే
కవ మదనబాణాగ్నిఁ గాఁగదుగదా ॥ పల్లవి ॥

వనితలావణ్యంపు వదనశశికలములు
చనుగిరులపై నేల జారిపడెనే
వెనకఁ దుర (రు?) మను రాహు వేవేలు రూపులై
తనర ముఖచందురుఁడు తలకఁడుగదా ॥ ఉవిద ॥

మొలకలై గుములై ముదితమై మరునంప-
ములుకులంతటనేల ముణుఁగఁబడెనే
పొలయు మరునస్త్ర*మటు పుంఖానుపుంఖములు
పొలఁతిమీఁదనె రాశివోయఁడు గదా ॥ ఉవిద ॥

కొమరైన పెనుదండు కుసుమాయుధుఁడు గదలి
తెమలి రాకిపుడెట్లఁ దిరుగఁబడెనే
విమలాంగికౌఁగిటను వేంకటేశ్వరునిఁ గని
భ్రమసి ప్రతిదండనుచు పదరఁడుగదా. ॥ ఉవిద ॥ 348

* ముఖ

ముఖారి

చెప్పిన హృదయము దలఁకెడు చెలి దానిపుడెట్లున్నదో
అప్పుడు పరితాపంబున నలసిన చందములు ॥ పల్లవి ॥

వేడుకతో సంగీతము విని కన్నుల మెచ్చుచు[1]—
నాడుచుఁ బ్రాణేశ్వరుఁగొనియాడెడి చందములు
కాడిన మర్మపుమాటల కంపంబునఁ దలయూఁపుచు
చూడక చూచిన చూపుల చొక్కెడిచందములు ॥ చెప్పిన ॥

చనుఁగవ సన్నపు చెమటలు జారెడి పయ్యెదనార్చుచు-
నొవరిన నిట్టూర్పులచే నూటాడెడి చందములు
తనువునఁ బలుమరుఁ బొడమెడి దట్టపు పులకాంకురములు
అనువున మెత్తక (?)* కరమున నంటిన చందములు॥ చెప్పిన॥

తిరువేంకటగిరివల్లభు దేవశిఖామణికౌఁగిట
తరుణి మనోభవుబారినిఁ దప్పిన చందములు
యిరవుగ నాతని చేఁతల వింపగుఁ బరవశములచే
దొరలిన మరపుల నెరుకలఁ దూలెడి చందములు ॥ చెప్పిన ॥349

90-వ రేకు. ముఖారి

కొండల గుబ్బల[2] నాతో గోరాదిగొనేవు[3]
కొండల నావులఁగాచిన[4] కోడెకాఁడఁ గాన ॥ పల్లవి ॥

వంకలకురులదాన వద్దు నే నీకు మూఁడు—
వంకలవెంటఁ[5] దిరిగేవాఁడఁ గాన[6]
సంకుమెడదాన నీతో సరివచ్చేనా[7]
సంకుచేతి నన్ను నీవు జట్టిగొంటి చాలదా ॥ కొండ ॥

---

1. ఈ పాదపు రెండవభాగమున రెండు మాత్రలు చాలవని తోఁచుచున్నది.
2. పె-రే. ౨౬. గుచ్చిల. 3. ఏ-రే. ౭౬. గొంటివి- 4. గాచే. 5 పంకల మేనుఁ దీఁగెవాఁడ. 6. నేఁగాన. 7. చ్చేనా వా. * * గోరు+ఆదిగొనేవు=గోరు-కొలత తీసికొనుచున్నావు? * మెత్తని

యేనుఁగు నడపుదాన నేల నే నీకు[1] తొల్లి
యేనుఁగుఁ గాచినవాఁడ యేనుఁగాన[2]
మీనుకవగఁటిదాన మెచ్చేవా నన్ను మేటి[3]—
* మీననై జలధిలో మెరసినవాఁడను[4] ॥కొండ॥

చీఁకటితురుముదాన చేరకు నన్ను[5]
చీఁకటి నల్లనిమేని చెలువుఁడను[6]
వేఁకపుఁ బిరుఁదుమీఁద వేయకు చెయి[7]
వేఁకమైన భూమిమోఁచే వేంకటవిభుఁడను[8]. ॥కొండ॥ 350

ఆహిరి

ఎడయాట మాటల[9] నేచినవలపు
వీడమిన యాసల పొద్దోకవలపు ॥పల్లవి॥

వేఁకమైన కోరికె వినుకలి వలపు
కాఁకలఁ బొరలుచెల్లఁ గనుచూపువలపు
మూఁకలైన తలఁపులు ముదరినవలపు
ఆఁకలిదీరని పొందులడయాసవలపు ॥ఎడ॥

నడురేయి గమనము నాఁటినవలపు
విడువవితాపము వేఁడివేఁడివలపు
తడఁబాటు తానౌట తలఁపనివలపు
నిడివేఁడి యూర్పులు నెట్టుకొన్నవలపు ॥ఎడ॥

తిరువేంకటేశుపై తిరమైనవలపు
సరసరీతులచేత సరిలేనివలపు
గురుతైన రచనలు కూడినవలపు
తరుణికి నతనికిఁ దగులైన వలపు ॥ఎడ॥ 351

---

1. నేలర నీకు. 2. యేఁగాన. 3. మీనుఁగవకంటి నన్ను మెచ్చేవా నీవు. నే 4. మీననై నీటిలోన మేటిఁబాఁగావ. 5. నన్నుఁనేఁ, 6. డనే. 7. విరుఁదుపై వేయకు చెయినే. 8. డనే. 9. పెం—రే. ౨౩. మాఁటల.

* 'మీను' అన్మదర్థ విశేషణమనియా? లేక 'మీనమై' అని యుండదగునా?

## నాదరామక్రియ

నెలఁతకుఁ గొండలతిమ్మని నేనిదె తోడ్కొనివచ్చెద
ఎలనాగలు మీరిందరు నేమరకుఁడీ చెలివి ॥ పల్లవి ॥

వలపుల రేవికి చెంగలువల[1] కొండము చొర మొక్కఁడీ
అలులకు పూఁదేనియ సోయగములు మెయికొనుఁడీ
ఫలరసములు మీఁదెత్తుఁడీ పదరి చిలుకలకును గోవిలలకు[2]
పొలఁతికి కెందమ్మిరేకులు పోయుఁడు బడిమిగను ॥ నెలఁత ॥

కట్టుఁడీ సన్నపువలిపెము కర్పూరముఁ బన్నీరును
దట్టముగాఁ బైనలఁదుఁడీ తరుణీమణికి
ఒట్టుఁడీ జాజులు పరపున నొరపెరిఁగిన చెలికత్తెలఁ
బెట్టుఁడీ మరుబలములచే బెగ్గిలి పడకుండ ॥ నెలఁత ॥

చిగురునఁ గెంపులు మొలచెను చిత్రము చూడఁగదమ్మా
మొగుడలపైనల చంద్రుని మూఁకలు మరిగినవి
మొగమున బిత్తరిచేఁతలు మును లేనివి చెలికబ్బెను
మగువయు(కుః) తిరువేంకటపతి మమతల పరిణతలు. ॥ నె॥ 352

## కేదారగౌళ

సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెదరోలాల[3] ॥ పల్లవి ॥

వనితల[4] మనసులు కుందెన చేసిటు[5]
వలపులు తగ నించో[6] లాల
కనుసన్నలనెడు రోఁకండ్లను
కన్నెలు దంచెదరోలాల ॥ సువ్వి ॥

1. పె-రే. ౨౮. చెంగఁలువలు. 2. ఇందు మాత్రాధిక్యము గాన వచ్చుచున్నది.
3. తా-వెం ౧౦౧౧. రోలల. 4. వనితమన. 5. చేసేటి. 6. నిచ్చో.

బంగారు చెరఁగుల పట్టుపుట్టముల —
కొంగులు దూలఁగనోలాల
అంగనలందరు నతివేడుకతో
సంగడి దంచెదరోలాల ॥ సువ్వి ॥

కురులు దూలఁగ మంచి గుబ్బచన్నులపై
సరులు దూలాడఁగ నోలాల
అరవిరి బాగుల నతివలు ముద్దులు
గురియుచు [1] దంచెదరోలాల ॥ సువ్వి ॥

ఘల్లు ఘల్లుమని (ను?) కంకణరవములు (ల?)
పల్లవ పాణుల కో (నో?) లాల
అల్లన నడుములు అసియాడుచు సతు —
లొల్లనె దంచెదరోలాల ॥ సువ్వి ॥

కప్పుర గందులు కమ్మని పువ్వుల —
చప్పరములలో నోలాల
తెప్పలుగా రతిఁ దేలుచుఁ గోనే —
టప్పనిఁ బాడెదరోలాల. ॥ సువ్వి ॥ 353

శ్రీరాగం

కూరిమిచేఁతలు కొండలుఁ గోట్లయి
గారవించి యింతిఁగాచినది ॥ పల్లవి ॥

వన్నెల మాటల వాకిటితంగెటి —
జున్నుకు వడగాలి సోఁకినది
విన్నని చూపుల వెన్నెల బయిటను
సన్నపు ముత్యాలు చల్లినవి ॥ కూరి ॥

1. మురియుచు.

ముద్దుల నవ్వులు ముంగిటిబంగారు
అద్దములోఁ జిగురంటినది
తిద్దిన మెఱుంగు[1] దీఁగెకుఁ బన్నీట —
నద్దుట గడు వేడుకైనది ॥ కూరి ॥

చక్కని కొండల చరులీ (రిలో?) వెన్నెల —
వక్కలు పైపైనె వాలినవి
యెక్కువై శ్రీ వేంకటేశుని కౌఁగిటి —
నొక్కుల కిట్టే నోఁచినది. ॥ కూరి ॥ 354

## శ్రీరాగం

ఎట్టు ధరియించెనో యీ యింతి హృదయంబు
పట్టనెట్లోపునో ప్రాణవాయువులు ॥ పల్లవి ॥

వడియఁ జెమటలనుఁ దుడువఁగరాని పన్నీట
తడియఁబయ్యెదయుఁ దత్తరమందు మనసు
సుడియఁదమకములచే సొలయు వలపుల మేన
విడియఁ బులకలు చూడ వెరగైన మోము ॥ ఎట్టు ॥

మరియఁదలఁపులను జలమునఁ బొదలు మదనాగ్ని —
నురియుదేహంబు గడు నుదుటుఁగోరికలు
విరియు మానంబు నరవిరి సొలపుమాఁటలునుఁ
గురియు మోహజలంబు కొదలుఁజూపులును ॥ ఎట్టు ॥

వెదచల్లునూర్పులును వెలితైన నవ్వులును
సదమదంబైన పలుచవిమేనిపూఁత
అదన శ్రీ తిరువేంకటాద్రీశు కౌఁగిటను
గదిసి యింపులఁ బొదలఁ గలిగె నీ చెలికి ॥ ఎట్టు ॥ 355

1. పెఁరే. అ౬. మెఱుఁగు.

91—వ రేకు. ఆహిరి

ఇంతి చేసిన భాగ్యమిట్టుండె దైవకృత —
మింతయును గడవంగ నెవ్వరికి రాదు ॥ పల్లవి ॥

విరహవేదనచేత వేఁగెడి విలాసినుల
పొరిది నింతకు మున్ను చూడమో వినమో
అరుదైన దుస్తరంబై ధరింపఁగరాని —
దురవస్థలెవ్వరికి దొరకవనికాక ॥ ఇంతి ॥

తల దోఁకలేని చిత్తమున వలపులఁ బొరలు —
పొలఁతులింతకుమున్ను పుట్టరో చనరో
అలవోక *తెలుపులును [1] అబ్బురపు మరపులును
కొలఁదిమీరుట మిగుల గోరమనికాక ॥ ఇంతి ॥

దేవతాకృపగలిగి దివ్యవైభవములను
భూవలయమున సతులు పుట్టరో మనరో
శ్రీ వేంకటేశుఁడీచెలియకిచ్చిన చనవు—
లేవెలఁదులకు నాతఁడియ్యఁడనికాక. ॥ ఇంతి ॥ 358

భైరవి

ఎవ్వతెరా నినుఁజూచె నేమని పుత్తెంచె
పువ్వుబంతి నిను వేసి పొందుచూపి మొక్కినది ॥ పల్లవి ॥

వీడియు వీడని కొప్పు వేఁగున వీఁగుచు మాట—
లాడియు నాడక చెలినల్లన దూరినది

జారియు జారని గుబ్బచన్నుల పయ్యెదది లో—
నారియు నారని కోపమైన మోహముది
పేరియుఁ బేరనికాఁకఁ బెచ్చువెరిగినది తాఁ
జేరియుఁ జేరక నీ చేరువ దాఁగినది ॥ఎవ్వతె॥

మాట[1] లాడుచును మోవి మఱఁగు సేసినదొక—
పూఁటలోనె నీ కాఁగిటి పొందులనుబ్బినది
యేఁటికిరా తిరువేంకటేశుఁడ బొంకఁగ నీ—
నాటకపు[2] బ్రియముతో నన్నుఁ గలసితివి. ॥ఎవ్వతె॥ 357

## ధన్నాసి

ఏమి బాఁతి సేఁడిదె నీకు మముఁ
గామించు సిరులింతె కదవయ్యా ॥పల్లవి॥

వెనక ముందర వెలయఁగ ముందర—
వెనకలింతే విభవాలు
పనితల పిఱుఁదులు వాఁడికుచములు కొప్పు
కనఁగొన భ్రమలింతె కదవయ్యా ॥ఏమి॥

వెలుఁగు చీఁకటి విరసాలు విభవాలు
కలిమిలేములే కదవయ్యా
పలువన్నె మాటలు పనిచేతలు నివి
కలవెంత కలలింతె కదవయ్యా ॥ఏమి॥

పగటుగుబ్బలు పాయపునడపులు
తగులుమాఁటలు తమకయ్యా
తగు వేంకటగిరిదైవమ నీ పొందు
తగులు దొరకుటమ్మతమ సోఁకుటయ్యా ॥ఏమి॥ 358

---

1. పె-రే. అల. మాఁట. 2. నాటకపు!

ముఖారి

మాఁటలు[1] నేరుతువుగా[2] మాయమ్మా
యేఁటికి నాతవి[3] నీవే యేలవమ్మా ॥ పల్లవి ॥

[4] చేయరాని విన్నపాలు సేసిసేసి విభునింత
మాయలఁ బెట్టితివి[5] గా మాయమ్మా
రాయడించి[6] యిఁకను నారాజ్యమెల్ల నీవే
సేయవమ్మా నేనేమి[7] సేసేనమ్మా ॥ మాఁట ॥

ఎందును నీకతఁడు నోరెత్తకుండ మంత్రాలు
మందులు నేరుతువుగా[8] మాయమ్మా
చెందరాని సుఖమెల్లఁ జెలఁగి యాతఁడు నీవే
చెందవమ్మా నాకేల చిన్నదానికమ్మా ॥ మాఁట ॥

వన్నెల వేంకటపతి వలఁబెట్టి[9] యతనిచే
మన్ననఁ బొందితిగా మాయమ్మా
నన్నుఁజూచుఖిఁతను నీ ననిచిన[10] యతవి నే
సన్నలఁ జిక్కించుకొంటిఁ జాలదా నాకమ్మా. ॥ మాఁట ॥ 359

ఆమరసింధు

తలఁచిన దేహము నిలువదు తానన్నుఁ దలఁచునొ తలఁచఁడో
వలనుగఁ జెలిమాటలు విని వచ్చునో రాఁడో ॥ పల్లవి ॥

---

1. వి-రే. ౧౦౫. ౧౧౨. మ్యాళ్ఛలార్థ- 2. నేరుతుగా, 3. ౧౦౫. నిందరి నీవే. 4 ౧౦౫. లో ఇది రెండవచరణము. 5. ౧౦౫ ౧౪౨, ౧౧౬. బెట్టితిగా 6. ౧౦౫. ౧౧౨. రాయిడించి. 7. ౧౦౫. నాకేమి. 8. వి.రే. మూఁడిటను-నేరతుగా. 9. ౧౦౫. వలపించి. 10 [illegible]

శిరసున నంటిన పునుఁగిటు[1] చెక్కుల జారెడిననుచును
  ఉరవడిఁ దివియుచుఁ గొనగోరాఁదిన చందములు
  మురిపెపు మొలనూళ్ళపై (ఖలపై?) మొగపుల సొబగులు చూచుచు—
  నరుదుగ గరమున నక్కడ[2] నంటెడి యాసలును ॥తలఁచి॥

చెనకుల వీడెపురసమిదె సెలవులఁ జెదరెడిననుచును
  మనుపగు గోళ్ళ (ఖల?) వాతెర నొక్కినచందములు
  పెనగొను ముత్యపుసరముల పెక్కువ దీర్చెదననుచును
  చనవునఁ జనుఁగవపైఁ జే[3] చాఁచిన చందములు ॥తలఁచి॥

వుద్దవు నడపులలోపల నొయ్యన పాదము జారిన—
  నొద్దికతో నునుఁగౌఁగిట నొరసిన చందములు
  నిద్దవుఁ దిరువేంకటగిరినిలయుఁడు ననుఁ దనకౌఁగిట—
  నద్దిన[4] కస్తురిచెమటల నలమిన చందములు ॥తలఁచి॥ 360

భూపాళం

సువ్వి సువ్వి సువ్వాలమ్మ -
  నవ్వుచు దేవకి నందనుఁ గనియె ॥పల్లవి॥

శశి వొడచె అలసంబులు గడచె
  దిశల దేవతల దిగుళ్ళు విడిచె ॥సువ్వి॥

కావిరి విరిసె కంసుఁడు గినిసె
  వావిరిఁ బువ్వులవానలు గురిసె ॥సువ్వి॥

గతిసేసె ఆటు గాడిద గూసె
  కుతిలకుడిచి జనకుఁడు నోరుమూసె ॥సువ్వి॥

గగురు పొడిచె లోకము విధి విడిచె
  మొగులు గురియఁగ యమున[5] పై నడచె ॥సువ్వి॥

---

1. వి-రే. ఇ-ఎ. వుణుగిడె. 2. నక్కడఁ గంమున. 3. వున నక్కడఁ జేతులు.
4. నద్దిక. 5. ఇది పె-రే. ఎల: సా-రే. యగనెమున.

కలి జారె వేంకటపతి మీరె
అలమేల్మంగనాచారలుకలు దీరె. ॥ నువ్వ ॥ 361

92-వ రేకు. శ్రీరాగం

వాఁడు నాకు నిక్కముగా వలచినను
నేఁడు వచ్చి బంటువలె నిలుచుండుమనవే ॥ పల్లవి ॥

సిగ్గు గొంత పరులపై చింతగొంత తనకు
యెగ్గు గొంత నామీఁదనేఁటివలపే
అగ్గలమై తానేలే అన్నిలోకములును
తగ్గనీక నాకునిట్టే దక్కఁగ నిమ్మనవే ॥ వాఁడు ॥

బొంకు గొంత సత్యముల పొందు గొంత తనకు
యింకా మానఁడు నాపై నేఁటివలపే
సంకెలేక వెంటవెంట సటలెల్ల విడిచి
కొంకక నాయందలము గొలిచి రమ్మనవే ॥ వాఁడు ॥

రచ్చగొంత రాఁపుగొంత రాజసము దనకు
యెచ్చుగొంత కుందుగొంత నేఁటి వలపే
వెచ్చనై కౌఁగిటఁగూడె వేంకటేశ్వరుఁడు
మచ్చిక నిట్టెయాకు మడిచి యిమ్మనవే. ॥ వాఁడు ॥ 362

రాగాలపేళ్ళు-సావేరి-జంపె

మెచ్చెనొకరాగంబు మీఁద మీఁద కడు-
నిచ్చెనొకరాగంబు యింతులకునెల్ల ॥ పల్లవి ॥

చేసెనొకరాగంబు చెలియెదుటఁ గన్నులనె
మూసెనొకరాగంబు ముదిత మతినె
పూసెనొకరాగంబు పొలిఁతిపులకలమేన
వ్రాసెనొకరాగంబు వనిత నినుఁబాసి ॥ మెచ్చె ॥

పట్టెనొకరాగంబు ప్రాణములపై నలిగి
తిట్టెనొకరాగంబు తిరిగి తిరిగి
పుట్టెనొకరాగంబు పొలఁతిడెందమునకును
మెట్టెనొకరాగంబు మెరయుచునె కదలి ॥ మెచ్చె ॥

కురిసెనొకరాగంబు కొప్పు పువ్వులనె సతి
మురిసెనొకరాగంబు ముంచి మేన
తిరువేంకటేశ్వరుఁడ తెలుసుకో నినుఁబొంది
పొరసెనొకరాగంబు పొలఁతికుచములనే. ॥ మెచ్చె ॥ 363

## రామక్రియ

చాలుఁ జాలు నీతోడి సరసాలు యిట్టె
పాలిండ్లకొంగుజారి బయటఁ బడితిమి ॥ పల్లవి ॥

సిగ్గువడితిమిర నీ చేసిన చేఁతలకు—
నగ్గమైతిమిర మరునమ్ములకును
దగ్గరి నీకాఁకలఁ దగులఁబట్టి నేఁడు
బగ్గన నిందరిలోనఁ బలచనైతిమి ॥ చాలు ॥

నొగిలితిమిర నేము నోఁచిన నోములకు
పొగిలితిమిర నీ పొందులకును
తెగి నీవు నన్ను రతిఁదేలించి తేలించి నాకు[1]
పగటు బిగువులెల్లఁ బచ్చిగాఁ జేసితివి ॥ చాలు ॥

దప్పిఁ బడితిమిర నీతాలిములనే కడు
నొప్పిఁ బడితిమిర నీ నొక్కుఁజేఁతల
ఇప్పుడిట్టె తిరువేంకటేశుఁడ నీవు నా—
కొప్పు సవరము దీసి కొల్లగొంటి మావము. ॥ చాలు ॥ 364

1. ని—రే. రా—ఐ. తెగి నీవు వడిపిర్రఁదేలించఁగా నాకు.

కాంభోది

వలపేడఁ గలిగెనే వామలోచనకు దీని
వలపించినటువంటివాఁడింకనెవ్వఁడో ॥ పల్లవి ॥

సిరులు గల మోమెల్ల చిరునవ్వుగనుదోయి
విరివైన వురమెల్ల వేఁకమైన గుబ్బలు
తరుణికి వెనకెల్లఁ దురుము పిఱుఁదులును మంచి-
నిరతంపు నడపెల్ల నిండుమురిపెములు ॥ వల ॥

జలజాక్షినిలువెల్ల చక్కఁదనముల పోగు
కలికితనమెల్లఁ గన్నులపండువు
కలకంటివయసెల్లగడుఁ గోమలము దీని-
పలుకుఁదేనియలెల్ల పంచదారకుప్పలు ॥ వల ॥

చెలువైన మోవెల్ల చిలుకవోట్లు దీని-
కలదేహమింతయునుఁ గస్తూరివాసనలు
అలరించెఁ దిరువేంకటాధీశ్వరుఁడు దీని-
తలఁపెల్ల విభునిలో దాఁగున్న కరువు ॥ వల ॥ 365

కాంభోది

ఎవ్వతిర ప్రియము నీకింత నేసినది చూచి
దవ్వుల నిన్నొకమాఁట తగులనాడినది ॥ పల్లవి ॥

నిబ్బెంపు గుబ్బలమీఁది జిలుగుఁబయ్యదది
గబ్బిచూపు నిన్నుఁజూచి కన్నుల నవ్వినది
బబ్బిలకాయలతోడి పసిఁడిమెట్టెలది
జొబ్బిలిన చెమటలచేఁ జొక్కి నిలిచినది ॥ ఎవ్వ ॥

తొంగలిరెప్పలతోడి తోరపుఁ గన్నులది
చెంగటిచెలియచేతఁ జెయివేసి నవ్వినది
చెంగలువబంతిచేతఁ జెక్కునొక్కినది
వుంగరాలవేళ్ళ నీ కొయ్యనె మొక్కినది ॥ ఎవ్వ ॥

పీడక పీడని కొప్పువిరులు జారినది
వాడక వాడనిమోవివన్నెలు దోఁచినది
యీడులేని తిరువేంకటేశ నినుఁబొంది యీ—
కోడెవయసునవింతి కోరికెలందినది. ॥ ఎవ్వ ॥ 366

ఆహిరి

జిగురువంటివాఁడె శినకాటి చింత—
శిగురమ్మఁబోసీఁడె శిన[1] కాటి ॥ పల్లవి ॥

* నేఁతి[2] కుత్తికవాఁడు నెడ[3] కుండ దాఁచిన—
పాఁతపెద్దవిల్లు బలువున
నాఁతికొరకు వచ్చి నడిమికి విఱిశిన[4]—
శేఁతలాఁడుగదె శినకాటి ॥ జిగురు ॥

రట్టడిశేఁతల రాకాశినాయని
పట్టపుశెలి[5] యలిఁ బడవేశి
కొట్టఁగొనముక్కు గోశివేశినట్టి—
శిట్టగీఁడుగదె శినకాటి ॥ జిగురు ॥

నలువున వెంకటనగమునఁ గోనేటి—
నెలవున సొంపుతో నెలకొని
కలిమి పడుసుతోడి కాఁపురమున్నట్టి
శలుగులాఁడుగదె శినకాటి ॥ జిగురు ॥ 367

93-వ రేకు. పాడి

జాజు[6] జాజేకాక దిరిశపుఁబువ్వౌనా
నీజాడెంతయిన నీవు మానేవా ॥ పల్లవి ॥

1. వి-రే. రాజ. చిన. 2. చేఁతి. 3. చెడ. 4. చిన. 5. పుఁజెలి. 6. వి-రే. ౧౧౫. జాతి.
* 'చేఁదు' కు వ్యావహారికరూపమా?

సంపెంగపూవులలోన సారెకుఁ జూచిన తన-
కంపే కాక తనకాఁక మానీనా
యింపులు గొందరికి యీరసాలు గొందరికి
జంపుల నీ గుణముల జాద మానేవా ॥ జాజు ॥

పొగడ పూవులలోన పొందుగఁ జూచిన తావి[1]
తగుఁగాక తా మదము మానీనా
నిగిడిన నీచేఁత నీ బోంట్లకే కాక
మగిడి నీగుణములు మంచివయ్యీనా ॥ జాజు ॥

కామించి కలువలు కన్నులనద్దుకొనిన
కామునమ్ములునేఁడు గాక మానీనా
దీమసపు వెంకటేశ తెమలని[2] కూటముల
ఆమని మాకోరికల ఆస మానీనా. ॥ జాజు ॥ 368

ముఖారి

వంచిన పన్నీటఁబో వాడె నీమోము
మంచునఁ దామెరపొంపు మాయుఁగదవే ॥ పల్లవి ॥

సంపెంగ నూనియనే మజ్జనము సేయఁగఁ బో
చెంపజారి తురుమెల్లఁ జెదరీ[3] నేఁడు
గుంపులైన తుమ్మెదలు కొమ్మ నీయలకలివి
రంపపుఁగంపునకు వెరచుఁగదవే ॥ వంచిన ॥

జవ్వాది యెప్పుడు నీ నొసల మెత్తఁగానె కో
యెవ్వరు పిలిచిన నోరెత్తవు నేఁడు
కొవ్విన చిలుకపలుకులు దీనిగాలికి
దవ్వుదవ్వులనె కడు దాఁగుఁగదవే ॥ వంచిన ॥

1. తావే. 2. తెమ్మలవి. 3. వి-రే. ఇా. జెదరె.

ఒక్కపై వేంకటవిభుఁడొత్తినరేఖలఁ బో
చక్కని నీచనుఁగొండ జారి నేఁడు
జక్కవపులుగులివి చందురుఁడుదయమైన
వుక్కమీరి బెదరుచునుండుఁ గదవే. ॥ వంచిన ॥ 369

శంకరాభరణం

సల్లుసూపుల నలమారి[1] యిఁక
వెల్లఁబో నన్ను వెనకఁడుగా ॥ పల్లవి ॥

సంతు సక్రముల సక్కనయ్యేకుఁ దన—
వుంకువవో నావాళ్ళెల్లా
సంకనున్న తన నదురాలి మొరఁగైన
సింకసూపు నాపై సిమ్మఁడుగా ॥ సల్లు ॥

మాపురేపుసూపు మాయలయ్యేకుఁ దన—
దాఁపురమువో నాతలఁపెల్లా
వీఁపురమణికరత[2] వెలవకేయినఁ దన
పూఁపనవ్వు నాపైఁ బుయ్యఁడుగా ॥ సల్లు ॥

వుసురుఁబడుక మీఁదనొరగిన్న సక్కని—
రసికుఁడు వేంకటరాయఁడు
పసపుకీర నాకుఁ బరపుగాఁ బరపించి
యెసగ[3] నిట్టె సనవియ్యఁడుగా. ॥ సల్లు ॥ 370

కేదారగౌళ

తనివిదీరమికిఁ గుంటెనలె యీన
అనుమతులకుఁ దాఁకనాడుటే యీన ॥ పల్లవి ॥

---

1. ని-రే. ౨౦. నలమరి. 2. ని-రే. రాజ. శ త్ర. 3. ౨౦. యెసగి.

వరినెలయింపులకు సళుపుఁజూపులె యాస
గిరుపుఁగన్నులకు జంకెనలె యాస
సరసంబునకు సలసపుఁ గసరులే యాస
మరు పెరరేఁపులకు మంతనమె యాస ॥తనివి॥

కడుఁ గోరికలకుఁ లోఁ గాఁతాళములె యాస
చిడిముడికాఁకలకుఁ జింతలే యాస
బడలికకౌఁగిటికి బట్టబయలే యాస
పడరానియెడఁ గడపటిచేఁతె యాస ॥తనివి॥

రతిసమయమునకు రాకొట్టులే యాస
అతిమోహమునకుఁ గయ్యములె యాస
యితమైన తిరువేంకటేశు కౌఁగిటఁగూడి
మతిలోనికెపుడుఁ దమకములె యాస ॥తనివి॥ 371

శుద్ధదేశి

మొలనూలి గొల్లెత మురియుచును
వలపంతఁ దిరిగీని వాడవాడలను ॥పల్లవి॥

సంపెఁగలతుఱుముతో చల్లలమ్మీనిదివో
పంపుమోము గొల్లెత వాడలను
యింపులకోరికె[1] తో నిందిరాపతి యెదుట
జంపుల నటనలతో సాళగింపుచును ॥మొల॥

నొసలికస్తూరితోఁ గన్నుల నవ్వీనిదివో
పసివాడు గొల్లెత వాడలను
కసరుచు హరిమీఁదికాఁకల కోపముతో
యెసరుఁజెమట గోర[2] యెమ్మెలఁ జిమ్ముచును ॥మొల॥

చెలువంపుటుంగరాల చెయి పీచీనిదివో
వలపుల గొల్లెత వాడలను
కలికియై తిరువేంకటవిభుకౌఁగిట
అలసిన నటవల నల్లంతనేఁగుచును. ॥మొల॥ 372

శంకరాభరణం

మొఱ్ఱో నేననఁగానే మొక్కేవుగాని
వెఱ్ఱినేను వెఱ్ఱినేను వెఱ్ఱినేను సుమ్మీ ॥పల్లవి॥

సద్దులాడఁగానే కడు జారినపయ్యద చూచి
యెద్ద నన్ను జాణఁజేసేవేఁటికో కావి
వద్దివారే వలపుల వన్నెవెట్టనేర నే
గొడ్డేరే గొడ్డేరే గొడ్డేరే సుమ్మీ ॥మొఱ్ఱో॥

ఒల్లననఁగానే నన్నునద్దండపుఁ దుటారాల
చల్లలమ్మఁగానే పగ చాటేవు గాని
కల్లలాడనేర నీతో కపటాలు నేర నే
గొల్లదాన గొల్లదాన గొల్లదానఁ జుమ్మీ ॥మొఱ్ఱో॥

వేంకటేశుఁడ నేనంటా వేసాలఁ బొయ్యేనంటా
అంకులచేతులుచూచి యంటితి గాని.[1]
కంకిగా గుబ్బలమీఁద గాజునఁ దీసేవు నే
వుంకువాల్ల నుంకువాల్ల నుంకువాల్లఁ జుమ్మీ. ॥మొఱ్ఱో॥ 373

94-వ రేకు. కేదారగౌళ

దశవిధాచరణం తన్నభవతి
దశవిధావస్థార్థం తే తత్ర ॥పల్లవి॥

1. వి-రే. ౧౧౭. యంటితిఁగాని.

స్థాపయిష్యామి వేదానితి వ్యాజేన
దీపితోఽయం మత్స్యదేహః పురా
వ్యాపారోఽయమేవం నచ తరుణ్యా
రూపజలధౌ కేళిరుచయే తత్ర ॥ దశ ॥

ధారయిష్యామి మందరమితి వ్యాజేన
చారుకచ్ఛపవిధాచరణం పురా
నీరసేయం తవ మనీషా ప్రియవధూ—
భారకుచమందరౌ[1] భర్తుం తత్ర ॥ దశ ॥

భువముద్ధరిష్యామి పునరితి వ్యాజేన
ధవళకిటివైభవం ధత్సే[2] పురా
వ్యవహృతిరియం నచ మహామహీకుచతటే
తవ దంతక్షతం దాతుం తత్ర ॥ దశ ॥

దనుజం హరిష్యామి తమితి వ్యాజేన
ఘన నారసింహవిక్రమణం పురా
దనుజహర తవ మహత్త్వం తన్నచ నఖా—
ర్జనమిందిరాయా (యాం ?) ప్రసర్తుం[3] తత్ర ॥ దశ ॥

అపహరిష్యామి బలిమహామితి వ్యాజేన
కపటవామనరూపకలనం పురా
నిపుణ ఏవం నఖలు నియతిస్సతీషు తే
కపటాచరణం ఘటయితుం తత్ర ॥ దశ ॥

సంహరిష్యామి నృపజనమితి వ్యాజేన
బహ్వారుణతోయే ప్రాప్తిః పురా
సింహవిక్రమణతే స్థితిరియం నచ సతీ—
[4] విహ్వలత్వం తదా వేత్తుం తత్ర ॥ దశ ॥

---

1. వి–రే. ఒరా. మందరౌ. 2. ధత్తే. 3. మహత్త్వం తంనచ నఖజ–జనసం ప్రియాంచ ప్రసర్తుం. 4. సా–రే; పె–రే. తాలా. సంహ్వా, బంహ్వా. సింహ్వా, విహ్వా అనియే ప్రామపాఠము; వి–రే. సంహా, బంహా, సింహా, విహా ..... .....।

రావణం జేష్యామి రణ ఇతి వ్యాజేన
భూవరత్వే తే భోగః పురా
ఏవం నభవతి మహీసుతా విరహం
సావధానేన ప్రహర్తుం[1] తత్ర ॥ దశ ॥

కంసం హనిష్యామి ఖలమితి వ్యాజేన
సంసారోయమాచరితః పురా
హింసాదూర నచ హితమిదం వ్రజవధూ–
సంసరణలీలాం ప్రసక్తుం[2] తత్ర ॥ దశ ॥

పాతయిష్యే[3] ప్రలంబమితి వ్యాజేన
జాతరోషస్య తే జననం పురా
భూతరక్షక తే ప్రభుత్వం తన్నఖలు[4]
భూతలే రేవతీం భోక్తుం తత్ర ॥ దశ ॥

బుద్ధో భవిష్యామి పురహృతివ్యాజేన
బద్ధరోష ఇతి తే[5] ప్రాప్తిః పురా
తద్ధితం నహిఖలు[6] తదా[7] వధూహస్త[8]–
సిద్ధప్రసారేణ సేవితుం తత్ర ॥ దశ ॥

మారయిష్యామి కలిమతమితి వ్యాజేన
క్రూర కల్క్యవతారకోపః పురా
ధీర వేంకటనగాధీశ ఏవం నఖలు
భీరుమూర్వీం సంప్రీణయితుమత్ర ॥ దశ ॥ 374

---

1. ని–రే. విం హే సావధానంచప్రసర్తుం. 2. ప్రసర్తుం. 3. యిష్యామి.
4. సా–రే. తం నఖలు. 5. ని–రే. రోషస్యతే. 6. నఖలు. 7. సా–రే. తధా.
8. హస్తాస

ముఖారి[1]

ఎంత సేయఁగ నేరదింతి గోపించినను
కంతుని గెలిపించెను ఘనుఁడైన విభుని ॥పల్లవి॥

సతివింత తాపాన చందురుఁడేఁపఁగఁ జో
ప్రతిచందురుండాయ పడఁతిమోము
అతివఁ గోవిలకూఁతలలయించఁగాఁ జో
తతిఁ గోవిలలకూఁత తానాయఁ బలుకు ॥ఎంత॥

మలయానిలుఁడు దన్ను మలసి యేఁచఁగఁ జో
చెలివూర్పు చిరుగాలిఁ జిత్రించెను
తలపోఁతచింత చిత్తము సేయఁగాఁ జో
కలికిచిత్తము పతికడకంపెనిపుడు ॥ఎంత॥

తిరుగఁ జంద్రుఁడు తన్ను తిలకించగాఁ జో
ధరియించెఁ గుచముల తానతని
తిరువేంకటగిరిదేవునికౌఁగిటి-
సిరులఁజో యిన్నిటాఁ జెలువాయె నిపుడు. ॥ఎంత॥ 375

ఆహిరి

నిన్నుఁ గూడిన విభుని నిలువెల్ల సొంపాయ
నిన్నియును నొనగూడె నింతలోపలనె ॥పల్లవి॥

సొలపు నీ కడగంటిచూపు హృదయము గాఁడి
లలినితఁడు శ్రీవత్సలాంఛనుండాయ
వెలఁది నినుఁ బెడఁబాసి విరహంపుమెయికాఁక-
వలన నీతఁడు నీలవర్ణుఁడైనాఁడు ॥నిన్ను॥

1. వి-రే. ౩౦. ఆహిరి.

అవన నీ చనుగుబ్బలను చక్రముల చేతఁ
ఐదిలపరపుచు చక్రపాణియైనాఁడు
సుదతి నీ దేహమున సొబగు కుంకుమపూఁత—
లెదిగి పీతాంబరంబీతనికి నాయ ॥ విన్ను ॥

ఆలింగనాపేక్షినయంబు వినుఁగూడ
లోలుఁడటుగాన నాలుగుచేతులాయ
శ్రీలలితమూర్తియగు శ్రీ వేంకటేశ్వరుఁడు
పాలించె నిను నీకుఁ బరితోషమాయ. ॥ విన్ను ॥ 376

ముఖారి

కందువ[1] నేఁడెందరైనాఁ గలరు నీకు
యిందరిలో నాప్రియమీదేరీనా ॥ పల్లవి ॥

సన్నలు సేసేటి[2] వారు సరసమాడేటివారు
కన్నుల మొక్కేటివారు గలరు నీకు
విన్ననై యిందరికివి వెరవనే కాక నా—
విన్నపమెంతైన నీకు వినఁదీరీనా ॥ కందు ॥

తేఁకువఁ జేరేటివారు తేనెల మాఁటలవారు
కాఁకలు సేసేటివారు గలరు నీకు
యేఁకటనిందరికడ నెడతాఁకనేకాక
సోఁకనాడే నావంక చూడఁగూడీనా ॥ కందు ॥

ముద్దులు గునియువారు ముచ్చటలాడెడివారు
గద్దించి తిట్టెడివారు గలరు నీకు
తిద్దిన నీవిద్యలివి తిరువేంకటేశ నా—
వొద్దఁ గూడి యిట్ల నీకు వుండఁగూడీనా ॥ కందు ॥ 377

1. వి—రే. ౧౨. కందువలైనే 2. సేసెడి.

95-వ రేకు. మాళవిగౌళ[1]

సీతక పడుసు దోసిటి పాల మగఁడు
బాతి[2] పడిన నగపడునటె వీఁడు ॥ పల్లవి ॥

మూ (?) డు గాళ్ళ పెద్ద ముసలి నవులుగొన్న
పాఁడిమేకల పాల *పాళము
వేఁడి జుట్టినతల్లి వేఁకటియై కన్న-
వాఁడు వీఁడు శిన్న[3] వాఁడటె వీఁడు ॥ సీత ॥

కొండలంత సను[4] గుబ్బలరాకాశి
మిండెత గవిశి పై మింగ రాఁగా
గుండె వగులనొక్క కోలనె సరగన[5]
నెండివేసినట్టి సిసు[6] వటె వీఁడు ॥ సీత ॥

వుడుకు నుదుటివాఁడు వుదుటున దా (ఁ) సిన-
బెడిదపు మోతల[7] పెనువిల్లు
తొడికి విరిశివేశి దోమటి * నునుఁబాల-
కడుపుల తొలి[8] పెండ్లికొడుకటె వీఁడు ॥ సీత ॥

మారుదల్లి నేతిమాటలఁ బడలేక
వూరు విడిశి యడవులకేఁగి
నేరవచ్చిన యింతి నెవులు ముక్కుఁగోశి
పేరువారిన పెద్దబిరుదటె వీఁడు ॥ సీత ॥

పొగడాగు తపసుల పుల్లవెలుగు మంట-
లగడు శేయఁగ ముగురసురల
నగము సాయ నంపి నడిఁబెట్టి విడిశిన-
బగిడికాఁడు సిన్నపడుసటె వీఁడు ॥ సీత ॥

---

1. ని-రే. ఙా. వరాళి. 2. బాఁతి. 3. పిన్న. 4. చన్ను. 5. సరుగన 6. శెండి వేశినట్టి శిశు. 7. ఉడుకు నుదుటివంటి ఉదుట మిడుకువాని-బెడిదపు రవముల 8 లతగు. * పాళము=పాయసమా? * నునుబాల కడుపుల

మిసమిస మెఱసేటి మెగముమేనిపై
పసలఁ దగిలి వెంటఁ బారి పారి
గసిక వింటికోల గరిగాఁడనేసిన
మసిమాయల సలమరి గదె వీఁడు ॥ సీత ॥

రవ్వల సేఁతల రాకాశినాయని—
కొవ్విన మదము తె[1] క్కోఁలుగాని
యిప్పలఁ దిరువేంకటేశుఁడై యున్నాఁడు[2]
గువ్వెక నిను చట్టిగొనెఁగదె[3] వీఁడు. ॥ సీత ॥ 378

శ్రీరాగం

ఇప్పుడెట్లున్నదో యిందువదన
అప్పటికిఁ గొంత గుణమాయ నావేళ ॥ పల్లవి ॥

తెలువ శశికాంతవేదికమీఁద మలఁగుపై—
నొలిగి పరితాపాగ్నినుడుకఁగాను
నెటి దొలఁకు మోముపెన్నెలకు శశికాంతఁపు—
టలఁగు గరఁగిన శైత్యమాయెనావేళ ॥ ఇప్పు ॥

చెలియ పొన్నల విడ (సీడ?) విగురుఁబానుపుమీఁద
పలుమారు నినుదూరి పాడఁగాను
చెలఁగి పొన్నల విరియు చిలుకుఁదేనెల సోనఁ
దెలివొంది కొంత వడదీరెనావేళ ॥ ఇప్పు ॥

తొయ్యలి విలాసమున తూఁగు మంచముమీఁద
పయ్యెదరజార నినుఁ బాడఁగాను
తియ్యమునఁ గూడితివి తిరువేంకటేశ్వరుఁడ
నెయ్యంపు వేడుకలు నినిచెనావేళ. ॥ ఇప్పు ॥ 379

1. రవ్వైన శేతులు రెండు వరుసలు గల—కొవ్విన అసుర దెక్కోఁలు. 2. డై యిదె వీఁడె. 3. పువ్వుల పూజలఁదొదలి. 'మాఁదదల్లి' – 'మిసమిస' అను రెండు చరణములు వి-రే. లో లేవు.

## ఆహిరి

ఎంత మన్నించితో యీ యింతివిదె నీవు
అంతకంతకుఁ బ్రేమవలరీవిపుడు ॥ పల్లవి ॥

పదఁతి నాట్యశ్రాంతిఁ బవళించి తొల్లి నీ-
తొడలపై నీవు తల దువ్వఁగాను
కదలేవి యటువంటి కళలు దలఁచే కదా
విడువవి వియోగమున వేఁగీనిపుడు ॥ ఎం ॥

ఒనరఁ గుచభారమున నొరఁగి యీ మలఁగుపై-
నెవసి నీవాకు మడిచియ్యఁగాను
వనిత నేఁడటువంటి వలపుదలఁచే కదా
ఘనమైన తాపమునఁ గాఁగీవిపుడు ॥ ఎంత ॥

సిరులు నీ మోముపైఁ జెక్కులొయ్యన చేర్చి
యరమోడ్చి కనురెప్పలలమి యలమి
తిరువేంకటాచలాధిపుఁడ నినుఁ గూడియే
పరవశానంద సంపదఁ దేలెనిపుడు. ॥ ఎంత ॥ 380



1. ఈ రేకులో ఇఁకను వ్రాయవలసిన రెండు కీర్తనలకు చోటు విడువఁబడినది.
౯౭, ౯౮, ౯౯, ౧౦౦. సంఖ్యల రేకులు నష్టములైనవి.

# అనుబంధము I

## అకారాదిగ రాగ — సంకీర్తన సంఖ్యా సూచిక

| రాగములు | | సంకీర్తన సంఖ్యలు |
|---|---|---|
| అమరసింధు | | 360 |
| ఆహిరి | .... | 3. 4. 8. 10. 32, 49. 58. 68. 69. 74, 76. 77, 84. 85, 92. 118. 123. 124. 125. 130. 136. 142. 147, 155. 159. 164, 181. 182, 188. 197. 203, 237. 249. 251. 258. 260. 263. 267. 278, 286, 302. 305, 317. 326. 331. 334. 345, 347, 348, 351, 356. 367. 376. 380. |
| కన్నడగౌళ | .... | 88. 116. 117. 168. 223, 306. 339. |
| కాంభోధి | .... | 5, 16, 46, 65, 99, 112, 114, 121. |
| (కాంబోది) | | 141, 145, 165, 172, 173, 184, 199, 211, 232, 235, 254, 338, 365, 366, 374. |
| కేదారగౌళ | .... | 283, 353. 371. |
| కొండమలహరి | .... | 175, 324. |
| తెలుఁగుఁగాంభోధి ( ,, కాంబోది) | .... | 86, 322. |
| దేవగాంధారి | .... | 148, 280. |

| రాగములు | | సంకీర్తన సంఖ్యలు |
|---|---|---|
| దేశాక్షి | .... | 161, 265, 294, 336. |
| దేశి | .... | 25, 35, 205. |
| దేసాళం | .... | 73, 98, 179. |
| ధన్నాసి | ... | 167, 198, 227, 358. |
| నాట | .... | 140, 244. |
| నాదరామక్రియ | .... | 22, 80, 82, 113, 293, 352. |
| నారణి | .... | 109, 346. |
| నారణి దేశాక్షి | .... | 190. |
| పళవంజరం | .... | 120. |
| పాడి | .... | 19, 66, 72, 81, 100, 104, 106, 107, 129, 132, 160, 163, 170, 171, 229, 230, 303, 308, 311, 313, 368. |
| బౌళి | .... | 71, 186, 204, 234, 287, 299. |
| (భవుళి) | .... | * 329. |
| భూపాళం | .... | 231, 257, 277, 282, 325, 361. |
| భైరవి | .... | 2, 15, 23, 44, 51, 94, 97, 127, 218, 222, 241, 245, 310, 315, 357. |
| మంగళకౌశిక | .... | 38, 102, 220. |
| మలహరి | .... | 139, 343. |
| మాళవశ్రీ | .... | 53. |

* రేకులో 'భవుళి' అని యున్నను ఇది 'బౌళి' గానే పరిగణింపఁబడినది.

| రాగములు | | సంకీర్తన సంఖ్యలు |
|---|---|---|
| మాళవి | .... | 137, 189, 226, |
| మాళవిగౌళ | .... | 335, 378, |
| ముఖారి | .... | 7. 9. 17, 21, 28, 42. 52, 57, 63, 64, 75, 89, 93, 95, 96, 111, 119, 135. 156, 157, 187, 202, 206, 207, 208, 209, 213, 214, 216, 221, 239, 240, 259, 269, 275, 284, 285, 291, 297, 300, 309, 321, 332, 349, 350, 359,369, 375, 377, |
| ముఖారి పంతు | .... | 176, |
| మేచబౌళి | .... | 268, |
| రామక్రియ | .... | 14, 30, 61, 150, 215, 304, 307, 318, 328, 340, 364, |
| రీతిగౌళ | .... | 166, |
| లలిత | .... | 48, 105, 295, |
| వరాళి | .... | 34, 40, 91, 115, 122, 151, 191, 194, 271, 272, 288, 323, |
| వసంతం | .... | 18, |
| వసంతవరాళి | ... | 342, |
| శంకరాభరణం | .... | 20, 24. 27, 70, 78, 108, 154, 174, 193, 194, 217, 242, 246, 247, 256, 266, 270, 316, 370, 373, |

# అనుబంధము 2

## అకారాది సంకీర్తన - రాగ - సంఖ్యా సూచిక

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| అంజలి రంజలి | శ్రీరాగం | 289 |
| ✓అంతకంతకు గాలి | శ్రీరాగం | 110 |
| అంతసేయకుండి | పాడి | 81 |
| అటు గొంతకాల | శ్రీరాగం | 344 |
| అడు గడుగుకు | సామంతం | 219 |
| అతఁడు చొచ్చిన | శ్రీరాగం | 153 |
| అతనుచే నెత్తైన | భైరవి | 245 |
| అతివ జవ్వనము | కాంబోది | 112 |
| అదిగాక సౌభాగ్య | పాడి | 230 |
| అద్దిర చిమ్ముల | సామంతం | 327 |
| అన్నిజాతులు దానె | ఆహిరి | 123 |
| అపురూపమైన | సామంతం | 128 |
| అప్పఁడు మజ్జన | శంకరాభరణం | 256 |
| అప్పటికివి చెక్కు | పాడి | 106 |
| అప్పటి యొండ చెమ | శ్రీరాగం | 26 |
| అప్ప మైన నీయ | ఆహిరి | 345 |
| అప్పుదేనే నీకు | సామంతం | 43 |
| అబ్బురంపు శిశువు | మంగళకౌశిక | 220 |
| అయ్యో పోఁదున | ఆహిరి | 147 |
| అలమేలు మంగ | పాడి | 160 |
| అలరులు గురియఁగ | శంకరాభరణం | 24 |
| అలికి సంపెగ | ఆహిరి | 331 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| కూరిమి చేఁత | శ్రీరాగం | 354 |
| కూరిములే కద | కాంబోది | 199 |
| కూరి మెఱిఁగి | భైరవి | 310 |
| కెరలి బయట | ఆహిరి | 124 |
| కొంచెము మాకుల | రామక్రియ | 150 |
| కొండల గుబ్బల | ముఖారి | 350 |
| కొండలోఁగోవిల | కొండమలహరి | 324 |
| కొనచూపులనె | సామంతం | 133 |
| కొప్పుతావి సారె | శ్రీరాగం | 248 |
| కొమ్మ తన ముత్యాల | ఆహిరి | 74 |
| కొలనిదోఁపరికి | దేసాళం | 98 |
| కొలనిలోన మును | ముఖారి | 214 |
| కొలమున మొద | శంకరాభరణం | 242 |
| కొలిచి బిందెల | వరాళి | 192 |
| కోపము లిద్దరిలో | ఆహిరి | 8 |
| కోవిల పలుకదు | భైరవి | 44 |
| గందము పూనె | భైరవి | 2 |
| గుట్టునఁగోరిక | ఆహిరి | 188 |
| గొల్లెతలకేలరా | శ్రీరాగం | 103 |
| గోళ్ళ పీటుచు | భైరవి | 94 |
| చంపరాని పగ | శ్రీరాగం | 236 |
| చక్కఁదనములచే | ఆహిరి | 68 |
| చక్కఁదనములనే | తెలుఁగుఁగాంబోది | 322 |
| చక్కని తల్లికి | పాడి | 107 |
| చలిగాలి వేఁదేల | శ్రీరాగం | 191 |
| చెల్లనై కాయ | సామంతం | 228 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
| --- | --- | --- |
| తురుము నీవియు | కన్నడగౌళ | 116 |
| తెప్పగా మఱ్ఱేకు | లలిత | 295 |
| తేనెయు నేయు | శ్రీరాగం | 87 |
| దంట మాటలనె | ఆహిరి | 3 |
| దంతచ్ఛదముద్రా | రామక్రియ | 318 |
| దవ్వుల నుండవే | ఆహిరి | 69 |
| దశవిధా చరణం | కేదారగౌళ | 374 |
| దిక్కు లేకపోయె | ఆహిరి | 155 |
| దిమ్మరివలె నిటు | శంకరాభరణం | 270 |
| దుప్పటెల్లా జవ్వాది | మాళవశ్రీ | 53 |
| దేవరచిత్తం | పాడి | 19 |
| దైవకృత మెవ్వరికి | శ్రీరాగం | 134 |
| దొరకెఁగా పూజ | ముఖారి | 95 |
| నల్లనిమేని | నాట | 244 |
| నాకుఁజెప్పరె | శంకరాభరణం | 193 |
| నిండినవేడుక | వరాళి | 272 |
| నిక్కమటే యీ మాట | లలిత | 105 |
| నిద్దిరించి పాల | మలహరి | 343 |
| నిన్నుఁ గూడిన విభు | ఆహిరి | 376 |
| నిలునిలు దగ్గర | వసంతవరాళి | 342 |
| నీవు దురగము | సాళంగం | 210 |
| నెయ్యములల్లో | దేసాళం | 179 |
| నెలఁతకుఁగొండల | నాదరామక్రియ | 352 |
| నే నెందు వోయె | శ్రీరాగం | 276 |
| నే నే లెవ్వరు నేల | మంగళకౌశిక | 102 |
| పంతపు బిగువు | నారణి | 346 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తనసంఖ్య |
|---|---|---|
| మెచ్చితి బళిరా | శుద్ధవసంతం | 62 |
| మెచ్చెనొక రాగం | సావేరి | 363 |
| మొలనూలి గొల్లెత | శుద్ధదేశి | 372 |
| మొట్లో నేనన | శంకరాభరణం | 373 |
| మోవిపై పీదెపు | అహిరి | 334 |
| మోవుల చిగురుల | వరాళి | 271 |
| మోహంపురతి | ఆహిరి | 302 |
| మోహము నేయించు | బౌళి | 71 |
| రమణి సురటిగా | కన్నడగౌళ | 117 |
| రమ్మనవే వాని | కేదారగౌళ | 283 |
| రాఁగదే చూతఁడిదె | రామక్రియ | 14 |
| రాఁడుగాక నరు | ముఖారి | 206 |
| రాకుంటే మాను | కాంబోది | 5 |
| రాధామాధవ | రీతిగౌళ | 166 |
| రాయడికాఁడు | భూపాళం | 325 |
| రావే కోడల | పాడి | 313 |
| రెప్పవేసి లోక | సామంతం | 233 |
| లంజకాఁడవౌదు | ఆహిరి | 84 |
| లలితలావణ్య | ఆహిరి | 130 |
| లేఁత చిగురిదె | దేశి | 35 |
| లేఁత చెమటలనె | శంకరాభరణం | 195 |
| లేఁతమాయలు | ఆహిరి | 85 |
| వంచనప్రియము | కన్నడగౌళ | 158 |
| వంచిన పన్నీట | ముఖారి | 369 |
| వచ్చేరా మాయమ్మ | పాడి | 72 |
| వట్టిసటలుగాక | ఆహిరి | 136 |